వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడా వెలుబడినవి. అన్నిటికన్నా శ్రీధరీయ వ్యాఖ్యానము ముఖ్యమైనది. శ్రీధరస్వామి రచించిన భావార్థ దీపిక అను అద్వైత సిద్ధాంతపరమైన వ్యాఖ్యానము మిక్కిలి విశిష్టమైనది. శ్రీమద్భాగవతము అద్వైత వేదాంత సిద్ధాంతముతో నిండియున్నదనుటకు సందేహము లేదు. దాన్ని ప్రతిపాదించునది భావార్థదీపిక. యథార్థమైనభావమును ప్రకాశింపజేయునది. శ్రీధరస్వామి గొప్ప నృసింహ భక్త్యుపాసనలు కల మహాపండితుడు. అంతటి ఉపాసకునికి గూడా భాగవత శ్లోకాలకు సరియైన అర్థము కొన్నిచోట్ల గోచరించకపోతే ఆయన ముఖముపై వస్త్రం వేసుకొని నృసింహ ధ్యానం చేస్తూ కూర్చొనేవాడనీ, కొద్ది సేపటికి ముఖవస్త్రం తీసి చూడగా అచట కొన్ని పంక్తులు చక్కని అర్థమును వివరించేవి వ్రాసియుండెడివని చివరన “అయం భావః ” అని ఉండిందనీ, ఆ అర్థాలను స్వయంగా నృసింహస్వామి తెల్పినాడని ప్రతీతి. శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని ఇతర వ్యాఖ్యానాలను పరికించి పండితులు ఏది గొప్పదని ఆలోచించి శ్రీధర వ్యాఖ్యలేనిచో, భాగవత నిగూఢార్థము ఎవ్వరికినీ తెలిసేది కాదని నిర్ధారించారు.

అట్టి శ్రీధర వ్యాఖ్య భావార్థదీపికకు వంశీధర వ్యాఖ్యానం కూడా వెలుబడింది. అంతేకాక ఈ వ్యాఖ్యానాలనన్నింటినీ జగన్నాథస్వామి గుడిలో ఉంచితే దేనిని స్వామి పరిగ్రహించునో అది గొప్పదని, తెలుసుకుందామని ఆ విధముగా గుడిలో ఉంచితే శ్రీధర వ్యాఖ్య జగన్నాథస్వామి చేతిలో కనిపించినదని ప్రతీతి.

శ్రీధర వ్యాఖ్యానము ప్రతులలో అనేక పాఠభేదాలు కలవని వాటిని శోధించి సుష్ఠు పాఠములను పండితవర్య నారాయణ శాస్త్రి ప్రభృతులు నిర్ణయించి ముద్రించారు. అందుకే........“వ్యాసో వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా న వా శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః”. అని ఆభాణకం వెలుబడినది. శ్రీధర వ్యాఖ్య గూడా చాలా జటిలం, వంశీధరవ్యాఖ్యయేకాక శ్రీధరీయానికి చాలా వ్యాఖ్యానాలు వెలుబడినవి. అట్టి శ్రీధరస్వామి భావార్థదీపిక సంస్కృత వ్యాఖ్యానానికి తెలుగు అనువాదం పండితులచే వ్రాయించి ప్రచురించాలని శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం సంకల్పించినది. శ్రీధరులు కఠిన పదాలకు మాత్రమే అర్థం వివరించారు. అనువాదం అటులనే చేసిన పాఠకులకు అగమ్యగోచరమగును. కావున శ్రీమద్భాగవతమునకు శ్రీధరవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ఈ గ్రంథ ధ్యేయము.

**డా॥ బ్రహ్మశ్రీ శివునూరి విశ్వనాథశర్మ**
పీఠకార్యనిర్వాహక సభ్యులు







శ్రీః

## శ్రీమద్భాగవతం, సవాఖ్యానమ్,

## పఞ్చమస్కంధః.

## ప్రథమోऽధ్యాయః

శ్లో॥ అథాతః పంచమస్కంధో వ్యాఖ్యానైకవిశేషవాన్ ।
ప్రియవ్రతాన్వయో యత్ర స ప్రపంచః ప్రపంచ్యతే ॥
షడ్వింశత్యాధునాధ్యాయైః పంచమే స్థానమీర్యతే ।
లోకద్వీపాది మర్యాదాపాలనార్థమనేకథా ॥
పృథివ్యపర్యధో లోకైర్మర్యాదా త్రివిధా మతా ।
పునశ్చైకైకశస్తేషు మర్యాదా బహుధా మతా ॥
భువిద్వీపాదిమర్యాదాః పాల్యంతే రాజభిః పృథక్ ।
భూమేరుపరి దేవాద్యైస్తతశ్చాధో సురాదిభిః ॥
తత్రాధ్యాయైస్తు వింశత్యా ప్రియవ్రత పురస్సరైః ।
భువో ద్వీపాదిమర్యాదాః పాలితా ఇతి వర్ణ్యతే ॥
త్రిభిస్సూర్యాదిభిర్జ్యోతిశ్చక్రాదిస్థితిరీర్యతే ।
అతలాదిషు దైత్యాద్యైఃపాలనం చ తత స్త్రిభిః ॥
తత్ర తు ప్రథమోऽధ్యాయే జ్ఞానినో రాజ్యనిర్వృతిః ।
పునశ్చ జ్ఞాననిష్ఠేతి ప్రియవ్రత కథాద్భుతా ।
వంశం ప్రియవ్రతస్యాపి నిబోధ నృపసత్తమ ।

శ్రీః

## శ్రీమద్భాగవతం, సవాఖ్యానమ్,

## పఞ్చమస్కంధః.

## 1 వ అధ్యాయము

శ్రీమద్భాగవతమున "పంచమోనాభిదేశశ్చ" అని శ్రీహరికి భాగవత పంచమస్కంధము నాభిస్థాన భూతమైనది. ఈ పంచమ స్కంధమున పురాణ లక్షణములలోని "స్థానము" అను లక్షణమభి వర్ణితమైనది. ఈ స్కంధమున ప్రియవ్రతుని యొక్క వంశము వర్ణించ బడుచున్నది. ఈ స్కంధమున ఇరువది ఆరు అధ్యాయములలో లోకపాలనమునకై ద్వీపాదుల సృష్టి క్రమ విధము అనేక విధములుగా తెలుపబడుచున్నది. భూలోకము, పైలోకము, అధోలోకముల త్రివిధమగు ఆచరణలు, తిరిగి మూడింటిలో ఒక్కొక్కదానిలో అనేకానేకముల విధివిధానాలు కలిగియున్నది. భూమిపై ద్వీపాదులను రాజులు పరిపాలించెదరు. భూమికి పైలోకములో దేవాదుల పాలనము, భూమికి కింది లోకములో సురాదుల పాలన వర్ణించబడుచున్నది, ఈ ఇరువదిఆరు అధ్యాయములలో ఇరువది అధ్యాయములలో ప్రియవ్రతుడు మొదలగు వారిచే భూమిపైన ద్వీపాదికముల విభాగ విధానము, ఆచరణలు పాలించబడినవని వర్ణించబడుచున్నది. ఆ పిదప మూడధ్యాయములలో సూర్యాదులు, జ్యోతిశ్చక్రాదుల స్థితి












యో నారదాదాత్మవిద్యామధిగమ్య పునర్మహీమ్ ॥
భుక్త్వా విభజ్య పుత్రేభ్య ఐశ్వరం సమగాత్పదమితి ॥

**రాజోవాచ**

శ్లో॥ ప్రియవ్రతో భాగవత ఆత్మారామః కథంమునే ।
గృహేఽరమత యన్మూలః కర్మబంధః పరాభవః ॥ 1

టీ:- పూర్వస్కంధాంతే. ప్రియవ్రతస్య ప్రథమమాత్మవిద్యా. తతో గృహాశ్రమః. తతస్సర్వసంగ త్యాగేన మోక్ష ఇత్యుక్తం. తత్ర విస్మితః పృచ్ఛతి రాజా. ప్రియవ్రత ఇతి. ప్రియవ్రతో భాగవతః ఆత్మారామః

వర్ణించబడుచున్నది. అచటినుండి మూడధ్యాయ ములలో అతలాది లోకములలో దైత్యాదుల పాలన వర్ణించబడుచున్నది.

మొదటి అధ్యాయమున ఆత్మజ్ఞానియగు ప్రియవ్రతుని రాజ్యపాలనము, తిరిగి జ్ఞాననిష్ఠ అను అద్భుతచరితము అభివర్ణిత మైనది. ప్రియవ్రతుడు నారదుని వలన ఆత్మవిద్యనొంది తిరిగి రాజ్యపాలన గావించి తన పుత్రులకు రాజ్యమును విభజించి ఇచ్చి ముక్తినొందెనను విషయము చెప్పబడుచున్నది.

చతుర్థస్కంధము చివరన ప్రియవ్రతునకు మొదట ఆత్మ విద్యాప్రాప్తి, ఆ పిదప గృహస్థాశ్రమము ఆ తరువాత సర్వసంగ పరి త్యాగముతో మోక్షప్రాప్తి అని తెలుపబడినది. ఆ విషయమును విని పరీక్షిద్రాజు ఆశ్చర్యచకితుడై ఇలా అడుగుచున్నాడు.

**పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.**

ఆత్మవిద్య సాధన చేసిన భాగవతోత్తముడగు ప్రియవ్రతుడు గృహస్థాశ్రమమున ఎట్లు ఆనందమొందెను. గృహస్థాశ్రమమున ఆనందమొందుటలో దోషమేమి? అనగా తెలుపుచున్నాడు. గృహ స్థాశ్రమమున ప్రవేశించిగానే మానవునకు తన స్వరూప విస్మృతి (తిరస్కారము) కలిగి కర్మబంధనములు కలుగును. 1







అతఏవ గృహే కథమరమత? నను రమతాం కో దోషః? ఇతి చేదత ఆహ - కర్మాణాం బంధః పరాభవశ్చ స్వరూపతిరస్కారః. యన్మూలో భవతి యద్గృహం మూలకారణం యస్య. 1

శ్లో॥ గృహేష్వభినివేశోఽయం పుంసాం భవితుమర్హతి ।
న నూనం ముక్తసంగానాం తాదృశానాం ద్విజర్షభ ॥ 2

టీ:- గృహేష్వితి. గృహేషు రతిశ్చ తత్రాభినివేశే సతి స్యాత్. స చ భాగవతానాం న సంభవతీత్యాహ - న నూనమితి. 2

ఓ విప్రశ్రేష్ఠా! గృహస్థాశ్రమమున గృహాదులయందు అనురాగము, వాటి విషయమున అభినివేశముతో సంభవించును. ఆ అభినివేశము ముక్తసంగులగు ప్రియవ్రతునిలాంటి వారికి కలుగదు. 2

శ్లో॥ మహతాం ఖలు విప్రర్షేహ్యుత్తమశ్లోకపాదయోః ।
ఛాయానిర్వృత చిత్తానాం న కుటుంబే స్పృహా మతిః ॥ 3

టీ:- గృహాసక్తిర్హి కుటుంబాదిస్పృహయా భవతి. సా చ తేషాం నాస్తీత్యాహ - మహతామితి. ఉత్తమశ్లోకపాదయోః యా కామాది సంతాపహారిణీ. తయా నిర్వృతం చిత్తం యేషాం తేషాం స్పృహాయుక్తా మతిర్నాస్తి. 3

**గృహాసక్తి యనునది కుటుంబాదులయందు ఏర్పడుకొన్న భావనతో కలుగును. అలాంటి భావన (స్పృహ) ప్రియవ్రతుని లాంటి వారికి లేదని తెలుపుచున్నాడు.** ఓ విప్రర్షీ! ఎవరి చిత్తము పుణ్యకీర్తివంతుడైన శ్రీహరి చరణముల శీతలఛాయనాశ్రయించి శాంతినొందునో అలాంటి మహాపురుషులకు కుటుంబాదులయందాసక్తి కలుగదు. 3










శ్లో॥ సంశయోऽయం మహాన్ బ్రహ్మన్ దారాగార సుతాదిషు ।
సక్తస్య యతిద్ధిరభూత్కృష్ణే చ మతిరచ్యుతా ॥ 4

టీ:- దారాద్యాసక్తస్య తు మోక్షః శ్రీకృష్ణే మతిశ్చాచలితా అభూదితి యత్. అయం చ మహాన్ సంశయ ఇత్యాహ - సంశయ ఇతి. 4

భార్యదులయందాసక్తి కలవారికి ముక్తి, శ్రీకృష్ణునియందు అచంచలమైన మనస్సు కలిగినదనుట నాకు గొప్ప సంశయమని తెలుపుచున్నాడు. మహారాజగు ప్రియవ్రతుడు భార్య, గృహ, పుత్రాదులయందు ఆసక్తుడైయుండియు ఏ విధముగా సిద్ధిని పొందెను? అతనికి శ్రీకృష్ణునియందు అచలితమగు భక్తి ఎలా కలిగినది. ఈ విషయమున నాకు గొప్ప సంశయము కల్గుచున్నదని పరీక్షిద్రాజు ప్రశ్నించెను. 4

**శ్రీశుక ఉవాచ**

చూర్ణిక॥ బాధముక్తం. కింతు భగవత ఉత్తమశ్లోకస్య శ్రీమచ్చ రణారవింద మకరందరసావేశితచేతసః భాగవత పరమహంస దయిత కథాం కథంచిదంతరాయవిహతామపిస్వాం శివతమాం పదవీం న ప్రాయేణ హిన్వంతి. 5

టీ:- అంగీకృత్య పరిహరతి - బాధమితి. అభినివేశాదికం నాస్తీతి సత్యమేవ. తథాపి విఘ్నవశేన తేషాం ప్రవృత్తిః పూర్వాభ్యాసబలేవ పునర్నివృత్తిశ్చ సంగచ్ఛత ఇత్యాహ - భగవతః శ్రీమచ్చరణారవింద మకరందరూపో యో రసః. తస్మిన్నావేశితం చేతః యైస్తేऽపి కథం చిదంత రాయేణ విఘ్నేన విహతామపి స్వాం పదవీం మార్గం న

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

పరీక్షిద్రాజు వెలిబుచ్చిన అభిప్రాయము నంగీకరించి పరిహరించుచున్నాడు. గృహాదుల యందు ప్రియవ్రతునకు అభినివేశము లేదనుట నిజమే. అయినను, విఘ్నముల వలన అలాంటి వారికి సంసారమున ప్రవృత్తి కలుగుచున్నది. కలిగినను పూర్వములో యుండెడి అభ్యాస బలముతో తిరిగి నివృత్తికూడా కలుగగలదని తెలుపుచున్నాడు.

ఓ పరీక్షిద్రాజా! నీవు పలికినది సత్యమే కానీ పవిత్ర కీర్తిమంతుడు, భగవంతుడునగు శ్రీహరి చరణకమల మకరంద రూపమగు ఏ రసమైతే కలదో దానియందు నిమగ్నమైన, స్థిరమైన చిత్తముగలవారికి విఘ్నములచేత అంతరాయము కలిగినను వారు

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ











హిన్వంతి న త్యజంతి. కాం? భాగవతా ఏవ పరమహంసా తేషాం దయితస్య శ్రీకృష్ణస్య హరేః కథాం. 5

చూ॥ యర్హివావ రాజన్ స రాజపుత్రః ప్రియవ్రతః పరమభాగవతో నారదస్య చరణ సేవయాంజసావగతపరమార్థసతత్త్వో బ్రహ్మసత్రేణ దీక్షిష్యమాణోఽవనీతల పరిపాలనాయామ్నాత ప్రవరగుణగణైకాంత భాజనతయా స్వపిత్రోపామంత్రితో భగవతి వాసుదేవ ఏవావ్యవధాన సమాధి యోగేన సమావేశితసకలకారక క్రియాకలాపో నైవాభ్య నందదృద్యపి తదప్రత్యామ్నాతవ్యం తదధికరణ ఆత్మనోఽన్యస్మా దసతోఽపి పరాభవమన్వీక్షమాణః. 6

టీ:- ప్రియవ్రతస్య బ్రహ్మాజ్ఞైవాంతరాయరూపా బభూవేతి సప్రసంగ మాహ - యర్హీతి. శ్లో."విముక్త సంగః ప్రకృతిం భజస్వే" త్యంతేన గ్రంథేన యర్హివావ యదాహి. వావేతి ప్రసిద్ధాదౌ. స రాజపుత్రః. స్వపిత్రా మనునా. అవనీతల పరిపాలనాయోపామంత్రితో నియుక్తో నైవాభ్యనందత్ నైచ్ఛత్. అథహ తథైవ భగవానాదిదేవో బ్రహ్మా స్వభవ నాదవతతారేత్యన్వయః. ఉపామంత్రణే హేతుః - ఆమ్నాతాః రాజ్ఞాం శాస్త్రేణోక్తాః యేప్రవరాః శ్రేష్ఠాః గుణాస్తేషాం గణస్య ఏకాంత భాజనతయా నియతాశ్రయత్వేన. అనిచ్ఛాయాం హేతుః పరమార్థ

తమ కళ్యాణ మయమగు పదమును అనగా భగవంతుడగు వాసుదేవ శ్రీకృష్ణుని కథాశ్రవణ రూపమగు మార్గమును వదలరు. 5

ప్రియవ్రతునకు బ్రహ్మదేవుని ఆజ్ఞనే విఘ్నకారణమాయెను అను విషయము సప్రసంగముగా-శ్లో." విముక్త సంగః ప్రకృతింభజస్వే" అను శ్లోకము చివరి వరకు తెలుపుచున్నాడు. వావ అనునది ప్రసిద్ధార్థములో వాడబడినది. ప్రియవ్రతుడు తన తండ్రియగు మనువుచేత భూ పరిపాలనార్థము ఆజ్ఞాపించబడిననూ అందుకు ఇష్టపడకపోయెను. ఓ రాజా! రాజకుమారుడగు ప్రియవ్రతుడు పరమభక్తుడై నారదమహర్షి పాదసేవనముతో పరమార్థతత్త్వమును తెలుసుకొనినవాడై, నిరంతరము బ్రహ్మాభ్యాసముతోనే జీవనము గడపవలెనను బ్రహ్మ సత్రదీక్షను స్వీకరించగా, ప్రియవ్రతుని తండ్రి యగు స్వాయంభువమనువు శాస్త్రములలో చెప్పబడిన అన్ని శ్రేష్ఠ గుణములలో సంపన్నుడైన ఆ ప్రియవ్రతుని భూమాండలాధిపత్యమును స్వీకరించుటకై ఆదేశించెను. కానీ ప్రియవ్రతుడు అఖండ సమాధి యోగముతో తన సమస్త ఇంద్రియముల క్రియాకలాపములను భగవంతుడగు వాసుదేవుని చరణకమలములపైనుంచి, తండ్రియాజ్ఞ ఉల్లంఘించగూడనిదైనను, రాజ్యాధికారమును పొందినచో నా ఆత్మ స్వరూపము స్త్రీపురుషాది అసత్ ప్రపంచముతో ఆచ్ఛాదితమై, రాజ్యము





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమోభగవతేవాసుదేవాయ. 

సత్తత్త్వం ఆత్మయాథార్థ్యం తత్ అవగతం యేన స తథా అతః బ్రహ్మ సత్రేణ అధ్యాత్మధ్యానేన కార్యేణ దీక్షిష్యమానః నియమం గ్రహీష్యన్ ప్రాగపి శ్రీవాసుదేవ ఏవ నిరంతర సమాధియోగేన చిత్తైకాగ్ర్యేణ సమావేశితః సమర్పితః. సకలకారకాణామింద్రియాణాం యాః క్రియాస్తాసాం కలాపో యేన సః. యద్యపి తత్పిత్రోక్తం న ప్రత్యాఖ్యేయం. తథాపి తదధికరణే రాజ్యాధికారే అసతః మిథ్యాభూతాదపి రాజ్యే ప్రపంచాదాత్మనః పరాభవమాలోచయన్ నాభ్యనందత్. 6

చూ॥ అథహ భగవానాదిదేవ ఏతస్య గుణవిసర్గస్య పరిబృంహణానుధ్యానవ్యవసిత సకలజగదభిప్రాయ ఆత్మయోనిరఖిల నిగమ నిజగణ పరి వేష్టితః స్వభవనాదవతతార. 7

టీ:- అథహేతి. గుణవిసర్గస్య గుణసృష్టేః. పరిబృంహణం సమృద్ధిః తదనుచింతయా వ్యవసితస్సకల జగతామభిప్రాయో యేన సః. యథా రాజ్ఞా చారైః మండలేశ్వరాణామభిప్రాయో నిశ్చీయతే. తద్వదఖిలైర్నిగమైర్మూర్తిమద్భిర్వేదైర్నిజగణైశ్చ మరీచ్యాదిభిః, పరివృతః సత్యలోకాదవతీర్ణః. 7

మరియు కుటుంబ చింతనలో నిమగ్నమై పరమార్థ తత్త్వమును మరువ (పరాభవమంద) గలనని ఆలోచించి తండ్రియాజ్ఞను శిరసావహించలేకపోయెను. 6

నిరంతరము గుణమయ ప్రపంచము నభివృద్ధిపరచు స్వభావముగల, ప్రపంచములోని సమస్త జనుల అభిప్రాయముల నెరిగిన, ఆదిదేవుడగు బ్రహ్మ ప్రియవ్రతుని అభిప్రాయము ఎరిగినవాడై రాజుల ఆజ్ఞలతో సామంతుల అభిప్రాయము నిశ్చయించబడునట్లుగా, రూపు ధరించిన సమస్త వేదములతో, మరీచ్యాదులు, మరియు నిజపరివారముతో కూడినవాడై సత్యలోకమునుండి అవతరించెను. 7





చూ॥ స చ తత్ర తత్ర గగనతలే హ్యుడుపతిరివ విమానావళిభిరను పథమమర పరిబృఢైరభిపూజ్యమానః పథి పథిచ వరూధశః సిద్ధ గంధర్వ సాధ్యచారణ ముని కిన్నరగణైరుపగీయమానో గంధమాదన ద్రోణీ మవభాస యన్నుపససర్ప. 8

టీ:- స ఇతి. స చ బ్రహ్మ తత్ర తత్రోడుపతిశ్చంద్ర ఇవ ప్రకాశమానో గంధమాదనస్య ద్రోణీం దరీమవభాసయన్ ఉపససర్పేత్యన్వయః. అమరపరిబృఢైః దేవేంద్రాదిభిః. 8

చ్లూ॥ తత్ర హవావ ఏనం సురర్షిర్హంసయానేన పితరం భగవంతం హిరణ్యగర్భముపలభమానస్సహసైవోత్థాయార్హణేన సహ పితా పుత్రాభ్యా మవహితాంజలిరుపతస్థే. 9

టీ:- తత్రేతి. హంసయానేనోపలక్షణేన ఏనం పితరముపలభమానః మత్పితాయమితి లక్షయన్. పితాపుత్రాభ్యాం మమ ప్రియవ్రతాభ్యాం సహ, కృతాంజలిస్సన్ సహసైవాభ్యుత్థాయ అర్హణేవ పూజయా సహోపతస్థే తుష్టావ చ ప్రియవ్రతం తథా మందరద్రోణ్యాం నారద ఉపదిశతి - మనుశ్చ తం నేతుమాగత్య స్థిత ఇతి జ్ఞాతవ్యం. 9

ఆ బ్రహ్మ ఆకాశమార్గమున అచటనచట విమానముల నధిరోహించిన దేవేంద్రాదులతో పూజింపబడుచు, బద్ధులై వచ్చిన సిద్ధ, గంధర్వ, సాధ్య, చారణ, మునిగణ, కిన్నెరాదులతో స్తుతించ బడుచు నక్షత్రాధిపతియగు చంద్రునివలె గంధమాదన తటిని ప్రకాశింపచేస్తూ ప్రియవ్రతుడున్న ప్రాంతమునకు చేరెను. 8

నారదుడు హంస వాహనమును గాంచి తన తండ్రియగు బ్రహ్మదేవుడరుదెంచినాడని తెలుసుకొని స్వాయంభువమనువు, ప్రియవ్రతులతో కూడి హఠాత్తుగా లేచి, అంజలి ఘటించి బ్రహ్మకు సదుపచారములుగావించిరి. (ఆ మందర ద్రోణిలో ప్రియవ్రతునకు బ్రహ్మవిద్యనుపదేశించుటకు నారదుడు, తన పుత్రుని రాజ్యపాలనకై తన నగరమునకు తీసుకు వెళ్ళుటకు మనువును వచ్చియుండిరని తెలియవలయును). 9









చూ॥ భగవానపి భారత - తదుపనీతార్హణస్సూక్తవాకేనాతితరాం ముదితగుణగణావతారసువిజయః ప్రియవ్రతమాదిపురుషస్తం సదయ హాసావలోక ఇతి హోవాచ ॥ 10

టీ:- భగవానితి. హే భారత భగవానాదిపురుషో బ్రహ్మాపి తం ప్రియవ్రతమితి హోవాచేత్యన్వయః. తేన నారదేన ఉపనీతమర్హణం యస్య సూక్తవాకేన యథోచితవాక్యేన అతిశయేన ఉదితా వర్ణితా. గుణ గణాః అవతారాః. సువిజయాస్సర్వోత్కర్షాశ్చ యస్య. 10

**బ్రహ్మా ఉవాచ**

శ్లో॥ నిబోధ తాతేదమృతం బ్రవీమి
మాసూయితుం దేవమర్హస్య ప్రమేయమ్ ।
వయం భవాంస్తేష తతో మహర్షి
ర్వహామ సర్వే వివశా యస్య దిష్టం ॥ 11

టీ:- ప్రవృత్తి విషయం మద్వాక్యం ప్రతికూలం మత్వా మయ్యసూయాం కరిష్యతీతి శంకమానో నాహమేవం వదామి కింతు మన్ముఖేన శ్రీహరి రేవ త్వామాజ్ఞాపయతీతి వదన్ ప్రవృత్తి నివృత్తి రహస్యమాహ-నవభిః. నిబోధేతి. ఋతం సత్యం అప్రమేయం దేవం

ఓ పరీక్షిద్రాజా! నారదుడు, సుమధుర వాక్కులచేత బ్రహ్మదేవుని సర్వోత్కృష్టములగు గుణగణములు, అవతారాదికములు, విజయములు వర్ణించగా బ్రహ్మదేవుడు సంతుష్టుడై, ప్రియవ్రతునివైపు దయతోగూడిన స్మితహాసముకల దృష్టితో చూచి ఈ విధముగా పలికెను. 10

విషయములపట్ల ప్రవృత్తిని కలుగజేసెడి నా మాటను తన వాంఛకు ప్రతికూలమైనదిగా తలచి, నాపై ప్రియవ్రతుడు దోషదృష్టి కలవాడగునోయని శంకించిన బ్రహ్మ, నా అంతట నేను ఇటుల పలుకుటలేదు. నా ద్వారా శ్రీహరియే నిన్నాజ్ఞాపించుచున్నాడని పలుకుచు ప్రవృత్తి, నివృత్తి (త్యాగమార్గ) రహస్యమును ఇచటినుండి తొమ్మిది శ్లోకములలో చెప్పుచున్నాడు.

**బ్రహ్మ ఈ విధముగా పలికెను.**

ఓ వత్సా! నేను నీకు సత్యమును తెలుపుచున్నాను. అవధానముతో వినుము. అప్రమేయుడగు శ్రీహరిపైన నీవు ఎలాంటి










అసూయితుం దోషా రోపణేన ద్రష్టుం మార్హసి. తే తవ. తతః తాత ఏషః త్వద్గురుః మహర్షిశ్చ దిష్టం ఆదిష్టం ఆజ్ఞాం వివశాః అస్వతంత్రా స్సంతో వహామ. 11

దోషదృష్టి కలవాడవు కాకుము. నేను, మహాదేవుడు, నీ తండ్రి మనువు, నీ గురువగు ఈ నారదమహర్షి అందరము శ్రీహరి ఆజ్ఞను అస్వతంత్రులమై, వివశులమై శిరసావహించెదము. 11

శ్లో॥ న తస్య కశ్చిత్తపసావిద్యయా వా న
యోగవీర్యేణ మనీషయా వా ।
నైవార్థధర్మైః పరతస్స్వతో వా కృతం
విహంతుం తనుభృద్విభూయాత్ ॥ 12

టీ:- వివశత్వమేవాహచతుర్భిః నేతి. తస్య కృతం తేన నిర్మితం తనుభృత్జీవః తప ఆదిభిర్విహంతుం అన్యథా కర్తుం న భూయాత్. ప్రభుర్న భవేత్. మనీషయా సామాది బుద్ధిబలేన పరతః బలవదాశ్రయాత్. 12

అస్వతంత్రతను ( వివశత్వమును) నాలుగు శ్లోకములతో వివరించుచున్నాడు. భగవంతుని ఆనతిని దేహధారియగు ఏ జీవియూ తపో విద్యాదులతోగాని, యోగబుద్ధి బలాదులతోగాని, అర్థ ధర్మములతోగాని స్వయముగాగాని, ఇతరుల సహాయముతోగాని దాటుటకు సమర్థుడుగాడు. 12

శ్లో॥ భవాయ నాశాయ చ కర్మకర్తుం
శోకాయ మోహాయ సదాభవాయ ।
సుఖాయ దుఃఖాయ చ దేహయోగ
మవ్యక్తదిష్టం జనతాంగధత్తే ॥ 13

టీ:- తత్ర దేహయోగే తావత్పారతంత్ర్యం ప్రసిద్ధమిత్యాహ -

జీవునకు దేహయోగమునందు పారతంత్ర్యము ప్రసిద్ధమైనదే నని తెలుపుచున్నాడు. ఓ ప్రియవ్రతా! అవ్యక్తుడగు ఈశ్వరునిచేత ఇవ్వబడ్డ శరీరమును సమస్త ప్రాణులు జన్మ, మరణ, శోక, మోహ, భయ, సుఖ, దుఃఖముల ననుభవించుటకు, కర్మల నాచరించుటకు ధరించుచున్నారు. ఇలాకాక వేరు విధముగా చేయుటకు అసమర్థులు కూడా!. 13











భవాయేతి. భవః జన్మభవాద్యర్థం అవ్యక్తేన ఈశ్వరేణాదిష్టం దత్తం దేహయోగం జనతా జీవసమూహః సదా ధత్తే న త్వన్యథా కర్తుం శక్నోతి. అంగ హే ప్రియవ్రత. 13

శ్లో॥ యద్వాచితంత్ర్యాం గుణకర్మదామభిస్సు
దుస్తరైర్వత్స వయం సుయోజితాః ।
సర్వే వహామో బలిమీశ్వరాయ
ప్రోతానసివ ద్విపదే చతుష్పదః ॥ 14

టీ:- కర్మకరణేఽపి పారతంత్ర్యమాహ - యదితి. యస్య వాచివేద లక్షణాయాం తంత్ర్యాం దామన్యాం గుణాస్సత్వాదయః తత్పూర్వకాణి చ యాని కర్మాణి తన్నిబంధకథనైర్దామభిః బ్రాహ్మణాది శబ్దైః సుదుస్త రైస్సుదృఢైః. హే వత్స వయం సర్వే సుయోజితా నిబద్ధాస్సంతః తస్మై ఈశ్వరాయ బలిం వహామ తదిచ్ఛయా కర్మ కుర్మఃనసి నాసికాయాం ప్రోతాః బద్ధాస్సంతశ్చతుష్పదః బలీవర్దాః యతావద్ద్విపదే పురుషాయ. (14)

జీవి కర్మలనాచరించుటలో పరాధీనుడే అను విషయమును తెలుపుచున్నాడు. ఓ వత్సా! ముకుతాడుచే బంధింపబడిన పశువు మానవులు వశమై ఏ విధముగా నుండునో అటులనే సత్వాది గుణములు, సాత్వికాది కర్మలు మరియు బ్రాహ్మణాది పదములనబడు, పరమాత్మ యొక్క వాణీరూపమగు వేదములనెడి దృఢమైన దారములతో బంధింపబడిన మనమందరము ఆ ఈశ్వరుని ఇచ్ఛానుసారము కర్మలయందు నిమగ్నులమై యుందుము. ఆ కర్మలద్వారా ఈశ్వరుని సేవించుచుందుము. 14









శ్లో॥ ఈశావసృష్టం హ్యవరుద్మహేఽంగ
దుఃఖం సుఖం వా గుణకర్మసంగాత్ ।
ఆస్థాయ తత్తద్యదయుజ్త్క నాథశ్చ
క్షుష్మతాంధా ఇవ నీయమానాః ॥ 15

టీ:- భోగేఽపి పారతంత్ర్యమాహ - ఈశేతి. ఈశావసృష్టం ఈశ్వరేణ విసృష్టం దత్తమేవ అంగ హే ప్రియవ్రత అవరుధ్మహే స్వీకుర్మః.యథా స్వామినా దత్తమేవ కణికాది బలీవర్ధాభక్షయంతి న స్వేచ్ఛయా తద్వత్. నచైవం వైషమ్య మీశ్వరస్య యతో గుణకర్మసంగాత్ నాథో యద్యత్ దేవతిర్య గాదిలక్షణం దేహమయుజ్క్త యోజితవాన్ తత్తదాస్థాయ స్వీ కృత్య. యథా అంధాశ్చక్షుష్మతా ఛాయాతపం వా నీయమానాస్సంతః (15)

శ్లో॥ ముక్తోఽపి తావద్బిభృయాత్స్వ దేహ
మారబ్ధ మశ్నన్నభిమాన శూన్యః ।
యథానుభూతం ప్రతియాతనిద్రః
కింత్వన్య దేహాయ గుణాన్న వృంక్తే ॥ 16

టీ:- నన్వేతత్సర్వం అవిదుష ఏవ న త్వాత్మవిద ఇత్యాశంక్యాహ - ముక్తోఽపీతి. యావత్ప్రారబ్ధం కర్మ తావత్. యథా స్వప్నేఽనుభూతం

జీవుడు అనుభవమొందుటలోను పరతంత్రుడే అను విషయము తెలుపుచున్నాడు. తన కర్మల ననుసరించి, ఈశ్వరుడు జీవుని ఏ యోనిలో జన్మింపచేసినాడో ఆ జన్మ నంగీకరించి ఈశ్వరునిచే కల్పించబడిన సుఖ దుఃఖములను తన స్వామిచే ఒసగబడిన ఆహారమునే పశువులు భుజించినటుల అనుభవించుచున్నాడు. ఈశ్వరునకు ఏ జీవిపైనను వైషమ్యము ఉండదు. ఆ జీవి గుణకర్మల ననుసరించి సుఖ దుఃఖాదుల కల్పించును. గుడ్డివాడు చూడగలిగిన వానిని అనుసరించి ఎండ, నీడల ప్రాంతములకు కొనిపోబడు నటుల ఈశ్వరేచ్ఛనే జీవుడనుసరించును. 15

ఇదంతయు ఆత్మజ్ఞానము లేనివానికే ఆత్మవేత్తకు కాదు అని శంకించినచో తెలుపుచున్నాడు. ముక్తుడగు పురుషుడు కూడా ప్రారబ్ధ కర్మను అనుభవిస్తూ, భగవంతుని ఇచ్ఛననుసరించి, స్వప్నములో అనుభవించిన విషయమును నిద్ర నుండి మేల్కొనిన పిదప అభిమాన శూన్యుడై స్మరించునటుల దేహధారణచేయును. మరి విషయవాసనతో పునర్జన్మ కలుగునని శంకించినచో ఇలా తెలుపుచున్నాడు. దేహాంతరారంభములగు గుణకర్మ వాసనలను భజించడు. 16








ప్రతియాతనిద్రః గతనిద్రః అభిమానశూన్య ఏవానుస్మరతి. తర్హి భోగవాసనయా పునర్జన్మ భవేత్తత్రాహ – కింతు దేహాంతరారంభకాన్ గుణాన్ కర్మాణి వాసనాశ్చ న వృణ్తే 2న సంభజతే. 16

శ్లో॥ భయం ప్రమత్తస్యవనేష్వపి
స్యాద్యతస్స ఆస్తేసహషట్సపత్నః ।
జితేంద్రియస్యాత్మరతేర్బుధస్య
గృహాశ్రమః కిన్ను కరోత్యవద్యమ్ ॥ 17

టీ:- నను గృహేవర్తమానస్య భోగాన్ భుంజానస్య కుతో2భి మానా భావః మోక్షో వా అతస్త్యాగేన వనవాసో వ్యాపయుక్తస్తత్రాహ – భయమితి భయం సంసారః స్యాదేవ ప్రమత్తస్య అజితేంద్రియస్య వనే ష్వపి సంగభియా వనాద్వనాంతరం గచ్ఛతో2పీత్యర్థః. సహైవ షట్స పత్నాశ్శత్రవో మనోబుద్ధ్యింద్రియాణి చ యస్య స తథాభూత ఏవ వనే ష్వపి యత ఆస్తే బుధత్వేన జితేంద్రియత్వాదాత్మారామస్య అవద్యం రాగాదిదోషం కిం కరోతి న కరోత్యేవ. 17

శ్లో॥ యష్షట్సపత్నాన్విజిగీషమాణో గృహేషు నిర్విశ్యయతేతపూర్వమ్।
అత్యేతిదుర్గాశ్రిత ఊర్జితారీన్ క్షీణేషు కామం విచరేద్విపశ్చిత్ ॥18

గృహములో నివసిస్తూ భోగములననుభవిస్తున్న వ్యక్తికి అభిమానము ఎలా ఉండదు? మోక్షమెలా కలుగుతుంది? అందువలన విషయవాసనలను వదలక గృహ, భోగముల త్యాగముతో వనవాసము కూడా అయుక్తమేనని తెలుపుచున్నాడు. ఏ వ్యక్తి మనోబుద్ధీంద్రియ ములను షట్సపత్నుల (ఆరుగురు శత్రువుల) వశుడై ఉండునో అతడు సంగభయముతో వనములో తిరుగుచున్ననూ, అలాంటి అజితేంద్రియు -నికి (ఇంద్రియములను జయించని వానికి) సంసార భయము, జనన మరణ భయము ఉంటూనే యుండును. బుద్ధిమంతుడై, మనో బుద్ధీంద్రియములను జయించి ఆత్మలో రమించునతనిని గృహాశ్రమము కూడా ఏమీ చేయలేదు. 17

గృహములో నివసించునతనికి రాగాదులు కల్గను వనములో నివసించునతనికి కలుగవనగా తెలుపుచున్నాడు. ఈ షట్సపత్నులను




టీ:- నను గృహే వసతః పురుషస్య రాగాదయస్సంభవంతి న తు వన ఇత్యాశంక్యా హ - య ఇతి. యో విజిగీషమాణస్సపూర్వం గృహేషు స్థిత్వా తేషామత్యంతనిబోధమకుర్వన్ జేతుం యతేత. క్షీణేష్వరిషు కామం గృహే అన్యత్ర వా విచరేత్. యతో లోకే ఊర్జితానరీన్ దుర్గాశ్రిత ఏవాత్యేతి జయతి పశ్చాత్ దుర్గే అన్యత్ర వా వర్తేత. యుధ్యేతేతి పాఠే ప్రహరేదిత్యర్థః. 18

శ్లో॥ త్వం త్వబ్జనాభాంఘ్రిసరోజ కోశ
దుర్గాశ్రితో నిర్జితషట్సపత్నః ।
భుంక్ష్వేహ భోగాన్ పురుషాతి దిష్టాన్
విముక్తసంగః ప్రకృతిం భజస్వ ॥ 19

టీ:- త్వమితి. ఇదం చ గృహదుర్గాశ్రయణం ప్రాకృతానాం. త్వం తు అబ్జనాభస్యాంఘ్రిసరోజకోశ ఏవ దుర్గం తదా శ్రితః. అతఏవ నిర్జితషట్సపత్నశ్చ తథాపి పురుషేణ ఈశ్వరేణాతిదిష్టాన్ దత్తాన్ భోగాన్ తావద్భుంక్ష్వ - పశ్చాద్విముక్తసంగస్సన్ ప్రకృతిం స్వరూపం భజస్వ ఆత్మనిష్ఠో భవేత్యర్థః. 19

(మనో బుద్ధీంద్రియములను) జయించవలెనను కోరికగల వ్యక్తి మొదలు గృహములో నుండియే మనో బుద్ధీంద్రియములను నిరోధించి జయించుటకు యత్నించవలెను. లోకమున గొప్ప శత్రువులను జయించుటకు దుర్గమునాశ్రయించి పోరాడి, జయించిన పిదప దుర్గమునకాని ఇతరత్రాకాని తిరిగినటుల ఈ షట్సపత్నుల జయము తరువాత గృహమునకాని వనమునకాని సంచరించవచ్చును. 18

ఓ ప్రియవ్రతా! నీవు శ్రీహరి చరణకమలములకోశమనెడు దుర్గాశ్రితుడవై, మనోబుద్ధీంద్రియాలను జయించినాడవు అయినప్పటికీ ఈశ్వరునిచే ఒసగబడిన భోగములనుభవించుము. ఆ పిదప నిస్సంగుడవై ఆత్మ స్వరూపమునొందుము. (ఆత్మనిష్ఠుడవు కమ్ము)19






శ్రీశుక ఉవాచ

చూ॥ ఇతి సమభిహితో మహాభాగవతో భగవతస్త్రి భువన గురోరనుశాసనమాత్మనో లఘుతయాऽవనతశిరోధరో బాఢమితి సబహుమానమువాహ. 20

టీ:- ఇతీతి. ఆత్మనస్తతో లఘుతయా అల్పతయా తచ్ఛాసనమంగీ చకార. యద్వా ఆత్మనో యదనుశాసనం తత్ అలఘుతయా గౌరవేణ బాఢం తథా సమభిహితః కరిష్యామీత్యవనతకంధరస్సన్ జగ్రాహ. 20

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

ముల్లోకములకు గురువగు బ్రహ్మ ఈ విధముగా పలుకగా పరమభాగవతుడగు ప్రియవ్రతుడు తాను బ్రహ్మకంటే అల్పుడగుటచే, నమ్ర భావముతో శిరస్సువంచి మీ ఆజ్ఞను అంగీకరించెదనని పలికెను. (20)

చూ॥ భగవానపి మనునా యథావదుపకల్పితాపచితిః ప్రియవ్రత నారదయోరవిషమమభి సమీక్షమాణయోరాత్మనస్సమవస్థాన మవాఙ్మనస క్షయమవ్యవహృతం ప్రవర్తయన్న గమత్. 21

టీ:- భగవానితి. మనునా సంతుష్టేన ఉపకల్పితా పూజా యస్య ప్రియవ్రతస్య యోగభ్రంశాన్నారదస్య చ శిష్యనాశాత్కుటిలమీక్షణం సంభవతితత్తునాస్తీత్యాహ - అవిషమం యథా భవతి తథా తయోరభిసమీక్షమాణయోస్సతోః ఆత్మనస్సమ్యగవస్థానం అవాఙ్మన సయోరవిషయం నివాసం. పాఠాంతరే - అవాక్ వాచామగోచరం కథంచిన్మనసః సంక్షయం విషయం అతః అవ్యవహృతం వ్యవహార శూన్యం బ్రహ్మ అనిర్వృతం ప్రవర్తయన్ వ్యవహారాద్విషణ్ణస్సన్ వ్యవహారాతీతం స్వరూపం చింతయన్ అంతర్హిత ఇత్యర్థః. 21

తనవలన ప్రియవ్రత నారదులలో ప్రియవ్రతునికి యోగభ్రష్టత్వము కలుగుటచే, నారదునకేమో ప్రియవ్రతుని లాంటి శిష్యుడు ప్రవృత్తికి వెళ్ళుట వలన ఏవిధమైన కుటిలము కనబడలేదని వారి చూపులతోనే తెలియచేయబడి, మనువుచే సదుపచారములను పొంది సంతుష్టుడై మనోవాక్కులకు అగమ్యగోచరమై తనకు ఆశ్రయమై, సకల వ్యవహారాలకు అతీతమైన పరబ్రహ్మను చింతిస్తూ (స్వస్వరూపమును) అంతర్హితుడయ్యెను. 21





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









చూ॥ మనురపి పరేణేత్థం ప్రతిసంధిత మనోరథః సురర్షేర్వరాను మతేనాత్మజమఖిల ధరామండల స్థితిగుప్తయేఽవస్థాప్య స్వయమతి విషమ విషయ విషజలాశయాశాయా ఉపరరామ. 22

టీ:- మనురితి. పుత్రమభిషిచ్య వనం యస్యామీత్యేవం యో మనోరథః. సః పరేణ బ్రహ్మణైవ ప్రతిసంధితః సంపాదితో యస్య సః. నారదస్యానుమతేన రాజ్యే స్థాపయిత్వా అతివిషమః దుస్తరో యో విషయ విషజలాశయః గృహం తస్యాశా దిక్ ప్రవృత్తి వాసనా భోగేచ్ఛా వా. తస్యా ఉపరతోఽభూత్. 22

చూ॥ ఇతిహవావస జగతీపతిరాత్మేచ్ఛయాధినివేశిత కర్మాధికారోఽఖిల జగద్బంధ ధ్వంసనపరానుభావస్య భగవత ఆదిపురుషస్యాంఘ్రి యుగళానవరత ధ్యానానుభావేన పరిరంధిత కషాయాశయోఽవదాతోఽభి మాన వర్ధనో మహతాం మహీతల మనుశశాస. 23

టీ:- యత్పృష్టం గృహే కథమరమతేతి తత్రోక్తముత్తరముపసంహరతి - ఇతీతి. ఇతి హవావ ఇత్థమేవ హి అధినివేశితః ప్రాప్తితః కర్మాధికారో యస్య. అఖిలస్య జగతో బంధధ్వంసనపరః అనుభావో యస్య తస్య యదంఘ్రియుగళం తస్య అనవరతధ్యానం. తదనుభావేన పరిరంధిత

నారదమహర్షి అనుమతితో ప్రియవ్రతుని సంపూర్ణ భూమండలమునకు శాసకునిగా నొనరించి స్వాయంభువమనువు కూడా బ్రహ్మదేవుని కృపతో వనమునకు వెళ్ళే కోరికను తీర్చుకొని, మిక్కిలి దుస్తరమగు విషయ విషజలాశయ రూపమగు గృహస్థాశ్రమ భోగేచ్ఛ నుండి విరక్తుడాయెను. 22

ప్రియవ్రతుడు గృహములో ఎట్లు రమించెను అను పరీక్షిత్తు ప్రశ్నకు సమాధానమిస్తూ ఉపసంహరిస్తున్నాడు. ఈ విధముగా బ్రహ్మ ఆజ్ఞతో రాజశాసన కర్మాధికారియైన ప్రియవ్రతుడు సమస్త జగద్బంధనముల తొలిగించెడి ఆదిపురుషుడగు భగవంతుని చరణ యుగళమును నిరంతరము ధ్యానిస్తూ రాగాది మలములు దగ్ధముకాగా శుద్ధుడై, మాన్యులగు బ్రహ్మాదుల ఆజ్ఞను పాలించుటకై భూమండలమును పరిపాలించెను. 23



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








కషాయః దగ్ధరాగాదిమలః ఆశయో యస్య అతః అవదాతః శద్ధోऽపి మహతాం బ్రహ్మాదీనాం ఆజ్ఞాపాలనేన మానవర్ధనః. 23

చూ॥ అథ స దుహితరం ప్రజాపతేర్విశ్వకర్మణ ఉపయేమే బర్హిష్మతీం నామ తస్యా ముహవావాత్మజానాత్మనస్సమాన గుణశీల కర్మరూప వీర్యో దారాన్ దశ సంభావయాం బభూవ - కన్యాం చ యవీయసీ మూర్జస్వతీం నామ. 24

ఆ పిదప ప్రియవ్రతుడు ప్రజాపతి విశ్వకర్మ పుత్రికయగు బర్హిష్మతిని వివాహమాడెను. ఆమెయందు తనతో సమానమగు శీల, గుణ, కర్మ రూప, వీర్యోదారులగు పదిమంది పుత్రులను కనెను. మరియు అందరికి కనిష్ఠురాటుగా ఊర్జస్వతి అను కన్యను కనెను. ఉ అనునది ఆశ్చర్యార్థమున, హ అనునది ప్రసిద్ధార్థమున వావ అనునది నిశ్చయార్థమున చెప్పబడినది. 24

టీ:- అథేతి. ఉ ఇతి విస్మయే. హ ఇతి ప్రసిద్ధౌ. వావేతి నిశ్చయే. ఆత్మనా సమానైశ్శీలాదిభిః. ఉదారాన్ మహతః దశ పుత్రాన్ జనయామాస. 24

చూ॥ ఆగ్నీధ్రేధ్మ జిహ్వాయజ్ఞ బాహుమహావీర హిరణ్యరేతో ఘృత పృష్ఠ సవనమేధాతిథి వీతిహోత్ర కవయ ఇతి సర్వ ఏవాగ్నినామానః. (25)

ఆ ప్రియవ్రతుని పుత్రుల నామములను తెలుపుచున్నాడు. 1. అగ్నీధ్రుడు 2. ఇధ్మజిహ్వుడు 3. యజ్ఞబాహుడు 4. మహావీరుడు 5. హిరణ్యరేతుడు 6. ఘృతపృష్ఠుడు 7. సవనుడు 8. మేధాతిథి 9. వీతిహోత్రుడు 10. కవి, అని అందరును అగ్ని నామములు కలవారు. (25)

టీ:- తానాహ - ఆగ్నీధ్రేతి. అగ్నీనాం నామాని యేషాం తే అగ్నినామానః. 25








ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

చూ॥ ఏతేషాం కవిర్మహావీరస్సవన ఇతి త్రయ ఆసన్నూర్ధ్వరేతసస్త ఆత్మవిద్యాయామర్భభావాదారభ్య కృతపరిచయాః పారమహంస్యమేవా శ్రమమభజన్. 26

టీ:- ఏతేషామితి. అర్భభావాద్బాల్యాదారభ్య. 26

చూ॥ తస్మిన్నుహవాహో ఉపశమశీలాః పరమర్షయః సకలజీవని కాయావాసస్య భగవతో వాసుదేవస్య భవభీతానాం శరణభూతస్య శ్రీమచ్చరణారవిందావిరతస్మరణా విగళిత పరమభక్తి యోగానుభావేన పరిభావితాంతర్హృదయాధిగతే భగవతి సర్వేషాం భూతానామాత్మభూతే ప్రత్యగాత్మన్యేవాత్మతాదాత్మ్యమవిశేషేణ సమీయుః. 27

చూ॥ అన్యస్యామపి జాయాయాం త్రయః పుత్రా ఆసన్ ఉత్తమ స్తామసో రైవత ఇతి మన్వంతరాధిపతయః. 28

టీ:- తస్మిన్నితి. తస్మిన్ పారమహంస్యాశ్రమే శ్రీమచ్చరణారవిందయో

వీరిలో కవి , సవనుడు, మహావీరుడు అను ముఫ్ఫురును బాల్యమునుండియే ఆత్మవిద్యాతత్పరులై ఊర్ధ్వరేతస్కులై (నైష్ఠిక బ్రహ్మచారులై) చివరన పరమహంసలైరి. (సన్యాసాశ్రమము స్వీకరించిరి). 26

నివృత్తిపరాయణులగు ఈ ముఫ్ఫురును సన్యాసాశ్రమము నందే యుంటూ సమస్త జీవులకధిష్ఠాత భవబంధములంటే భయపడే వారికి ఆశ్రయభూతుడగు వాసుదేవుని చరణారవిందములను నిరంతరము చింతించగా కలిగిన అఖండము, శ్రేష్ఠమగు భక్తియోగముతో వారి అంతఃకరణములు శుద్ధము లాయెను. వారిలో భగవంతుని ఆవిర్భావము కలిగెను. ఆవిర్భవించిన భగవంతునిలో దేహాద్యుపాధి నివృత్తితో త్వం పదార్థము యొక్క తాదాత్మ్యము నొందిరి. అనగా ప్రత్యగాత్మలో ఐక్యమొందిరి. 27

ప్రియవ్రతునకు వేరొక భార్యయందు మన్వంతరాధిపతులగు ఉత్తముడు, తామసుడు, రైవతుడు అను ముగ్గురుపుత్రులు కలిగిరి. 28



ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.










రనవరతస్మరణేన అవిగళః అఖండితః యః పరమోభక్తియోగః తస్యాను భావేన విశోధితాంతఃకరణే ప్రతీతోయో భగవాన్ తస్మిన్నాత్మనః త్వం పదార్థస్య తాదాత్మ్యం అవిశేషేణ. విశేషో దేహాద్యుపాధిః తదపోహేన ప్రాపుః. (27-28)

చూ॥ ఏవముపశమాయనేషు స్వతనయేష్వథ జగతీపతిర్జగతీమర్బు దాన్యేకాదశ పరివత్సరాణామవ్యాహతాఖిల పురుషకారసార సంభృత దోర్దండయుగళాపీడిత కోదండమౌర్వీ గుణస్తనితవిరమిత ధర్మప్రతిపక్షో బర్హిష్మత్యాశ్చానుదిన మేధమానప్రమోద ప్రస్రవణయౌషణ్యవ్రీడా ప్రముషిత హాసావలోక రుచిర క్ష్వేళాదిభిః పరాభూయమాన వివేకో ऽనవబుధ్యమాన ఇవ మహామనా బుభుజే. 29

టీ:- ఏవమితి. ఉపశ్రమాశ్రయేషు సత్సు దశకోటిభిరేకమర్బుదం తాదృశాని వర్షాణాం ఏకాదశార్బుదాని జగతీం బుభుజ ఇత్యన్వయః రాజ్ఞో ధర్మపాలన విషయభోగ ప్రభావైర్భావ్యం. తత్ర అనాయాసేనైవ ధర్మపాలనమాహ - అవ్యాహతాః అఖిలాః పురుషకారాః పౌరుషాణి యస్మాత్ తేన సారేణబలేన సంభృతౌ పూర్ణౌ దోర్దండౌ తయోర్యుగళం తేనాపీడితః ఆకృష్టః మౌర్వీగుణః. తస్యాస్తనితటంకారః తేనైవ యుద్ధం వినా విరమితా నిరస్తాః ధర్మ ప్రతిపక్షాః యేన భోగాతిశయమాహ -

ఈ విధముగా కవి మొదలగు ముమ్వురు నివృత్తి పరాయణులు కాగా, ప్రియవ్రతుడు పదకొండు అర్బుదముల సంవత్సరకాలము (పదికోట్లు ఒక అర్బుదము అనగా ఒకవంద పదికోట్ల సంవత్సరములు) తన యొక్క అఖండ పురుషార్థ సామర్థ్యముచే, పరాక్రమవంతమైన భుజములతో, ధనుర్విద్యా బలముతో ధర్మద్రోహులందరిని శిక్షించెను. తన భార్యయగు బర్హిష్మతి యొక్క నిత్యనూతన, హర్ష, అభ్యుత్థానాది లీలలతో స్త్రీ స్వాభావికమగు శృంగార భావప్రకాశన, వ్రీడ, సంకోచ హాసాదులతో కూడిన పరిహాస వాక్యములతో ప్రియవ్రతుడు వివేక హీనునివలె ఆత్మ విస్మృతి నొందిన వాడివలె సమస్త భోగముల ననుభవిస్తూ రాజ్యమును సుభిక్షముగ పరిపాలించెను. వాస్తవముగా ఆ భోగములందు ఆసక్తుడు కాకుండెను. 29









బర్హిష్మత్యాః స్వభార్యాయాః అనుదినమేధమానైః ప్రమోదాదిభిః పరాభూయమానవివేక ఇవ అత ఏవ విషయాసక్త్యా ఆత్మాన మనవ బుధ్యమాన ఇవ బుభుజే. తత్ర ప్రమోదః పతిం దృష్ట్వా హర్షః. తతః ప్రసరణం అభ్యుత్థానాదిలీలా. తతో యౌషిణ్యం యోషిత్స్వభావకృత శృంగారానుభావ ప్రకాశనం. తతో వ్రీడయా ప్రముషితాస్సంకోచితాః. హాసావలోకాః తతో రుచిరక్ష్వేళాదయః పరిహాసకవాక్యాని తైః. 29

చూ॥ యావదవభాసయతి సురగిరిమను పరిక్రామన్ భగవానాదిత్యో వసుధాతలమర్ధేనైవ ప్రతపత్యర్ధేనాచ్ఛాదయతి–తథాహి భగవదుపాసనోపచితాతిపురుషప్రభావస్తమభినందన్ సమజవేన రథేన జ్యోతిర్మయేన రజనీమపి దివం కరిష్యామీతి సప్తకృత్వస్తరణిమను పర్యక్రామద్ద్వితీయ ఇవ పతంగః. 30

టీ:– ప్రభావాతిశయమాహ – యావదితి. యావద్వసుధా తలం లోకాలోకపర్యంతమవభాసయతి మేరుం ధ్రువం ప్రదక్షిణీ కుర్వన్ ఆదిత్యస్తస్మిన్నర్ధేనైవోపలక్షితం. ప్రతపతి ప్రకాశయతి. అర్ధేనాచ్ఛాదయతి తమసా ఆవృణోతి, తథాహీతి. యః పతంగస్సూర్య ఇవ పర్యక్రామత్. న చేదమసంభావితం యతో భగవదుపాసనోపచితః అతిపురుషః పురుషానతిక్రాంతః ప్రభావో యస్య. 30

ప్రియవ్రతుని ప్రభావాతిశయము వర్ణించుచున్నాడు. సూర్యుడు మేరుపర్వతమును పరిక్రమిస్తూ లోకాలోకపర్వత పర్యంతమైన భూమిని ఎంత భాగము చూచునో అందు అర్ధ భాగము ప్రకాశవంతమై యుండును. మిగిలిన అర్ధమున చీకటి ఆవరించును. భగవదుపాసనతో పొందిన, పురుషుల నతిక్రమించిన ప్రభావము గల ప్రియవ్రతునకది నచ్చక సూర్యరథముతో సమానమగు వేగముగల ప్రకాశవంతమగు రథముతో రాత్రినిగూడా పగలుగ చేసెదనను సంకల్పముతో రెండవ సూర్యునివలె సూర్యుని అనుసరించి ఏడు పర్యాయములు పృథివిని పరిక్రమించెను. 30









చూ॥ యే వా ఉహ తద్రథచరణ నేమికృత
పరిఘాతాస్తే సప్తసింధవ ఆసన్ ।
యత ఏవ కృతాస్సప్త భువో ద్వీపాః
జంబూప్లక్ష శాల్మలి కుశ క్రౌంచ శాక పుష్కర సంజ్ఞాః ॥ 31

టీ:- యే వా ఇతి. వై ఉహ ఇతి ప్రసిద్ధౌ. తస్య రథచక్రాగ్రకృతాః పరిఘాతాః గర్తాః యతః యైరేవ కృతాః. 31

ఆ ప్రియవ్రతుని రథములతో చేయబడిన గుర్తములు ఏడు సముద్రములాయెను. వాటితో భూమిపై జంబూ, ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములను పేర్లుగల ఏడుద్వీపములేర్పడినవి. 31

చూ॥ తేషాం పరిమాణం పూర్వస్మాదుత్తరోత్తరో యథా సంఖ్యం ద్విగుణేన బహిః సమంతత ఉపక్ల్ప్తాః. 32

టీ:- తేషామితి. తేషాం పరిమాణం శ్రుణ్వితి శేషః. పూర్వస్య యద్విస్తారమానం ఉత్తరస్తతో ద్విగుణేన విస్తారమానేనేత్యేవం సింధుభ్యో బహిస్సమంతతః ఉపక్ల్ప్తాః రచితాః. 32

ఆ ద్వీపములయొక్క పరిమాణమును వినుము ఆ ద్వీపములు ఒకదానికంటే ఒకటి రెండింతల పరిమాణము కలవిగా సముద్రములకు వెలుపల చుట్టును రచింపబడినవి. 32

చూ॥ క్షారోదేక్షురసోదసురోదఘృతో దక్షీరోదదధిమంథోదశుద్ధోదాస్సప్త జలధయః సప్తద్వీప పరిఘా అభ్యంతర ద్వీపసమానా ఏకైకస్య యథానుపూర్వం సప్తస్వపి బహిర్ద్వీపేషు పృథక్పృథక్పరిత ఉపకల్పితాః తేషు జంబ్వాదిషు బర్హిష్మతీపతిరనువృత్తానాత్మజానాగ్నీధ్రేధ్మ జిహ్వా

సముద్రమునకు వెలుపల ద్వీపములున్నట్లే ద్వీపములకు వెలుపల సముద్రములుగలవని తెలుపుచున్నాడు. క్షారోదన, ఇక్షురసోదన, సురోదన, ఘృతోదన, క్షీరోదన, దధిమంథోదన, శుద్ధోదన ములనునవి ఏడు సముద్రములు. ఈ ఏడు సముద్రములు జంబూ











యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృతపృష్ఠ మేధాతిథి వీతిహోత్ర సంజ్ఞాన్ యథా సంఖ్యేనైకైకస్మిన్నేకమేకమేవాధిపతిం విదధే. 33

| ద్వీపము | విస్తీర్ణము | అధిపతి | సముద్రము |
|---|---|---|---|
| జంబూ | లక్ష యోజనాలు | అగ్నీధ్రుడు | క్షారోదన |
| ప్లక్ష | 2 లక్షల యోజనాలు | ఇధ్వజిహ్వుడు | ఇక్షురసోదన |
| శాల్మలీ | 4 లక్షల యోజనాలు | యజ్ఞబాహుడు | సురోదన |
| కుశ | 8 లక్షల యోజనాలు | హిరణ్యరేతుడు | ఘృతోదన |
| క్రౌంచ | 16 లక్షల యోజనాలు | ఘృతపృష్ఠుడు | క్షీర |
| శాక | 32 లక్షల యోజనాలు | మేధాతిథి | దధిమంథోన |
| పుష్కర | 64 లక్షల యోజనాలు | వీతి హోత్రుడు | శుద్ధోదన |

మొదలగు సప్తద్వీపములకు అగడ్తలవలె (కందకములు) నుండెను. ద్వీపములు అభ్యంతర ద్వీపముల వలె యుండి, ఒక్కొక్క ద్వీపమునకు ఒక్కొక్క సముద్రము అగడ్తవలె నుండి, సప్తద్వీపములకు సప్త సముద్రములు అగడ్తలుగా, ఈ అగడ్తలకు వెలుపల ద్వీపములు వేరువేరుగా కల్పించబడియున్నవి. అనగా మొదట జంబూద్వీపము, దాని చుట్టూ క్షారోదీ సముద్రము, ఈ క్ష్వారోద సముద్రము ప్లక్ష ద్వీపముతో చుట్టబడియున్నది. ప్లక్షద్వీపమునకు చుట్టూ ఇక్షురసోద సముద్రము; ఈ ఇక్షురసోదము శాల్మలీ ద్వీపముతో చుట్టబడియున్నది. శాల్మలీ ద్వీపము చుట్టూ సురోదన సముద్రము, దానిచుట్టూ కుశ ద్వీపము, ఈ కుశ ద్వీముచుట్టు ఘృతోదన సముద్రము, దానిచుట్టూ క్రౌంచద్వీపము, ఈ ద్వీపము చుట్టు క్షీరసముద్రము; దానిచుట్టు శాకద్వీపము, ఆ ద్వీపము చుట్టు దధిమంథోద సముద్రము చుట్టబడియున్నది. దానిచుట్టూ పుష్కరద్వీపము, ఆ ద్వీపమును చుట్టుకొని శుద్ధోద సముద్రము చుట్టబడియున్నది. బర్హిష్మతీపతియగు ప్రియవ్రతుడు ఈ ద్వీపములకు క్రమముగ అగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, హిరణ్యరేత, ఘృతపృష్ఠ, మేధాతిథి, వీతిహోత్రులను తన పుత్రులను శాసకులను గావించెను. 33











శ్లో॥ దుహితరం చోర్జస్వతీం నామోశనసే ప్రాయచ్ఛత్ ।
యస్యామాసీద్దేవయానీనామ కావ్యసుతా ॥ 34

టీ:- యథా యథా సింధుభ్యో బహిరేకైకశోద్వీపాః ఏవం ద్వీపానామపి బహిస్సింధవ ఇత్యాహ - క్షారోదేతి. దధిమంథః మథితం దధి. ఏతే సప్తజలధయః సప్తద్వీపానాం పరిఘా ఇవ అభ్యంతరే తైస్సంవేష్టితా యే ద్వీపాః తైస్సమానాః విస్తారతో బహిరంతః పృథక్ పృథక్ అసంకీర్ణతయా. (33-34)

శ్లో॥ శ్లో. నైవం విధః పురుషకార ఉరుక్రమస్య
పుంసాం తదంఘ్రిరజసా జితషడ్గుణానామ్ ।
చిత్రం విదూర విగతస్సకృదాదదీత యన్నా
మధేయమధునా స జహాతి బంధమ్ ॥ 35

టీ:- అహో ఆశ్చర్యం రాజ్ఞస్సామర్థ్యమితి పరీక్షిదభిప్రాయజ్ఞో భగవాన్ బాదరాయణిరాహ - నైవమితి. జితాష్షడ్గుణాః ఇంద్రియాణి షడూర్మయో వా యైస్తేషాం. ఏవం విధః పురుషకార ఇతి న చిత్రం. నాసంభావితం. విదూరవిగతః అంత్యజోఽపి. యస్య ఉరుక్రమస్య నామ. సకృదుచ్చార యేద్యః సః. అధునా తత్ క్షణమేవ బంధం సంసారం. తత్త్వమితి. పాఠేఽప్యయమేవార్థః. పాఠాంతరే - తత్త్వం చండాలత్వం. జహాతి శుద్ధోభవతీత్యర్థః. 35

ప్రియవ్రతుడు తన కూతురగు ఊర్జస్వతిని శుక్రాచార్యునకిచ్చి వివాహమొనరించెను. ఆమెకు దేవయాని అనే పుత్రిక జన్మించినది. 34

ప్రియవ్రత మహారాజు సామర్థ్యము ఆశ్చర్యకరమైనదను పరీక్షిత్తు అభిప్రాయము గ్రహించిన శుకుడు ఇలా తెలుపుచున్నాడు. భగవచ్చ రణారవింద రజస్సుచేత పంచజ్ఞానేంద్రియములు మనస్సు అను ఆరు ఇంద్రియములు; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను షడ్గుణములను; ఆకలి, దప్పిక, శోకము, మోహము, ముసలితనము, మృత్యువు అను ఆరు బాధలను జయించిన భాగవతోత్తముడగు ప్రియవ్రతునకు ఇంతటి పురుషార్థము ఉండుటలో ఆశ్చర్యమేమియు లేదు. ఏలనన వర్ణ బహిష్కృతులగు నీచ పురుషులు కూడా భగవంతుని నామముచ్చరించినంతలో శుద్ధులై సంసార బంధముల నుండి విరక్తు లగుదురు. 35








చూ॥ స ఏవమపరిమిత బలపరాక్రమ ఏకదా తు దేవర్షి చరణాను శయనానుపతిత గుణవిసర్గసంసర్గేణానిర్వృతమివాత్మానాం మన్యమాన ఆత్మనిర్వేద ఇదమాహాహో అసాధ్వనుష్ఠితం యదభినివేశితోఽ హమింద్రియైర విద్యావిరచిత విషమవిషయాంధకూపే, తదల మలమముష్యా వనితాయా వినోదమృగం మాం ధిగ్ధిగితి గర్హయాం చకార. 36

టీ:- తస్య పరాక్రమముపసంహరన్. నివృత్తిక్రమమాహ - స ఇతి. దేవర్షిచరణయో రనుశయనమనుసేవా ఉపపత్తిః తదనుపతితో యో గుణవిసర్గః రాజ్యాదిప్రపంచః. తత్సంపర్గేణ ఆత్మని మనసి నిర్వేదో యస్య. మయా అసాధ్యనుష్ఠితం యత్ యతః అభినివేశితః తత్ తతః అలమలం. విషయైర్వినోదమృగం మర్కటం. 36

ప్రియవ్రతుని పరాక్రమమును గూర్చి ఉపసంహరిస్తూ నివృత్తి క్రమమును తెలుపుచున్నాడు. ఈ విధముగా సాటిలేని పరాక్రమము గల ప్రియవ్రతుడు, దేవర్షి నారదుని చరణసేవతో కలిగిన జ్ఞానము కలిగియూ దైవవశమున రాజ్యాధికారమునొంది సంసారములో మునిగి తనను అశాంతునిగా తలచుకొని ఒకసారి నిర్వేదమొంది ఇట్లు తలచెను. నేను చాలా తప్పు చేసితిని. విషయలోలములగు నా ఇంద్రియములు నన్ను అవిద్యచే కలిగిన విషమ విషయరూపమగు అంధకారకూపమున పడవేసినవి. నేను విషయములకు క్రీడామృగముగ (కోతిగా) మారితిని గదా! అని తనను తాను నిందించుకొనెను. 36

చూ॥ పరదేవతా ప్రసాదాధిగతాత్మప్రత్యవమర్శనే నానుగతేభ్యః పుత్రేభ్య ఇమాం యథా దాయం విభజ్య భుక్తభోగాం చ మహిషీం మృతకమివసమహా విభూతిమపహాయ స్వయం విహితనిర్వేదో హృది గృహీతరుచిర హరి విహారానుభావో భగవతో నారదస్య పదవీం పునరేవానుససార. 37

పరమారాధ్యుడగు శ్రీహరి అనుగ్రహముతో కలిగిన ఆత్మ విమర్శచే, ఆ ప్రియవ్రతుడు తననునుసరించిన తన ఏడుగురు పుత్రులకు ఈ భూమిని విభజించి ఇచ్చి, ఇంతకాలము అనేక రకముల భోగములను కలిసి అనుభవించిన రాణియగు బర్హిష్మతిని మరియు ఐశ్వర్యములను, మృతశరీరమువలె పరిత్యజించి, హృదయమున వైరాగ్యమునొంది శ్రీహరి లీలలను చింతిస్తూ నారదునిచే సూచించ-బడిన మార్గము ననుసరించెను. 37





టీ:- పరదేవతేతి. పరదేవతాయాః శ్రీహరేః. ప్రసాదేన అధిగతః ప్రాప్తో యః. ఆత్మప్రత్యవమర్శః వివేకః తేన నారదస్య పదవీం తదుపదిష్టమార్గ మేవ. పునరనుససారేత్యన్వయః. కిం కృత్వా. అనుగతేభ్యః పుత్రేభ్యః. ఇమాం పృథ్వీం విభజ్య భుక్తోభాగో యస్యాం తాం. సమహిషీం మహావిభూతిం సామ్రాజ్యసంపత్సహితాం. మృతకశరీరమివ పరిత్యజ్య. తత్ర హేతుః - హృది నిహితో నిర్వేదో యేన. హృదీత్యస్య ఉత్తరత్రా ప్యన్వయః. హృదిగృహీతః చింతితః రుచిరః హరేర్విహారః తేనానుభావః త్యాగసామర్థ్యం యస్య. 37

చూ॥ తస్య వా హ ఏతే శ్లోకాః. ॥ 38

ఆ ప్రియవ్రతుని మహిమను తెలిపెడి శ్లోకములు "తదప్యేష శ్లోకోభవతి" అను శ్రుతి తెలిపినటుల చెప్పబడుచున్నవి. 38

టీ:- తస్యేతి. తస్య మహిమోపనిబంధనశ్లోకాః. పూర్వనిబద్ధాః కథ్యంతే. యథా. శ్రు. "తదప్యేష శ్లోకో భవతీ" తి. 38

శ్లో॥ ప్రియవ్రత కృతం కర్మకో ను కుర్యాద్వినేశ్వరమ్ ।
యో నేమినిమ్నైరకరోచ్ఛాయాఘ్నన్ సప్తవారిధీన్ ॥ 39

ప్రియవ్రత మహారాజు చేసిన కర్మ సర్వశక్తిమంతుడగు ఈశ్వరుడు తప్ప ఎవరు చేయగలరు? ఆ ప్రియవ్రతుడు రాత్రిచే కలిగిన అంధకారమును తొలగించ యత్నిస్తూ తన రథ నేములచే గుర్తములతో సప్త సముద్రముల నొనరించెను. 39

టీ:- ప్రియవ్రతేతి. కోనామ కుర్యాత్ ఛాయఘ్నన్ తమోనిరస్యన్. 39






శ్లో॥ భూసంస్థానం కృతం యేన సరిద్గిరి వనాదిభిః ।
సీమా చ భూతనిర్వృత్యై ద్వీపద్వీపే విభాగశః ॥ 40

టీ:- భూసంస్థానమితి. భూసంస్థానం ద్వీపైర్యేన కృతం. సరిద్గిరి వనాదిభిస్సీమా చ యేన కృతా. భూతానాం నిర్వృత్యై సుఖాయ అవివాదాయ. 40

ప్రాణులకు వివాదము లేకుండా సుఖము కలిగించుటకు ప్రియవ్రతుడు భూమిని ద్వీపములుగా విభజించి ప్రతిద్వీపములోను నదులు, పర్వతములు, వనములు, మొదలగువాటిలో సరిహద్దులను నిర్ణయించెను. 40

శ్లో॥ భౌమందివ్యం మానుషం చ మహత్త్వం యోగకర్మజమ్ ।
యశ్చక్రే నిరయౌపమ్యం పురుషానుజనప్రియః ॥ 41

టీ:- భౌమమితి. భౌమం పాతాళజం. దివ్యం స్వర్గజం మానుషం మర్త్యలోకజం. మహత్త్వం వైభవం. యో నిరయతుల్యం మే నే. పురుషానుజనాః విష్ణుభక్తాః. త ఏవ ప్రియా యస్యేతి. 41

భగవద్భక్తుడగు నారదునకు ప్రియభక్తుడగు ప్రియవ్రతుడు పాతాళ, దేవ, మర్త్య లోకములలోని గొప్ప ఐశ్వర్యములను, వైభవములను, నరకసమానములుగ భావించెను. 41

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,
ప్రథమోऽధ్యాయః

శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు
మొదటి అధ్యాయము సమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








## ద్వితీయోऽధ్యాయః

శ్లో॥ ద్వితీయే ప్రోక్తమాగ్నీధ్రచరిత్రం స్త్రైణసమ్మతమ్ ।
పత్న్యాం హి పూర్వచిత్త్యాం యో నాభిముఖ్యానజీజనత్ ॥
అస్మిన్ వంశే ప్రసిద్ధోऽయమాగ్నీధ్రః స్త్రైణపుంగవః ।
విహసన్నివ తస్యేదం చరితం మునిరబ్రవీత్ ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ ఏవం పితరి సన్నివృత్తే తదనుశాసనే సంవర్తమాన ఆగ్నీధ్రో జంబూద్వీపౌకసః ప్రజా ఔరసవద్ధర్మావేక్షమాణః పర్యగోపాయత్. 1

టీ:- ఏవమితి. జంబూద్వీపమోకో యాసాం తాః ప్రజాః పుత్రవత్పాలయామాస ధర్మావేక్షమాణః ధర్మమవేక్షమాణ ఇత్యర్థః. 1

చూ॥ స చ కదాచిత్పితృలోకకామః. సురవరవనితా క్రీడాచలద్రోణ్యాం భగవంతం విశ్వసృజాం పతిమాహృత పరిచర్యోపకరణ ఆత్మైకాగ్రేణ తపసారాధయాం బభూవ. 2

టీ:- స ఇతి. పిత్రులోకకామః పుత్రకామః. సురవరాణాం వనితాస్తాసాం ఆక్రీడాచలః మందరః తస్య ద్రోణ్యాం ఆహృతాని పరిచర్యోపకరణాని పుష్పాదీని యేన. 2

## 2 వ అధ్యాయము

ఈ రెండవ అధ్యాయమున ఈ వంశములో ప్రసిద్ధుడు, తన పత్నియగు పూర్వచిత్తియందు నాభి మొదలగు పుత్రులను కనిన అగ్నీధ్రుని చరితము చెప్పబడుచున్నది.

### శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

ఈ విధముగా తండ్రియగు ప్రియవ్రతుడు తపశ్చర్యలో సంలగ్నుడుకాగా ఆతని ఆజ్ఞను శిరసావహించిన అగ్నీధ్రుడు జంబూద్వీపములోని ప్రజలను ధర్మానుసారముగ తన సొంతబిడ్డలవలె పరిపాలించుచుండెను. 1

అగ్నీధ్రుడు ఒకసారి పుత్రకాముడై దేవతాస్త్రీలకు క్రీడాస్థలమగు మందరాచల ప్రాంతమునకు పుష్పాది పూజాసామగ్రితోసహా వెళ్ళి ప్రజాపతులకు అధిపతియగు బ్రహ్మను ఏకాగ్రమైన మనస్సుతో ఆరాధించుచుండెను. 2









చూ॥ తదుపలభ్య భగవానాదిపురుషః సదసి గాయంతీం పూర్వచిత్తిం నామాప్సరసమభియాపయామాస. 3

టీ:- తదితి. తదుపలభ్య జ్ఞాత్వా బ్రహ్మా అభియాపయామాస సంభోగార్థం ప్రస్థాపయామాస. 3

ఆదిదేవుడుగు బ్రహ్మ అతని అభిలాషను తెలిసికొని తన సభలో గాయనియగు పూర్వచిత్తియను అప్సరసను అతనితో కలియుటకు పంపెను. 3

చూ॥ సా చ తదాశ్రమోపవనమతిరమణీయం వివిధ నిబిడ విటపి విటపాశ్లిష్ట నికట పురటల తారుఢస్థల విహంగమమిథున ప్రోచ్యమాన శ్రుతిభిః ప్రతిబోధ్యమాన సలిల కుక్కుట కారండవ బక కలహంసాది భిర్విచిత్రముపకూజితా మలజలాశయ కమలాకరముపబభ్రామ. 4

టీ:- సేతి. సా చ తదాశ్రమోపవనముపబభ్రామేత్యన్వయః రమణీయత్వమేవాహ - వివిధాశ్చనిబిడాశ్చ యే విటపినః తేషాం విటపాః తేషు సంశ్లిష్టాః నికటపురటలతాః సన్నికష్ట స్వర్ణ వల్ల్యః తాస్వారూఢాః స్థల విహంగాః మయూరాదయః తేషాంమిథునైః. ప్రోచ్యమానాభిః శ్రుతిభిరుచ్చామార్యణైః షడ్జాదిభిః సర్వైః. ప్రతిబోధ్య మానా యే సలిలకుక్కుటాదయః తైర్విచిత్రం యథా తథా. ఉపకూజితా నాదితాః అమలా జలాశయాః తేషు కమలాని తేషామకరముపవనం. 4

ఆ పూర్వచిత్తి ఆ అగ్నీధ్రుడున్న వనమున మిక్కిలి సుందరము లగు దట్టముగానుండెడి అనేక రకములగు వృక్షముల కొమ్మలపై అల్లుకొన్న స్వర్ణలతలనధిరోహించిన నెమళ్ళు మొదలగు అనేక రకములగు స్థలచర పక్షి జంటలచేత ధ్వనించబడుచున్న షడ్జాది స్వరములతో సచేతనములైన నీటికోళ్లు, కారండవములు, కొంగలు, హంసలు మున్నగు జలపక్షులతో చిత్రముగా, కూజితములు గావించబడుచున్న స్వచ్ఛమగు జలాశయముల సమీపమున భ్రమించు - చుండెను. 4












చూ॥ తస్యాస్సులలిత గమన పదవిన్యాసగత విలాసాయాశ్చానుపదం ఘుణఘుణాయమాన రుచిరచరణాభరణస్వనముపాకర్ణ్య నరదేవ కుమారః సమాధియోగే నామీలితనయన నళిన ముకుళ యుగళ మీషద్వికచయ్య వ్యాచష్ట. 5

టీ:- తస్యా ఇతి. సులలితే గమనే యే పదవిన్యాసాః తైర్గతో విలాసో యస్యాః చకారస్తస్యాశ్చేత్యేకవాక్యత్వాయ. ఘుణఘుణేతి ధ్వనిం కుర్వతో రుచిరస్య చరణాభరణస్య స్వనం ఆమీలితే నయనే ఏవ ముకుళే తయోర్యుగళం. ఈషద్వికచయ్య కించదున్మీల్య వ్యాచష్ట దదర్శ. 5

ఆ పూర్వచిత్తియొక్క విలాసపూర్ణమైన లలిత గమనమున కలుగు పదవిన్యాసములతో ప్రతిపదమున ఘుణఘుణ ధ్వనించు సుందరమగు అందెల సవ్వడితో అగ్నీధ్రుడు సమాధి యోగముతో మూయబడియున్న కమలపు మొగ్గల్లాంటి తన కన్నులను కొంచెము తెరచి ఆ పూర్వచిత్తిని గాంచెను. 5

చూ॥ తామేవావిదూరే మధుకరీమివ సుమనస ఉపజిఘ్రంతీం - దివిజమనుజమనో నయనాహ్లాదదుఘైర్గతి విహారవినయావలోకైస్సుస్వ రాక్షరావయవైర్మనసిన్నృణాం కుసుమాయుధస్య విదధతీం వివరమ్. 6

టీ:- తామితి. తామేవ దేవీం మకరధ్వజస్య వశముపనీతస్సన్ జడవది తీహ వక్ష్యమాణాం దశశ్లోకీమువాచ జాడ్యానుకరణంచ వైదగ్ధ్యేన తద్వశీ కరణార్థం దివిజానాం దేవానాం మనుజానాం చ యాని మనాంసి నయనాని చ. తేషామాహ్లాదదుఘైః గత్యాదిభిర్నృణాం మనసి కామస్య వివరం ప్రవేశద్వారం విదధతీం. గతిశ్చ విహారశ్చ క్రీడా వినయ యుక్తోऽవలోకశ్చ. సుస్వరాణ్యక్షరాణి చ అవయవాశ్చ నేత్రాదయస్తైః. 6

(సమీపమున) మధుకరాంగనవలె పుష్పములనాఘ్రాణించు -చున్న దేవ మానవ మనో నయనములకు ఆహ్లాదము కలిగించెడి తన విలాసమున, క్రీడాచాపల్య లజ్జా వినయముతో గూడిన చూపులతో, మధురమగు వాక్కులతో నేత్రద్వయములతో మానవుల మనస్సులలో మన్మథునికి ప్రవేశద్వారము కల్పించుచు (పూర్వచిత్తిని చూచెను) (తరువాతి గద్యముతో అన్వయము). 6












చూ॥ నిజముఖవిగళితామృతాసవసహాసభాషణా మోదమదాంధ మధుకరనికరో పరోధద్రుతపదన్యాస వల్గుస్పందనస్తనకబరభారరశనాం దేవీం – తదవలోకనేన వివృతావసరస్య భగవతో మకరధ్వజస్య వశముపనీతో జడవదితిహోవాచః. 7

టీ:– నిజేతి. నిజముఖాద్విగళితం. అమృతమివ స్వాదు ఆసవ ఇవ మాదకం యత్సహాసం భాషణం తస్మిన్నామోదో నిశ్వాసగంధః. తేన మదాంధాః యే మధుకరనికరాః తైరుపరోధ ఆవరణం తేన. భయాద్ద్రుతః శీఘ్రః యః పదవిన్యాసః తేన వల్గుస్పందనం కించిచ్చలనం. స్తవయోః కబరభారే రశనాయాం చ. యస్యాస్తాం తస్యా అవలోకనేన నిర్వృతావసరస్య దత్తావకాశస్య. 7

శ్లో॥ కాత్వం చికీర్షసి చ కిం మునివర్యశైలే
మాయాసి కాపి భగవత్పరదేవతాయాః ।
విజ్యే బిభర్షి ధనుషీ సుహృదాత్మనోఽర్థేకిం
వామృగాన్ మృగయసే విపినే ప్రమత్తాన్ ॥ 8

టీ:– కా త్వమితి. కాత్వంశైలే గిరావస్మిన్ కిం చికీర్షసి. మునివర్యేత్యాది పుంస్త్వేన సంబోధనాని. జాడ్యానుకారార్థం మానం భగవతః

తన వదనము నుండి జారిన, అమృతమువలె రుచ్యమగు ఆసవమువలె మదమును కల్గించెడి చిరునవ్వుతోగూడిన భాషణమందలి నిశ్వాస గంధముతో, మదాంధములగు తుమ్మెదల గుంపులు చుట్టుకొనగా, భయముతో శీఘ్రమైన పదవిన్యాసముతో ఈషచ్చలితము లగు స్తనములు, కొప్పు, వడ్డాణములుకల పూర్వచిత్తిని గూర్చి పూర్వచిత్తి చూపులతో పొందిన అవకాశముగల మన్మథునకు అగ్నీధ్రుడు వశుడై ఆవిడను ప్రసన్నురాలను చేసుకొనుటకు జడునివలె ఇలా పలికెను. (చెప్పబోవు పది శ్లోకములలో ఇలా పలికెను.) 7

(మునివర్యా! మొదలగు పుంస్త్వ సంబోధనలు జడత్వమును అను కరించుటకై ప్రయోగించబడినవి.) ఓమునివర్యా! నీవెవతవు? ఈ పర్వత ములపై నీవేమి చేయదలచినావు, నీవు పరదేవతయగు శ్రీమన్నారా యణుని మాయవా? (కనుబొమ్మలను కాంచుతూ) ఓ సఖా! అల్లెత్రాడు లేని ఈరెండు ధనస్సులను ఎందుకు ధరించు– చున్నావు. నీ కొరకా? వీటితో నీకేమి ప్రయోజనము కలదు? లేక అజితేంద్రియులమగు మృగ తుల్యమగు మాలాంటి వారిని











పరదేవతాభూతస్య మాయాసి భ్రువావాలక్ష్యాహ - హే సుహృత్ సఖే విజ్యే నిర్గుణే ధనుషి బిభర్షి కిమాత్మనోऽర్థే? తవైతాభ్యాం కింకార్య మస్తి? కిం వా ప్రమత్తాన్ అజితేంద్రియాన్ మృగతుల్యాన్ అస్మదాదీన్ మృగయసే? తాన్వశీకర్తుం ధనుషీ ధారయసీత్యర్థః. 8

శ్లో॥ బాణావిమౌ భగవతశ్శతపత్రపత్రౌ
కాంతావ పుంఖరుచిరావతితిగ్మ దంతౌ ।
కస్మై యుయుంక్షసి వనే విహరన్న విద్మః
క్షేమాయనో జడధియాం తవ విక్రమోऽస్తు ॥ 9

టీ:- కటాక్షావాలక్ష్యాహ - బాణావితి. బాణావిమౌ భగవతశ్శతపత్రే కమలే తే ఏవ.పత్రాణి పింఛాని యయోః. శాంతౌ విభ్రమేణ మందరౌ పుంఖాభ్యాం వినాపి రుచిరౌ. పత్రతయా కల్పితనేత్రాభ్యాం పరభాగస్య పుంఖస్థానీయస్యాభావాత్. అతితిగ్మౌ తీక్ష్ణౌ దంతౌ అగ్రభాగౌ యయోస్తౌ. కస్మై ప్రయోక్తుమిచ్ఛసీతి న విద్మః. అతో భయాదేవైతావత్ప్రార్థయామహే తవాయం విక్రమః. అస్మాకం క్షేమాయాస్తు. 9

వేటాడదలిచావా? అలాంటి వారిని వశము చేసుకొనుటకు ఈ ధనస్సులను ధరించుచున్నావు అని భావము. 8

పూర్వచిత్తి వాడిచూపులను (కటాక్షములను) చూస్తూ పలుకు చున్నాడు. నీవాడి చూపులనే రెండు బాణాలు మిక్కిలి సుందరములు, అతి తీక్షణములగు అగ్రభాగములు కలిగియున్నవి. ఈ బాణముల నెవరిపై ప్రయోగించినావు. ఈ నీ పరాక్రమము మాకు క్షేమము కలిగించుగాక. 9








శ్లో॥ శిష్యా ఇమే భగవతః పరితః పఠంతి
గాయంతి సామసరహస్యమజస్రమీశ ।
యుష్మచ్ఛిఖావిలులితాస్సుమనోఽభివృష్టిః
సర్వేభజంత్యృషిగణా ఇవ వేదశాఖాః ॥ 10

టీ:- తదంగపరిమళ లోభేనానుగచ్ఛతో భ్రమరానాలక్ష్యాహ - శిష్యా ఇతి. అజస్రం సంతతం. యుష్మచ్ఛిఖాతః విలులితాః విగళితాః. సుమనసాం అభితో వృష్టిః, గళితాని కుసుమాని భజంతీత్యర్థః. శుద్ధత్వేనోపమా. వేదశాఖా ఇవేతి. 10

పూర్వచిత్తి శరీరమందలి సుగంధముపైని లోభముతో ఆమెననుసరించి తిరుగుచున్న తుమ్మెదలను గాంచి పలుకుచున్నాడు. ఋషులు వేదశాఖలను సేవించి, అనుసరించినట్లు, రహస్యమైన సామవేదమును, వేదాంగములతో గానముచేయుచున్నట్లు, ఈ (భ్రమరములు) శిష్యులు నీ చుట్టూ తిరుగుతూ, నీ శిరస్సు నుండి జారిపడిన పుష్ప సముదాయాన్ని సేవిస్తున్నవిగదా! 10

శ్లో॥ వాచం పరం. చరణపంకజతిత్తిరీణాం
బ్రహ్మన్నరూపముఖరీం శ్రుణువామ తుభ్యమ్ ।
లబ్ధా కదంబరుచిరంకవిటంకబింబే
యస్యా మలాతపరిధిః క్వచ వల్కలం తే ॥ 11

టీ:- నూపురస్వనమాకర్ణ్యాహ - వాచమితి. తుభ్యం తవ. చరణ పంకజయోర్నూపురయోః తిత్తిరీణాం అంతర్గతరత్నానాం. పరం కేవలం. వాచం శ్రుణుమః. కథంభూతాం అరూపాం అదృష్టవక్తృకాం ముఖరీం అతి ప్రకటితాం చ పరిధాన వస్త్ర నితంబ కాంతిత్వేన ప్రకల్ప్యాహ -

కాలి అందెల సవ్వడిని విని పలుకుచున్నాడు. బ్రహ్మన్! నీ చరణ కమలములందలి అందెలలో తిత్తిరి పక్షి పొదగబడియున్నదేమో? అందుకే అందెలలో పొదగబడిన రత్నముల ధ్వని అరూప వాణిగా వినిపించుచున్నది. (పరిధాన వస్త్రమును నితంబకాంతినిగా కల్పించి పలుకుచున్నాడు) సుందరమగు శ్యామవర్ణ నితంబ మండలమున కదంబ కుసుమ కాంతి ఎలా లభించినది? (వడ్డాణమును చూచి పలుకుచున్నాడు) దీనిపైన అలాత పరిధి (నిప్పుల మండలి) వలె రేఖలు కనబడుచున్నవి. (నితంబ కాంతియే వస్త్రమని అనుకొని పలుకుచున్నాడు) నీ వల్కలమసలెక్కడ ఉన్నది? 11










కదంబస్య రుచిర్దీప్తిః అంక విటంకస్య బింబే. నితంబస్య సుందరే మండలే. క్వ లబ్ధా! పాఠాంతరే. అంగేతి సంబోధనం. మేఖలా మాలక్ష్యాహ – యస్యామ లాతపరిధిర్వర్తతే. వస్త్రం నితంబకాంతిత్వేన ప్రకల్ప్య. వస్త్రమదృష్ట్వైవ పృచ్ఛతి – క్వ చ తే వల్కలమితి. 11

శ్లో॥ కిం సంభృతం రుచిరయోర్ద్విజశృంగ
యోస్తేమధ్యేకృశో వహసి యత్రదృశిశ్శ్రితా మే ।
పంకోऽరుణస్సురభిరాత్మ విషాణ ఈదృగ్యే
నాశ్రమం సుభగ మే సురభీకరోషి ॥ 12

టీ:– స్తనావాలక్ష్యాహ – కిమితి. శృంగయోః స్తనయోః కిం సంభృతం కిం పూర్ణమస్తి మనోహరం కించిదస్తీత్యేతావత్తు జనామి. యతో మధ్యే కృశోऽపి. కృచ్ఛ్రేణవహసి. యత్ర చ మే దృశిః దృష్టిః శ్రితా సంలగ్నా. అన్యథా ఇదం ద్వయం న ఘటత ఇతి భావః. స్తనగతం కుంకుమ మాలక్ష్యాహ – పంకోऽరుణః ఆత్మనస్తవ విషాణే స్తనే. ఈదృక్ అత్యపూర్వః కుత ఇత్యత ఆహ – యేన పంకేన. ఆశ్రమం మే గంధాయమానం కరోషి. 12

కొమ్మలవలె ఉన్నతములై మనోహరములగు నీ స్తనముల మధ్య భాగము దేనితో నిండి యున్నది? ఏదో మనోహర పదార్థమే ఉండవచ్చు. వాటిని మోయుటచే నీ నడుము సన్ననైనదేమో? అయినను ఈ రెండింటినీ నీవు భారంగా వహిస్తున్నావు. నా దృష్టి వీటిపైననే లగ్నమైనది. నీ స్తన యుగళమందు కనపడే ఎఱ్ఱని రంగు ఎక్కడిది? ఆ ఎఱ్ఱని (కుంకుమాది) లేపము (అంగలేపనము) యొక్క పరిమళము ద్వారా నా ఆశ్రమము అంతా సువాసనమయమయ్యింది. (12)










శ్లో॥ లోకం ప్రదర్శయ సుహృత్తమ తావకం
మే యత్రత్య ఇత్థమురసావయవావపూర్వౌ ।
అస్మద్విధస్య మన ఉన్నయనౌ బిభర్తి
బహ్వద్భుతం సరసరాససుధాదివక్త్రే ॥ 13

టీ:- లోకమితి. లోకం స్థానం. యత్రత్యో జనః. ఇత్థమపూర్వావయవౌ ఉరసా బిభర్తి. మన ఉన్నయనౌ క్షోభకౌ. పాఠాంతరే - ఇత్థం భూతలక్షణా తృతీయా. వక్త్రే చ బహ్వద్భుతం బిభర్తి. కిం తదాహ - సరసః మధురాలాపః. రాసః విలాసః. తాభ్యాం సహితా. సుధా అధరామృతం ఆదిశబ్దాత్ స్మితనర్మాది. 13

శ్లో॥ కావాత్మవృత్తిరదనాద్ధవిరంగ వాతి విష్ణోః
కలాస్యనిమిషోన్మకరౌ చ కర్ణౌ ।
ఉద్విగ్నమీనయుగళం ద్విజపఙ్క్తిశోచి
రాసన్న భృంగనికరం సరవన్ముఖం తే ॥ 14

టీ:- కేతి. కావా తవ లోకే ఆత్మనః దేహస్య, వృత్తిః ఆహారః. అంగ హే సఖే. అదనాచ్చర్వణాత్. హవిరితి తత్సంబంధిగంధః వాతి ఆగచ్ఛతీతి తాంబూలాభిప్రాయం. అదనాద్బహిరంగభాతీతి

ఓ మిత్రవర్యా! నీ వుండే ప్రదేశమేమిటి? అక్కడ నివసించువారు పాలిండ్లతోపాటుగా అపూర్వావయములను ధరించినట్లున్నారు. అవి మాలాంటి ప్రాణుల మనస్సులను, నేత్రములను క్షోభపెట్టుచున్నవి మరియు వారు వదనములతో మధుర విలాస, మందహాసాదులతో కూడిన అధరామృతమును ధరించినారు. అలాంటి నీ యొక్క దేశమేదో తెలుపుము 13

ఓ సఖా! నీవు ఏ ఆహారము స్వీకరిస్తావు? తాంబూలము వేసుకొనుటవల్లనేమో నీ ముఖము నుండి వెలుబడే గంధమునుబట్టి చూస్తే నీవు యజ్ఞములలో వాడే పదార్థములను భుజించుచున్నట్లు తోస్తున్నది. ఎందుకనగా నీవు యజ్ఞభోక్తయగు (యజ్ఞ పదార్థములను తప్ప మరేవీ భుజించని) విష్ణువు యొక్క అంశకలవే. అందుకే నీవు వేరేమీ తినని అనశనవని (అనశన్నన్యో అభివాకశీతి అని శ్రుతి) నా అభిప్రాయము. నీ ముఖము సరోవరమువలె అందముగా ఉన్నది. నీ నేత్రములు మీనముల నేత్రములవలె, నీ చెవులకున్న మకర











పారేమమతావద్భోజనాద్బహిర్భూతేవ వృత్తిర్భాతీత్యర్థః. యతస్త్వం శ్రీవిష్ణోః కలాసి విష్ణుశ్చ నాశ్నాతి. శ్రు. "అనశ్నన్నన్యో అభిచాకశీతీ"తి శ్రుతేః. విష్ణోః కలాసీత్యత్ర హేతుః. తవ చ కర్ణౌ శ్రీవిష్ణోరివా నిమిషో న్మకరౌ. అనిమిషౌ నిద్రారహితత్వేన. అలుప్తదృష్టిత్వేన. రత్ననేత్రత్వేనని మేషశూన్యౌ. ఉత్ లసంతౌ. మకరౌ తదాకారే కుండలే యయోస్తౌ. కించ తవ ముఖం సరవత్ శరత్సర ఇవ. అత్రాదంతత్వమార్షం. తదేవాహ - ఉద్విగ్నం చంచలం. మీనయుగళమివ నేత్ర ద్వయం యస్మిన్. ద్విజాః దంతాః తేషాం పఙ్క్త్యా శ్శోచిశ్శోభా యస్మిన్. సరసి తు. ద్విజాః హంసాః. ఆసన్నో భృంగనికర ఏవ కేశస్తోమః పరిమళలుబ్ధభృంగస్తోమో వా యస్మిన్. 14

శ్లో॥ యోఽసౌ త్వయా కరసరోజహతః పతంగో
దిక్షు భ్రమన్ భ్రమత ఏజయతేఽక్షిణీ మే ।
ముక్తం న తే స్మరసి వక్రజటావరూథం
కష్టోఽనిలో హరతి లంపట ఏష నీవీమ్ ॥ 15

టీ:- య ఇతి. పతంగః కంతుకః భ్రమతః భ్రమచ్చిత్తస్య మే. అక్షిణీ ఏజయతే చంచలతాం నయతి. వక్ర కేశసమూహం ముక్తబంధనం. న స్మరసి సంభావయసి కిం? కష్టః ధూర్తః అనిలః. నీవీం హరతి. ఏతచ్చ న స్మరసి కిం? 15

కుండలములు రెప్పలులేని చేపలవలె, నీ దంత పంక్తి రాజహంసలవలె, నీ కురులు సుగంధమునాశించిన తుమ్మెదలవలె ఉన్నవి. 14

నీ కరపద్మములతో నివారించబడుచున్న భ్రమరము దిక్కులలో సంచరిస్తూ చిత్తభ్రమ నొందిన నా యొక్క నేత్రములను చంచల మొనరించుచున్నది. నీ కొప్పు ముడి విడిపోయిననూ ఎందుకు సవరించుకొనుట లేదు. ధూర్తుడగు ఈ వాయువు నీ వస్త్రమును సడలింపచేస్తున్నాడు. ఆ వాయువు నీ యందే ఆసక్తము కాదు కదా! (15)









శ్లో॥ రూపం తపోధనతపశ్చరతాం తపోఘ్నం
హ్యేతన్నుకేన తపసా భవతోపలబ్ధమ్ ।
చర్తుం తపోఽర్హసి మయా సహ మిత్రమహ్యం
కిం వా ప్రసీదతి భవభావనోమే ॥ 16

టీ:- రూపమితి. ఉపలబ్ధం ప్రాప్తం మహ్యం మమ. హేమిత్ర మయా సహ. తపశ్చర్తుమర్హసి. కించ స వై భవభావనః సంస్కృతివిస్తారకః బ్రహ్మా. మే ప్రసీదతి. త్వాం భార్యాం కల్పయతీత్యర్థః. 16

ఓ తపోధనా! తపోవంతుల తపస్సును భ్రష్టమొనరించెడి ఈ అనుపమానమగు రూపమును నీవు ఏ తపస్సుతో సాధించినావు. ఓ మిత్రమా! నాతోకలిసి తపమాచరించుము. మరియు సంసృతి (సృష్టి, ప్రపంచము) విస్తారకుడగు బ్రహ్మ నాయెడ ప్రసన్నుడైనాడా ఏమీ? అనగా నిన్ను భార్యగా కల్పించుచున్నాడని భావము. 16

శ్లో॥ న త్వాంత్యజామి దయితం ద్విజదేవదత్తం
యస్మిన్ మనోదృగపి నో న వియాతి లగ్నమ్ ।
మాంచారుశృంగ్యర్హ సి నేతుమనువ్రతం
తే చిత్తం యతః ప్రతిసరంతు శివాస్సచివ్యః ॥ 17

టీ:- నేతి. ద్విజ - దేవేన బ్రహ్మణా. దత్తం దృఙ్మనశ్చ లగ్నం సత్. నాపయాతి. హే చారుశృంగి. యతస్తే చిత్తం. తతో మాం త్వదధీనం నేతుమర్హసి స చివ్యస్తవ సఖ్యోఽపి. శివాః అనుకూలాస్సత్యః మాం ప్రతి. అనుసరంతు అనువర్తంతాం. యద్వా. ఏతావత్పర్యంతం. మేయా స్సచివ్యః సఖ్యః. శివాః ఫేరవాః. తాః ప్రతిసరంతు నిర్యాంతు. యద్వా

బ్రహ్మదేవునిచేత నొసగబడిన నీయందు నా మనస్సు, దృష్టి లగ్నమై వదులుచు లేవు. అట్టి నిన్ను వదలను. ఓ చారుశృంగీ! నీ మనస్సు ఎచటకు వెళ్ళునో అచటకు నన్ను కొనిపొమ్ము. నేను నీ అనుచరుణ్ణి మంగళమయులగు నీ సఖులు గూడా నన్నసరించెదరు గాక! (శరణ్య అను పాఠాంతరములో రాత్రులు సుఖమయులై గడచుగాక) అని భావము. 17










- వనవాసే సహచర్యో హరిణ్యః శివాః ప్రతిసరంతు ప్రదక్షిణం గచ్ఛంతు. సరణ్య ఇతి పాఠే - సరంతీతి సరణ్యో రాత్రయః శివాః మంగళరూపాః సరంతు గచ్ఛంతు. 17

శ్రీ శుక ఉవాచ

చూ॥ ఇతి లలనానునయాతి విశారదో గ్రామ్యవైదగ్ధ్య పరిభాషయా తాం విబుధవధూమధ్రువమతి రధిసభాజయామాస. 18

టీ:- ఇతీతి. గ్రామ్యేషు వైదగ్ధ్యం యస్యాః. సభాజయామాస. సమ్ముఖీచకారేత్యర్థః. 18

చూ॥ సా చ తతస్తస్య వీరయూధపతేర్బుద్ధిరూపశీలవిద్యావయ శ్శ్రియౌదార్యేణ పరాక్షిప్తమనాస్తేన సహాయుతా యుతపరివత్సరోప లక్షణం కాలం జంబూద్వీపపతినా భౌమస్వర్గభోగాన్ బుభుజే. 19

టీ:- సేతి. బుద్ధ్యాదీనాం ద్వంద్వైక్యం. పరాక్షిప్తమాసక్తం మనః యస్యాః భౌమసర్గాః నవఖండాః తేషు యే భోగాః తాన్. 19

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

దేవతలతో సమానమగు బుద్ధివైశిష్యముగల నాకు, స్త్రీలననున యించడములో పండితుడగు అగ్నీధ్రుడు మిక్కిలి చాతుర్యముగల మాటలతో ఆ పూర్వచిత్తిని ప్రసన్నురాలిని చేసికొనెను. 18

ఆ పూర్వచిత్తి అగ్నీధ్రుని బుద్ధి, శీల, రూప, వయో, సంపద, ఉదారతలచేత ఆకర్షితురాలై అతనితోకూడి వేలసంవత్సరములు నవఖండాత్మకమగు భూమండలముపై భోగములను, స్వర్గభోగములను అనుభవించెను. 19

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చూ॥ తస్యాముహవా ఆత్మజాన్ సరాజవర అగ్నీధ్రో నాభి కింపురుష హరివర్ష ఇలావృత రమ్యక హిరణ్మయ కురు భద్రాశ్వకేతుమాల సంజ్ఞా న్నవ పుత్రానజనయత్ – సా సూత్వాథసుతాన్ సర్వాననువత్సరం గృహ ఏవాపహాయ పూర్వాచిత్తిర్భూయ ఏవాజం దేవముపతస్థే. 20

టీ:– తస్యామితి. పుదాఖ్యాన్న రకాత్త్రాయత ఇతి పుత్ర ఇత్యవయ వార్థావగమాయ పుత్రశబ్దః ప్రయుక్తః అతో న పౌనర్యుక్త్యం. ప్రతివత్సరం సా సుత్వా ప్రసూయ. ఉపతస్థే అభజత్. 20

రాజశ్రేష్ఠుడగు అగ్నీధ్రుడు ఆ పూర్వచిత్తి యందు నాభి, కింపురుష, హరివర్ష, ఇలావృత, రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాలురను పేర్లుగల తొమ్మండగురు పుత్రుల బడసెను. ఆ పూర్వచిత్తి ఈ తొమ్మండగురిని సంవత్సరమునకు ఒక్కరిని చొప్పున కని, తిరిగి బ్రహ్మను చేరెను. పున్నామ నరకము నుండి రక్షించువాడను అవయవార్థవగమనమునకై పుత్ర శబ్దము వాడబడినందున పునరుక్తి లేదు. 20

శ్లో॥ ఆగ్నీధ్రసుతాస్తే మాతురనుగ్రహా
దౌత్పత్తికేనైవ సంహననబలోపేతాః ।
పిత్రావిభక్తాన్యాత్మతుల్యనామాని యథాభాగం
జంబూద్వీపవర్షాణి బుభుజుః ॥ 21

టీ:– ఆగ్నీధ్రేతి. ఔత్పత్తికేనైవ స్వభావేనైవ. సంహవనం దృఢాంగత్వం. (21)

ఈ అగ్నీధ్రుని పుత్రులు తల్లి సౌందర్యమును, తండ్రి బలశౌర్యములను పుట్టుకతోనే పొందిరి. అగ్నీధ్రుడు జంబూద్వీపమును వారివారి పేర్లతో నవఖండములుగ విభజించి తన పుత్రులకు పంచి ఇచ్చెను. వారా ఖండములను పాలించిరి. 21

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ











చూ॥ ఆగ్నీధ్రో రాజాతృప్తకామాస్తామప్సరసమేవానుదినమభి మన్యమానః తస్యాస్సలోకతాం శ్రుతిభిరవారుంధే యత్ర పితరో మాదయంతే. 22

టీ:- ఆగ్నీధ్ర ఇతి. కామానాం భోగైః. అధికం మన్యమానః శ్రుతిభిః వేదోక్తైః కర్మభిః. అవారుంధే ప్రాప్తః మాదయంతే మోదయంతే. 22

అగ్నీధ్రరాజు భోగములననుభవించుచు గూడా తృప్తి నొందక ఆ అప్సరసనే పరమ పురుషార్థముగా తలంచుచూ వైదిక కార్యములతోనే (పితృదేవతలు తమ సుకృత కర్మలతో ఆనందించెడి లోకమును) ఆ అప్సరస లోకమునొందెను. 22

చూ॥ సంపరేతే పితరి నవ భ్రాతరో మేరుదుహితౄర్మేరుదేవవీం ప్రతిరూపాముగ్రదంష్ట్రీం లతాం రమ్యాం శ్యామాం నారీం భద్రాం దేవవీతిమితి సంజ్ఞానవోద వహన్. 23

టీ:- సంపరేత ఇతి. ఇత్యేవం భూతాస్సంజ్ఞాయాసాం తాః పరిణీత - వంతః. 23

తండ్రి అగ్నీధ్రుడు పరలోకగతుడుకాగా నాభితో సహా సహోదరులు తొమ్మండుగురు రాజపుత్రులు మేరుపుత్రికలగు మేరుదేవి, ప్రతిరూపా, ఉగ్రదంష్ట్రీ, లతా, రమ్యా, శమ్యానారీ, భద్రా, దేవవీతి అనుపేర్లుగల తొమ్మండుగురిని వివాహమాడిరి.

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, ద్వితీయోऽధ్యాయః

శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు రెండవ అధ్యాయము సమాప్తము.











## తృతీయోऽధ్యాయః

శ్లో॥ తృతీయే చరితం నాభేః పరం మంగళమీర్యతే ।
యస్య యజ్ఞే ప్రతీతస్సన్ పుత్రోऽభూద్వృషభో హరిః ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ నాభిరపత్య కామోऽప్రజయా మేరుదేవ్యా భగవంతం యజ్ఞపురుషమవహితాత్మాయజత్. 1

టీ:- నాభిః ఆగ్నీధ్రసుతః అపుత్రయా మేరుదేవ్యా భార్యయా సహ. 1

చూ॥ తస్య హవావ శ్రద్ధయా విశుద్ధభావేన యజతః ప్రవర్గ్యేషు ప్రచరత్సు ద్రవ్యదేశకాలమంత్రర్త్విగ్దక్షిణా విధానయోగోపహత్యా దురధిగమోऽపి భగవాన్ భాగవతవత్సలతయా సుప్రతీక ఆత్మాన మపరాజితం నిజ జనాభిప్రేతార్థవిధిత్సయా గృహీత హృదయో హృదయంగమం మనోనయనానందనావయవాభిరామమావిశ్చకార. 2

టీ:- తస్యేతి. ప్రవర్గ్యసంజ్ఞికేషు కర్మను క్రియమాణేషు ద్రవ్యాదయస్సప్త యే యోగాః ఉపాయాః. తేషాముపపత్త్యా సంపత్త్యా దురధిగమః దుష్ప్రాపోऽపి భాగవతేషు కృపాళుతయా సుప్రతీకః

## 3 వ అధ్యాయము

ఈ మూడవ అధ్యాయమున పరమ మంగళకరమగు నాభి చరితము వర్ణించబడుచున్నది.

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

నాభి సంతానము లేకపోవుటచే సంతానము కొరకై తన భార్యయగు మేరుదేవితో సహా, ఏకాగ్ర మనస్కుడై యజ్ఞపురుషుని గూర్చి యజ్ఞమొనర్చెను. ఆ యజ్ఞమున శ్రీహరి ప్రత్యక్షమై నాభికి పుత్రుడాయెను. 1

పరిశుద్ధ భావముతో శ్రద్ధతో యజ్ఞమునాచరించుచున్న ఆ నాభి ప్రవర్గ్యములను పేరుగల ద్రవ్య, దేశ, కాల, మంత్ర ఋత్విక్, దక్షిణ, విధానము అను సప్తయోగము (సాధన)ల సంపత్తితో కూడా లభించని వాడు, స్వతంత్రుడు భక్తుల యందలి దయతో స్వతంత్రుడును అగు భగవంతుడు తన భక్తుల అభీప్సిత తీర్చదలచినవాడై మనోనయనానంద - కరమగు అవయవములతో సుందరమగు రూపమునావిష్కరించెను. (నాభికి దర్శన మిచ్చెను) 2











శోభనావయవస్సన్ ఆత్మానమావిశ్చకార. అపరాజితం స్వతంత్రం నిజభక్తానాం యే అభిప్రేతార్థాః. తేషాం విధిత్సయా గృహీతం ఆకృష్టం హృదయం చిత్తం యస్య. హృదయంగమం సుఖకరం యతో మనో నయనాన్యానందయంతి యే అవయవాః తైరభిరామం సుందరం. 2

చూ॥ అథహతమావిష్కృత భుజయుగళద్వయం హిరణ్మయం పురుషవిశేషం కనక కపిశ కౌశేయాంబరధరం, ఉరసి విలసచ్ఛ్రీవత్స లలామందర వరవనరుహవనమాలాచ్ఛూర్య మృతమణిగదాభిరుప లక్షితం, స్ఫురత్కిరణ ప్రవర మణిమయ మకుటకుండల కటక కటి సూత్ర హార కేయూర నూపురాద్యంగ భూషణ విభూషితం, ఋత్విక్స దస్యగృహపతయోऽధనా ఇవోత్తమం ధనముపలభ్య, సబహుమాన మర్హణేన అవనతశీర్ష్ణా ఉపతస్థుః. 3

టీ:- అథేతి. అథ హేత్యాదినిపాతబాహుళ్యం వాక్యాలంకారాయ. ఆవిష్కృతం.భుజానాం యుగళద్వయం చతుష్టయం యేన హిరణ్మయం తేజోమయం పురుషేషు విశిష్యత ఇతి తథా పురుషోత్తమమిత్యర్థః. అర్హణేన అర్ఘ్యేణ సహోపతస్థు అభజన్నిత్యన్వయః. విలసత్ శ్రీవత్స ఏవ లలామం చిహ్నం యస్య. దరవరః శంఖ శ్రేష్ఠః వనరుహం పద్మం అచ్ఛూరి చక్రం అమృతమణిః కౌస్తుభః. ఏవమాదిభిరుపలక్షితం

చతుర్భుజములతో, ప్రకాశించెడి శ్రీవత్సలాంఛితుడు, శంఖ చక్ర, పద్మకౌస్తుభమణి, గదలను ధరించిన, ప్రకాశించెడి మణి మయములైన మకుటకుండల కంకణాది అంగభూషణములతో అలంకరించబడి నట్టి బంగారుకాంతులీనెడి పీతాంబరధారియగు, తేజోమయుడగు పురుష శ్రీకృష్ణుని గాంచి ధనహీనులకు ధనము లభించిన విధముగా ఋత్విక్కులు, సదస్యులు, యజమానులు సంతోషించి ఆదరపూర్వకముగా భజించిరి. 3





స్ఫుటకిరణా యే ప్రవరా మణయః తన్మయాని యాని మకుటాదీని అంగానాం భూషణాని తైర్విభూషితం. బహుమానే దృష్టాంతః – అధనా ఇవోత్తమం ధనం నిధిం. 3

**ఋత్విజ ఉవాచ**

చూ॥ అర్హసి ముహురర్హత్తమార్హణమస్మాకమనుపథానాం నమో నమ ఇత్యేతావత్సదుపశిక్షితం కోऽర్హతి పుమాన్ ప్రకృతి గుణవ్యతికరమతి –రనీశ ఈశ్వరపరస్య ప్రకృతి పురుషయోరర్వాక్త నాభిర్నామ రూపాకృతి –భిస్స్వరూప నిరూపణమ్. 4

టీ:– అర్హసీత్యాదినా నిగదేన స్తువంతి. అర్హసీతి హే అర్హత్తమ పరిపూర్ణోऽపి త్వం అనుపథానాం భృత్యానామస్మాకమర్హణం ముహుః స్వయమేవ స్వీకర్తుమర్హసి. న తు వయం స్తోతుం శక్తా ఇత్యాహుః – నమో నమ ఇత్యేతావదేవాస్మాకం సద్భిరుపలక్షితం శిక్షితం త్వద్రూపస్య దుర్విజ్ఞేయత్వాత్. తదేవాహుః – కోऽర్హతీతి. ప్రకృతి గుణానాం వ్యతికరః ప్రపంచః తస్మిన్నేవ మతిర్యస్య అత ఏవానీశః ప్రకృతి పురుషయోః పరస్య అత ఏవేశ్వరస్య. అర్వాక్తనాభిః. త్వామస్పృశంతీభిః ప్రపంచాంతర్గతాభిః. నామ చ రూపం చ. ఆకృతిశ్చాకారః. తాభిః తవ స్వరూపనిరూపణం కర్తుం కో నామ పుమాన్ అర్హతి? 4

**ఋత్విక్కులు ఈ విధముగా పలికిరి.**

ఓ పూజ్యతమా! పరిపూర్ణుడవైన నీవు భృత్యులమగు మాయొక్క పూజను స్వీకరించతగియున్నావు. మేము నిన్ను స్తుతించుటకశక్తులము సత్పురుషులు మాకు "నమోనమః" అనునదే ఉపదేశించినారు. ఏలనన నీ రూపము తెలియజాలనిది. ప్రాకృత గుణముల కార్యభూతమగు ప్రపంచమున మగ్నులమగు మేము నీ గుణగానము చేయుటకశక్తు –లము. ఈ ప్రపంచములో ప్రాకృతమగు నామరూపములతో మరియు ఆకారముతో నీ స్వరూప నిరూపణము చేయు సమర్థుడెవరు కలదు? 4








చూ॥ సకల జీవనికాయ వృజిన నిరసన శివతమప్రవర గుణగణైక దేశకథనాదృతే. 5

టీ:- సహ్యేతావన్మాత్రమేవార్హతి నాధికమిత్యాహుః - సకలేతి. సకలజీవనికా యస్య వృజినం నిరస్యంతీతి తథా. శివతమాః ప్రవరాశ్చ యే గుణగణాః. తేషా మేకదేశస్తస్య. కథనాదృతే వినా. అధికం నార్హతి. 5

చూ॥ పరిజనానురాగ విరచిత శబల సంశబ్దస్తవ సలిలసితకిసలయ తులసీ దూర్వాంకురైరపి సంభృతయా సపర్యయా కిల పరమ పరితుష్యసి. 6

టీ:- వాఙ్మనసోఽగోచరోఽపి త్వం భక్తానాం సుఖారాధ్య ఏవేత్యాహుః - పరిజనేతి. హే పరమ పరిజనైరనురాగేణ. విరచితా యే శబల సంశబ్దస్తవాః గద్గదాక్షరస్తుతయః. సలిలం చ. సితకిసలయాశ్చ శుద్ధ పల్లవాః. శిలేతి పాఠే - శిలం కుశాదిమంజరీ. ఏవమాదిభిస్సం భృతయా సంపాదితయా. పూజయా కిల పరితుష్యసి. 6

పరమమంగళమగు నీ గుణములు సమస్తప్రాణుల దుఃఖము లను నాశనమొందింప సమర్థములు. ఆ గుణములనెవరైనా వర్ణించదలచినచో వాటిలో లేశమాత్రమే స్తుతింపగలరు. కానీ సంపూర్ణ గుణగానమొనరించ ఎవరితరము? 5

నీవు అవాఙ్మానస గోచరుడవైనను భక్తులకు సుఖారాధ్యుడవని తెలుపుచున్నారు. ఓ పురుషోత్తమా! భక్తజనుల, ప్రేమ గద్గదమైన వాక్కులతో స్తుతించుట, జలము, తులసీదళములు, దర్భాదులతో చేసెడి పూజతో నిజముగా నీవు సంతసించెదవు. 6









చూ॥ అథానయాపి న భవత ఇజ్యయోరుభారభరయా ।
సముచితమర్థమిహోపలభామహే ॥ 7

టీ:- అథేతి ప్రకారాంతరే. అన్యథా తు అనయా ఇజ్యయా యాగే నాపి. ఉరుభారభరయా అనేకాంగ సంవృద్ధయాపి. భవతస్సముచితం అపేక్షితం. ప్రయోజనం నైవపశ్యామః. 7

చూ॥ ఆత్మన ఏవానుసవనమంజసా వ్యతిరేకేణ బోభూయమానాశేష పురుషార్థస్వరూపస్య కింతు నాథాశిష ఆశాసానానా మేతదభిసంరాధన మాత్రం భవితుమర్హతి. 8

టీ:- ఆత్మన ఇతి. అత్ర హేతుః ఆత్మనస్స్వత ఏవ అనుసవనం సర్వదా. అంజసా సాక్షాత్ అవ్యతిరేకేణ సమన్వయేన. బోభూయమానాః అతిశయేన భవంతః. యే అశేషాః పురుషార్థాః. తే స్వరూపే యస్య. పరమానందస్య. న చైవం సత్యపి యాగానర్థక్యమిత్యాహుః – కింత్వితి. సకామానామస్మాకమేవైతదుపయుజ్యతే. న తవేత్యర్థః. 8

చూ॥ తద్యథా బాలిశానాం స్వయమాత్మనశ్శ్రేయః పరమవిదుషాం పరమపురుష ప్రకర్షకరుణయా స్వమహిమానం చాపవర్గాఖ్య ముపకల్పయిష్యన్ స్వయం చ నాపచిత ఏవేతరవదిహోపలక్షితః. 9

భక్తి లేకుండా ద్రవ్య కాలాది అంశములతో చేసే యజ్ఞములను చేసినా నీవు ఇష్టపడవు. అయినా ఈ యజ్ఞములతో నీకేమి ప్రయోజనమో? 7

ఏలనన నీ నుండి నిరంతరము సంపూర్ణ పురుషార్థ ఫల స్వరూపమగు పరమానందము ఆవిర్భవించుచుండును. నీవు సాక్షాదానంద స్వరూపుడవు. (అందువలన యాగాదుల అవసరమేల యని తెలుపుచున్నాడు) మా కోరికలు తీర్చుట కొరకే ఈ యజ్ఞాదులు కానీ వాటి వలన నీకు ప్రయోజనము లేదు. 8

తమ ప్రయోజనమునే తెలుపుచున్నారు. మేము మాకు శ్రేయస్సేదో తెలియని అజ్ఞానులము నీవు బ్రహ్మాదులకంటే శ్రేష్ఠుడవు, మేము నీకు తగిన పూజను కూడా ఆచరించకపోయితిమి. అయినా







టీ:- స్వోపయోగమేవ ప్రదర్శయతి - తదితి. పరమేభ్యోఽపి. పరమపురుష ప్రకర్షయుక్తయా కరుణయా. ఉపకల్పయిష్యన్. సంపాదయిష్యన్ చకారాత్కామితం చ. నాపచితః అనపచితః. అపూజిత ఏవ పూజన పేక్షత్వాత్. స్వయమేవోపలక్షితః దృష్టోఽసి. ఇతరవత్ సాపేక్షవత్. 9

చూ|| అథ హాయమేవ వరో హ్యర్హత్తమ యర్హిబర్హిషి రాజర్షేర్వరదర్షభో భవాన్నిజపురుషేణ క్షణవిషయ ఆసీత్. 10

టీ:- అథేతి. యద్యపి వరాన్ దాతుమావిర్భూతోఽసి. అథాపి హే అర్హత్తమ రాజర్షేః బర్హిషి యజ్ఞే, నిజపురుషాణాం త్వద్భక్తానామస్మాకం ఈక్షణవిషయోభవాన్ మహర్షిః. యర్హి యదా. ఆసీత్ తదా అయమేవ వరస్సంజాతః. 10

చూ|| అసంగ నిశిత జ్ఞానానిలవధూతాశేషామలానాం, భవత్స్వభావా నామాత్మారామాణాం మునీనామనవరత పరిగుణిత గుణగణ పరమ మంగళాయన గుణగణకథనోఽసి. 11

టీ:- దర్శనస్య దుర్లభతా మాహుః - అసంగేతి. అసంగేన వైరాగ్యేణ. నిశ్చితం యత్ జ్ఞానం, తదేవానిలః తేన విధూతాః అశేషామలా యేషాం

తత్త్వజ్ఞుడగు పురుషుడు పిలువబడకున్నను దయతో అల్పజ్ఞుని దగ్గరికి చేరినట్లుగా, నీవు గొప్పదయతో మాకు మోక్షమను పరమ పదమును ప్రసాదించుటకు, మా మనోరథములను తీర్చుటకు, పూజించక పోయిననూ యజ్ఞదర్శకులగు సామాన్యులవలె ఇచ్చట మాకు దర్శన మొసంగితివి. 9

ఓ పురుషోత్తమా! రాజర్షియగు ఈ నాభి ఆచరించిన యజ్ఞమున వరములిచ్చు వారిలో శ్రేష్ఠుడవగు నీవు వరములనొసంగుటకే అరుదెంచితివి. నీ భక్తులమగు మాకు నీ రూపదర్శనమే గొప్ప వరమైనది. 10

నీదర్శనము దుర్లభమైనదని తెలుపుచున్నారు. వైరాగ్యముతో కలిగిన జ్ఞానాగ్నిచే అశేష పాపములను కాల్చివేసినవారు, నీలాంటి స్వభావముగల ఆత్మారాములగు మునులకును అనవరతము అభ్యసించ బడు గుణగణములుగల పరమ మంగళ స్థానమగు నీ గుణగణముల ధ్యానమే కల్గును. కానీ మాకు మీ దర్శన భాగ్యమబ్బినది. 11

తే. అతో భవత ఇవ స్వభావో యేషాం తానేవాహుః – ఆత్మారామాణాం ఏవంభూతానాం మునీనామపి పరమమంగళాయనం గుణగణ కథనమేవ. న తు దర్శనం యస్య అతః తైవనవరతం పరిగుణితాః అభ్యస్తాః గుణగణాః యస్యేతి సంబోధనం. 11

చూ॥ అథ కథంచిత్స్ఖలన క్షుత్పతన జృంభణ దురవస్థానాదిషు, వివశానాం నః, శ్రీమచ్చరణారవిందస్మరణాయ, జ్వర మరణ దశాయా మపి సకలకశ్మలనిరసనాని, తవ గుణకృతనామధేయాని, వనగోచరాణి భవంతు. 12

టీ:– దర్శనేనైవ కృతార్థా అపి వరమేకం ప్రార్థయంతే – అథేతి. స్మరణాయ వివశానాం, త్వాం స్మర్తుమశక్తానాం నః. 12

చూ॥ కించాయం రాజర్షిరపత్య కామః, ప్రజాం చ భవాదృశీ మాసా సానః, ఈశ్వరమాశిషాం స్వర్గాపవర్గయోరపి భవంతముపధావతి, ప్రజాయామేవ పురుషార్థప్రత్యయః, ధనమివాధనః ఫలీకరణమ్. 13

టీ:– అన్యచ్చ ప్రార్థనీయమస్తీత్యాహుః – కించేతి. ఆశిషాం ఐహి కానాం. స్వర్గాపవర్గయోరపి ఈశ్వరం త్వాం ఉపధావతి. ప్రజాయా మేవ పురుషార్థఇతి ప్రత్యయో యస్య, అధనో యథా ఫలీకరణం తుష కణాదికమాశాసానః, ధనముపధావతి. 13

నీ దర్శనము చేతనే ధన్యులమైనను, ఒక వరమును కోరుకొను చున్నాము. జారుట, పడుట, తుమ్ముట, ఆవులించుట, జ్వర, మరణాది అన్ని సమయములలో సమస్త కలిమలవినాశకమగు నీ నామములు మా వచనగోచరములగు గాక! (అన్ని సమయములలో జ్వర మరణాది సర్వ విషయ వివశులమగు మేము నీ స్మరణ చేయలేకపోచున్నాము. మాకు అన్ని వేళలలో సమస్త కలిమల నాశకరమగు నీ నామ సంకీర్తనలే వచనములుగా ఉండునట్లు వరము అనుగ్రమించెదరుగాక!). 12

ఇంతకంటే కోరతగినదేదిలేదు. అయిననూ మరొక కోరిక కలదని తెలుపుచున్నాడు. సంతానమే పురుషార్థముగ భావించిన ఈ రాజర్షియగు నాభి పుత్ర కామన కలవాడై నీలాంటి సంతానమును, ఐహికములగు వాటికి, స్వర్గాపవర్గములకు ఈశ్వరుడవగు నిన్ను ధనహీనుడు, ఉదారపురుషుని చేరి తుషా కణాదికమును (ఊకను) అడిగినటుల కోరుచున్నాడు. (అనగా మోక్షమును కాకుండా సంతానమును కోరుతున్నాడని భావము) 13

 



చూ॥ కో వా ఇహ తేఽపరాజితయాఽపరాజితో మాయయానవసిత పదవ్యానావృత మతిర్విషయ విషరయానావృతకృతిరనుపాసిత మహచ్చరణః. 14

టీ:- ఇదం చ నాతిచిత్రమిత్యాహుః - క ఇతి. ఇహ సంసారే తే. అపరాజితయా. అనవసితపదవ్యా అలక్షితమార్గయా. అపరాజితః కో వై న కోఽపి. అతః తయా అనావృతమతిస్స కః? అత ఏవ విషయా ఏవ విషం, తస్య రయాః వేగాః తైరనావృతా ప్రకృతిర్యస్య సః కః? యద్యనుపాసితమహచ్చరణః. అతస్త్వన్మాయయా మోహితస్యైవం ఆశంసా ఘటత ఇత్యర్థః. 14

ఈ విధముగా కోరడములో ఆశ్చర్యము ఏమియు లేదని తెలుపుచున్నారు. అపరాజితయగు నీ మాయను ఎవరును దాటలేరు. ఆ మాయ ఎవరికి అధీనమయ్యేది కాదు. మహాత్ముల చరణసేవ చేయనట్టి ఏ వ్యక్తి ఆ మాయచేత ఆవరించబడక యుండును? విషయ రూప విషవేగముతో ఆవరించని ప్రకృతిగల వాడెవ్వడు. అందువలన నీ మాయామోహితులైన వారికి ఇలాంటి కోరిక కల్గడము సహజమే యని భావము. 14

చూ॥ యదుహవావ తవ పునరదభ్రకర్తరిహ సమాహూతస్తత్రార్థ ధియాం మదాంధానాం నస్తద్యద్దేవహేళనం దేవతదేవార్హసి సామ్యేన సర్వాత్మన్ ప్రతివోఢుమవిదుషామ్. 15

టీ:- యదితి. అదభ్రకర్తః హే బహుకార్యకారిన్ అల్పీయసే కార్యాయ త్వంయత్ యస్మాదిహ సమాహుతోఽసి. తత్ర ప్రజాయామర్థే ధీర్యేషాం మదాంధానాం. తేషాం నో యద్దేవ హేళనం అవజ్ఞానం తత్. సర్వాత్మన్ తవ సామ్యేన హేతునా, ప్రతివోఢుం సోఢుమర్హసి. (15)

ఓ దేవదేవా! నీవు భక్తుల గొప్ప గొప్ప కోరికల తీర్చెదవు. అట్టి నిన్ను మందమతులగు మేము ఈ అల్ప కార్యమునకై ఆహ్వానించితిమి. ఇది మిమ్ములను అనాదరించుటయే అయినను సమదర్శివైన నీవు ఈ మా అపరాధమును సహించగలిగిన వానివి కదా!. 15







చూ॥ ఇతి నిగదేనాభిష్టూయమానో భగవాననిమిషర్షభో వర్షధరాభి వాదితాభివందిత చరణస్సదయమిదమాహ. 16

టీ:- ఇతీతి. ఇతి నిగదేన గద్యాత్మక స్తోత్రేణ వరధరః భారత వర్షాధి పతిః. నాభిః. తేనాభివాదితా యే ఋత్విజః. తైరభివందితౌ చరణౌ యస్య. 16

ఓ పరీక్షిద్రాజా! భరతవర్షాధిపతి నాభి యొక్క ఋత్విజులు గద్యాత్మకమగు ఈ స్తోత్రములతో స్తుతించగా దేవశ్రేష్ఠుడగు శ్రీహరి దయతో ఈ విధముగా పలికెను. 16

### శ్రీ భగవాను ఉవాచ

చూ॥ అహో బతాహమృషయోభగవద్భిరవితథగీర్భిః పరమసులభ మభియాచితౌ యదముష్మాదాత్మజో మయా సదృశో భూయాదితి మమా హమేవాభిరూపః కైవల్యాదథాపి బ్రహ్మవాదో న మృషా భవితుమర్హతి మమైవ హి ముఖం యద్ద్విజ దేవకులమ్. 17

టీ:- అసులభత్వే హేతుమాహ - అహో ఇతి. మమా యమేవాభి రూపః సదృశః. కైవల్యాత్. అద్వితీయత్వాత్. ద్విజేషు దేవా ఇవ బ్రాహ్మణాః, తేషాం కులం. 17

### భగవానుడు ఈవిధముగా పలికెను

ఓ ఋత్విజులారా! మీరు రాజర్షియగునాభికి నాతో సమానమైన పుత్రుని ప్రసాదించమని దుర్లభమైన వరమును కోరితిరి. నాతో సమానమైన వానిని నేనే. ఏలనన నేనద్వితీయుడను. అయినను బ్రాహ్మణుల వాక్కు మిథ్య కాకూడదు. బ్రాహ్మణులు నా ముఖ స్థానీయులు. (తరువాతి శ్లోకముతో అన్వయము) (బ్రాహ్మణోస్య ముఖమాసీత్). 17

చూ॥ తత ఆగ్నీధ్రీ యేక్షేత్రే అంశకలయావతరిష్యామి ఆత్మతుల్య మనుపలభమానః. 18

నాతో సమానుడెవరును లేనందున, నేనే నాభి పత్నియగు మేరుదేవి యందు నా అంశకళలతో ఆవిర్భవించెదను. 18










టీ:- తత ఇతి. అగ్నీధ్రీయే నాభి సంబంధిని క్షేత్రే. మేరుదేవ్యా మిత్యర్థః. 18

చూ॥ ఇతి నిశామయంత్యా మేరుదేవ్యాః పతిమభిధాయాంతర్దధే భగవాన్ బర్హిషి తస్మిన్, ఏవం విష్ణుదత్త భగవాన్ పరమర్షిభిః ప్రసాదితో నాభేః ప్రియచికీర్షయా తదవరోధాయనే మేరుదేవ్యాం ధర్మాన్ దర్శయితు కామో వాతరశనానాం శ్రవణానామృషీణా మూర్ధ్వమంథినాం శుక్లయా తనువావతతార. 19

టీ:- ఇతీతి. హే విష్ణుదత్త తస్యావరోధాయనే అంతఃపురే మేరుదేవ్యాం. శుక్లయా శుద్ధసత్త్వమయ్యా తన్వా.అవతతార కేషాం ధర్మాన్. వాతరశనానాం దిగ్వాససాం పాషండివ్యావృత్యర్థమాహ - శ్రవణానాం తపస్వినాం ఋషీణాం. జ్ఞానినాం ఊర్ధ్వమంథినాం నైష్ఠిక బ్రహ్మచారిణాం. 19

**మహారాణి మేరుదేవి వినుచుండగ నాభితో అలా చెప్పి భగవంతుడు అంతర్ధానమొందెను.**

ఓ పరీక్షిద్రాజా! భగవంతుడు ఆ యజ్ఞములో మహర్షులచే ఈ విధముగా పూజింపబడి, ప్రసన్నుడై, మహారాజు నాభికి ప్రియము చేయదలచి మహారాణి మేరుదేవి గర్భమున నైష్ఠిక బ్రహ్మచారుల, సన్యాసుల, వానప్రస్థుల, ఊర్ధ్వరేతస్కులగు మునుల, యజ్ఞ నిష్ఠలగు గృహస్థుల ధర్మమును ప్రకటించుకై శుక్లవర్ణమగు శరీరముతో అవతరించెను. 19

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, తృతీయోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు మూడవ అధ్యాయము సమాప్తము.**









## చతుర్థోऽధ్యాయః

శ్లో॥ చతుర్థాది త్రిభిః ప్రోక్తవృషభస్యేహితం మహత్ ।
లోకార్థం యేన సత్కర్మనైష్కర్మ్యం చ ప్రదర్శితమ్ ॥

చతుర్థే శత పుత్రస్య రాజ్యం తస్యోపవర్ణ్యతే ।
యస్య రాజ్యే జనస్సర్వస్సం తోషామృతనిర్వృతః ॥

**శ్రీశుక ఉవాచ**

చూ॥ అథ హతముత్పత్త్యైవాభివ్యజ్యమాన భగవల్లక్షణం సామ్యోపశమ వైరాగ్యైశ్వర్య మహావిభూతిభిరనుదిన మేధమానానుభావం, ప్రకృతయః ప్రజాః బ్రాహ్మణదేవతాశ్చావనీతలసమవనాయాతితరాం జగృధుః 1

టీ:- అథేతి. అభివ్యజ్యమానాని భగవల్లక్షణాని పాదతలాదిషు వజ్రాంకుశాదీని యస్య సామ్యం సర్వభూతేషు సమత్వం. ఉపశమః, అంతర్బాహ్యేంద్రియనియమః. వైరాగ్యం విషయేష్వనాసక్తిః ఐశ్వర్యం సర్వభూత నియంతృత్వం. మహావిభూతిస్సర్వ సంపత్తిః. ఏతైస్సామ్యాది భిస్సహ వర్ధమాన ప్రభావం ప్రకృతయః అమత్యాదయః. ప్రజాః జనాః బ్రాహ్మణదేవతాశ్చ. గోబలీవర్దన్యాయేన బ్రాహ్మణదేవతా ఇత్యుక్తం. అవనీతలరక్షణాయ జగృధుః అభికాంక్షతి స్మ. 1

## 4 వ అధ్యాయము

ఈ నాలుగవ అధ్యాయము నుండి మూడధ్యాయములలో లోకనిమిత్తము సత్కర్మలను, నిష్కర్మత్వమును, ప్రదర్శించిన, వంద మంది పుత్రులు కలిగిన ఋషభదేవ చరితము తెలుపబడుచున్నది.

**శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.**

నాభినందనుని అంగములు పుట్టుకతోనే వజ్రాంకుశాది విష్ణు లక్షణములు కలిగియుండెను. సమత్వము, శాంతము, అంతర్బహిరింద్రియముల నిగ్రహము, వైరాగ్యము, విషయములపట్ల విముఖత, ఐశ్వర్యము, అన్ని ప్రాణులను నియంత్రించే శక్తి మొదలగు మహావిభూతులతో ఆతని ప్రభావము దినదిన ప్రవర్ధమాన మగుచుండగా అమాత్యులు, ప్రజలు, బ్రాహ్మణ దేవతలును ఆతడే భూపరిపాలన చేయవలయునని కోరుచుండిరి. 1









చూ॥ తస్యహ వా ఇత్థం వర్ష్మణా వరీయసా బృహచ్ఛ్లోకేనౌజసా బలేన శ్రియా యశసా వీర్యశౌర్యాభ్యాం చ పితా ఋషభ ఇతీదం నామ చకార. 2

టీ:- తస్యేతి. వర్ష్మణా దేహేన, తస్య విశేషణ ద్వయం, వరీయసా శ్రేష్ఠతమేన, బృహంతః శ్లోకాః పద్యాని కవీనాం యస్మిన్ తేన ఓజః తేజః. వీర్యం ప్రభావః శౌర్యముత్సాహః. ఏతైర్గుణైరతిశ్రేష్ఠత్వాత్. ఋషభః శ్రేష్ఠ ఇతి నామ చకార. 2

చూ॥ యస్య హీంద్రః స్పర్ధమానో భగవాన్ వర్షేనవవర్ష–తదవధార్య భగవానృషభదేవో యోగీశ్వరః – ప్రహస్యాత్మ యోగమాయయా స్వవర్షమజనాభం నామాభ్యవర్షత్. 3

టీ:- యస్యేతి. యస్య వర్షే మండలే అజనాభం నామస్వవర్షం భారతవర్షస్యాజనాభమితి ప్రాక్తనం నామ. 3

చూ॥ నాభిస్తు యథా భిలషితం సుప్రజాస్త్వమవరుధ్య అతి ప్రమోద భరవిహ్వాలో గద్గదాక్షరయా గిరాస్వైర గృహీత నరలోక ధర్మం–భగవతం పురాణపురుషం–మాయయా విలసితమతిః వత్స తాతేతి సానునయ ముపలాలయన్–పరాం నిర్వృతిముపగతః. 4

ఆ బాలుడు కవులచే వర్ణింపబడేరీతిలో శ్రేష్ఠమైన శరీరము, వర్చస్సు, బలము, సంపద, వీర్యము, శౌర్యము, కీర్తిప్రభావజనిత ఉత్సాహము మొదలగు గొప్ప గుణములతో నుండుటచే నాభి మహారాజు ఆతనికి “ఋషభుడు” అని పేరే పెట్టెను. 2

ఋషభదేవుడు అజనాభమును, తన మండలమును పరిపాలించుచుండ (భారత వర్షమునకు అజనాభమని పురాతన నామము). ఒకసారి ఇంద్రుడు ఈర్ష్యతో ఆ ఋషభుని రాజ్యమున వర్షము కురిపించలేదు. అపుడు యోగేశ్వరుడగు ఋషభదేవుడు ఇంద్రుడి మూర్ఖతను గాంచి నవ్వుకొని తన యోగమాయతో అజనాభ మండలమున సమృద్ధమగు వర్షమును కురిపించెను. 3

నాభి మహారాజు తను కోరిన ప్రకారముగ శ్రేష్ఠుడగు పుత్రుని పొంది, మిక్కిలి సంతసించి, తన ఇచ్ఛతో మనుష్య శరీరధారణ చేసిన పురాణ పురుషుడగు భగవంతుణ్ణి, ఆతని లీలావిలాసములతో ముగ్ధుడై ప్రేమతో విహ్వాలములైన గద్గద వాక్కులతో వత్సా కుమారా అని లాలిస్తూ పరమ సుఖమును పొందుచుండెను. 4













టీ:- నాభిరితి. శోభనా ప్రజాసంతతిర్యస్య తస్మాదసిచ్. తస్య భావః సుప్రజాస్త్వం. అవరుధ్య ప్రాప్య, స్వైరం ఇచ్ఛయా గృహీతో నరలోక ధర్మో మనుష్యాకారో యేన తం. అత ఏవ మాయయా స్వపుత్ర ఇతి విలసితా మతిర్యస్య. 4

చూ॥ విదితానురాగమాపౌర ప్రకృతి జనపదోరాజా నాభిరాత్మజం-సమయ సేతురక్షాయామభిషిచ్య బ్రాహ్మణేషూపనిధాయ సహ మేరుదేవ్యా విశాలాయాం ప్రసన్న నిపుణేన తపసా సమాధియోగేన నరనారాయణాఖ్యం భగవతం వాసుదేవముపాసీనః కాలేన తన్మహిమానమవాప. 5

టీ:- విదితేతి. ఆపౌరప్రకృతి. పౌరాన్ ప్రకృతీశ్చాభివ్యాప్య, విదితోऽనురాగో యస్మిన్, యస్మిన్, కథంభూతో నాభిః, జనపదః జనా పౌరాదయః పదం ప్రమాణం యస్య సః. ఆత్మజం ధర్మ మర్యాదారక్షార్థం అభిషిచ్య బ్రాహ్మణానాముత్సంగే నిధాయ విశాలాయాం బదరికాశ్రమే ప్రసన్నం పరానుద్వేజకం నిపుణం తీవ్రం విఘ్నానుపహతం వాతేన ఉపాసీనః సేవ్యమానః తన్మహిమానం జీవన్ముక్తమవాప. 5

నాభిమహారాజు అమాత్యులు, నాగరికులు, రాజ్యములోని జనులు ఋషభదేవునిపై అనురక్తులై యున్నారని తెలుసుకొని, తన పుత్రుడగు ఋషభదేవుని, ధర్మ మర్యాదను రక్షించుటకై రాజ్యమున అభిషేకించి, బ్రాహ్మణలకప్పగించి తన పత్నియగు మేరుదేవితోసహా బదరికాశ్రమమును చేరి, ఇతరులకు బాధ కలిగించని విఘ్నములు లేని తపస్సుతో, సమాధియోగముతో నారాయణ నామధేయుడు, భగవంతుడగు వాసుదేవుని ఉపాసిస్తూ కొంతకాలము పిదప భగవంతునిలో లీనమాయెను. (జీవన్ముక్తుడాయెను) 5








మూ॥ యత్ర హ వా పాండవేయశ్లోకా ఉదాహరంతి. శ్లో. కోను తత్కర్మ రాజర్షేర్నాభేరన్వాచరేత్పుమాన్, అపత్య తామగాద్యస్య హరిశ్శుద్ధేన కర్మణా. 6

టీ:- కోన్వితి. నాభేస్తత్ప్రసిద్ధం అను తదనంతరం. కోను పుమాన్ ఆచరేత్ న కోఽపీత్యర్థః. 6

మూ॥ బ్రహ్మణ్యోఽన్యః కుతో నాభేర్విప్రా మంగళపూజితాః ।
యస్య బర్హిషి యజ్ఞేశం దర్శయామాసు రోజసా ॥ 7

టీ:- బ్రహ్మణ్య ఇతి. మంగళైః దక్షిణాభిః పూజితాస్సంతతః ఓజసా మంత్ర బలేన. 7

మూ॥ అథ భగవానృషభదేవః స్వవర్షం కర్మక్షేత్రమనుమన్యమానః ప్రదర్శిత గురుకులవాసో లబ్ధవరైర్గురుభిరనుజ్ఞాతో గృహమేధినాం ధర్మాననుశిక్షమాణో జయంత్యామింద్రదత్తాయాముభయలక్షణం కర్మ సమామ్నాతమభియుంజన్నాత్మజానామాత్మసమానానాం శతం జనయామాస. 8

ఓ పరీక్షిద్రాజా! నాభిమహారాజు విషయమున ఈ శ్లోకములు ఉదహరించబడుచున్నవి.

ఆ రాజర్షియగు నాభి ఆచరించిన ఆ గొప్ప కర్మలను వేరెవరు ఆచరించగలరు? నాభి యొక్క పరిశుద్ధములగు కర్మలచే సంతుష్టుడై శ్రీహరి నాభికి పుత్రుడాయెను. 6

నాభిమహారాజు ఆచరించిన యజ్ఞములో దక్షిణాదులతో పూజించబడిన బ్రాహ్మణులు, తమ మంత్ర బలముతో యజ్ఞశాలలో యజ్ఞేశుడగు విష్ణు భగవానుని దర్శింపచేసిరి. అట్టి నాభి లాంటి భగవద్భక్తులెవరుందురు? 7

భగవంతుడగు ఋషభదేవుడు తన రాజ్యమగు అజనాభమును కర్మభూమిగాతలంచి, లోకసంగ్రహమునకై కొంతకాలము గురుకులమున వసించి, గురుదక్షిణ నొసగి, గుర్వాజ్ఞనొంది, గృహస్థు - లకు ధర్మమార్గమున శిక్షణనొసంగుచు, ఇంద్రునిచే నొసగబడిన ఇంద్ర పుత్రికయగు జయంతిని వివాహమాడి శాస్త్రోపదిష్టములైన శ్రౌత స్మార్త ఉభయ విధ కర్మలనాచరిస్తూ తన భార్యయగు జయంతి యందు తనతో సమానులగు వందమంది పుత్రులను కనెను. 8









చూ॥ తేషాం ఖలు మహాయోగీ భరతో జ్యేష్ఠశ్రేష్ఠగుణ ఆసీత్ ।
యేనేదం వర్షం భారతమితి యత ఆరభ్య వ్యపదిశంతి హి ॥9

టీ:- అథేతి. అన్యేషాం ప్రదర్శితో గురుకులవాసో యేన, అనుశిక్ష మాణః అనుశిక్షయన్, ఉభయవిదం శ్రుతి స్మృతిలక్షణం, కర్మవిధిం సమామ్నాతం విహితం, అభియుంజన్ అనుతిష్ఠన్ జయంత్యాం భార్యాయాం, ఆత్మజానాం శతం జనయామాస. (8-9)

ఆ వందమంది పుత్రులలో మహాయోగియగు భరతుడు జ్యేష్ఠుడు, గుణములలో శ్రేష్ఠుడు. ఆతని పేరుతోనే అజనాభమను ఈ దేశము భారత వర్షమని చెప్పబడుచున్నది. 9

చూ॥ తమను కుశావర్త ఇలావర్తో బ్రహ్మావర్త ఆర్యావర్తో మలయకేతు ర్భద్రసేన ఇంద్రస్పృగ్విదర్భః కీకట ఇతి, నవనవతి ప్రధానాః.10

టీ:- తమితి. తం భరతమను కుశావర్తాదయో నవ పుత్రాః నవతేః ప్రధానాః జ్యేష్ఠాః. 10

ఆ భరతుని తరువాత కుశావర్త, ఇలావర్త, బ్రహ్మావర్త, మలయ కేతు, భద్రసేను, ఇంద్రస్పృక్, విదర్భ కీటకులను తొమ్మండుగురు మిగిలిన తొంభైమంది పుత్రులకంటే జ్యేష్ఠులు. (అనగా భరతుని తరువాతి వారు) 10

చూ॥ కవిర్హరిరంతరిక్షః ప్రబుద్ధః పిప్పలాయన ఆవిర్హోత్రో ద్రమీలశ్చ మసః కరభాజనః ఇతి భాగవతధర్మదర్శనా నవమహాభాగవతాస్తేషాం సుచరితం భగవన్మహిమోపబృంహితం వసుదేవ నారద సంవాదముపశ మాయనముపరిష్టాద్వర్ణయిష్యామః. 11

టీ:- కవిరితి. తదనంతరం,కవిప్రముఖాః నవ భాగవతధర్మ ప్రదర్శకాః వసుదేవ నారదయోస్సంవాదో యస్మిన్. ఉపరిష్టాదేకాదశ స్కంధే. 11

ఈ కుశావర్తాది తొమ్మండుగురికంటే చిన్నవారలగు కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, అవిర్హోత్రుడు, ద్రుమిళుడు, చమసుడు, కరభాజనుడు అను తొమ్మండుగురు భాగవతధర్మ ప్రచారకులగు భగవద్భక్తులు. చిత్తశాంతినిచ్చే వీరి చరిత్ర ఏకాదశ స్కంధమున నారద వసుదేవ సంవాదమున చెప్పెదను. 11












చూ॥ యవీయాంస ఏకాశీతిర్జాయంతే, యే పితురాదేశకరా మహాశాలీనా మహాశ్రోత్రియా యజ్ఞశీలాః కర్మవిశుద్ధా బ్రాహ్మణా బభూవుః (12)

టీ:- యవీయాంస ఇతి. మహాశాలీనాః అతివినీతాః. 12

చూ॥ భగవానృషభసంజ్ఞ ఆత్మతంత్రః స్వయం నిత్యనివృత్తానర్థ పరంపరః కేవలానందానుభవః ఈశ్వర ఏవ విపరీతవత్కర్మాణ్యారభమాణః కాలేనానుగతం ధర్మమాచారేణోప శిక్షయన్నతద్విదాం సమ ఉపశాంతో మైత్రః కారుణికో ధర్మార్థయశః ప్రజానందామృతావరోధేన గృహేషు లోకాన్న్యయమయత్. 13

టీ:- భగవానితి. కేవలశ్శుద్ధః. విపరీతవత్ అనీశ్వరవత్ కర్మాణి కుర్వన్ న్యయమయత్ నియమితవాన్. పాఠాంతరే నితరామరమయత్. కర్మకరణే హేతుః. అనుగతం ఉత్పన్నం ధర్మం స్వయమాచరణేన అతద్విదాముపశిక్షయన్ కథం ధర్మాదీనామవరోధేన సంగ్రహేణ ప్రజానందః. ప్రజార్థో భోగః. అమృతం మోక్షః. 13

ఋషభ - జయంతుల పుత్రులలో తదుపరివారు పైన చెప్పిన వారికంటే చిన్నవారైన ఎనభైఒక్కమంది పిత్రాదేశమును ఆచరించెడివారు. వినీతులు, వేదవిదులు, యజ్ఞకర్తలు, పుణ్యకర్మల నాచరించి శుద్ధులై బ్రాహ్మణులైరి. **(భరతుడు1; కుశాదులు 9 మంది; కవి మొదలగువారు9మంది; మిగిలినవారు81మంది మొత్తము100మంది.)** 12

భగవంతుడగు ఋషభదేవుడు స్వతంత్రుడగుటచే సర్వదా సర్వానర్థ పరంపరా రహితుడై, కేవలానంద స్వరూపుడగు ఈశ్వరుడే అయి ఉండిగూడా, అజ్ఞానివలె కర్మలనాచరిస్తూ, కాలానుగుణముగా ప్రాప్తమైన ధర్మమునాచరిస్తూ, ధర్మతత్త్వము తెలియని వారికి తెలుపుతూ వారితో శాంతముతో, సుహృద్భావముతో, దయతో మెదలుచూ ధర్మ, అర్థ, యశస్సంతాన భోగ సుఖ మోక్షములను సంగ్రహిస్తూ ప్రజలను, గృహస్థాశ్రమములో నియమించెను. (అనగా గృహస్థాశ్రమములో ఎలా మెదలుకోవలెనో నిరూపించెను.)13











చూ॥ యద్యచ్ఛీర్షణ్యాచరితం తత్తదనువర్తతే లోకః ॥ 14

గొప్పవారు దేనిని ఆచరించెదరో, ప్రజలు దానిని అనుసరించెదరు. 14

టీ:- యద్యదితి. శీర్షణ్యః శ్రేష్ఠః. తేనాచరితం తత్తదనువర్తతేయతః. 14

చూ॥ యద్యపి స్వవిదితం సకలధర్మం బ్రాహ్మణైర్దర్శితమార్గేణ సామాదిభిరుపాయైర్జనతామనుశశాస. 15

ఆ ఋషభదేవుడు సమస్త ధర్మములు, వేద రహస్యములు తెలిసినవాడైనను, బ్రాహ్మణులు చూపిన మార్గములో, సామ, దానాద్యుపాయములతో ప్రజలను పాలించెను. తనకు తెలిసినప్పటికీ ప్రతి పనిని బ్రాహ్మణులనడిగియే చేసెడివాడని అర్థము. 15

టీ:- యద్యపీతి. సకలః ధర్మో యస్మిన్ తత్. బ్రహ్మగుహ్యం వేదరహస్యం యద్యపి స్వేనైవ విదితం. తథాపి బ్రాహ్మణాన్ పృష్ట్వైవ కరోతీత్యర్థః. 15

శ్లో॥ ద్రవ్యదేశ కాలవయఃశ్రద్ధర్త్విగ్వివిధోద్దేశోపచితైః ।
సర్వైరపి క్రతుభిర్యథోపదేశం శతకృత్వ ఇయాజ ॥ 16

ఆ ఋషభదేవుడు యౌవనములో భక్తి, శ్రద్ధలచే, బ్రాహ్మణులు ఉపదేశించినటుల యజ్ఞ సంబంధ పదార్థములు (వడ్లు మొదలగునవి), యజ్ఞ సంబంధ కాలములు (వసంతాది ఋతువులు), యజ్ఞ సంబంధ స్థలములు (గంగాతీరాదులు) మరియు బుధులగు ఋత్విజులతో అనేక విధములుగా, యథా శాస్త్రీయముగా ఒక్కో యజ్ఞమును వందసార్లుచేసి, వివిధ దేవతలనుద్దేశించి సమృద్ధితో సమర్పించెను. 16

టీ:- ద్రవ్యేతి. ద్రవ్యాభిరుపచితైర్యజ్ఞైరిష్టవాన్ తత్ర వయః యౌవనం. శ్లో."యదైవ ధర్మ మన్విచ్ఛేది"తి వచనాత్. వివిధోద్దేశాః నానాదేవతోద్దేశాః యథోపదేశం యథావిధి. ఏకైకం శతవారం. 16










చూ॥ భగవతర్షభేణ పరిరక్ష్యమాణ ఏతస్మిన్ వర్షేన కశ్చన్న పురుషో వాంఛత్యవిద్యమానమివాత్మనోఽన్యస్మాత్కథంచన కిమపి కర్హి చిదపేక్షతే భర్తర్యనుసవన విజృంభితస్నేహాతిశయమంతరేణ ॥ 17

టీ:- భగవతేతి. అన్యస్మాత్సకాశాదాత్మనః కచ్చిదపి కిమపి కథంచ నాపి న వాఛంతి. ఇచ్ఛానుదయే దృష్టాంతః. అవిద్యమానం ఖపుష్పాదికమివ న చాన్యదీయమపేక్షత ఇత్యర్థః. భర్తరి ఋషభదేవే ప్రతిక్షణముల్లసిత స్నేహోద్రేకం వినా అన్యం. న వాంఛతి. 17

ఋషభదేవుడు శాసించు సమయమున ఆ దేశవాసులు తమ ప్రభువుపై దినదినము పెరిగెడి అనురాగమును తప్ప వేరే దానిని దేనిని కూడా, ఎప్పుడు కూడా, ఇతరుల కొరకుగాని తమ కొరకుగాని కోరకుండిరి. మిగతా కోరికలన్నీ వారి దృష్టిలో ఆకాశకుసుమములవలె మిథ్యా భావములే. 17

చూ॥ స కదాచిదటమానో భగవానృషభో బ్రహ్మావర్తగతో బ్రహ్మర్షి ప్రవరసభాయాం ప్రజానాం నిశామయంతీ నామాత్మ జానవహితాత్మనః ప్రశ్రయ ప్రణయభరసుయంత్రితానప్యుపశిక్షయన్నితి హోవాచ ॥ 18

టీ:- స ఇతి. అవహితాత్మనః సంయతచిత్తానపి ప్రజానుశాసనార్థం ఉపశిక్షయన్. ఇతి హ వక్ష్యమాణమువాచ. 18

ఆ ఋషభదేవుడొకానొకసారి సంచరిస్తూ బ్రహ్మావర్తనమును చేరెను. అచట శ్రేష్ఠులగు బ్రాహ్మణుల సభలో ప్రజలు వినుచుండగా, సమాహిత చిత్తులు జితేంద్రియులు, వినయవంతులు, ప్రేమభావ యుతులునగు తన పుత్రులకు ప్రజాపాలన విధానమై ఉపదేశమివ్వ దలచి ఇట్లు పలికెను. 18

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, చతుర్థోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు నాల్గవ అధ్యాయము సమాప్తము.**









## పంచమోఽధ్యాయః

శ్లో॥ పంచమే మోక్షధర్మోపదేశైః పుత్రానుశాసనమ్ ।
ఉక్తం పరమహంస్యం చ తస్య ద్వంద్వ తితిక్షయా ॥

**ఋషభ దేవ ఉవాచ**

శ్లో॥ నాయం దేహో దేహభాజాం నృలోకే
కష్టాన్ కామానర్హతి విడ్భుజాం యే ।
తపో దివ్యం పుత్రకా యేన సత్త్వం
శుధ్యేద్యస్మాద్బ్రహ్మసుఖం హ్యనంతమ్ ॥ 1

టీ:- నాయమితి. విడ్భుజామపి సంతి యే తాన్ కష్టాన్ దుఃఖదాన్ కామాన్ విషయాన్ నార్హతి తద్భోగయోగ్యోఽయం మనుష్యదేహో న భవతి. దివ్యముత్కృష్టందేవస్య విష్ణోరారాధనరూపం. యేన తపసా యస్మాత్. శుద్ధాత్సత్వాత్. అనంతం బ్రహ్మసుఖం భవతి. 1

శ్లో॥ మహత్సేవాం ద్వారమాహుర్విముక్తే
స్తమోద్వారం యోషితాం సంగిసంగమ్ ।
మహాంతస్తే సమచిత్తాః ప్రశాంతా
విమన్యవస్సుహృదస్సాధవో యే ॥ 2

## 5వ అధ్యాయము

ఈ ఐదవ అధ్యాయమున ఋషభదేవుడు సుఖ దుఃఖాది ద్వంద్వములను జయించుటకై పరమహంసలకు సంబంధించిన మోక్ష ధర్మములను తన పుత్రులకు ఉపదేశించుట చెప్పబడినది.

**ఋషభదేవుడు ఈ విధముగా పలికెను.**

పుత్రులారా! ఈ మానవలోకమున మానవశరీరము మలమును భుజించెడి ప్రాణులవలె కష్టసుఖముల ననుభవించుటకై ఏర్పడినది కాదు. తపస్సుతో అంతఃకరణ శుద్ధినొంది అనంతమగు బ్రహ్మానంద ప్రాప్తి కలుగును. అటువంటి భగవదారాధనలాంటి తపమాచరించుట కేర్పడినది. (అనగా ఈ దేహముతో విషయలోలురై కష్టసుఖముల ననుభవించక తపమాచరించవలెను.) 1

మోక్షబంధములకు కారణముల తెలుపుచున్నాడు. సమచిత్తులు, పరమశాంతులు, క్రోధరహితులు, సర్వహితకాంక్షులు, సదాచార పరాయణులగు మహాపురుషుల సేవ మోక్షమునకు ద్వారము. స్త్రీలంపటులగు కాముకుల సంగమము సంసారమునకు కారణమగు తమోద్వారమని తెలిపిరి. 2










టీ:- మోక్షబంధయోర్నిదానమాహ - మహదితి. తమసః సంసారస్య ద్వారం యోషితాం యే సంగినః తేషాం సంగం మహతాం లక్షణమాహ - సార్ధేన. మహాంత ఇతి. సాధవస్సదాచారాః. 2

శ్లో॥ యే వా మయీశే కృత సౌహృదార్థా
జనేషు దేహంభర వార్తికేషు ।
గృహేషు జాయాత్మజరాతిమత్సు న
ప్రీతియుక్తా యావదర్థాశ్చ లోకే ॥ 3

ఈ శ్లోకమున కూడా మహా పురుషులెవరనునది తెలుపబడుచున్నది. కేవల విషయ వార్తలనే తప్ప ధర్మ విషయములను తలుపనట్టి వారియందు, భార్యా పుత్ర ధనాదులతో సంపన్నమగు గృహముల యందు ప్రీతిలేకుండా, కేవలము శరీర నిర్వహణకై లౌకిక కార్యములయందు ప్రవృత్తి కలిగి పరమాత్మనగు నాయందు ప్రేమనే పరమపురుషార్థముగా తలచువారు మహాపురుషులు. అట్టివారి సేవ మోక్షద్వారము. పై శ్లోకముతో అన్వయము. 3

టీ:- య ఇతి. మయి ఈశేకృతం సౌహృదమేవ అర్థః ప్రయోజనం పురుషార్థో వా యేషాం. వా శబ్దేనాన్యనిరపేక్షస్యైవ అస్య లక్షణత్వం దర్శయతి-దేహం బిభర్తీతి. దేహం భరావిషయవార్తైవ న ధర్మవిషయా యేషు తేషు జనేషు. జాయాది యుక్తేషు చ. రాతిర్మిత్రం ధనం వా. పాఠాంతరే జాయాదిప్రదేషు యావదర్థాశ్చ యావదర్థమేవార్థో యేషామితి మధ్యమపదలోపసమాసః. దేహనిర్వాహాదికస్పృహాశూన్యా ఇత్యర్థః. 3

శ్లో॥ నూనం ప్రమత్తః కురుతే వికర్మ
యదింద్రియప్రీతయ ఆపృణోతి ।
న సాధుమన్యే యత ఆత్మనోऽయ
మసన్నపి క్లేశద ఆస దేహః ॥ 4

కోరికలు తగవు అనుదానిని బలపరచుచున్నాడు. మానవుడు ఇంద్రియతృప్తినొందించుటకు ప్రమత్తుడై పాపకర్మను ఆచరించును. అది సరియైనదని నేను తలంచను. (సరికాదు) ఇంద్రియ ప్రీతిపూర్వక పాపకర్మల వల్ల ఈ దేహము వచ్చింది. వాస్తవముగా ఆత్మ(జీవునకు)








టీ:- కామాన్నార్థతీతి యదుక్తం తదుపపాదయతి - నూనమితి. యత్ యదా ఇంద్రియప్రీతయే ఆవృణోతి వ్యాప్రియతే తదా ప్రమత్తస్సన్ వికర్మ పాపం నూనం కురుతే యతో వికర్మణః ప్రాచీనాత్. అయం క్లేశదో దేహః జాతః తస్యైవ పునః కారణం సాధుమన్యే. 4

ప్రాకృతదేహము, విషయ తృష్ణలు లేవు. అలాంటప్పుడు దేహోత్పత్తి కారకములగు ఈ వికర్మలు చేయుటతగదు. 4

చూ॥ పరాభవస్తావదభోధజాతో యావన్నజిజ్ఞాసత
ఆత్మతత్త్వమ్ యావత్రియాస్తావదిదం
మనో వై కర్మాత్మకం యేన శరీరబంధః ॥ 5

ప్రాణికి ఎంతవరకు ఆత్మతత్త్వ జిజ్ఞాస కలుగదో అంతవరకు అజ్ఞానము వలన కలిగెడి దేహాదులతో స్వరూప తిరస్కారము కలుగును. మనస్సు ఎంతవరకు లౌకిక, వైదిక కర్మలలో (పాప పుణ్యాదులు కలిగించునవి) మగ్నమౌతుందో అంతవరకు కర్మవాసన ఉంటుంది. ఈ కర్మ వాసనతోనే దేహ బంధమేర్పడును. 5

టీ:- దేహాదేర్నశ్వరత్వాత్. కియానయమర్థ ఇత్యాహ - పరాభవ ఇతి. పరాభవః దేహాదినా స్వరూపాభిభవః అజ్ఞానకృతస్తావద్భుతి. తత్ర హేతుః. యావత్రియాస్స్యుః తావదిదం మనో హి కర్మస్వభావమేవస్యాత్. యేన కర్మాత్మ కేన మనసా. 5

శ్లో॥ ఏవం మనః కర్మవశం ప్రయుజ్క్తే
హ్యవిద్యయాత్మన్యుపధీయమానే ।
ప్రీతిర్న యావన్మయి వాసుదేవే న
ముచ్యతే దేహయోగేన తావత్ ॥ 6

ఈ ప్రకారముగా అజ్ఞానముతో ఆత్మ స్వరూప తిరస్కారము (ఆత్మానాత్మ వివేచన లేకపోవుట) కలుగగా కర్మవశమగు చిత్తము మళ్ళీ కర్మల నాచరింపచేయును. అందువలన ఎంతవరకు వాసుదేవుడనగు నాయందు ప్రీతి కలుగదో అంతవరకు జీవునకు (తనకు) దేహబంధమునుండి ముక్తి లభించదు. 6









టీ:- ఉక్తముపసంహరితి - ఏవమితి. ఏవం పూర్వకృతం కర్మ. కర్మభూతం. మనః కర్మభూతం. వశం ప్రయుఙ్క్తే పునః కర్మనిష్ఠం కరోతి. జీవన్ముక్త వ్యావృత్త్యర్థమాహ - అవిద్యయేతి. అవిద్యయా ఆత్మన్యుపధీయమానే ఆచ్ఛాద్యమానే సతి. 6

శ్లో॥ యదా న పశ్యత్య యథాగుణేహాం
స్వార్థే ప్రమత్తస్సహసా విపశ్చిత్ ।
గతస్మృతి ర్విందతి తత్ర తాపా
నాసాద్య మైథున్య మగారమజ్ఞః ॥ 7

టీ:- న కేవలం దేహయోగమాత్రం అనర్థాంతరం చేత్యాహ - యదేతి. యదా గుణానాం ఇంద్రియాణామిహాం చేష్టాం అయథా మిథ్యా ఆత్మీయా న భవతీతి విపశ్చిత్. వివేకీ సన్న పశ్యతి అనుపశ్య తీతి పాఠే అయథా మిథ్యా. ఆత్మీయత్వేనేత్యర్థః. తత్ర తదా. సహసా గతస్మృతిః స్వరూప స్మృతిశూన్యస్సన్. అజ్ఞః మూఢః మైథున్యం సుఖప్రధానం గృహం ప్రాప్య తాపాన్విందతి. 7

కేవలము దేహమునొందుటనే కాక వేరే అనర్థము కూడా సంభవించునని తెలుపుచున్నాడు. జీవి వివేకదృష్టి నాశ్రయించి ఇంద్రియ చేష్టలు మిథ్యాభూతములని ఎంతవరకు ప్రమత్తుడై తలంచడో అంతవరకు ఆత్మ స్వరూప విస్మృతి వలన, అజ్ఞానముతో ఇంద్రియ విషయ సుఖప్రధానములగు గృహాదులయందాసక్తుడై అనేక క్లేశముల నొందును. 7











శ్లో॥ పుంసః స్త్రియా మిథునీభావమేవం
తయోర్మిథో హృథయగ్రంథిమాహుః ।
అతో గృహక్షేత్ర సుతాప్తవిత్తై
ర్జనస్య మోహోऽయమహం మమేతి ॥ 8

టీ:- నను యథోపయోగం స్త్రియా మిథునీభూయ సుఖమాత్రమను భవతః కుతస్తాపాస్స్యుస్తత్రాహ-పుంస ఇతి. ప్రత్యేకం తయోరేకైకః హృదయగ్రంథిరస్త్యేవ. ఏవం మిథః స్థూలమన్యం హృదయయోర్గ్రంథిం. దుర్భేదంవదంతి. కుత ఇత్యత ఆహ - అతః అస్మాన్మిథునీభావాత్. ప్రత్యేకం హృదయగ్రంథినా తు దేహేంద్రియమాత్రే అహం మమేతి మోహః. తస్మాత్తు గృహాదిభిర్విషయభూతైః మహాన్మోహో భవేదిత్యర్థః (8)

స్త్రీ పురుష సంయోగముతో సుఖమును అనుభవించుటలో తాపమెలా కలుగును? అనునది తెలుపుచున్నాడు. స్త్రీ పురుషుల కిరువురకు ప్రత్యేకమైన (వేరువేరు) దేహాభిమానమను హృదయగ్రంథి ఉంటుంది. స్త్రీపురుష దాంపత్యభావమేదైతే కలదో దానిని పండితులు దుర్భేద్యమగు రెండవ హృదయగ్రంథిగా తెలిపినారు. దీనివలన జీవికి దేహేంద్రియములకంటే భిన్నమగు గృహము, క్షేత్రము, సుతులు, తనవారు, ధనము మొదలగువానియందు నేను, నాదియను మోహభావము కల్గును. 8

శ్లో॥ యదా మనో హృదయగ్రంథిరస్య
కర్మానుబంధో ద్రఢిమా శ్లథీత ।
తదా జనస్సంపరివర్తతేऽస్మాన్ముక్తః
పరం యాత్యతిహాయ హేతుమ్ ॥ 9

టీ:- కదా తర్హి తస్య నివృత్తిరత ఆహ - యదేతి. యదాస్య జనస్య కర్మభిరనుబద్ధో దృఢో మనోరూపో హృదయగ్రంథిః శిథిలో భవేత్.

మరి దాని నివృత్తి ఎప్పుడనగా తెలుపుచున్నాడు. జీవికి ఎప్పుడైతే కర్మసంబంధియగు దృఢమగు మనోరూప హృదయగ్రంథి శిథిలమగునో అపుడు దాంపత్య భావమునుండి నివృత్తి కల్గును. సంసారహేతు భూతమగు అంహంకారము వదిలి సమస్త బంధములనుండి విముక్తుడై పరమపదప్రాప్తి నొందును. 9













తదాస్మాన్మిథునీభావాత్. నివర్తతే తతశ్చ హేతుం అహంకారం. త్యక్త్వా ముక్తస్సన్. పరంపదం యాస్యతి. 9

హేతుభూతమగు అంహంకారమును వదిలి అని చెప్పబడినది. ఆ అహంకార త్యాగమునకు ఇరువదిఐదు సాధనములను నాలుగు శ్లోకములతో తెలుపుచున్నాడు. జ్ఞానినగు నా యందు గురుభక్తితో, సేవాతత్పరతతో, తృష్ణాత్యాగముతో, సుఖదుఃఖాది ద్వంద్వ సహిష్ణుత్వము తో, జీవి అంతటను దుఃఖమునే అనుభవించునను జ్ఞానముతో తత్త్వజిజ్ఞాసతో తపస్సుతో (వ్రతానుష్ఠానాదులు) కామ్యకర్మత్యాగముతో (అహంకార రూపలింగశరీరమును వదులును అను పదమూడవ శ్లోకముతో అన్వయము.) 10

శ్లో॥ హంసే గురౌమయిభక్త్యానువృత్త్యా
వితృష్ణయా ద్వంద్వ తితిక్షయా చ ।
సర్వత్ర జంతోర్వ్యసనావగత్యా
జిజ్ఞాసయా తపసేహా నివృత్త్యా ॥10

టీ:- హేతు మతిహాయేత్యుక్తం స తత్ర పంచవిశతిసాధనాన్యాహ - చతుర్భిః. హంస ఇతి. హంసే మయి గురౌ భక్తిః సేవా. అనువృత్తిః తత్పరతా. విగతతృష్ణయా సర్వత్ర లోకాంతరేఽపి వ్యసనావగత్యా దుఃఖానుసంధానేన ఈహానివృత్త్యా కామ్యకర్మత్యాగేన. 10

ఓ పుత్రులారా ఎల్లప్పుడూ నా కొరకే కర్మలు చేయుచూ, నా కథాశ్రవణముతో, నా భక్తుల సాంగత్యముతో, నా గుణకీర్తనతో ద్వేష త్యాగముతో, సమభావనతో, శాంతితో శరీర గృహాదులయందు నేను, నాది అను భావము వదులుట. (అహంకార రూపలింగ శరీరమును వదులును అను 13 శ్లోకముతో అన్వయము.) 11

శ్లో॥ మత్కర్మభిర్మత్కథయా చ నిత్యం
మద్దేవసంగాద్గుణకీర్తనాన్మే ।
నిర్వైరసామ్యోపశమేన పుత్రా
జిహాసయా దేహ గేహాత్మబుద్ధేః ॥ 11

టీ:- మదితి. మదర్థైః కర్మభిః అహమేవ దేవో యేషాం తైః. సంగాత్. హే పుత్రాః దేహ గేహయోరాత్మబుద్ధేః అహం మమేతి బుద్ధేః. 11











శ్లో॥ అధ్యాత్మయోగేన వివిక్తసేవయా
ప్రాణేంద్రియాత్మాభిజయేన సధ్ర్యక్ ।
సచ్ఛ్రద్ధయా బ్రహ్మచర్యేణ శశ్వ
దసంప్రమాదేన యమేన వాచామ్ ॥ 12

టీ:- అధ్యాత్మేతి. అథ అధ్యాత్మయోగేన అధ్యాత్మశాస్త్రాభ్యాసేన సధ్ర్యక్ సమ్యక్. అసంప్రమాదేన కర్తవ్యస్యాపరిత్యాగేన. 12

శ్లో॥ సర్వత్ర మద్భావవిచక్షణేన
జ్ఞానేన విజ్ఞాన విరాజితేన ।
యోగేన ధృత్యుద్యమసత్త్వ యుక్తో
లింగం వ్యపోహేత్కుశ లోహమాఖ్యమ్ ॥ 13

టీ:- సర్వత్రేతి. సర్వత్ర మద్భావః. మద్భావనా. తత్ర విచక్షణేన నిపుణేన. విజ్ఞాన విరాజితేన అనుభవపర్యంతేన జ్ఞానేన. యోగేన సమాధినా. ధృత్యుద్యమ సత్త్వయుక్తః ధైర్యప్రయత్నవివేకయుక్తస్సన్. అహంకారాఖ్యముపాధిం వ్యపోహేత్ నిరస్యేత్. 13

అధ్యాత్మశాస్త్రాభ్యాసముతో ఏకాంతవాసముతో, ప్రాణేంద్రియ మనోసంయమనముతో, శ్రద్ధతో, పూర్ణ బ్రహ్మచర్యముతో, కర్తవ్య కర్మల నొదలకుండుటతో, వృథా వాక్కులు లేకుండా నియమముతో. (అహంకార రూపలింగ శరీరమును వదులును అను 13 శ్లోకముతో అన్వయము.) 12

అంతట నేనున్నాననే ఆలోచనతో, అనుభవముతో కూడిన విజ్ఞానముతో, యోగసాధనతో, ధైర్యప్రయత్న వివేక యుక్తుడై అహంకారమను పేరుగల ఉపాధిని తొలగించుకొనవలెను. 13











శ్లో॥ కర్మాశయం హృదయగ్రంథి బంధ
మవిద్యయా సాదితమప్రమత్తః।
అనేన యోగేన యథోపదేశం
సమ్యగ్వ్యపోహ్యోపరమేత యోగాత్ ॥ 14

టీ:- తతస్సాధనాదుపరమేదిత్యాహ – కర్మాశయమితి. కర్మాణ్యాశేరతే యస్మిన్. యోగేన ఉపాయేన. యద్యపి ఫలే సిద్ధే. సాధనోపరమ ఏవ. తథాపి యావద్దేహపాతం తావదభ్యాసశంకా వారణాయోక్తం. 14

కర్మాశయమగు అజ్ఞానము వలన కలిగిన హృదయ గ్రంథి రూపబంధమును, జీవి అప్రమత్తుడై పైన చెప్పబడిన 25 సాధనముల ఉపాయముతో త్రెంచుకొనవలెను. ఆ పిదప సాధనామార్గము నుండియు ఉపరమించవచ్చును. దేహపాతము వరకు సాధన కొనసాగించవలయునా అన్న శంకను నివారించుటకు ఫలసిద్ధి, హృదయగ్రంథి బంధము తెగిన పిదప సాధన చేయవలసిన అవసరము లేదని తెలుపబడినది. (అది తనకు తానే తెలుసుకుంటాడు) 14

శ్లో॥ పుత్రాంశ్చ శిష్యాంశ్చ నృపో గురుర్వా
మల్లోకకామో మదనుగ్రహార్థః ।
ఇత్థం విమన్యురనుశిక్షేదతద్ జ్ఞాన్
న యోజయేత్కర్మసు కర్మమూఢాన్ ॥ 15

టీ:- పుత్రానితి. పుత్రాన్ పితా. శిష్యాన్ గురుః. నృపః ప్రజాః. ఏవమను శిక్షయేత్ మమలోకం యః కామయతే. యద్వా – మదనుగ్రహా ఏవ అర్థో యస్య. విమన్యుః శిక్షతస్యాప్యకరణే కోపశూన్యః అతద్ జ్ఞాన్ అతత్త్వవిదుషః న తు కర్మమూఢాన్ అనాది పుణ్యాపుణ్య రూపకర్మణా మూఢానజ్ఞాన్. 15

నా లోకమును కోరు, నా అనుగ్రహమభిలషించు తండ్రి పుత్రులకు, గురువు శిష్యులకు, రాజు ప్రజలకు ఇలాంటి శిక్షణనే ఇవ్వవలయును. అజ్ఞానమున వారు ఆ శిక్షణ ననుసరించిక కర్మనే పురుషార్థముగా భావించినచో, వారిని కోపగించక వారికి నచ్చచెప్పి వారిని కర్మల నుండి నివృత్తులను చేయవలయును. అలాగే కర్మయందు చిత్తములేని వారిని, ఆత్మతత్త్వము నెరిగిన వారిని కర్మలయందు ప్రవర్తింపజేయరాదు. 15












చూ॥ కంయోజన్మనుజోऽర్థం లభేత నిపాతయన్నదృశం హి గర్తే ।
లోకస్స్వయం శ్రేయసి నష్ట దృష్టిర్యోऽర్థాన్ సమీహేత
నికామకామః అన్యోన్య వైరం సుఖలేశ హేతోరనంత
దుఃఖం చనవేదమూఢః ॥16

టీ:- అన్యథోపదేశే ప్రత్యవాయమాహ - కమితి. మనుజః కార్య కర్మసు పురుషం యోజయన్. గర్తే సంసారకూపే. తం పాతయతి. స మనుజః కిమర్థం పురుషార్థం లభేత. న కమపీత్యర్థః. శ్రేయోబుద్ధ్యా కర్మసు మూఢాన్న యోజయేదిత్యేతదుపాదయతి - లోక ఇత్యారభ్య త్రిభిః. నష్టదృష్టిత్వే హేతుః - య ఇతి నీ కామం అతిశయేన కామో యస్య. 16

ఆ విధముగా నుపదేశించని ఎడల కలుగు ప్రత్యవాయమును తెలుపుచున్నాడు. పురుషుడు, కామ్యకర్మలలో నియోగించబడిన ఏమి ఫలమొందును? ఏమీ లాభము లేదు. ఆ విధముగా నియోజించుట గుడ్డివాణ్ణి గోతిలో పడవేసినటులే యగును. అందువలన శ్రేయో బుద్ధి కలిగించువారై, మూఢులను కర్మలలో నియోగించకూడదని తెలుపుచున్నాడు. లోకము (జనులు) తమ శ్రేయస్సుపైన దృష్టిలేనివారై అనేక రకములగు భోగములపై కోరికలలో నిమగ్నులై, క్షణిక సుఖము కొరకు అన్యోన్య వైరము కలవారై,మూఢులై, దానివలన కలుగు నరకాది అనంత దుఃఖములను తెలిసికొనజాలరు. 16

శ్లో॥ కస్తం స్వయం తదభిజ్ఞోవిపశ్చిద
విద్యాయామన్తరే వర్తమానమ్ ।
దృష్ట్వా పునస్తం సఘృణః కుబుద్ధిం
ప్రయోజయేదుత్పథగం యథాంధమ్ ॥ 17

టీ:- క ఇతి. తమీదృశం కు బుద్ధిం దృష్ట్వా, తత్రైవ కస్తం ప్రవర్తయేత్? న కోऽపి. ఉత్పథేన గచ్ఛంత మంధం తేనైవ గచ్ఛేతి కో బ్రూయాత్? 17

తప్పు దారిలో నడుస్తున్న గ్రుడ్డి వానిని చూచిన కంటిచూపున్న వ్యక్తి ఆతనిని అదే మార్గములో పయనించుమని బోధించనిరీతిలో అజ్ఞానముతో దుఃఖమువైపు పయనించెడి కుబుద్ధిని గాంచి, దయా బుద్ధిగల జ్ఞాని ఆ మార్గముననే పయనించుమని ఎలా చెప్పగలడు? చెప్పదని భావము. 17








శ్లో॥ గురుర్న సస్స్యాత్స్వజనో న సస్స్యాత్పితా
న సస్స్యాజ్జననీ న సా స్యాత్ ।
దైవం న తత్స్యాన్న పతిశ్చసస్స్యాన్న
మోచయేద్యస్సముపేత మృత్యుమ్ ॥ 18

టీ:- గురురితి. సముపేతః సంప్రాప్తో మృత్యుస్సంసారో యేన తం. తతో భక్తమార్గోపదేశేన యో న మోచయేత్. స గుర్వాదిర్నభవతీత్యర్థః. యద్వా – యస్తం మోచయితుం న శక్నుయాత్. స తస్య గుర్వాదిర్న స్యాదితి నిషేధః. తస్య పితాన స్యాదితి. పుత్రోత్పత్తౌ యత్నో న కార్య ఇత్యర్థః. దైవం దేవతా న స్యాదితి. పూజా న గ్రాహేత్యర్థః. ఏవ మన్యదపి ద్రష్టవ్యం. 18

శ్లో॥ ఇదం శరీరం మమ దుర్విభావ్యం
సత్త్వం హి మే హృదయం యత్ర ధర్మః ।
పృష్ఠే కృతో మే యదధర్మ ఆరాధతో
హి మామృషభం ప్రాహురార్యాః ॥ 19

టీ:- ఏవం మోక్షధర్మానుపదిశ్య. భ్రాతృశుశ్రూషాలక్షణం. స్పర్ధాది నివృత్తయే తేషాం జన్మకథనపూర్వకమాహ – ద్వాభ్యాం. ఇదమితి. ఇదం మనుష్యాకారం శరీరం. మమదుర్విభావ్యం అవితర్క్యం మదిచ్ఛా

సముచితమైన భక్తి మార్గోపదేశము చేసి మృత్యుస్వరూపమైన సంసారమును విడిపించని గురువు గురువే కాడు. స్వజనులు (మిత్రుడు, హితుడు) మిత్రులేకారు, తండ్రి తండ్రేకాడు, తల్లి తల్లి కాదు. అనగా కేవలము పుత్రోత్పత్తి ప్రయత్నమే తల్లిదండ్రుల కార్యము కాదు. అటువంటి వారు వివాహితులు కావడమూ వ్యర్థమే. అలాగే ముక్తిమార్గముజూపని దేవతలు దేవతలేకారు. అనగా వారిని పూజించి కూడా ప్రయోజనములేదు. భావమేమనగా ముక్తిమార్గము చూపని గురువు, తండ్రి, దైవము, స్వజనాదులు విడిచిపెట్టదగిన వారు. 18

ఈ విధముగా మోక్షధర్మములను తెలిపి స్పర్థను నివారించుట కొరకు భాతృసేవాలక్షణములను వారి జన్మకథన పూర్వకముగా రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు. ఈ నా శరీరము అవితర్క్యమైనది. అనగా నా ఇచ్ఛతో ప్రాప్తమైనది. నా శరీరము ప్రాకృతమైన మానవుని శరీరమువలె కర్మాధీనముగా వచ్చినది కాదు. ధర్మ నివాసమగు నా హృదయము శుద్ధసత్త్వము. ఏలనన నేను అధర్మమును దూరము నుండియే తొలగించితిని. అనగా అధర్మము నన్ను సమీపించజాలదు. అందువలననే నన్ను ఋషభుడు అని (శ్రేష్ఠుడని) పలికిరి. 19









విలసితం.న త్వాహం ప్రాకృతో మనుష్య ఇత్యర్థః.మే హృదయం తు సత్త్వం. కిం తద్ధృదయం.యత్ర ధర్మః తచ్ఛుద్ధ సత్త్వమిత్యర్థః. కుతః యత్ యస్మాత్. మయా అధర్మో దూరాదేవ పృష్ఠే కృతః ఉత్సారితః. అత ఏవ మామృషభం శ్రేష్ఠం ప్రాహుః. 19

శ్లో॥ తస్మాద్భవంతో హృదయేన జాతస్సర్వే
మహీయాం సమముంసనాభమ్ ।
అక్లిష్టబుద్ధ్యా భరతం భజధ్వం
శుశ్రూషణం మే భరణం ప్రజానామ్ ॥ 20

టీ:- తస్మాదితి. భవంతశ్చ హృదయేన శుద్ధసత్త్వమయేన జాతాః తస్మాన్మత్సరం హిత్వా మహత్తమం సనాభం సోదరం. భజధ్వం. నను త్వత్పుత్రత్వాత్త్వాం వయం భజేమ రాజపుత్రత్వాత్ప్రజాశ్చ పాలయామేతి చేదత ఆహ - తదేవ మే శుశ్రూణం. ప్రజానాం చ పాలనం. భరతానువృత్త్యైవ సర్వం కృతం స్యాదితి భావః. 20

చూ॥ భూతేషువీరుద్భ్య ఉదుత్తమాయే సరీసృపాస్తేషు సబోధనిష్ఠాః ।
తతో మనుష్యాః ప్రమథాస్తతోఽపి
గంధర్వసిద్ధా విబుధానుగా యే ॥ 21

ఓ పుత్రులారా! మీరు ఇట్టి శుద్ధసత్త్వమయమగు హృదయము నుండి జన్మించితిరి. అందువలన మాత్సర్యము వదిలి, గొప్పవాడు, మీ సోదరుడగు భరతుని సేవించండి. మేము మీ పుత్రులము కనుక మిమ్ములనే సేవిస్తాము. రాజ పుత్రులమగుటచే ప్రజలను పాలించెద - మని అనవద్దు. ఆ భరతుని సేవించడమే నా సేవ, ప్రజాపాలన అవుతుంది. అనగా భరతుని అనుసరించినచో సమస్తమొనరించినట్ల - గునని భావము. 20

ఇప్పుడు బ్రాహ్మణులుకూడా సేవించదగిన వారనే ఆశయముతో ఆ బ్రాహ్మణులకు అందరికంటే గొప్పతనమును ఐదు శ్లోకములలో తెలుపుచున్నాడు. చేతనాచేతనములగు ప్రాణులలో స్థావరములగు



టీ:- ఇదానీం బ్రాహ్మణాశ్చ సేవ్యా ఇత్యాశయేన తేషాం సర్వేభ్య శ్త్రైష్ఠ్యమాహ - పంచభిః. భూతేష్వితి. భూతేషు చేతనాచేతనేషు. వివిధం రోహంతీతి వీరుధః స్థావరాః ఉత్ ఉచ్చైః. అతిశయేనోత్తమాః తేభ్యోऽపి. యే సరీసృపాః సర్పంతీతి. జంగమాః తే ఉత్తమా ఇతి. సర్వత్రానుషంగః. తేష్వపి సబోధనిష్ఠాః బోధసహితా స్థితిర్యేషాం పశ్వాదీనాం. తే కీటాదిభ్యః. తతః తేష్వపి మనుష్యాః. తతోऽపి ప్రమథాః భూతప్రేతాదయః. తతోऽపి గంధర్వాః. తతస్సిద్ధాః. తతోऽన్యే విబుధానుగాః కిన్నరాదయః. 21

వృక్షములు గొప్పవి. వాటికంటే జంగమములగు సరీసృపములు శ్రేష్ఠములు. ఆ కీటాదులకంటే జ్ఞానముగల పశ్వాదులు ఉత్తమములు. వాటిలో మనుష్యులు శ్రేష్ఠులు. వారికంటే భూతప్రేతాది ప్రమథ గణములు, వారికంటే గంధర్వులు, గంధర్వులకంటే సిద్ధులు, సిద్ధులకంటే దేవతానుయాయులగు కిన్నరాదులు శ్రేష్ఠులు. 21

శ్లో॥ దేవా సురేభ్యో మఘవత్ప్రధానా
దక్షాదయో బ్రహ్మసుతాశ్చ తేషామ్ ।
భవః పరస్సోऽథ విరించవీర్య
స్సమత్పరోऽహం ద్విజదేవదేవః ॥ 22

టీ:- దేవేతి. తేభ్యః సురాః. దేవాః అసురేభ్యః. సంధిరార్షః. దేవాశ్చ మఘవత్ప్రధానాః. దేవేభ్యః ఇంద్రః శ్రేష్ఠ ఇత్యర్థః. తతోऽపి బ్రహ్మసుతాః దక్షాదయః. తేషాం మధ్యే భవః పరః శ్రేష్ఠః. స భవః విరించస్య వీర్యం శక్తిః కారణం యస్య విరించవీర్యః తతస్తజ్జనకత్వాత్. విరించతః తతః పరత ఇత్యర్థః. స విరించో మత్పరః. అహం పరో యస్య ద్విజదేవాః బ్రాహ్మణా ఏవ దేవాః పూజ్యా యస్య సోऽహం. 22

కిన్నరులకంటే అసురులు, వారికంటే దేవతలు, దేవతలలో ఇంద్రుడు శ్రేష్ఠుడు. అతనికంటే బ్రహ్మసుతులగు దక్షాది ప్రజాపతులు శ్రేష్ఠులు. వారిలో రుద్రుడు శ్రేష్ఠుడు. బ్రహ్మనుండి జనించిన రుద్రుని కంటే బ్రహ్మ శ్రేష్ఠుడు. ఆ బహ్మ నా నుండి ఉద్భవించి నన్ను ఉపాసించును. కావున ఆ బ్రహ్మకంటే నేను శ్రేష్ఠుడను. నా కంటే పూజ్యులుగా నేను భావించెడి బ్రాహ్మణులు శ్రేష్ఠులు. 22





శ్లో॥ న బ్రాహ్మణైస్తులయే భూతమన్య
త్పశ్యామి విప్రాః కిమతః పరం తు ।
యస్మిన్నృభిః ప్రహుతం శ్రద్ధయాహ
మశ్నామి కామం న తథాగ్ని హోత్రే ॥ 23

టీ:- నేతి. బ్రాహ్మణైరన్యద్భూతం న తులయే న సమం పశ్యామి. అతో బ్రాహ్మణాత్పరం భూతం కిం పశ్యామి న కించత్. విప్రా ఇతి. తత్రత్యానాం బ్రాహ్మణానాం సంభోధనం సమస్యైవాభావాదధికం కుతస్త్యమిత్యర్థః. తత్ర హేతునాహ – సార్ధ ద్వాభ్యాం. యస్మిన్ బ్రాహ్మణే శ్రద్ధయా ప్రకర్షేణ హుతమన్నాది కామం యథేచ్ఛం అహమశ్నామి. 23

శ్లో॥ ధృతా తనూరుశతీ మే పురాణీ
యేనేహ సత్త్వం పరమం పవిత్రమ్ ।
శమో దమస్సత్యమనుగ్రహశ్చ
తపస్తితిక్షానుభవశ్చ యత్ర ॥ 24

టీ:- ధృతేతి. మే తనూః మూర్తిః వేదాఖ్యా, యేన బ్రాహ్మణేన ఇహ లోకే ధృతా యత్ర చ బ్రాహ్మణే సత్త్వాదయోऽష్టౌ గుణాస్సంతి. తతః పరం కిం పశ్యామీత్యన్వయః. 24

అచట ఆ సభలోనుండెడి బ్రాహ్మణుల సంబోధిస్తూ, ఓ విప్రులారా! నేను వేరే ఏ ప్రాణిని కూడా బ్రాహ్మణులతో సమానముగా భావించను. మరి వారికంటే అధికులనెక్కడ తలంచెదను? అనగా బ్రాహ్మణులే సర్వశ్రేష్ఠులు. జనులు శ్రద్ధాపూర్వకముగ బ్రాహ్మణులకు సమర్పించెడి భోజనాదులను నేను గ్రహించినటుల (భుజించునటుల) అగ్నిలో ఆహుతిచేయబడిన దానిని గూడా గ్రహించను. (అనగా అగ్నిహోత్ర ముఖముగా సమర్పించిన హవ్య ద్రవ్యముకన్నా బ్రాహ్మణ ముఖముగా సమర్పించిన భోజనాదులే నాకు శ్రేష్ఠమైనవని తాత్పర్యము) 23

ఏ బ్రాహ్మణులు ఈ లోకములో అధ్యయానాదులతో వేదరూప మగు నా శరీరమును ధరించుచున్నారో మరియు పరమ పవిత్రములగు సత్త్వము, శమము, దమము, సత్యము, దయ, తపస్సు, ఓరిమి, జ్ఞానములనెడి ఎనిమిది గుణములు ఏ బ్రాహ్మణులందు కలవో వారికంటే గొప్పవారు ఎవరుందురు. 24


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ











శ్లో॥ మత్తోऽప్యనంతాత్పరతః పరస్మా
త్స్వర్గాపవర్గాధిపతేర్న కించిత్ ।
యేషాం కిముస్యాదితరేణ తేషా
మకించనానాం మయి భక్తి భాజామ్ ॥ 25

టీ:- నిస్పృహత్వమాహ - మత్త ఇతి. మత్తోऽపి యేషాం న కించిత్ ప్రార్థనీయమస్తి తేషామితరేణ రాజ్యాదినా. కిముస్యాన్న కిమపి తదేవం బ్రాహ్మణ సంమానం విధాయ ఇదానీం సర్వభూతసంమానం విధత్తే. 25

శ్లో॥ సర్వాణిమద్ధిష్ణ్యత యాభవద్భిశ్చరాణి భూతాని సుతాధ్రువాణి
సంభావితవ్యాని పదేపదే వో వివిక్త దృగ్భిస్తదుతార్హణంమే ॥26

టీ:- సర్వాణీతి. హే సుతాస్సర్వాణి జంగమాని స్థావరాణి చ భూతాని మదధిష్టానతయా తత్ వో యుష్మాభిస్సంమాననీయాని పదే పదే క్షణే క్షణే వివిక్తా పూతా మత్సరాదిరహితా దృష్టిర్యేషాం తైః. తదేవ హి మమార్హణం. 26

బ్రాహ్మణులు నిస్పృహులైనవారు, వారు అచంచల భక్తిగల వారు, బ్రాహ్మాదుల కంటే శ్రేష్ఠుడను, అనంతుడను, స్వర్గాప వర్గముల నొసగెడి వాడను అగు నా నుండి కూడా ఏమీ కోరరు. అలాంటి వారికి రాజ్యాదులతో ఏమి ప్రయోజనము? అని ఈ విధముగా బ్రాహ్మణ సమానత్వమును తెలిపి ఇపుడు సర్వభూత సమానత్వమును తెలుపుచున్నాడు. 25

ఓ పుత్రులారా! తిరిగే తిరగని ప్రాణులు (స్థావర, జంగమ) నా స్థానములని, అధిష్ఠాన రూపంలోని నేనే అలా ఉన్నానని శుద్ధమైన వివేచనతో తెలిసికొని, పదే పదే మీచేత పూజింపతగి యున్నవి. ఈ విధముగా ఆచరించడమే నన్ను పూజించుట యగును. 26














శ్లో॥ మనోవచోదృక్కరణే హి తస్య
సాక్షాత్కృతం మే పరిబర్హణం హి ।
వినా పుమాన్ యేన మహావిమోహా
త్కృతాంతపాశాన్న విమోక్తుమీశేత్ ॥ 27

టీ:- సర్వకర్మణాం ఈశ్వరార్పణం విధత్తే. మన ఇతి. మనో వచో దృశాం అన్యేషాం కరణానామీహితస్య వ్యాపారస్య మే పరిబర్హణం ఆరాధనమేవ సాక్షాత్కృతంఫలం యేన పరిబర్హణేన వినా కాలపాశాత్ విమోక్తుం న ఈశేత్ ఈశితా సమర్థో న భవేత్. 27

సర్వకర్మలను ఈశ్వరార్పణ చేయడమును తెలుపుచున్నాడు. మనస్సు, వాక్కు, దృష్టి, మిగతా ఇంద్రియములచే చేయబడు కర్మలను నాకర్పణ చేయుటయే నా పూజ అనబడును. ఈ విధముగా సర్వమును నాకర్పించని మానవుడు మహామోహమయమగు కాలపాశము నుండి విముక్తుడు కాడు. 27

**శ్రీ శుక ఉవాచ**

చూ॥ స ఏవ మనుశాస్యాత్మజాన్ స్వయమనుయమనుశిష్టానపి లోకానుశాసనార్థం మహానుభావః - పరమసుహృద్భగవాన్ ఋషభాపదేశ ఉపశమశీలానాముపరతకర్మణాం మహామునీనాం భక్తిజ్ఞాన వైరాగ్య లక్షణం పారమహంస్యం ధర్మముపశిక్షమాణస్స్వ తనయశత జ్యేష్ఠం పరమభాగవతం భగవజ్జనపరాయణం భరతం ధరణి పాలనాయాభిషిచ్య స్వయం భవన ఏవోర్వరిత శరీర పరిగ్రహ ఉన్మత్త ఇవ గగన పరిధానః ప్రకీర్ణ కేశః ఆత్మన్యారోపితా హవనీయో, బ్రహ్మావర్తాత్ప్రవవ్రాజ. 28

**శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.**

తన పుత్రులు స్వయముగానే సుశిక్షుతులైనను లోకులకు తెలియుట కొరకై ఈ విధముగా శాసించి, మహానుభావుడు పరమ సుహృద్భా వములుగల ఋషభదేవుడు ఉపశమనశీలురు నివృత్తి పరాయణులగు మహామునులకు భక్తి, జ్ఞాన వైరాగ్య రూపమగు పరమహంస ధర్మములను బోధించదలచి, తన వందమంది పుత్రులలో జ్యేష్ఠుడు, భాగవతోత్తముడు, భగవద్భక్తిపరాయణుడగు భరతుని భూపరిపాలనకై అభిషేకించి అగ్నులను ఆత్మారోపణ చేసికొని విరక్తుడై, సర్వమువదిలి శరీరమాత్రుడై ఉన్మత్తునివలె దిగంబరుడై విరబోసిన కేశములుకలవాడై బ్రహ్మావర్త దేశము విడిచి వెళ్ళెను. 28

టీ:- ఏవమితి. స్వత ఏవ శిక్షితానపి లోకాననుశాసనార్థం అనుశాస్య








మునీనాం పారమహంస్యధర్మముపశిక్షయిష్యన్ భరతమభిషిచ్య ఋషభ ఇత్యుపదేశో నామ యస్య స భగవాన్ బ్రహ్మావర్తాత్స్వదేశాత్ ప్రవవ్రాజేత్యన్వయః ఉర్వరితః అవశిష్టః. శరీరమాత్రపరిగ్రహో యస్య. 28

చూ॥ జడాంధబధిర మూక పిశాచోన్మాద ఇవావధూత వేషోऽభిభాష్యమాణోऽపి. జనానాం గృహీత మౌనవ్రతస్తూష్ణీం బభూవ. 29

టీ:- జడేతి.అభిభాష్యమాణోऽపిజనానాంమధ్యేజడాదివద్వర్తమానః తూష్ణీం బభూవ. అవధూతస్యైవ వేషో యస్య. 29

ఆ ఋషభదేవుడు జడునివలె, గ్రుడ్డివానివలె, మాటలురానివానివలె, చెవిటివానివలె, పిశాచమువలె, ఉన్మత్తునివలె ఉంటూ జనులచేత పలుకరించబడియు పలుకక మౌనముతో పట్టించుకోనట్లే సంభాషించక ఉండెడివాడు. 29

చూ॥ తత్ర తత్ర పుర గ్రామాకర ఖేటవాట శిబిర వ్రజ ఘోష సార్థ గిరి వనాశ్రమాదిష్వనుపథమవనిచరాపశదైః పరిభూయమానో మక్షికాదిభిరివ వనగజః - తర్జన తాడన మేహన ష్ఠీవన గ్రావశకృద్రజః ప్రక్షేపణ పూతివాతదురుక్తై స్తదవిగణయన్నేవాసత్సంస్థాన ఏతస్మిన్ దేహోపలక్షణే సదపదేశే - ఉభయానుభవస్య రూపేణ స్వనుహిమావస్థానేనాసమారోపితాహం మమాభిమానత్వాదవిఖండితమనాః పృథివీమేకచరః పరిబభ్రామ. 30

టీ:- తత్రేతి. తత్ర తత్రపురుషాదిషు అనుపథం మార్గేమార్గే అవనిచరాపశదైః. దుర్జనైః తర్జనాదిభిః పరిభూయయానోऽపి. తదవిగణయన్నేవైకచరః ఏకాకీ సన్ పృథివీం పరిబభ్రామేత్యన్వయః.

అచటనచట పట్టణములు, గ్రామములు, గనులు, రైతులుండే గ్రామములు, పుష్పవాటికలు, సేనానివాసములు, పర్వత గ్రామములు, గోశాలలు, గోపాలకుల పల్లెలు, యాత్రిక నివాసములు, ఋష్యాశ్రమములలో సంచరిస్తుండగా మార్గములలో దుర్జనులు, భయపెట్టుట, కొట్టుట, పైనమూత్రించుట, కాకరించి ఉమ్ముట, రాళ్ళు విసురుట, దుమ్ము చల్లుట, అపానవాయువులనొదలుట, శాప వాక్యములు పలుకుట మొదలగు వికరచేష్టలతో అడవి ఏనుగును ఈగలు బాధించినట్లు అవమానపరచినా. వాటిని లెక్కించక మిథ్యాభూతమగు అపదేశమాత్రముతో (చిత్తను నామమాత్రమగు) సత్తనబడెడి దేహమున అభిమానములేనివాడైనందున కార్యకారణరూప సంపూర్ణ ప్రపంచము-










తత్ర పురం పట్టణం గ్రామః హట్టహీనః. ఆకరః ఖనిః. ఖేటకః కృషీవలగ్రామః. వాటః పుష్పవాటికా శిబిరం సేనాయాః ఆవాసస్థానం. వ్రజో గవాం స్థానం. ఘోషః గోపానాం సార్థః. యాత్రికజనసంఘాతస్య ఆశ్రమః ఋషీణాం తర్జనం భయజననం తాడనం ప్రహారః. మేహనం ఉపర్యుపరి మూత్రణం. ష్ఠీవనం పూత్కృత్యశ్లేష్మప్రక్షేపః. గ్రావ్ణః శకృతః రజసశ్చ ప్రక్షేపః. పూతివాతః అధోవాయుః. దురుక్తం శాపః. ఏతైః అగణనేదృష్టాంతః. మక్షికాభిరివేతి తత్రైవహేతుః – అసతి మిథ్యాభూతే సంస్థానే సన్నివేశే దేహ ఇత్యుపలక్షణం ఆకారో యస్య సదిత్యపదేశ మాత్రం యస్య తస్మిన్నిరభిమానత్వాత్కేన హేతునా ఉభయోస్సదసతోః యోఽనుభవతః తత్స్వరూపేణ యత్ స్వమహిమ్న్యవస్థానం తేన అత ఏవాఖండితం మనో యస్య స పరిబభ్రామ. 30

నకు సాక్షియై ఉండి కూడా స్వస్థితిలో ఉన్నవాడై అఖండమగు చిత్తవృత్తితో ఈ భూమండలమున ఏకాకియై సంచరించుచుండెను. 30

చూ॥ అతి సుకుమారకరచరణోరస్థ్సల విపుల బాహ్వంసగళ వదనాద్యవయవ విన్యాసః –ప్రకృతి సుందరః –స్వభావహాససుముఖో నవ నళిన దళాయమాన శిశిర తారారుణాయతనయన రుచిరః, సదృశ సుభగ కపోల కర్ణ కంఠనాసో విగూఢ స్మిత వదన మహోత్సవేన పురవనితానాం మనసి కుసుమశ రాసనముపదధానః, పరాగవలంబ మాన జటిల కుటిలాలక కపిశ కేశభూరి భారోఽవధూత మలినేన నిజ శరీరేణ గ్రహ గృహీత ఇవాదృశ్యత. 31

అతి సుకుమార సుందరములగు కాళ్ళు, చేతులు, వక్షఃస్థలము, పొడవైన బాహువులు, భుజములు, గళము, వదనము మున్నగు అవయవముల పొందికతో మిక్కిలి సుకుమారమైనదై స్వభావ సిద్ధమగు చిరునవ్వు కలిగిన ముఖశోభ కలిగి అప్పుడే విచ్చుకున్న కమలపు రేకులతో సమానమగు శిశిర తారలవలె తాపమును హరించెడి, కొంచెము అరుణత కలిగి విశాలమైన నేత్రముల కాంతితో స్వభావ సుందరుడగు, సమానములగు సుందరములగు చెక్కిళ్ళు, శ్రోత్రములు




టీ:- అతి సుకుమారేతి. స చ తదా(గ్రహగృహీత ఇవాదృశ్యత. తత్ర హేతుః - పరాక్ పరితః. అవలంబమానాశ్చ తే జటిలాశ్చ కుటిలాశ్చ కపిశాశ్చ కేశాః తేషాం భూరి భారో యస్య. అవధూతమనాదృతం అత ఏవ మలినం నిజశరీరం తేన. కథంభూతోऽప్యేవమదృశ్యత అతి సుకుమారాణి కరచరణోరస్థలాని తథా. విపులా బాహ్వాదయః త ఏవా వయవాః తేషాం విశిష్టో వ్యాసస్సన్నివేశో యస్య స తథా. ప్రకృత్యైవ సుందరః. స్వభావసిద్ధో హాసః తేన శోభనం ముఖం యస్య స తథా నవ నళిన దళవదాచరతీ యే శిశిరతారే. తాపహారిణీ కనీనికే. అరుణే ఆయతే నయనే తాభ్యాం రుచిరః తథా. సదృశాః అన్యూనాధికాః సుభగాశ్చ కపోలకర్ణకంఠ నాసికాః యస్య తథా; విగూఢ స్మితం యద్వదనం. సత్యమహోత్సవేన విభ్రమేణ పురాంగనానాం మనసి కామముద్దీపయన్. ఏవం భూతోऽపి తథా అదృశ్యతేత్యన్వయః. 31

కంఠము, ముక్కులతో సుందరుడగు, చిరునవ్వుతో కూడిన ముఖము కలిగిన తన విభ్రమముతో, దృఢమైన శరీరముతో పురస్త్రీల మనస్సులలో కామదేవుని ఉద్దేపింపచేసే ఆ ఋషభదేవుడు అవధూతయై కపిశ వర్ణము గలిగి, వంకరములు తిరిగి, జడలు కట్టిన వ్రేలాడుతున్న వెంట్రుకలతో, పట్టించుకోకపోవుటచే మలినమై శరీరము కలిగి గ్రహముతో పీడించబడుచున్న వాడివలె కనబడెను. (భూతము పట్టిన వానివలె ఉండెను) 31

చూ॥ యర్హి వావ స భగవాన్ లోకమిమం యోగస్యాద్ధా ప్రతీపమివా చక్షాణస్తత్ప్రతి క్రియా కర్మబీభత్సితమితి వ్రతమాజగరమాస్థితశ్శయాన ఏవాశ్నాతి పిబతి ఖాదత్యవమేహతి హదతే స్మ - వేష్టమాన ఉచ్చరితా దిగ్ధోద్దేశః. 32

టీ:- యర్హీతి. యర్హి యదా. స భగవానృషభః. లోకం జనం యోగ

ఆ ఋషభదేవుడు ఈ జనులు సాధనకు విఘ్నరూపులని తలచి వీరినుండి తనను కాపాడుకోవడానికి భయంకరముగా ప్రవర్తించడమే ఉపాయమని తలచి అజగరవృత్తిని ధరించి, పడుకొనియే భుజించుచు, జలపానము చేయుచు, పడుకొనియే మూత్రించుచు, మల విసర్జన కావించుచు, (అజగర వ్రతమనగా ఒకేచోట నుండి ప్రారబ్ధకర్మ ననుభవించుట) దేహము నిండా మలము అంటునట్లుగా మలములో








స్యాద్ధా. సాక్షాత్ప్రతీపం ప్రతిపక్షం. ఆచక్షణాః. పశ్యన్ బభూవ. తస్య ప్రతిక్రియా కరణం చ నిందితమితి చాచక్షాణః. తదా ఆజగరం వ్రతమాస్థితస్సన్. శయాన ఏవాశ్నాతిస్మేత్యన్వయః. ఆజగరం వ్రతం నామైకత్రైవ స్థిత్వా ప్రారబ్ధకర్మోపభోగః. అవమేహతి మూత్రయతి. హదతే పురీషముత్స్ృజతి ఉచ్చరితే పురీషే. వేష్టమానః విలుఠన్ తేనైవాదిగ్ధాః ఆలిప్తాః ఉద్దేశాః దేహ ప్రదేశాః యస్య. 32

పొరలుచుండెను 32

చూ॥ తస్య హ్యాయం పురీషసురభి సౌగంధ్యోవాయుర్దిశో దశయోజనం సమంతాత్సురభీచకార. 33

టీ:- బీభత్సమీవాశంక్యాహ - తస్యేతి. తస్య పురీషస్య. సురాభిణా గంధేన. సౌగంధ్యం యస్య సః. 33

బీభత్సకర్మయనే శంకను తొలగించుచున్నాడు. ఆతని మలము గొప్ప సుగంధముగా నుండెను. ఆతని మలము నుండి వెలుబడిన సుగంధము చుట్టూరా పదియోజనముల వరకు గాలిని సుగంధ భరితముగా చేయుచుండెను 33

చూ॥ ఏవం గో మృగ కాక చర్యయా వ్రజంస్తిష్ఠన్నాసీనశ్శయానః కాక మృగ గో చరితః పిబత్యవమేహతి స్మ. 34

టీ:- ఏవమితి. ఏవం గవాది చర్యయా పానాది కరోతిస్మ. తదేవాహ - వ్రజన్నిత్యాది. కాక మృగ గవామివ అన్యదపి చరితం వృత్తిర్యస్య. 34

ఆ ఋషభదేవుడు ఈ విధముగా గోవులు, మృగములు, పక్ష్యాదుల రీతిగా ప్రవర్తించదలచి గో మృగ కాకాదులవలె నడచుచు, నిలబడి, కూర్చొని, పడుకొని భోజన, పాన, మూత్ర, మల విసర్జనాది క్రియలనాచరించుచుండెను. 34








చూ॥ ఇతి నానాయోగచర్యాచరణో భగవాన్ కైవల్యపతి ఋషభో విరతపరమానందానుభవ ఆత్మని సర్వేషాం భూతానామాత్మభూతే భగవతి వాసుదేవే – ఆత్మనోవ్యవధానానంతరోదరభావేన సిద్ధసమస్తార్థ పరిపూర్ణ యోగైశ్వర్యాణి వైహాయసమనోజవాంతర్ధాన పరకాయ ప్రవేశ దూర గ్రహణశ్రవణాదీని యదృచ్ఛయోపగతాని నాంజసా నృపహృదయే నాభ్యనందత్. 35

టీ:- ఇతీతి నానాయోగచర్యా మాచరతీతి తథా లోకయత్రా పరిహారాయ యోగిభిరేవం వర్తితవ్యమితి ప్రదర్శనాయ. తథా కృతవాన్. వస్తు తస్తు భగవాన్ యతః పరమః మహాన్. ఉత్తరోత్తరశతగుణత్వేన ఉక్తో య ఆనందః తస్యానుభవః స్వరూపః. కించ శ్రీవాసుదేవే ఆత్మనః అవ్యవధానేన అభేదేన.న విద్యతే అన్యేషామివ. అంతరా మధ్యే. ఉదరస్య దేహోపాధేర్భావస్తేన. నిత్యనివృత్తో పాధిత్వేనేత్యర్థః. స్వత ఏవ సిద్ధైస్సమస్తైరర్థైః ఫలైః. పరిపూర్ణాని యోగైశ్వర్యాణి నాభ్యనందత్. వైహాయసం ఖేచరత్వం. మనోజవం మనస ఇవ దేహస్య వేగం. దూరగ్రహణం దూరదర్శనం. హే నృప హృదయేన మనసా. 35

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, పంచమోऽధ్యాయః**

ఓ పరీక్షిద్రాజా! ఋషభ భగవానుడు పరమహంసలకు ఆదర్శ భూతమగు త్యాగమును బోధించుటకై అనేక విధములగు యోగచర్యల నాచరించెను. కైవల్యప్రతియగు ఋషభదేవుడు నిరంతరము సర్వశ్రేష్ఠ మగు ఆనందానుభూతినొందుతూ సర్వప్రాణులకు ఆత్మస్వరూపుడగు భగవంతుడగు వాసుదేవునియందు తనకు అభేదభావముతో దేహోపాధి భావము తొలగినవాడై స్వయముగ సిద్ధించిన ఫలములగు పరిపూర్ణ యోగసంపదలగు ఆకాశగమన, మనోజవ, అంతర్ధాన, (అదృశ్య భావము) ఇతరశరీరప్రవేశ, దూరగ్రహణ, దూరదర్శనాది సిద్ధులను మనస్సులో గూడా ఆదరించలేదు.. 35

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు ఐదవ అధ్యాయము సమాప్తము.**










ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## షష్ఠోऽధ్యాయః

శ్లో॥ షష్ఠే లీలాభిమానస్య దేహత్యాగక్రమాభిధా ।
ప్రదహంతం దవాగ్నిం యః పశ్యన్నపి న పశ్యతి ॥

## 6వ అధ్యాయము

ఈ ఆరవ అధ్యాయమున అభిమానరహితుడై, జ్వలించెడి దావాగ్నిని చూస్తూకూడా అగ్నిగా చూడనివానివలె ప్రవర్తించిన ఋషభదేవుని దేహత్యాగము వర్ణించబడుచున్నది.

**రాజో ఉవాచ**

చూ॥ న నూనం భగవన్నాత్మారామాణాం యోగసమీరత జ్ఞానానలావ భర్జిత కర్మబీజనామైశ్వర్యాణి పునః క్లేశదాని భవితుమర్హంతి యదృచ్ఛ యోపగతాని. 1

టీ:- యోగైశ్వర్యాణి నాభ్యనందదిత్యుక్తం తత్ర పృచ్ఛతి - నేతి. హే భగవన్. యోగేన సమీరతముద్దీపితం యజ్జ్ఞానం తదేవానలః. తేనావభర్జితాని దగ్ధాని కర్మబీజాని రాగాదీని యైః తేషాం యదృచ్ఛయా ప్రాప్తాని యోగైశ్వర్యాణి పునః క్లేశదాని భవితుం నార్హంతి. అతః కిమితి నాభ్యనందదిత్యర్థః. 1

**రాజు ఈ విధముగా పలికెను**

స్వతహాగా సిద్ధించిన యోగైశ్వర్యములను ఋషభదేవుడాదరించ లేదను విషయమును వినిన పరీక్షిద్రాజు ఇటుల ప్రశ్నించుచున్నాడు.

హే భగవన్ శుకదేవా! యోగముతో ఉద్దీపితమగు జ్ఞానాగ్నితో రాగాది కర్మబీజములు దగ్ధములు కాగా ఆత్మారాములగు వారికి వాటంతట అవియే వచ్చే యోగైశ్వర్యములు తిరిగి క్లేశమును కలుగజేసెడివి కావుకదా! మరి ఎందువలన ఋషభదేవుడు ఆ యోగైశ్వర్యములను అనాదరించెను. 1

**శ్రీ శుక ఉవాచ**

చూ॥ సత్యముక్తం కిం త్విహ వా ఏకే తు మనసో విస్రంభ మనవ స్థానస్య శఠకిరాత ఇవ సంగచ్ఛంతే. 2

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

పరీక్షిద్రాజు శంకించిన దానిని అంగీకరించి పరిహరించు చున్నాడు. నీవు పలికినది సత్యమే. కానీ బుద్ధిమంతులు చంచలమగు మనస్సునందు విశ్వాసముంచరు ఎలాననగా మృతములైన




టీ:- అంగీకృత్య పరిహరతి - సత్యమితి. ఏకే తు బుద్ధిమంతః. అనవస్థానస్య చంచలస్య మనసః విశ్వాసం న సంగచ్ఛం తే న సమ్యక్ప్రాప్నువంతి. శఠః కిరాతో యథా మృతేష్వపి మృగేషు శఠే కిరాతే యథా మృగా ఇతి. సప్తమ్యంతం. పాఠాంతరే శఠః వంచకః కిరాతః. వణిక్. వ్యవహర్తరి యథా తస్మిన్ వా వ్యవహర్తా యథా విశ్వాసం న యాతీత్యర్థః. పాక్షికోऽపి దోషో వర్జనీయ ఇత్యుపదేష్టుం నాభ్యనందదితి భావః. 2

మృగములందు కుత్సితుడగు వేటగాడు విశ్వాసముంచనటుల (లేక) వంచకుడగు వణిజుని యందు వ్యవహర్త విశ్వాసముంచనటుల విశ్వాసముంచరు. ఏ కొంచము దోషమునైనా గూడా వదలదగినదేయని తెలుపుటకే వాటినాదరించ లేదు. 2

చూ॥ తథాచోక్తం. శ్లో. "న కుర్యాత్కర్హిచిత్సఖ్యం మనసి హ్యనవస్థితే ।
యద్విస్రంభాచ్చిరాచ్చీర్ణం చస్కందతప ఐశ్వర్యమ్ ॥ 3

టీ:- నేతి. యద్విసంభ్రాత్ యస్య విశ్వాసాత్. చిరాచ్చీర్ణం బహుకాలసంచితం తపః. చస్కంద సుస్రావ ఐశ్వరం విష్ణోర్మోహినీరూప దర్శనేన. యద్వా ఈశ్వరాణాం సమర్థానామపి. సౌభరి ప్రభృతీనాం తపః. 3

ఇదే విషయము ఇంకా ఇలా చెప్పబడినది చంచలమగు మనస్సుతో సఖ్యము (విశ్వాసము) చేయకూడదు. మనస్సునందు విశ్వాసముంచిన శంకరునకు సైతము విష్ణువు యొక్క మోహినీరూప దర్శనముతో బహుకాల సంచితమగు తపస్సు నశించెను. (కరిగి పోయెను) అటాగే సమర్థులగు సౌభరి మొదలగు మునుల యొక్క తపస్సు కూడా మనస్సుపై విశ్వాసముంచుటచే నష్టమాయెను. 3

శ్లో॥ నిత్యం దదాతి కామస్య ఛిద్రం తమను యేరయః ।
యోగినః కృతమైత్రస్య పత్యుర్జాయేవ పుంశ్చలీ ॥ 4

టీ:- నిత్యమితి. తత్ర హేతుః కృతవిశ్వాసో యోయోగీ, తదీయం

జారిణి యగు భార్య జారులకావకాశము కల్పించి పతిని వధించినటుల, మనస్సుపైన విశ్వాసముంచిన యోగి యొక్క మనస్సు కామమునకు, దానిననుసరించెడి క్రోధాది శత్రువులకు అవకాశము కల్పించి అతనిని భ్రష్టునిగా చేయును. 4

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ






మనః కామస్య తమను యే అరయః తేషాం చ ఛిద్రమవకాశం. దదాతి యథా కృతవిశ్వాసస్య పత్యుః పుంశ్చలీ జాయా జారాణామ వకాశం దత్వా పతిం ఘాతయతి, తథా మనోऽపి కామాదిభిర్యోగినం భ్రంశయతీత్యర్థః. 4

శ్లో॥ కామో మన్యుర్మదో లోభశ్శోకమోహ భయాదయః ।
కర్మబంధశ్చ యన్మూలస్స్వీకుర్యాత్కో ను తద్బుధః ॥ 5

టీ:- అరీన్ కథయన్ ఉపసంహరతి-కామ ఇతి. యన్మూలః యన్ని మిత్తోభవతి. తత్ మనః కోనుబుధః స్వీకుర్యాత్? స్వాధీనమితి మన్యేత. 5

శత్రువులను తెలుపుచూ ఉపసంహరించుచున్నాడు. కర్మబంధమునకు, కామ, క్రోధ, మద, లోభ, శోక, మోహ భయాది శత్రువులకు మూలమగు మనస్సుపైన బుద్ధిమంతుడు విశ్వాస- ముంచడు? అనగా మనస్సు తనకు లోబడినదని తలచడని భావము. 5

చూ॥ చూ. అథైనమఖిలలోకపాలలలామోऽపి విలక్షణైర్జడవద వధూతవేష భాషాచరిత్రైర విలక్షిత భగవత్ప్రభావో యోగినాం సాంపరాయ విధిమనుశిక్షయన్ స్వకళేబరం జిహాసురాత్మన్యాత్మా నమసం వ్యవహిత మనర్థాంతరభావేనాన్వీక్షమాణ ఉపరతానువృత్తి రుపరరామ. 6

టీ:- ప్రాసంగికం సమాప్య ప్రస్తుతమాహ - అథేతి. అఖిలానాం లోకపాలానాం లలామో మండనభూతోऽపి. ఉపరతా బాదితా.

ప్రాసంగిక విషయమును ముగించి ప్రస్తుత విషయమును తెలుపుచున్నాడు. ఋషభదేవుడు సమస్త లోకపాలురకు అలంకార రూపుడై యుండికూడా జడునివలె వివిధములగు అవధూత వేషముతో, మాటలతో, చేష్టలతో భగవత్ప్రభావమును కనుపించనీయక యోగులకు దేహత్యాగ విధిని బోధించుటకై శరీరమును వదలదలచి తన అంతః కరణములో అభేదరూపముతోనున్న పరమాత్మను వ్యవధాన రహితముగా తనకంటే అభిన్నునిగ కాంచుచూ (ఏకంగాచూస్తూ) విషయవాసనలను వదిలి దేహాభిమానమును వదిలెను. 6







విషయానువృత్తిర్యస్మాత్సః ఉపరరామ దేహాభిమానం జహౌ. విలక్షణైః అనేక ప్రకారైః, అవధూతవేషాదిభిః న విలక్షితో భగవత్ప్రభావో యస్మిన్ సాంపరాయవిధిం దేహత్యాగ ప్రకారం, ఆధారాధేయభావవ్యావృత్త్యర్థ మాహ - అనర్థాంతరభావేన అభేదేన. ఉపాసనా వ్యావృత్త్యర్థమాహ - అసంవ్యవహితం వ్యవధానరహితం. 6

చూ।। తస్య హ వా ఏవముక్తలింగస్య భగవత ఋషభస్య యోగమాయా వాసనయా దేహ ఇమాం జగతీమభిమానాభాసేన చంక్రమమాణః. 7

టీ:- తస్యేతి. మనసా స్వయం త్యక్తేఽప్యభిమానే, కేనాపి సంస్కారేణ.దేహః ప్రచలతి యథా కులాలచక్రం సోయమభిమానాభాసః తేన స చ జీవన్ముక్తో నావిద్యావాసనాయా భవతీతి, తతో విశేషమాహ - యోగమాయావాసనయేతి. 7

చూ।। ఏకదా తు కోరకణవంకపటకుటకాన్ దక్షిణకర్ణాటకాన్
దేశాన్ యదృచ్ఛయోపగతః కుటకాచలోపవనే ।
ఆస్య కృతాశ్మ కబళ ఉన్మాద ఇవ
ముక్తమూర్ధజో సంవీత ఏవ విచచార ॥ 8

కులోలునిచేత తిప్పబడుచున్న కుమ్మరిసారె కులాలుడు తిప్పడము ఆపిన పిదపకూడా తిరుగుతుంది. అటులనే దేహాభిమానము నుండి విముక్తుడైన ఋషభదేవుని శరీరము యోగ మాయయొక్క వాసనాబలముతో కేవలమభిమానాభాసముతో పృథివిపై తిరుగుచుండెను. జీవన్ముక్తుడగు అతడు అజ్ఞాన వాసనతో తిరగడంలేదని తెలుపుటకు యోగమాయ వాసనతో అని తెలుపబడినది. 7

ఒకసారి ఆ ఋషభదేవుడు కోరకణవంకపటకుటములన బడెడు (కొంకణదేశము). దక్షిణ, కర్ణాటక దేశములందు తిరుగుతూ వెడలి కుటకాచల సమీపమున ఉన్మత్తునివలె ఏదో వాసనాబలముతో నోటిలో రాళ్ళను నమలుచూ (అశ్మకబలుడై) వెంట్రుకలు విడిపోగా నగ్నుడై తిరుగుచుండెను. 8










టీ:- ఏకదేతి. కోరకణాదీన్ దేశాన్ గతస్సన్. కయాపి వాసనయా. ఆస్యే కృతః ఆత్మకబళోయేన. అసంవీతః నగ్నః. 8

చూ॥ అథ సమీరవేగధూత వేణువికలజాతోగ్ర దావానలస్తద్వనమాలేలిహానస్సహ తేన దదాహ. 9

టీ:- అథేతి. సమీర వేగేన విధూతానాం కంపితానాం, వేణూనాం సంఘర్షణేన, జాతః ఉగ్రో దావానలః, ఆలేలిహానస్సర్వతో గ్రసన్. 9

ఆ పిమ్మట గాలి వేగానికి వెదురు కర్రలు ఒకదానితో మరొకటి రాపిడి చెంది, వాటి నుండి జనించిన ఉగ్రమగు దావాగ్ని ఆ అరణ్యమంతటిని కాల్చుచుండగా ఆ అరణ్యముతోబాటు ఋషభదేవుడు కూడా కాల్చబడెను. 9

చూ॥ యస్య కిలా చరితముపాకర్ణ్య కరోకవంకపటానాం రాజార్హన్నామోపశిక్ష్యకలావధర్మ ఉత్కృష్యభవితవ్యేన విమోహితః స్వధర్మ పథమకుతోభయమపహాయ కుపథ పాషండమసమంజసం నిజమనీషయా మందోమనుజాన్ సంప్రవర్తయిష్యతే. 10

టీ:- అవధూత వేషేణ ఋషభదేవః తత్ర గత ఇత్యేతస్య సూచకమాహ - యస్యేతి. యస్య కిలాశ్రమాతీతమనుచరితం, తద్దేశ వాసిభ్యః ఉపాకర్ణ్య, అర్హన్నితి నామ యస్య స రాజా, స్వయం తదుపశిక్ష్యశిక్షిత్వా, కుపథశ్చాసౌ పాషండశ్చతం. నిజమనీషయా సంప్రవర్తయిష్యత ఇత్యన్వయః. తత్ర హేతుః. కలావిత్యాది, భవితవ్యేన ప్రాణినాం పూర్వసంచితపాపఫలేన. 10

ఋషభదేవుడు అవధూత వేషముతో ఆ దేశమునకు వెడలినాడు అనుదానికి సూచన తెలుపుచున్నాడు. ఋషభదేవుని యొక్క ఆశ్రమాతీతమగు చరితను కోరకవంక పటముల దేశవాసుల ద్వారా వినిన అర్హుడు అను పేరుగల ఆ దేశపురాజు స్వయంగా తానే ఋషభదేవుని వలె ఆచరించడం ప్రారంభించెను. (అర్హత లేకున్నా అర్హుడను పేరుగల రాజు (గ్రహించెను) కలికాలమున ప్రాణుల పూర్వసంచిత పాపఫలముతో మోహితుడై (అజ్ఞానములో మునిగి) బుద్ధిహీనుడై తన ధర్మమార్గమును వదిలి, నిర్భయముగా అనుచితమగు పాషండ మతమును ప్రవర్తింపచేయ గలడు. (ప్రచారము చేయగలడు). 10









చూ॥ యేన హవావకలౌ మనుజాపశదా దేవమాయా విమోహితాః స్వవిధినియోగ శౌచచారిత్ర విహీనా దేవహేళనాన్యపవ్రతాని నిజేచ్ఛయా నిగృహ్ణానా అస్నానానాచమనాశౌచకేచ కేశోల్లుంఛనాదీని కలినాధర్మ బహుళేన ఉపహతధియో బ్రహ్మబ్రాహ్మణా యజ్ఞపురుషలోకవిదూషకాః ప్రాయేణ భవిష్యంతి. 11

టీ:- యేనేతి. యేన ప్రవర్తకేన. మనుజేష్వపశదాః నికృష్టాః స్వవిధినా నియోగో యస్మిన్ శౌచచారిత్రే. తద్విహీనాః దేవావజ్ఞారూపాణ్య స్నానాదీని కుర్వతా నిగృహ్ణానాః వేదాదీనాం దూషకాశ్చ భవిష్యంతి. 11

చూ॥ తే చైవ హ్యర్వాక్తనయా నిజలోకయాత్రయాంధ పరంపరయా తథైవాశ్వస్తాః స్వయమేవ తమస్యంధేనిపతిష్యంతి. 12

టీ:- తత్ఫలం చాంధం తమః ప్రాప్స్యంతీత్యాహ - తేచేతి. అర్వాక్తనయా అవేదమూలయా, నిజలోకయాత్రయా స్వేచ్ఛయా కృతప్రవృత్త్యా ఆశ్వస్తాః కృతవిశ్వాసాః. 12

చూ॥ అయమవతారో రజసోపప్లుతకైవల్యోపశిక్షార్థః ।
తస్యానుగుణాన్ శ్లోకాన్ గాయంతి ॥ 13

ఆ అర్హద్రాజు పాషండమతము ప్రవర్తింపచేయగా కలియుగమున బుద్ధిహీనులగు అధమమానవులు దేవమాయా మోహితులై శాస్త్ర విహితములగు శౌచ ఆచారహీనులై దేవహేళనాది దుర్వ్రతములను తమ ఇచ్ఛతో గ్రహించి, కలి ప్రభావముచే స్నాన, ఆచమన, శౌచములు లేకుండుట, వెంట్రుకలు కత్తిరించుకొనుట మొదలగు కర్మలందు పాషండధర్మముల నాచరిస్తూ వేద, బ్రాహ్మణ, యజ్ఞ పురుషులను నిందించెడి వారగుదురు. 11

ఆ పాషండ కర్మలకు ఫలము అంధతామిస్రాది నరక ప్రాప్తియని తెలుపుచున్నాడు. మానవులు నూతనములగు ఈ అవైదిక స్వేచ్ఛాకృత ప్రవృత్తిలో గుడ్డిగా విశ్వాసముంచి దానిద్వారా స్వయముగా ఘోర నరకములలో పడగలరు. 12

అటులైనచో అనర్థ కారకమగు ఈ ఋషభావతార మెందుల కనగా తెలుపుచున్నాడు.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








టీ:- నను తర్హ్యనర్థకారీ కిమర్థోSయమృషభావతారః. తత్రాహ - అయమితి. రజోవ్యాప్తానాం మోక్షమార్గోపశిక్షణార్థః, తస్య కైవల్యోప శిక్షణస్యానురూపాన్. 13

రజోగుణముతోనిండిన వారికి మోక్షమార్గమును ఉపదేశించుట కొరకే ఈ ఋషభావతారము. పండితులు తదనుగుణముగా ఈ శ్లోకములను గానము చేయుచుందురు. 13

శ్లో॥ అహో భువస్సప్తసముద్రవత్యా
దీ్వపేషు వర్షేష్వతి పుణ్య మేతత్ ।
గాయంతి తత్ర త్యజనా మురారేః
కర్మాణి భద్రాణ్యవతారవంతి ॥ 14

సప్తసముద్రవతియగు భూమండలములోని సమస్త ద్వీపములలో వర్షములలో ఈ భారతవర్షము గొప్ప పుణ్యవంతమైనది. ఏలననగా ఈ భారతవర్షమందలి జనులు శ్రీహరియొక్క మంగళమయములగు ఋషభాద్యవతారముల చరిత్రను గానమొనర్చెదరు. 14

టీ:- అహో ఇతి. అధికం పుణ్యం యస్మిన్ ఏతత్ భారతం వర్షం ఋషభాద్యవతార యుక్తాని కర్మాణి. 14

శ్లో॥ అహోను వంశో యశసా వదాతః
ప్రియవ్రతో యత్ర పుమాన్ పురాణః ।
కృతావతారః పురుషస్స ఆద్యశ్చ
చార ధర్మం యదకర్మ హేతుమ్ ॥ 15

భళా! పురాణపురుషుడగు ప్రియవ్రతుని వంశము మిక్కిలి శుద్ధమైనది, కీర్తివంతమైనది. ఈ వంశమున ఆదిపురుషుడగు శ్రీమన్నారాయణుడు ఋషభదేవుడుగా అవతరించి మోక్షకారకమగు ధర్మమును ఆచరించెను. 15

టీ:- అహో ఇతి. ప్రియవ్రతస్య వంశః అవదాతః శుద్ధః. యత్ర వంశే. యత్ యస్మాత్ అకర్మ మోక్షః. తస్య హేతుం ధర్మం చచార. 15

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.








చూ॥ కోన్వస్య కాష్ఠామవరోऽనుగచ్ఛే
న్మనోరథేనాప్యభవస్య యోగీ ।
యో యోగమాయాస్స్పృహయత్యుదస్తా
హ్యసత్తయా యేన కృత ప్రయత్నాః ॥ 16

టీ:- క ఇతి. అపరం కో ను యోగీ అస్య కాష్ఠాం దిశమప్యనుగచ్ఛేత్ యో యోగీ యేన ఋషభేణ అసత్తయా అవస్తుత్వేన. ఉదస్తాః నిరస్తాః యోగమాయాస్సిద్ధీః. వాంఛతి కథంభూతాః. కృతః ప్రయత్నో యాసు. తదర్థం ప్రయత్నం చ కరోతీత్యర్థః. యద్వా - కథంభూతాః. కృతః ప్రయత్నాః సేవితుముద్యతా అపీత్యర్థః. 16

చూ॥ ఇతి హస్మసకలవేదలోకదేవ బ్రాహ్మణ గవాం పరమ గురో ర్భగవత ఋషభాఖ్యస్య విశుద్ధచరితేరితం పుంసాం సమస్త దుశ్చరితాభిహరణం పరమమహామంగళాయనమిదమనుశ్రద్ధయోపచిత యాను శ్రుణోత్యా శ్రావయత్యవహితో భగవతి తస్మిన్ వాసుదేవే. ఏకాంతతో భక్తిరనయోరపి సమనువర్తతే. 17

టీ:- ఇతీతి. విశుద్ధం చరితం యత్ ఈరితం కథితమ్. తత్ సమస్తం దుశ్చరితం. అభితో హరతీతి తథా. పరమమహా మంగళానామ యనం చ. అవహితస్సన్. అనయోరపి శ్రోతృ శ్రావయిత్రోః అవిశేషణ భక్తిః సమ్యగనువృత్తా భవతీత్యర్థః. 17

ఋషభుడు అసత్యములుగా, శ్రేష్ఠములుకాని వానిగా భావించి తిరస్కరించిన యోగసిద్ధుల కోసం ఇతర యోగులు నిరంతరం ప్రయత్నం చేస్తుంటారు. అయినా వారికి లభ్యముకాని యోగ సిద్ధులు ఋషభుని ఆశ్రయించినా ఆయన వాటిని ఆదరించలేదు. ఏ యోగి కూడా జన్మరహితుడు, భగవానుడగు ఋషభదేవుని మార్గములో ఇలా పయనించగలడా?(అనుసరించలేదని తాత్పర్యము). 16

ఓ పరీక్షిద్రాజా! సమస్త వేదములకు, లోకములకు, దేవతలకు, బ్రాహ్మణులకు, గోవులకు పరమగురువు అగు ఋషభదేవుని పరిశుద్ధమైన చరిత్రను తెలిపితిని. మానవుల యొక్క సమస్త దుష్కర్మలను (పాపములను) హరించెడి, సమస్త మంగళములకు స్థానమగు ఈ చరితమును మిక్కిలి శ్రద్ధతో మనస్సుపెట్టి ఎవరు విందురో, వినిపించెదరో వారిరువురకు భగవంతుడగు వాసుదేవుని యందు అనన్యభక్తి (ఏకాంతభక్తి) కలుగును. 17



  

చూ॥ యస్యామేవ కవయ ఆత్మానమవిరతం వివిధ వృజిన సంసార పరితాపోపతప్యమానమనుసవనం స్నాపయంతస్తయైవ నివృత్యా పరయాహ్యపవర్గమాత్యంతికం పరమపురుషార్థమపి స్వయమాసాదితం నో ఏవాద్రియంతే భగదీయత్వేనైవ పరితస్సమాప్తసర్వార్థాః. 18

టీ:- భక్తేః పరమపురుషార్థత్వమేవాహ - యస్యామితి. యస్యాం భక్తావేవ. న తు యోగాదిషు అనుసవనం అవిరతం ఆత్మానం స్నాపయంతః. స్వయమాసాదితం అప్రార్థితం భగవతా స్వయమేవ దీయమానమపి అనాదరే హేతుః. భగవదీయత్వే నైవ పరితస్సమాప్తాః సమ్యక్ప్రాప్తాః. సర్వే పురుషార్థాః యైస్తే. 18

భక్తియే పరమ పురుషార్థమని తెలుపుచున్నాడు.

భక్తులైనవారు అనేక రకాల పాపాలతో కూడిన సంసార తాప త్రయముతో బాధపడుచున్ననూ, భగవంతుడు తనుకు తానుగా మోక్షమును ప్రసాదించిననూ అంగీకరించరు. ఎందుకనగా భక్తుడుగా ఉండటమే అన్ని సిద్ధులు పొంది, కోరికలన్నీ తీరినట్లుగా భావిస్తారు. (18)

చూ॥ రాజన్ పతిర్గురులంభవతాం యదూనాం
దైవం ప్రియః కులపతిః క్వ చ కింకరో వః ।
అస్త్వేవమంగ భగవాన్ భజనాం ముకుందో
ముక్తిం దదాతి కర్హిచిన్న తు భక్తియోగమ్ ॥ 19

టీ:- నను భగవతోకతిసులభత్వ దర్శనాన్మోక్షస్య చాతి దుర్లభత్వా ద్భక్తేరియమతిస్తుతిరేవేత్యాశంక్యాహ – రాజన్నితి. హే రాజన్ భవతాం పాండవానాం యదూనాం చ పతిః పాలకః. గురురుపదేష్టా. దైవం

భగవద్దర్శనము అతి సులభమైనది. మోక్షము అతి దుర్లభమైనది. అందువలన పైన చెప్పిన భక్తియే పరమ పురుషార్థమనుట అతిశయోక్తియే అగుననగా తెలుపుచున్నాడు.

ఓ పరీక్షిద్రాజా! పాండవులకు, యాదవులకు శ్రీకృష్ణుడు ప్రభువు, గురువు, ఉపాస్యదైవము, స్నేహితుడు, వంశాధిపతి, నియంత, ఒక్కొక్కసారి సేవకుడు. (రాయబారములో పాండవులకు సేవకుడు) అనగా ఆజ్ఞనువర్తికూడా అయినాడు. ఇదే విధముగా భజించెడి అన్యులకును ముక్తి నొసంగును. కాని అన్నిటికంటే గొప్పదగు సప్రేమ

  






ఉపాస్యః. ప్రియః సుహృత్. కులస్య పతిః నియంతా. కిం బహూనా క్వ చ కదాచిత్. దూత్యాదిషు వః పాండవానాం కింకరోऽపి. ఆజ్ఞానువర్తీ అస్తు నామైవం తథాప్యన్యేషాం నిత్యం నిత్యం భజతామపి ముక్తిం దదాతి. న తు కదాచిదపి స ప్రేమభక్తియోగం. 19

భక్తియోగము సహజముగా నొసగడు. (అంత సులభముగా భక్తి-యోగము అలవడదని భావము) 19

శ్లో॥ నిత్యానుభూతనిజలాభ నివృత్త తృష్ణః
శ్రేయస్య తద్రచనయాచిరసుప్తబుద్ధేః ।
లోకస్య యః కరుణయా భయమాత్మ లోక
మాఖ్యాతవాన్ భగవతే ఋషభాయ తస్మై ॥ 20

ఇంతవరకు వర్ణించబడిన ఋషభావతారమునకు నమస్కరించుచున్నాడు.

నిరంతరము స్వస్వరూపమును అనుభవించుటచే ఆశాపాశము తొలగినవాడు మరియు దేహాదులకొరకై, కోరికలలో మునిగి (విషయ లోలురై) అజ్ఞానముచే ఆవరించబడిన బుద్ధిగల జనులకు దయతో తన అనుభూతులచే ఆత్మావలోకనమును ఉపదేశించిన భగవంతుడగు ఋషభదేవునకు నమస్కారము. 20

టీ:- వర్ణితమృషభావతారం నమస్కరోతి - నిత్యేతి. నిత్యమనుభూతం యన్నిజం రూపం. స ఏవ లాభః. తేన నివృత్తా తృష్ణా యస్య సః. అత ద్రచనయా దేహాద్యర్థం. మనోరథేన శ్రేయసి విషయే. చిరసుప్తా బుద్ధిరస్య తస్య జనస్య కరుణయా నిర్భయమాత్మ స్వరూపం. య ఆఖ్యాతవాన్, తస్మై ఋషభాయ నమః. 20

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, షష్ఠోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు ఆరవ అధ్యాయము సమాప్తము.**








## సప్తమోऽధ్యాయః

శ్లో॥ అధ్యాయానాం త్రయేణైవమృషభాఖ్యానమీరితమ్ ।
అష్టభిర్భరతాఖ్యానమితః ప్రస్తూయతేऽమృతమ్ ॥

సప్తమే భరతో రాజ్యే చిరం యజ్ఞైర్హరిం యజన్ ।
ఆరబ్ధకర్మ నిర్వాణో హరిక్షేత్రేऽభజద్ధరిమ్ ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ భరతస్తు మహాభాగవతో యదా భగవతావనీతల పరిపాల నాయ సంచితితస్తదనుశాసనపరః పంచజనీం విశ్వరూప దుహితర ముపయేమే. 1

టీ:- భరత ఇతి. సంచింతితస్సంకల్పేనైన రాజ్యాదౌ నియుక్తః. 1

చూ॥ తస్యాముహవా ఆత్మజాన్ కార్త్స్న్యేనానురూపానాత్మనః పంచ జనయామాస భూతాదిరివ భూతసూక్ష్మాణి. 2

టీ:- తస్యామితి. ఆత్మనః అనురూపాన్. భూతాదిః అహంకార ఇవ. భూతసూక్ష్మాణీతి సంతతివృద్ధౌ దృష్టాంతః. 2

## 7వ అధ్యాయము

మూడధ్యాయములలో ఋషభదేవుని చరిత్రను తెలిపి ఇచటి నుండి ఎనిమిది అధ్యాయములలో అమృతోపమగు భరత చరిత చెప్పబడుచున్నది. భరతుడు చాలాకాలము రాజ్యపాలన చేస్తూ అనేక యజ్ఞములనాచరించి కర్మమార్గమును వదిలి హరిక్షేత్రములో శ్రీహరిని భజించుట ఈ ఏడవ అధ్యాయమున చెప్పబడుచున్నది.

### శ్రీశుకుడు పలికెను

ఋషభదేవుడు సంకల్ప మాత్రముతో, పరమభాగవతుడగు భరతుణ్ణి, రాజ్యపాలనయందు నియమించగా ఆతని ఆజ్ఞను శిరసా వహించిన భరతుడు రాజ్యపాలన చేస్తూ, విశ్వరూపుని పుత్రికయగు పంచజనిని వివాహమాడెను. 1

భూతాదియగు అహంకారము నుండి శబ్దాది పంచతన్మాత్రలు (భూతసూక్ష్మములు) జనించినటుల భరతునికి పంచజని యందు ఆయన అనురూపులగు అయిదుగురు పుత్రులు జన్మించిరి. 2





చూ॥ సుమతిం రాష్ట్రభృతం సుదర్శనమాచరణం ధూమ్రకేతుమితి అజనాభం నామైతద్వర్షం భారతమితి యత ఆరభ్య వ్యపదిశంతి. 3

టీ:- సుమతమితి. భారతమితి స్వనామ్నాఖ్యాపకత్వేన. ధర్మాద్యతిశయ స్సూచితః. 3

సుమతి, రాష్ట్రభృత్, సుదర్శనుడు, ఆచరణుడు, ధూమ్రకేతువు అను ఐదుగురు భరతుని పుత్రులు. అజనాభమను ఈ దేశము భరతుని పాలన నుండియే 'భారత'మని చెప్పబడుచున్నది. దీనితో ధర్మ విస్తరణము సూచించబడుచున్నది. 3

చూ॥ స బహు విన్మహీపతిః పితృపితామహవదురువత్సలతయా స్వే స్వే కర్మణి వర్తమానాః ప్రజాస్స్వధర్మ మనువర్తమానః పర్యపాలయత్. 4

టీ:- స ఇతి. బహువిత్. సర్వజ్ఞః. 4

సర్వజ్ఞుడగు భరతుడు స్వధర్మములలో నిరతులగు ప్రజలను తన తండ్రి తాతలతో సమానమగు గొప్ప వాత్సల్యభావముతో పరిపాలించెను. 4

చూ॥ ఈజే చ భగవతం యజ్ఞక్రతురూపైః క్రతుభిరుచ్చావచైః శ్రద్ధయా హుతాగ్నిహోత్రః దర్శపూర్ణమాసచాతుర్మాస్య పశుసోమానాం ప్రకృతి వికృతిభిరనుసవనం చాతుర్హోత్రవిధినా. 5

టీ:- ఈజ ఇతి. యజ్ఞాః అయూపాః. క్రతవస్సయూపాః తద్రూపైరుచ్చావచైర్మహద్భిరల్పై ఏశ్చ క్రతుభిః శ్రద్ధయా ఈజే చ. తానేవాహ- ఆహుతాస్స్వాధికారేణాత్మసాత్కృతాః. యే అగ్నిహోత్రా దయః తేషాం ప్రకృతి వికృతిభిః అగ్నిహోత్రాదయో ద్వివిధాః.

భరతుడు హోతా, అధ్వర్యువు, ఉద్గాతా, బ్రహ్మ అను నలుగురు ఋత్విజులచేత చేయించెడు చాతుర్హోత్రవిధితో కూడిన ప్రకృతి వికృతి అను ద్వివిధములగు అగ్నిహోత్ర, దర్శపూర్ణమాస, పశు, సోమాది క్రతువులతో, యజ్ఞములతో, యజ్ఞక్రతురూపుడగు భగవంతుని యథా సమయమున శ్రద్ధాపూర్వకముగా యజనమొనర్చెను. యూపములతో కూడినవి క్రతువులు (యూపమనగా పశువును బంధించెడు స్తంభము) యూపములు లేనివి యజ్ఞములు సమస్తములగు అంగములతో గూడినవి ప్రకృతులు, ఏదేని అంగలోపములు కలవి వికృతులు. 5






సకలాంగయుక్తాః ప్రకృతయః. వికలాంగా వికృతయ ఇతి. త్రైర్ద్విర్ద్విధైరపీష్ట వానిత్యర్థః. అనుసవనమిత్యంతం వా. చాతుర్హోత్రవిధినేత్యంతం వా గద్యం. 5

చూ॥ సంప్రచరత్సునానాయోగేషు విరచితాంగ క్రియేష్వపూర్వం యత్తత్క్రియాఫలం ధర్మాఖ్యం పరే బ్రహ్మణి యజ్ఞపురుషే సర్వ దేవతా లింగానాం మంత్రాణామర్థనియామకతయా సాక్షాత్కర్తరిపరదేవతా -యాం భగవతి వాసుదేవ ఏవ భావయామాన ఆత్మనైపుణ్య మృదిత కషాయో హవిస్స్వధ్వర్యుభిర్గ్రృహ్యమాణేషు సయజమానో యజ్ఞభాజో దేవాంస్తాన్ పురుషావయవేష్వభ్యధ్యాయాత్. 6

టీ:- సంప్రచరత్స్వితి. కించ సంప్రచరత్సు ప్రవర్తమానేషు నానా యోగేషు విరచితా అనుష్ఠితా అంగక్రియా యేషాం తేషు. యదపూర్వం తద్వాసుదేవ ఏవ. భావయమానః చింతయన్. స యజమానః. యజ్ఞభాజో యే దేవాస్సూర్యాదయః తాన్. పురుషస్య వాసుదేవస్యా వయవేషు చక్షురాదిష్వభ్యధ్యాయత్. న తు పృథక్త్వే నేత్యన్వయః. అపూర్వే పక్షద్వయం మీమాంసకానాం తదానీమేవ సూక్ష్మత్వేనోత్పన్న ఫలమేవాపూర్వం కాలాంతరఫలోత్పాదికా కర్మశక్తిర్వేతి. తదుక్తం. శ్లో."యాగాదేవ ఫలం తద్ధిశక్తిద్వారేణ సిధ్యతి. సూక్ష్మం శక్త్యాత్మకం

ఈ విధముగా అంగములు క్రియలతోగూడిన అనేక రకములగు యజ్ఞములనాచరించెడి సమయమున ఋత్విజుల సమూహము ఆహుతి నొసంగుటకై హవిస్సును గ్రహించగా యజమానియగు భరతుడు యజ్ఞభోక్తలగు సూర్యాదిదేవతలను, యజ్ఞపురుషుడగు వాసుదేవుని చక్షురాద్యవయవములయందు ధ్యానిస్తూ అనగా వేరు దేవతలుగా భావించక వాస్తవముగా ఆ పబ్రహ్మస్వరూపుడగు వాసుదేవుడే ఇంద్రాది సమస్త దేవతాప్రకాశములగు మంత్రముల ప్రతిపాద్యమగు దేవతలకు నియామకుడగుటచేత ప్రధానకర్త పరదేవత వాసుదేవునిగానే భావించి అపూర్వమనబడు ఆ యజ్ఞకర్మఫలమగు ధర్మఫలమును పరబ్రహ్మ యజ్ఞపురుషుడనగు వాసుదేవునకే సమర్పించి భగవదర్పణరూపమగు తన నైపుణ్యముచేత రాగదికషాయములు క్షీణించగా యజ్ఞభోక్తులగు సూర్యాది దేవతలను, యజ్ఞపురుషుడగు వాసుదేవుని చక్షురాద్యావయవములుగా ధ్యానించెను. వేరుగా కాదని అర్థము. (అవయవములు, అవయవి అనే వ్యత్యాసము లేకుండా అని తాత్పర్యము)




వాపి ఫలమేవోపజాయత" ఇతి. తదేతదాహ – క్రియాఫలం ధర్మాఖ్యమితి చ. నను యద్యంగ దేవతాః కర్మ ప్రధానమితి మతం తర్హి కర్తృనిష్ఠమపూర్వం స్యాత్? తదుక్తం. శ్లో."కర్మభ్యః ప్రాగయోగస్య కర్మణః పురుషస్య వా, యోగ్యతా శాస్త్రగమ్యా యా పరా సా పూర్వ మిష్యత" ఇతి. అథ దేవతా ప్రధానం కర్మ తు దేవతారాధనార్థం తదా దేవతా ప్రసాదరూపత్వాత్ అపూర్వస్య అథ దేవతాశ్రయత్వమేవ యుక్తం. ప్రోక్షణాద్యపూర్వస్యైవ వ్రీహ్యాద్యాశ్రయత్వం కుతః వాసుదేవాశ్రయమపూర్వం భావ యతి? ఉచ్యతేయది కర్తృనిష్ఠమపూర్వం తర్హి శ్రీవాసుదేవస్యాంతర్యామిణః. ప్రవర్తకత్వేన ముఖ్యకర్తృత్వాత్తదాశ్రయమేవాపూర్వం న తు తత్ప్రయోజ్యమానాశ్రయం 'శాస్త్ర ఫలం ప్రయోకర్తీ'తిన్యాయాత్. అన్యథా ఋత్విజామప్యపూర్వాశ్రయత్వ ప్రసంగాత్. తదేతతాహ – సాక్షాత్కర్తరీతి. దేవతాశ్రయత్వేఽపి శ్రీవాసుదేవాశ్రయత్వమేవేత్యాహ – పరదేవతాయామితి. పరదేవతాత్వే హేతుః. సర్వదేవతాలింగానాం తత్తద్దేవతాప్రకాశకానాం మంత్రాణాం యే అర్థాః ఇంద్రాదిదేవతాః తేషాం నియామకతయా తస్యైవ ప్రసాదనీయత్వాత్ ఫలదాతృత్వాచ్చ యుక్తమేవాపూర్వాశ్రయమిత్యర్థః ఏవం భావన మేవాత్మనో నైపుణ్యం కౌశలం తేన మృదితాః క్షీణాః కషాయాః రాగాదయో యస్య అధ్వర్యుభిరితి బహువచనం నానాకర్మాబి ప్రాయేణ. 6

ఈ అపూర్వ విషయమున మీమాంసాశాస్త్రజ్ఞులలో రెండు పక్షములు కనబడుచున్నవి. క్రియనాచరించిన వెంటనే సూక్ష్మముగా జనించిన ఫలమే అపూర్వమనునది ఒక పక్షము కాలాంతరమున ఫలమును కలుగజేసెడి కర్మ శక్తియే అపూర్వమనునది రెండవపక్షము. ఈ విషయమిటుల చెప్పబడినది. "యాగాదేవ ఫలం తద్ధిశక్తిద్వారేణ సిధ్యతి. సూక్ష్మం శక్త్యాత్మకం వాపి ఫలమేవోపజాయతీతి" యాగము వలననే ఫలప్రాప్తి, ఆ ఫలప్రాప్తి, శక్తి ద్వారా కలుగును. లేక శక్త్యాత్మకమగు సూక్ష్మమగు ఫలమే ఆవిర్భవించును అని చెప్పబడినది. అందువలన ఇది చెప్పుచున్నాడు. (క్రియల ఫలము ధర్మాఖ్యమని) అంగదేవతలే కర్మకు ప్రధానమైనచో అపూర్వము, కర్తృనిష్ఠము (కర్మ చేయువాని యందుండనిది)అగును. ఈ విషయము "కర్మభ్యః ప్రాగయోగస్య కర్మణః పురుషస్య వా, యోగ్యతా శాస్త్రగమ్యా యా పరా సా పూర్వ మిష్యత ఇతి" కర్మకు గాని పురుషునకు గాని కర్మల కంటే ముందులేనట్టి తరువాత కలిగెడి శాస్త్రగమ్యమగు యే యోగ్యత గలదో అదే అపూర్వముఅనబడును అని చెప్పబడినది. దేవతారాధనమునకై దేవతా ప్రధానమగు కర్మ దేవతా ప్రసాదరూపముగావున అపూర్వమునకు దేవతాశ్రయత్వమే తగినది. మరి అటులైన ప్రోక్షణాది ఆ పూర్వమునకు వ్రీహ్యాద్యాశ్రయత్వము చెప్పబడినందున అపూర్వము వాసుదేవాశ్రయ మని ఎటుల భావించెదరు అనగా తెలుపబడుచున్నది.






చూ॥ ఏవం కర్మవిశుద్ధ్యా విశుద్ధసత్త్వసాంతర్హృదయ ఆకాశశరీరే బ్రహ్మణి భగవతివాసుదేవే మహాపురుషోపలక్షణై శ్రీవత్సకౌస్తుభ వన మాలారిదరగదాసిభిరుపలక్షితే నిజపురుషహృల్లేఖితేనాత్మనిపురుష రూపేణవిరోచమాన ఉచ్చైస్తరాం భక్తిరనుదినమేధమానరయాజాయత. 7

టీ:- ఏవమితి. ఏవం భూతాయా కర్మ విశుద్ధా విశుద్ధసత్త్వస్య భక్తి రజాయతేత్యన్వయః. క్వ అంతర్హృదయే య ఆకాశః స ఏవ శరీరస్యాభి వ్యక్తిస్థానం యస్య తస్మిన్ బ్రహ్మణి కీదృశే మహాపురుష రూపస్యోప లక్షణమాకారో యస్య తస్మిన్ కించ శ్రీవత్సాదిభిరుపలక్షితే నిజపు

కర్తృనిష్ఠ అపూర్వమైన యెడల సర్వాంతర్యామియగు వాసుదేవుడు ప్రవర్తకుడగుటచే ముఖ్య కర్త కావున అపూర్వము వాసుదేవాశ్రయమే అగును. శాస్త్రఫలం ప్రయోక్తరి అను న్యాయముతో ప్రయోజ్యుడగు యజమానాశ్రయము కాదు. ఆ విధముగా కాని యెడల ఋత్విజులు కూడా అపూర్వమునకాశ్రయులు కావలసి వచ్చును. అపూర్వము దేవతాశ్రయమైనను వాసుదేవాశ్రయమేయగును. పరబ్రహ్మ స్వరూపుడగు వాసుదేవుడే ఇంద్రాది సమస్త దేవతా ప్రకాశములగు మంత్రప్రతిపాద్యమగు దేవతలకు నియామకుడగుటచేత ఆ వాసుదేవుడే ప్రసాదనీయుడగుటచే వాసుదేవుడే ఫలప్రదాత యగుటచే అపూర్వమున కాశ్రయుడు వాసుదేవుడనుటయే యుక్తము. 6

ఈ ప్రకారమైన విశుద్ధకర్మతో శుద్ధుడగు భరతునకు అంతర్హృద యాకాశములో అభివ్యక్తుడయ్యెడి పరబ్రహ్మ స్వరూపుడు, భగవంతుడగు మహాపురుష లక్షణములగు శ్రీవత్స కౌస్తుభ వనమాలా చక్ర, శంఖ గదాదులతో శోభితుడునగు, నారదాది నిజభక్తుల హృదయములలో లిఖించబడిన చిత్తరువులవలె నిశ్చల భావముతో ఉండెడి పురుష రూపములో, తన ఆత్మలో ప్రకాశించెడి వాసుదేవునియందు దినదినము వేగముగా ప్రవర్ధమానమగు భక్తి కలిగెను. 7







రుషాణాం నారదాదీనాం హృదిలిఖితవత్ నిశ్చింతయా స్థితేన ఉక్తేన పురుషరూపేణాత్మని స్వమనసి విరోచమానే కీదృశీ భక్తిః. అత్యంతాతి శయేన ఏధమానో రయః వేగః ప్రకర్షో యస్యాః. 7

చూ॥ ఏవం వర్షాయుత సహస్రపర్యంతావసితకర్మ నిర్వాణావసరోऽధి భుజ్యమానం స్వతనయేభ్యో రిక్థం పితృపైతామహం యథాదాయం విభజ్య స్వయం సకల సంపన్నికేతాత్స్వనికేతాత్పులహాశ్రమం ప్రవవ్రాజ - యత్ర హవావ భగవాన్ హరిరద్యాపి తత్రత్యానాం.నిజజనానాం వాత్సల్యేన సన్నిధాప్యత ఇచ్ఛానురూపేణ-యత్రాశ్రమపదాన్యుభయతో నాభిభిర్దృషచ్చక్రైశ్చక్ర నదీనామసరిత్ప్రవరా సర్వతః పవిత్రీకరోతి. 8

టీ:- ఏవమితి. ఏవమనువృత్త్యా వర్షాణామయుతాని తేషాం సహస్రం తత్పర్యంతే కాలే అవస్తితః నిశ్చితః. కర్మనిర్వాణావసరః రాజ్య భోగాదృష్ట సమాప్తి సమయో యేన సః అధికృత్య భుజ్యమానం రిక్థం ధనం యథావిభాగం విభజ్య సకలసంపదాం నికేతాత్ ఆశ్రయాత్ స్వ గృహాత్. పులహాశ్రమం హరిక్షేత్రం ప్రవవ్రాజ యత్రక్షేత్రే విద్యాధర కుండేవాత్సల్యం కర్తుం. తేన సన్నిధాప్యతే సన్నిహితః క్రియతే ఇచ్ఛాను రూపేణభక్తనామపేక్షితేన రూపేణ సన్నిహితోభవతీత్యర్థః. ఆశ్రమ స్థానాని ఉభయతః ఉపర్యధశ్చ నాభిర్యేషాం తైః.దృషచ్చక్రైః శిలా మధ్య గతైః చక్రైః చక్రనదీ గండకీసరిత్ సరితాం శ్రేష్ఠా పవిత్రీకరోతి. 8

ఈ విధముగా ఒకకోటి సంవత్సరములు గడిచిపోగా భరత చక్రవర్తి రాజ్యమును భోగించెడి ప్రారబ్ధ కర్మ నశించినదిగా తెలుసుకొని తనచేత ఉపభుజ్యమానమగు, వంశ పరంపరగా వచ్చిన సంపదను తన పుత్రులకు యథా భాగముగ విభజించి ఇచ్చి తాను సకల సంపదలకు స్థానమగు రాజగృహమునువదిలి, హరిక్షేత్రమగు పులహాశ్రమమునకు వెడలెను. ఆ పులహాశ్రమమున విద్యాధర కుండమున శ్రీహరి తన భక్తునకు అభీప్సితమగు రూపముతో భక్త వాత్సల్యముతో ఇప్పటికిని సన్నిహితుడగుచుండును. పైన, కిందను, నాభ్యాకారములగు చిహ్నములుగల శాలిగ్రామ శిలలతో గూడిన శ్రేష్ఠమగు చక్రనదీ (గండకీనది) ఆ ప్రాంతమునంతటిని పవిత్రీకరించు -చున్నది. 8







చూ॥ తస్మిన్ హవావ కిల స ఏకలః పులహాశ్రమోపవనే వివిధ కుసుమ కిసలయ తులసికాంబుభిః - కందమూలఫలోపహారైశ్చ - సమీహమానో భగవత ఆరాధనం వివిక్త ఉపరతవిషయాభిలాష ఉపభృతో పశమః పరాం నిర్వృతిమవాప. 9

టీ:- తస్మిన్నితి ఏకలః ఏకః. ఆరాధనం సమీహమానః కుర్వాణః వివిక్తః శుద్ధః. అత ఏవోపరతో విషయాభిలాషో యస్య ఉపభృతస్సమృద్ధః . ఉపశమో యస్య. 9

ఆ పులహాశ్రమ సమీపారణ్యమున ఏకాంత స్థలమున భరతుడు ఒక్కడే అనేక రకములగు పూలు, చిగురుటాకులు, తులసీ దళములు, నీళ్ళు, కందమూల ఫలాద్యుపహారములతో భగవదారాధన చేస్తూ అంతః కరణములో విషయాభిలాషలేనివాడై శాంతి కలిగి పరమానందము నొందెను. 9

చూ॥ తయేత్థమవిరతపురుష పరిచర్యయా భగవతి ప్రవర్ధమానా నురాగభర ద్రుతహృదయశైథిల్యః ప్రహర్షవేగే నాత్మన్యుద్భిద్యమానరోమ పులకకులక ఔత్కంఠ్యప్రవృత్త ప్రణయబాష్పనిరుద్ధావలోక నయన ఏవం నిజరమణారుణ చరణారవిందానుధ్యానపరిచిత భక్తియోగేన పరిప్లుత పరమాహ్లాదగంభీర హృదయ హ్రదావగాఢ ధిషణస్తామపి క్రియమాణాం భగవత్సపర్యాం న సస్మార. 10

టీ:- తయేతి. ప్రవర్ధమానానురాగస్యభరేణ యత్ ద్రుతం ద్రవీభూతం హృదయం తస్మిన్ శైథిల్యమనుద్యమో యస్య ఆత్మని దేహే ఉద్భిద్య మానం రోమపులకకులం రోమాంచబృందం యస్య కకారస్సమాసాంతః

భరతుడు ఈ విధముగా అనవరతము భగవత్పరిచర్యతో భగవంతునియందు అభివృద్ధినొందు అనురాగవేగముతో హృదయము ద్రవించి శాంతినొందగా ఆనందాతిశయముతో శరీరమున పులకాంకు రములుకలుగగా, ఉత్కంఠతతో నేత్రములలో కలిగిన ఆనంద బాష్పము లతో దృష్టి నిరుద్ధముకాగా తనకు ప్రియతముడగు భగవంతుని అరుణ చరణారవిందముల ధ్యానముతోకలిగిన భక్తియోగము వలన పరమానందముతో హృదయ సరోవరములో బుద్ధి నిమగ్నముకాగా, తాను నియమ పూర్వకముగా చేయు భగవత్పూజను సైతం చేయలేక- పోవుచు తన్మయుడగుచుండెను. 10

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








.ఔత్కంఠ్యాత్ప్రవృత్తేన ప్రయణబాష్పేణ నిరుద్ధోऽవలోకో యయోః తేనయనే యస్య స ఏవం వర్తమానః తామపి భగవత్సపర్యాం న సస్మారేత్యన్వయః. తత్ర హేతుః. నిజరమణస్య స్వప్రీతిదాతుర్యే అరుణే చరణారవిందే తయోరనుధ్యానేన పరిచితస్సమృద్ధః భక్తియోగస్తేన పరిప్లుతః సర్వతో వ్యాప్తః పరమ ఆహ్లాదః పరమానందో యస్మిన్ గంభీరధీర హృదయహ్రదే తస్మిన్నవగాఢానిమగ్నానిధిషణా యస్య. 10

చూ॥ ఇత్థం ధృతభగవద్వ్రత ఐణేయవాససానుసవనాభిషేకార్ద్ర కపిశ జటాకలాపేన చ విరోచమానః - సూర్యర్చాభగవంతం హిరణ్మయం పురుషముజ్జిహానే సూర్యమండలేऽభ్యుపతిష్ఠన్నేతదుహోవాచ. 11

టీ:- ఇత్థమితి. ధృతాని భగవద్వ్రతాని యేన సః భగవంతం సూర్య మండలేऽభ్యుపతిష్ఠన్నేతదుహోవాచేత్యన్వయః. కీదృశః ఏణ్యాః హరిణ్యాః అజినమైణేయం తదేవ వాసః తేన అనుసవనాభిషేకేణ ఆర్ద్రాః కపిశాశ్చ యాః కుటిలా జటాః తాసాం కలాపేన చ విరోచమానః సూర్యప్రకాశకయా రుచా హిరణ్మయం. శ్రు. "ధ్యేయస్సదా సవితృ మండలమధ్యవర్తీ" త్యాదినోక్తం ఉజ్జిహానే ఉద్గచ్ఛతి సతి. సకారాంతపాఠే సనంతాద్యచ్. అర్థస్తు స ఏవ. 11

ఈ విధముగా భగవదారాధన చేయునట్టి భరతుడు శరీరమున జింక చర్మమును ధరించి త్రికాలములలోను స్నానము చేయడముచే తడిసిన కపిశ వర్ణముకల జడలతోప్రకాశిస్తూ "ధ్యేయస్సదాసవితృ మండలమధ్యవర్తే" ఇత్యాది శ్రుతి తెలిపినటుల ఉదయిస్తున్న సూర్యుణ్ణి ఉపాసించే ఋక్కులతో జ్యోతిర్మయ పురుషుడగు నారాయణుని ఆరాధిస్తూ ఇట్లు అనుచుండెను. 11












చూ॥ పరోరజస్సవితుర్జాతవేదో
దేవస్య భర్గోమనసేదం జజాన ।
సురేతసాదః పునః ప్రవిశ్య చష్టే
హంసం గృధ్రాణం వృషద్రుంగిరామిమ ఇతి ॥ 12

టీ:- పర ఇతి. పరో రజః రజసః ప్రకృతేః పరం శుద్ధసత్త్వాత్మకం సవితుర్దేవస్య సూర్యస్య భర్గస్వరూపభూతం తేజః జాతం వేదో ధనం కర్మఫలం యస్మాత్తత్కర్మఫలమిత్యర్థః. అత్ర హేతుః. యత్ మనసైవ ఇదం విశ్వం జజాన ససర్జ. పునశ్చ అదశ్చ సృష్టం విశ్వమంతర్యామి రూపేణ ప్రవిశ్య గృధ్రాణం కాంక్షంతం. హంసం జీవం సురేతసా చిచ్ఛక్త్యా విచష్టే పశ్యతి పాలయతీత్యర్థః. నృషు సీదతి ఉపాధితయా తిష్ఠతీతి నృషత్ బుద్ధిః తస్యాః ఋంగి ఋంగణం గతిం రాతీతి నృషద్రుంగిరాం వాఛం దసీత్యమిపూర్వరూపత్వాభావః లింగత్రయ నిర్దిష్టం తద్భర్గః ఇమః శరణం వ్రజామః. 12

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,
సప్తమోఽధ్యాయః

ప్రకృతికంటే పరమగు కర్మఫలములనొసగెడు దానిని సంకల్ప మాత్రముననే ఈ జగత్తును సృష్టించిన, తాను సృష్టించిన జగత్తులో అంతర్యామి రూపముగా ప్రవేశించు వానిని కోరికలుకల జీవిని చిచ్ఛక్తితో రక్షించెడి వానిని మానవులలో ఉపాధిగా నుండెడి వానిని బుద్ధి యొక్క ప్రవర్తకమగు సూర్యుని యొక్క తేజస్సును (భర్గీ) శరణు పొందెదము అని (గాయత్రీ మంత్రమను సావిత్ర్యుపాసనము గుర్తుకు తెచ్చుకోవచ్చును) పలుకు చుండెను పై శ్లోకముతో అన్వయము. 12

శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు
ఏడవ అధ్యాయము సమాప్తము.







## అష్టమోऽధ్యాయః

శ్లో॥ అష్టమే భజతో విష్ణు విష్ణుం తస్య కర్మాంతరాయతః ।
ఏణరక్షాప్రసక్తస్య జాతమేణత్వ మీర్యతే ॥
కృపయాపి కృతస్సంగః పతనాయైవ యోగినః ।
ఇతి ప్రదర్శయన్నాహ భరతస్యైణపోషణమ్ ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ ఏకదాతు మహదానద్యాం కృతాభిషేక నైయమికావశ్యకో బ్రహ్మాక్షరమభిగృణానో ముహూర్తత్రయముదకాంత ఉపవివేశ । తత్ర తదా రాజన్ హరిణీ పిపాసయా జలాశయాభ్యాశమేకైవోపజగామ తయాపేపీయమానే ఉదకే తావదేవా విదూరే నదతో మృగపేతేరున్నాదో లోకభయంకర ఉదపతత్ ॥ 1

టీ:- ఏకదేతి. నైయమికం నిత్యనైమిత్తికవిధిప్రాప్తం ఆవశ్యక మర్థ ప్రాప్తం మూత్రోత్సర్జనాదికృతమభిషేకాదికం యేన బ్రహ్మాక్షరం ప్రణవం అభిగృణానో జపన్ ఉదకాంతే నద్యాస్తీరే జలాశయాభ్యాశం నద్యాస్సమీపం పేపీయమానే అత్యాసక్త్యా పీయమానే సతి తావదేవ తత్క్షణమేవ అవిదూరే సన్నిధౌ మృగపతేస్సింహస్య ఉన్నతో మహాన్నాద ఉద్గతః. 1

## 8వ అధ్యాయము

ఈ ఎనిమిదవ అధ్యాయమున విష్ణువును భజించెడి భరతునకు చేస్తున్న మానసిక కర్మనుండి లౌకికకర్మ వాసనలో పడుటచే లేడిని రక్షించుటలోమగ్నుడయ్యి లేడి జన్మ నెత్తడము, దయా భావముతో సంగ మొందినను యోగికి పతనమే అని చూపుటకు భరతుని లేడి పెంపక వృత్తాంతము తెలుపబడుచున్నది.

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఒకసారి భరతుడు గండకీనదిలో నిత్య, నైమిత్తిక కర్మలనొనర్చి (మూత్రోత్సర్జన స్నానాదులను, పూజాదికములు నెరవేర్చి) ప్రణవమును జపిస్తూ మూడు ముహూర్తముల సమయము నదీప్రవాహ సమీపమున కూర్చుండెను. ఓ పరీక్షిద్రాజా! అప్పుడు దప్పికగొన్న ఒక ఆడలేడి ఆ నదీ సమీపమునకు ఒంటరిగానే వచ్చెను. ఆ ఆడలేడి నీరు త్రాగుచుండగా దగ్గరలో సింహ గర్జన లోకభయంకరమగు రీతిలో వినబడెను. 1

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.











చ్లూ॥ తముపశ్రుత్య సా మృగవధూః ప్రకృతివిక్లబా చకితం నిరీక్షమాణా సుతరామపి హరిభయానివేశవ్యగ్ర హృదయా పారిప్లవ దృష్టి రగత తృషా భయాత్సహసైవోచ్చక్రామ. 2

టీ:- తమితి. ప్రకృత్యా స్వభావత ఏవ విక్లబా వ్యాకులాసుతారాం తు హరిభయస్యాభినివేశేన వ్యగ్రం వ్యాకులం హృదయం యస్యాః పారిప్లవదృష్టిః పరిభ్రాంతనేత్రా న గతా తృషా తృట్ యస్యాః ఉచ్చక్రామ నదీముల్లంఘితవతీ. 2

చూ॥ తస్యా ఉత్పతం త్యా అంతర్వత్న్యా ఉరుభయావళిగతో యోనేర్ని ర్గతో గర్భః స్రోతసి నిపపాత - తత్ప్రసవోత్సర్పణ భయ ఖేదాతురా స్వగణేన వియుజ్యమానా కస్యాం చిద్దర్యాం కృష్ణసారస్వతీ నిపపాత - అథ చ మమార చ. 3

టీ:- తస్యా ఇతి. అంతర్వత్న్యాః గర్భిణ్యాః ఉరుభయేన స్థానాద్వి చాలితో యోనేర్నిర్గతస్సన్ స్రోతసి ప్రవాహే నిపతితః. తత్ప్రసవో గర్భపాతః. ఉత్సర్పణముల్లంఘనం భయం చ ఏతైః ఖేదేనాతురాపీడితా దర్యాం గిరిగుహాయాం హరిణవధూః పపాత. అథ అనంతరం మృతా చ. 3

స్వభావముగానే వ్యాకులము, చంచలమైన చూపులుకల ఆ ఆడలేడి సింహగర్జన విని, భయముపడి వ్యాకులమగు హృదయము గలదై చంచలమగు దృష్టితో దప్పిక తీరకుండానే నదిని దాటుటకై ఎగిరి దూకెను . 2

తన లేళ్ళగుంపుతో విడివడిన గర్భవతియగు ఆ ఆడలేడి మిక్కిలి భయముతో, పైకెగురగా దాని గర్భము స్థానభ్రంశమంది (గర్భపాతమై) యోని మార్గమున బయటకు వచ్చి నదిలో పడెను. గర్భపాతము జరుగుట, పైకెగురనప్పుడు కలిగిన భయము వీటి ఖేదముతో పీడించబడి, ఆ లేడి ఒక పర్వత గుహలో పడి మరణించెను. 3









చూ॥ తం త్వేణకుణకం కృపణం స్రోతసానూహ్యమానామభివీక్ష్యా పవిద్ధం బంధుమివ అనుకంపయా రాజర్షిర్భరత ఆదాయ మృత మాతరం నిజమాశ్రమపదమనయత్. 4

టీ:- తమితి. ఏణ కుణకం హరిణ బాలకం అపవిద్ధం బంధుభిః త్యక్తం ఇత్యేతైః కృపణత్వాది హేతుభిః. యా అనుకంపా తయా అనయత్. 4

బంధువులచే వదలబడి, నదీ ప్రవాహములో కొట్టుకొని-పోవుచున్న తల్లిలేని (చనిపోయిన) దయనీయమగు ఆ లేడి పిల్లను చూచి రాజర్షిభరతుడు ఆత్మీయునివలె దయతో దానిని తన ఆశ్రమము-నకు తీసుకొనివెళ్ళెను. 4

చూ॥ తస్యహ వా వైణకుణక ఉచ్చైస్తరాం తస్మిన్ కృతనిజాభిమానా స్యాహరహస్తత్పోషణ పాలన ప్రీణన లాలనానుధ్యానేనాత్మనియమా స్సహ యమాః పురుష పరిచర్యాదయ ఏకైకశః కతిపయేనాహర్గణేన వియుజ్యమానాః కిల సర్వ ఏవోదవసన్. 5

టీ:- తస్యేతి. కృతః నిజః స్వీయ ఇత్యభిమానో యేన పోషణం తృణాదినా పాలనం. వృకాదిభ్యో రక్షణం. ప్రీణనం కండూయనాదినా లాలనం చుంబనాదినా ఏతైర్యదనుధ్యానమాసక్తిః. తేన ఆత్మనో నియమాః స్నానాదయః. యమాః అహింసా దయః తత్సహితాః ఈశ్వరపరిచర్యాదయశ్చ ప్రతిహమేకైకశో వియుజ్యమానాస్సంత్యః కతిపయే నాహర్గణేన సర్వే. ఉదవసన్ ఉత్సన్నా బభూవుః. 5

ఆ లేడిపిల్లయందు మమతాభిమానములు పుట్టిన భరతుడు దానిని తృణాదులతో పోషిస్తూ తోడేలు మొదలగువాని నుండి రక్షిస్తూ, దురద నివారణకై నిమురుతూ దానికి ఉత్సాహాన్ని, తృప్తిని కలిగిస్తూ చుంబనాదులతో లాలిస్తూ దానిపై ఆసక్తుడాయెను. అతని యొక్క స్నానాది నియమములు, అహింసాది నియమములు, యమ నియమములతో కూడిన ఈశ్వర పరిచర్యాదులు రోజుకొకటి వదిలినవి. కొన్ని రోజులలో అన్నీ మానుకున్నాడు. (వదలబడినవి) 5









చూ॥ అహో బతాయం హరిణకుణకః కృపణ ఈశ్వరరథచరణ పరిభ్రమణరయేణ స్వగణసుహృద్బంధుభ్యః పరివర్జితశ్శరణం చ మోపసాదితః మామేవ మాతాపితరౌ భ్రాతృబంధుజ్ఞాతీన్ యౌధికాంశ్చోపేయాయ నాన్యం కంచన వేదమయ్యతివిస్రబ్ధశ్చాత ఏవ మయా మత్పరాయణస్య పోషణ పాలన ప్రీణన లాలన మనసూయు నానుష్ఠేయం శరణ్యోపేక్షాదోషవిదుషా. 6

టీ:- సక్తిం ప్రపంచయతి - అహో ఇత్యాదినా కృతానుషంగ ఇత్యేతత్పర్యంతేన. ఈశ్వరరథచరణః కాలచక్రం తస్య పరిభ్రమణ వేగేన స్వగణాదిభ్యో విభ్రంశితః. మేతి మాం చ శరణం ప్రాపితః. మామేవ మాతా పిత్రాదిబుద్ధ్యా ఊపేయాయ ప్రాప్తః. యౌధికాన్ యూధసంఘాతినః. అనసూయునా ఏతస్మిన్నిమిత్తం మమస్వార్థో భ్రశ్యతీతి దోషదృష్టిమకుర్వతా. 6

చూ॥ నూనం హ్యార్యాః సాధవ ఉపశమశీలాః కృపనసుహృద
ఏవంవిధార్థేస్వార్థానపి గురుతరానుపేక్షంతే ॥ 7

టీ:- తదేవాహ - నూనం హీతి. 7

**ఆ లేడి పిల్లపైన ఆసక్తిని తెలియచేయుచున్నాడు.**

అయ్యో దీనమగు హరిణకుణకము (లేడిపిల్ల) కాలచక్ర భ్రమణ వేగముతో దాని యొక్క సమూహముతో స్నేహితులతో, బంధువులతో వదలబడినదై (దూరము చేయబడినదై) నా శరణములోకి (రక్షణలోకి) చేర్చబడినది. నన్నే తల్లిదండ్రులుగా, సోదరులుగా, జ్ఞాతులుగా, సమూహములోని సహచరులుగా తలంచుచున్నది. నన్నుతప్ప వేరే ఎవరిని ఎరగదు. నా యందు నమ్మకము కలిగియున్నది. ఇలా శరణాగత అయిన దీనిని వదులుట దోషమనితలచి భరతుడు తననాశ్రయించిన దీనికి పాలన, పోషణ, తృప్తికలిగించుట, లాలనలు చేయుచూ దీని నిమిత్తమై నా స్వార్థము (నా కార్యకలాపాలన్నీ) నశించునను దోషదృష్టిలేక, దాని పోషణ చేయవలెనని తలంచెను. 6

శాంతస్వభావులు, దీనులను రక్షించెడి సత్పురుషులు శరణాగత రక్షణ విషయమున తమ గొప్ప లాభాదులను గూడా ఉపేక్షింతురు. ఇది నిశ్చయము. 7





శ్లో॥ ఇతి కృతానుషంగ ఆసనశయనాటన స్నానాదిషు ।
సహ మృగజాహునాస్నేహానుబద్ధ హృదయ ఆసీత్ ॥ 8

టీ:- ఇతీతి. ఇత్యేవం కృతోऽనుషంగః ఆసక్తిర్యేన మృగజహునా మృగాపత్యేన సహ. స్నేహానుబద్ధం హృదయం యేన. 8

చూ॥ కుశ కుసుమసమిత్పలాశ ఫలమూలోదకాన్యాహరిష్యమాణో మృకసాలావృకాదిభ్యో భయమాశంసమానో యదా సహ హరిణ కుణకేన వనం సమావిశతి. 9

టీ:- స్నేహానుబంధమేవ ప్రపంచయతి. కుశకుసుమేత్యాదినా స్వధయతీత్యం తేన. సాలావృకాః శ్వానః. యథాభయం శంకమానో భవతి. తదా తేన సహ వనం ప్రవిశతి. 9

చూ॥ తదా పథి పథి చ ముక్తభావేన తత్ర తత్ర విషక్తమతిః అతిశయ ప్రణయభరహృదయః కార్పణ్యాత్ స్కంధేనోద్వహతి ఏవమురస్యుత్సంగే చాధాయోపలాలయన్ ముదం పరమామవాప. 10

టీ:- తదేతి. అతిశయితః ప్రణయభరో యస్య తద్ధృదయం యస్య. 10

ఈ విధముగా లేడిపిల్లయందు ఆసక్తి కల్గిన భరతుడు కూర్చునుట, పడుకొనుట, తిరుగుట, స్నానము మున్నగు వాటిని చేయుచునప్పుడు కూడా ఆ జింకపిల్లయందే స్నేహముగల హృదయు-డాయెను (అనగా సదా లేడిపిల్లను గూర్చియే ధ్యానించు చుండెను). 8

**ఇచటినుండి స్వధయతీరి అను చివరగాగల 22వ శ్లోకము చివరి వరకు లేడిపిల్లపైగల స్నేహానుబంధమును తెలియజేయు చున్నాడు.**

భరతుడు దర్భలు, పుష్పములు, సమిధలు తెచ్చుటకు అరణ్యమునకు వెళ్ళునప్పుడు తోడేళ్ళు, కుక్కలు మొదలగు వాటితో ఈ లేడిపిల్లకు ప్రమాదము కలుగునను భయముతో దానినికూడా వెంట తీసుకొని వెల్లెడివాడు. 9

ఆ సమయమున మార్గమధ్యమములో ఆ లేడిపిల్ల తననుండి దూరమైనపుడు (పచ్చి గరకలను చూచి ఆగిపోయినయెడల) దానిపైన అధికమైన ప్రేమతో, దయతో దానిని తన భుజములపైన మోయుచు ఎదపైన ఒడిలో ఉంచుకొని లాలిస్తూ గొప్ప సంతోషము నొందు-చుండెను. 10



శ్లో॥ క్రియాయాం నిర్వర్త్యమా నాయామంత
రాళేऽప్యుత్థాయోత్థాయ యద్దైవమభిచక్షీత ।
తర్హి వా వవర్ష పతిః ప్రకృతిస్థేన మనసా
తస్మా ఆశిష ఆశాస్తే స్వస్తిస్తాద్వత్స తే సర్వత ఇతి ॥ 11

టీ:- క్రియాయామితి. క్రియాయాం దేవపూజాదిలక్షణాయాం. వర్షపతిః. భరతః ప్రకృతిస్థేన స్వస్థేన స్తాత్ భూయాత్. 11

భారతవర్షాధిపతియగు భరతుడు దేవపూజ క్రియలు నిర్వర్తిస్తూ, మధ్యమధ్యలో లేచి, ఆ లేడిపిల్లను చూచుచుండును. దానిని చూడగానే శాంతచిత్తుడై దానిని " ఓ వత్సా! నీకు ఎల్లప్పుడూ శుభము కలుగుగాక" అని ఆశీస్సులనిచ్చుచుండెను. 11

చూ॥ అన్యథా తు భృశముద్విగ్నమనాః నష్ట ద్రవిణ ఇవ కృపణః సకరుణమతితర్షేణ హరిణకుణక విరహవిహ్వల హృదయ సంతాపస్త మేవానుశోచన్ కిల కశ్మలం మహదభిలంభిత ఇతి హోవాచ. 12

టీ:- అన్యథేతి. అన్యథా అదర్శనేన సకరుణం యథా భవత్యేవ మనుశోచన్నితి హోవాచేత్యన్వయః. అతితరేణ అత్యౌత్సుక్యేన హరిణకుణకవిరహేణ విహ్వలే హృదయే సంతాపో యస్య కశ్మలం మోహం ప్రాపితస్సన్. 12

ఎప్పుడైనా ఆ లేడిపిల్ల కనిపించనిచో ధనము నష్టపోయిన వ్యక్తివలె ఉద్విగ్నచిత్తుడై ఆ లేడిపిల్ల యొక్క విరహవ్యాకులముచే సంతప్తుడై, దయతో ఉత్కంఠితుడై, మోహావిష్టుడై, శోకమగ్నుడై ఈ విధముగా అనుకొనుచుండును. 12

చూ॥ అపి బత వై కృపణ ఏణబాలకో మృతహరిణీసుత ఆహోమమా నార్యస్య శఠ కిరాతమతేరకృత సుకృతస్య కృతవిస్రంభ ఆత్మప్రత్యయేన తదవిగణయన్ సుజన ఇవ కిమాగమిష్యతి. 13

**అపి అను పదము సంభావనార్థములో బత అనునది దయ అను అర్థములో వాడబడినవి.**

దయనీయమగు మాతృహీనమగు ఆ లేడిపిల్ల కుత్సితుడైన






టీ:- అపీతి. అపీతి సంభావనాయాం. బతేత్యనుకంపాయాం. అహో ఇతి ఖేదే. శఠకిరాతయోరివవంచనపరా క్రూరా చ మతిర్యస్య అకృత సుకృతస్య నిర్భాగ్యస్య. మమ. తత్ శాఠ్యాదికమగణయన్నచింతయన్ ఆగమిష్యతి కిం. అపరాధాచింతనే హేతుః. ఆత్మప్రత్యయేన స్వచిత్త శుద్ధ్యా కృతవిశ్వాసస్సన్ సుజనో యథా న గణయతి తద్వత్. 13

కిరాతునివలె, మోసపూరితమగు మనస్సుగల నిర్భాగ్యుడనగు నన్ను నమ్మి తన వానిగా భావించి, నేనొనరించిన అపరాధములను సత్పురుషునివలె లెక్కించక తిరిగి వస్తుందా?. 13

చూ।। అపి క్షేమేణాస్మిన్నాశ్రమోపవనే శష్పాణి చరంతం దేవగుప్తం ద్రక్ష్యామి. 14

భగవత్కృపచే రక్షించబడి క్షేమముగా ఈ ఆశ్రమ ప్రాంతములో పచ్చి గరికనేరుకొనెడి దానిని చూస్తానా?. 14

టీ:- అపీతి. శష్పాణి కోమలతృణాని. 14

చూ।। అపి నవృకస్సాలావృకోఽన్యతమోవా నైకచర ఏకచరోనా భక్షయతి. 15

ఆ లేడిపిల్లను గుంపులుగా తిరిగెడి తోడేళ్ళు, కుక్కలు, అడవి -పందులు, ఒంటరిగా తిరిగెడి క్రూరమృగములగు సింహములు, పులులు మొదలగునవి తినివేయవు గదా! 15

టీ:- అపీతి. నైకచరః యూథచరః సూకరాదిః. యద్వా - ఏక ఏవ చరతి యః క్రూరస్వభావః వ్యాఘ్రాదిః. న భక్షయతి. 15

చూ।। నిమ్లోచతీహ భగవాన్ సకలజగత్ క్షేమోదయస్త్రయ్యాత్మా అద్యాపి నమమ మృగవధూన్యాస ఆగచ్ఛతి. 16

ఎవనినుండి సమస్త లోకములకు క్షేమము కలుగునో మూడు వేదములు ఎవని యొక్క స్వరూపమో అట్టి సూర్యుడస్తమిస్తున్నాడు.




టీ:- నిమ్లోచతీతి. సకలలోకస్య క్షేమో యస్మాత్ ఉదయో యస్య. వేదత్రయీ ఆత్మా స్వరూపం యస్య. స సూర్యో నిమ్లోచతి అస్తం యాతి. మృగవధ్వాః న్యాసః నిక్షేపభూతః. 16

చూ॥ అపి స్విదకృత సుకృతమాగత్య మాం సుఖయిష్యతి - హరిణ రాజకుమారో వివిధ రుచిర దర్శనీయ నిజమృగదారక వినోదైర సంతోషం స్వానామపనుదన్. 17

టీ:- అపి స్విదితి. హరిణ ఏవ రాజకుమారః. ఆగత్య మామపి స్వితు్స ఖయిష్యతీత్యన్వతీత్యన్వయః కింకుర్వన్ వివిధైః. రుచిరైర్దర్శనీయైః నిజైః మృగదారకవినోదైః. స్వీయానాం ఖేదమపనుదన్ అపనయన్ సన్. 17

చూ॥ క్ష్వేళికాయాం మాం మృషాసమాధ్యామీలితదృశం ప్రేమ సంరంభేణ చకిత చకిత ఆగత్య పృషదపురుషవిషాణాగ్రే లుఠతి. 18

టీ:- సంభవతి చైతదిత్యాహ - క్ష్వేళికాయామితి. క్షేళికాయాం క్రీడాయాం. మృషా యస్సమాధిః తేన ఆమీలితే దృశౌయేన తం మాం. ప్రేమసంరంభేణ ప్రణయకోపేన. పృషత్ జలబిందుః తద్వదపరుషేణ మృదునా విషాణాగ్రేణ. లుఠతి సంఘట్టయతి. 18

చనిపోయిన ఆడలేడిచేత నా వద్ద న్యాసముగా నుంచబడిన ఆ లేడిపిల్ల ఇంకా తిరిగి రావడము లేదు. 16

ఆ హరిణరాజకుమారము నిర్భాగ్యుడనగు (పుణ్యమాచరించని) నా దగ్గరకు వచ్చి సుందరములు దర్శనీయములగు అనేక రకముల వినోదములతో నా దుఃఖమును తొలగించి సంతోషముగా సుఖపెట్ట గలదో లేదో? 17

**అలాంటి సుఖము సంభవించినయెడల ఏమి కల్గునని తెలుపుచున్నాడు.**

అటలో భాగముగా సమాధిలోనున్న వ్యక్తిలాగా నటిస్తున్నపుడు సగము తెరచిన కన్నులతో నేనుంటే నన్ను ప్రణయకోపములో, జల బిందువులవలె చల్లనైన మృదువైన లేతనైన చిన్న కొమ్ముల కొసలతో తాకుతుంది. 18





చూ॥ ఆసాదిత హవిషి బర్హిషి దూషితే మయోపాలబ్ధో భీత భీతః సపద్యు పరతరభసః ఋషి కుమారవదవహితకరణకలాప ఆస్తే. 19

టీ:- ఆసాదిత ఇతి. ఆసాదితం హవిర్యస్మిన్ బర్హిషి దర్భే. దంతా కర్షణాదినా చాపలేన, దూషితే సతి. దూషిత్వేతి పాఠే బర్హిషి విషయే దూషణం కృత్వేత్యర్థః. మయా అధిక్షిప్తస్సన్ తత్ క్షణమేవోపరతక్రీడో నిశ్చల ఆస్తే. 19

చూ॥ కిం వా అరే ఆచరితం తపస్తపస్విన్యానయా యది యమవనిస్స వినయకృష్ణసార తనయ తనుతరసుభగశివ తమఖరఖురపదపంక్తి భిర్ద్రవిణవిరహాతురస్య కృపణస్య మమ ద్రవిణపదవీం సూచయంత్యా త్మానం సర్వతః కృతకౌతుకం ద్విజానాం స్వర్గాపవర్గ కామానాం దేవయజనం కరోతి. 20

టీ:- ఇతి బహుధా ప్రలప్యోత్థాయ బహిర్నిర్గత్య తత్ఖురఖాత భూభాగో పలంభ సంభ్రాంతహృదయః ఆహ - కింవేతి. అరే అహో అనయా క్షిత్యా కిం వా తప ఆచరితం తపస్విన్యా సభాగ్యయా యద్యస్మాత్ ఇయం సవినయస్య కృష్ణసార తనయస్య తనుతారాస్సుభగాశ్శివతమాః ఖరాశ్చ ఖురాః యేషు తేషాం పదానాం. తత్ర తత్రాంకితానాం పంక్తిభిః

దర్భలపై హవిస్సునుంచగా ఆ దర్భలను చాపల్యముతో కొరకడము లాగడము చేయగా నేను కోపించడంతో మిక్కిలి భీతిల్లినదై ఎగరడము దుముకడము మున్నగు క్రీడలను విరమించి ఋషికుమారునివలె నిశ్చలముగా ఉంటుంది. 19

అని ఈ విధముగా అనేక రకములుగా పలికి లేచి బయటకు వెళ్ళి అచట భూమిపై ఆ లేడిపిల్ల గిట్టలచిహ్నాములను గాంచి ఆశ్చర్య చకితుడై ఇటుల పలికెను. ఆశ్చర్యము! భాగ్యవంతురాలగు ఈ భూమి ఏమి తపమొనరించినదో! ఏలనన వినయవంతుడగు నల్లలేడిపిల్ల యొక్క చిన్ననైన, సుందరములైన, సుఖకరములగు కోమలములగు గిట్టలు కలచరణ చిహ్నాములతో నున్న ఈ భూమి లేడిపిల్ల అనెడి ద్రవ్య విరహాతురతచే వ్యాకులడనగు నాకు ద్రవ్యప్రాప్తి మార్గమును సూచిస్తూ స్వయముగా తన శరీరమంతటను ఈ లేడిపిల్ల పాద చిహ్నాములతో భూషితురాలై స్వర్గమోక్షములను కోరెడి ద్విజులకు యజ్ఞస్థలమగుచున్నది. "యస్మన్ దేశేమృగౌ కృష్ణ స్తస్మిన్ ధర్మాన్ని బోధతే" ఏ భూమిపై కృష్ణసారమృగము సంచరించునో ఆ భూమి



. ద్రవిణం మృగః తేన రహితస్య అత ఏవాతురస్య దుఃఖితస్య మమ ద్రవిణమార్గం సూచయంతీ సతీ స్వాత్మానం చ తాభిః కృతమండనం ద్విజానాం యజ్ఞభూమిం కరోతి. శ్లో. "యస్మిన్ దేశే మృగః కృష్ణస్తస్మిన్ ధర్మాన్నిబోధతే"తి స్మృతేః. 20

చూ॥ అపిస్విదసౌ భగవానుడుపతిరేవం మృగపతిభయాన్మృగబాలకం స్వాశ్రమపరిభ్రష్ట మన ఉకంపయా కృపణజనవత్సలః పరిపాతి. 21
టీ:- తావదుదితే చంద్రే మృగం దృష్ట్వా స్వమృగత్వం సంభావ యన్నాహ - అపిస్విదితి. 21

చూ॥ కిం వాత్మజవిశ్లేషణ జ్వరదవదహనశిఖాభిరుపతప్యమాన హృదయస్థలనళినీకం మాముపసృతమృగీతనయం శిశిరశాంతానురాగ గుణిత నిజవదన సలిలామృతమయ గభస్తిభిః స్వధయతీతి వా. 22

టీ:- చంద్రరశ్మిభిః స్పర్శసుఖం ప్రాప్యాహ - కిం వేతి. స ఏష తే హరిణకులోపనిధిః మయా గుప్త ఇతి. కింవేతి సంభావనాయాం. ఆత్మ జవిశ్లేషణజ్వరః తాపః స ఏవ దవదహనః తస్య జ్వాలాభిః ఉపతప్యమానా హృదయరూపా స్థలనళినీ యస్య. జలస్థం పద్మం

ధర్మకర్మలకు యజ్ఞాద్యనుష్ఠానములకు యోగ్యమైనదగును అని స్మృతి తెలుపుచున్నది. 20

చంద్రోదయముకాగా చంద్రునిలో మృగమును (మృగ చిహ్నమును) గాంచి తన లేడిపిల్లగా తలచి పలుకుచున్నాడు. తన ఆశ్రమము నుండి బయటకు వెడలిన మృగబాలకునకు సింహాదులతో భయము కలుగునని దీనవత్సలుడు భగవంతుడగు చంద్రుడు దయతో రక్షించుచున్నాడేమోయని తలంచుచుండెను. 21

చంద్రకిరణస్పర్శసుఖాన్ని పొంది ఇటుల తలంచుచున్నాడు. ఒక లేడిపిల్లను అనుసరించి, పుత్రవియోగరూప దావాగ్ని జ్వాలలతో హృదయ కమలము దహించబడగా (ఒక మృగబాలకునిచే అనుగతుడనైన) నన్ను చల్లని, శాంతములైన, ప్రేమపూర్ణములైన, తన వదన సలిల స్వరూపములైన అమృతమయములుగలగు కిరణములలో చంద్రుడు శాంతినొందించు చున్నాడా ఏమి? లోకములో మాంత్రికులు తమ వదన సలిలముతో తాపశాంతి కల్గిస్తారని ప్రసిద్ధి. 22





తాపం సోఢుం క్షమమితి స్థలగ్రహణం. ఉపసృతః అనుగతో మృగీతనయో యేన తం మాం. చంద్రః స్వధయతి శాంతిం గమయతి. కైః శిశిరం చ తచ్ఛాంతం చ మయ్యనురాగేణ గుణితం చ ఆవర్తితం పునః పునస్స్రవద్యద్వదనసలిలం. తదేవామృతమయ్యో గభస్తయః తాభిః . లోకేహి మంత్రవాదినో వదనసలిలైః తాపం శమయంతీతి ప్రసిద్ధం. ఉపసృత్య మృగీతనయ ఇతి పాఠే – మనోరథాంతరమేవ తత్, ఉపసృత్య ప్రాప్య మృగీతవయః కింవా మాం స్వధయతీతి. శేషం సమానం. 22

చూ॥ ఏవమఘటమాన మనోరథాకులహృదయో మృగదారకాభాసేన స్వారబ్ధకర్మణా యోగారంభణతో విభ్రంశితః సయోగతాపసో భగవదారాధన లక్షణాచ్చ కథమితరథా జాత్యంతర ఏణకుణక ఆసంగస్సాక్షాన్నిశ్శ్రేయస ప్రతిపక్షతయా ప్రాక్పరిత్యక్తదుస్త్యజ హృదయాభిజాతస్య తస్యైవమంతరాయవిహత యోగా రంభణస్య రాజర్షేర్భరతస్య తావన్మృగార్భక పోషణ పాలన ప్రీణన లాలనానుషం గేణావిగణయత ఆత్మా నమహిరివాఖుబిలం దుర తిక్రమః కాలః కరాళరభస ఆపద్యత. 23

టీ:– ఏవమితి.మృగదారకవదాభాసమానేన భగవదారాధన లక్షణాత్క ర్మణశ్చ విభ్రంశితః ప్రారబ్ధకర్మత్వే హేతుః – కథమితరథేతి.సాక్షా

ఈ విధముగా అసంభవములగు మానసిక చింతనలతో వ్యాకుల హృదయుడగు, యోగతాపసుడైన భరతుడు లేడిపిల్ల రూపముగా వచ్చిన ప్రారబ్ధకర్మ వశమున భగవదారాధన రూపమగు నిత్యమగు కర్మల నుండి, యోగానుష్ఠానము నుండి దిగజారిపోయెను. కాకుంటే మరేమి? ఏ భరతుడైతే మోక్షమార్గమునకు సాక్షాత్తు విఘ్నమని మొదట తన హృదయమునుండి జనించిన విడువరాని తనయులను వదలెనో అట్టి భరతునకు జాత్యంతరమగు లేడిపిల్లయందు ఆసక్తి ఎటుల కలుగును? ఈ విధముగా విఘ్నాయత్తుడై యోగసాధననుండిచ్యుతుడై ఆ లేడిపిల్ల పోషణ పాలన ప్రీణనలాలనలలో (తృప్తిపరచుట) మునిగి ఆత్మస్వరూపమును మరచిన రాజర్షియగు భరతునకు, ఎలుక రంధ్రములో దూరు సర్పమువలె అతిక్రమించుటకు వెనుదిరుగుటకు





త్స్వపుత్రవత్కథమాసంగస్స్యాత్ పూర్వం పరిత్యక్తాః దుస్త్యజాః ఔరసా యేన అంతరాయేణ విహతం యోగారంభణం యస్య ఆత్మనమ విగణయతః ఆత్మ చింతా మకుర్వతః తావదేవ తీవ్రవేగః కాలః మృత్యుసమయశ్చ ఆపద్యత. 23

చూ॥ తదానీమపి పార్శ్వవర్తినమాత్మజమివానుశోచంతం తమభి వీక్షమాణో మృగ ఏవాభినివేశితమనా విసృజ్య లోకమిమం సహ మృగేణ కళేబరం మృతమను నమృతపూర్వజన్మానుస్మ ృతిరితరవన్మృగ శరీరమావాప. 24

టీ:- తదానీమితి. లోకం దేహం మృగేన సహితం విసృజ్య ప్రాకృత ఇవ మృగశరీరమవాప. కథం భూతః కళేబరం మృతమను. న మృతా న వినష్టా పూర్వజన్మాను స్మృతిర్యస్య. 24

చూ॥ తత్రాపి హవావాత్మనో మృగత్వ కారణం భగవదారాధనసమీహా నుభావేనానుస్మృత్యా భృశమనుతప్యమాన ఆహ. 25

టీ:- తత్రాపీతి. ఆహ స్వచిత్తే. 25

( తప్పించుకొనుటకు) వీలుకానట్టి మిక్కిలి వేగమంతమగు మృత్యు సమయము వచ్చెను. 23

ఆ సమయమునను తన ప్రక్కనేయుండి పుత్రునివలె దుఃఖించు చున్నఆ లేడిపిల్లనే చూస్తూ మనస్సులో ఆ మృగమునే చింతిస్తూ ఈ లోకమును, ఆ లేడిపిల్లను, తన శరీరమును వదిలెను. అంత్యకాల -ములో ఆ మృగమునే ధ్యానించడము చేత సాధారణ పురుషునివలె ( యోగమార్గాననుసరించినా కలిగిన విఘ్నమువలన రాజు అజ్ఞాన మానవునివలెనే మృగ శరీరముతో జన్మించెను. 24

పూర్వజన్మలో గావించిన భగవదారాధన ప్రభావముతో ఆ మృగజన్మలో తాను మృగరూపమొందుటకు కారణము తెలిసినవాడై పశ్చాత్తప్తుడై ఇలా అనుకొనెను. 25





చూ।। అహోకష్టంభ్రష్టోఽహమాత్మవతామనుపథాత్,యద్విముక్త సమస్తసంగస్య వివిక్తపుణ్యారణ్య శరణస్యాత్మవత ఆత్మని సర్వేషా మాత్మవతాం భగవతి వాసుదేవే తదనుశ్రవణ మనన సంకీర్త నారాధ నానుస్మర ణాభియోగేనాశూన్య సకలయామేనకాలేన సమావేశితం సమాహితం కార్త్స్న్యేన మనస్తత్పునర్మమాబుధస్యారా న్మృగసుత మనుపరిసుస్రావ. 26

టీ:- అహో ఇతి, అహో కష్టం ధీరాణాం మార్గాత్ భ్రష్టోఽహం. భ్రంశమేవాహ – యత్ యతః విముక్తాస్సమస్తాస్సంగాః యేన. వివిక్తం పుణ్యారణ్యం శరణం యస్య. ఆత్మవతః ధీర్యస్య మమ. మనస్సర్వేషాం భూతానామాత్మాని శ్రీవాసుదేవే. సమావేశితం సమాహితం చ నిశ్చలం సత్. ఆరాద్దూరాదేవ. సుస్రావ గళితం నిస్సృతం. కేన సంవేశితం తస్యానుశ్రవణాదిషు అభియోగేన అభినివేశేన. అశూన్యాస్సకలాః యామా యస్మి. 26

అయ్యో ఎంతటి కష్టము వచ్చినది. నేను సంయమన శీలురగు మహానుభావుల మార్గమునుండి భ్రష్టుడనైతిని. సమస్త సంగములను వదిలి ఏకాంతమగు అరణ్యమునాశ్రయించి వాసుదేవుని గుణముల శ్రవణ మనన సంకీర్తనలనొనర్చి, సర్వ సమయముల యందు వాసుదేవుని ఆరాధన స్మరణాదులతో సఫలమై, స్థిరభావముతో ఏ చిత్తమునైతే సర్వభూతాత్మకుడగు వాసుదేవుని యందుంచితినో, అట్టి నా మనస్సు (చిత్తము) అకస్మాత్తుగా ఒక లేడిపిల్లయందు లగ్నమై నా లక్ష్యమునుండి తొలగించబడినది కదా! 26

చూ।। ఇత్యేవం నిగూఢనిర్వేదో విసృజ్యమృగీం మాతరం పునర్భగవతః క్షేత్రముపశమశీలమునిగణదయితం సాలగ్రామం పులస్త్యపులహాశ్రమం కాలాంజనాత్ప్రత్యాజగామ. 27

టీ:- ఇతీతి. తేన. కాలేన నిగూఢః అనావిష్కృతో నిర్వేదో యేన,

ఈ విధముగా మృగజన్మలోనున్న భరతుడు వైరాగ్య స్వభావమును తనలో నుంచుకొని తన మృగమాతను, తన జన్మభూమి యగు కాలాంజన పర్వతమును వదిలి, శాంతస్వభావు లగు మునులకు ప్రియమగు భగవత్ క్షేత్రమగు గండకీనది ప్రాంతములోని పులహ పులస్త్యాశ్రమమునకు వెళ్ళెను. 27










సాలావృక్షోపలక్షితం గ్రామం కాలాంజనాత్ యత్ర హరిణో జాతః తస్మాత్పర్వతాత్. 27

చూ॥ తస్మిన్నపి కాలం ప్రతీక్షమాణస్సంగాచ్చ భృశమద్విగ్న ఆత్మ సహచరశ్శుష్కపర్ణతృణవీరుధా వివర్తమానో మృగత్వనిమిత్తావసానమేవ గణయన్మృగశరీరం తీర్థోదకక్లిన్నముత్ససర్జ. 28

టీ:- తస్మిన్నితి. ఆత్మైవ సహచరో యస్య ఏకాకీ ప్రతీక్షణస్యైవ ప్రపంచః మృగత్వనిమిత్తే తీర్థోదకేన క్లిన్నం ఆర్ద్రం అర్ధోదకస్థమిత్యర్థః. 28

ఆ పులహాశ్రమములో ఉంటూ కూడా భరతుడు కాలమునకు ఎదురుచూస్తూ అందరితో కలియుటకు మిక్కిలి భయపడి ఒక్కడే వసిస్తూ ఎండుటాకులు, గడ్డి, లేతఆకులు (చిగుళ్ళు) తిని జీవితము గడుపుచూ, మృగజన్మనొందుటకు కారణమైన ప్రారబ్ధకర్మ నాశనమునకై చూస్తూ తన మృగశరీరమును గండకీనదీ తీర్థోదకముల నానుకొని వదిలెను. 28

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, అష్టమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**




 



## నవమోऽధ్యాయః

చూ॥ పితుః ప్రాప్తాత్మవిజ్ఞానో భరతో మృగతాం గతః. ప్రారబ్ధకర్మ వేగేన తదంతే జడవిప్రతాం. నవమే జడవిప్రత్వే తస్య రాగాద్యభావతః భద్రకాళీపశుత్వేऽపి నిర్వికారత్వమీర్యతే.

## 9వ అధ్యాయము

తండ్రియగు ఋషభదేవుని నుండి ఆత్మజ్ఞానమును పొందిన భరతుడు ప్రారబ్ధకర్మ వశమున మృగరూపమొందెను. ఆ పిదప జడుడగు విప్రత్వమొందెను. ఈ తొమ్మిదవ అధ్యాయమున జడ విప్రుడైన భరతున్ని భద్రకాళికి బలిపశువుగా గొని పోబడినను, ఆతనికి రాగాదులు లేకుండుటచే ఏ మాత్రము వికారము లేకుండుట తెలుపబడుచున్నది.

### శ్రీ శుక ఉవాచ

చూ॥ అథ కస్యచిద్ద్విజవరస్యాంగిరస ప్రవరస్య శమదమతపస్స్వాధ్యాయాధ్యయనాధ్యాపన సంతోషతి తిక్షాప్రశ్రయత్యాగవిద్యానసూయాత్మజ్ఞాన నంద యుక్తస్యాత్మసదృశశ్రుతశీలాచారరూపౌదార్యగుణా నవ సోదర్యా అంగజా బభూవుః మిథునం చ యవీయస్యాం భార్యాయాం. 1

టీ:- అథేతి. ఆంగిరసగోత్రజానాం ప్రవరస్య శ్రేష్ఠస్య శమాదియుక్తస్యః త్యాగోऽత్రాతిథ్యాదిభ్యోऽన్నదానాది. విద్యాకర్మవిద్యా. ఆత్మజ్ఞానం దేహాది వ్యతిరిక్తభోక్త్రాత్మజ్ఞానం. ఆనందో ధర్మ సంపత్తిజః. ఆత్మనా సదృశాః శ్రుతాదయో గుణాః యేషాం తే. సమానోదరా నవపుత్రా బభూవుః. యవీయస్యాం కనిష్ఠాయాం చ మిథునం స్త్రీపుంసయుగ్మం. 1

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా! శమదమతపస్స్వాధ్యాయ వేదాధ్యయనము, అధ్యాపనము, త్యాగము, సంతోషము, ఓరిమి, వినయము, శాస్త్రవిహిత కర్మాచరణము, విద్య, ఇతరుల గుణసంపత్తి యందు దోషచింతనలేని అనసూయత్వము, అతిథి మొదలగు వారికి భోజనమిడుట, ఆత్మకర్తృత్వ భోక్తృత్వములను ఆత్మజ్ఞాన ధర్మపాలన ద్వారా కలుగు సుఖము మున్నగు సమస్త గుణములు కలిగి అంగిరగోత్రజులలో శ్రేష్ఠుడగు బ్రాహ్మణునకు ఆతని పెద్దభార్య యందు అతనితో సమానమగు విద్య, శీల, ఆచార, రూప, ఔదార్యాది గుణములుగల తొమ్మండుగురు పుత్రులు కలిగిరి. చిన్న భార్యయందు ఒక పుత్రుడు ఒక పుత్రిక కవలలుగా జన్మించిరి. 1

 








చూ॥ యస్తు తత్ర పుమాంస్తం పరమభాగవతం రాజర్షిప్రవరం భరత ముత్సృష్ట మృగశరీరం చరమశరీరేణ విప్రత్వం గతమాహుః. 2

టీ:- య ఇతి. ఉత్సృష్టం మృగశరీరం యేన. శ్లో.'శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయత' ఇతి స్మృతేః. 2

చూ॥ తత్రాప్యన్యజనసంగాచ్చ భృశముద్విజమానో భగవతః కర్మ బంధ విధ్వంసన శ్రవణ స్మరణ గుణవివరణం చరణారవింద యుగళం మనసా విదధాన ఆత్మనః ప్రతిఘాతమాశంకమానో భగవదను గ్రహేణానుస్మృత స్వపూర్వజన్మావళిరాత్మానమున్మత్త జడాంధబధిర స్వరూపేణ. దర్శయామాస లోకస్య. 3

టీ:- తత్రాపీతి తత్రాపిచాన్యసంగాదాత్మనో భ్రంశమాశంకమానః ఆత్మానమున్మత్తాదిరూపేణ దర్శయామాసేత్యన్వయః. కిం కుర్వన్ కర్మబంధవిధ్వంసనం శ్రవణం స్మరణం గుణానాం వివరణం కథనం చ యస్య తత్. భగవతశ్చరణారవిందయుగళం మనసా విశేషేణ ధారయన్. ప్రతిభూతశంకాయాం హేతుః అనుస్మృతా స్వీయా పూర్వజన్మ నామావళిః పరంపరా యేన. 3

ఈ కవలలోని బాలుడు పరమభాగవతుడు రాజర్షిశ్రేష్ఠుడగు భరతుడు. ఆతడు మృగశరీరమును వదిలి బ్రాహ్మణుడాయెను. ఆచార వ్యవహారవంతులు, గొప్పవారి గృహములో యోగభ్రష్టులు (గతజన్మలో యోగాభ్యాసం చేస్తూ పూర్తికాకుండానే మరణించినవారు) జనించెదరని స్మృతి వాక్యము. 2

భగవత్కృపతో ఈ విప్రజన్మలో కూడా పూర్వజన్మ పరంపరా జ్ఞానముండుటచే మళ్ళీ విఘ్నములు రాగలవేమోనను శంకతో (స్వజన) సాంగత్యమునకు భీతిల్లి, కర్మ బంధఛేదన మొనరించు భగవంతుని శ్రవణ స్మరణ గుణగానములను ఎల్లప్పుడూ చేస్తూ భగవచ్చరణారవింద యుగళమును మనస్సున నిలుపుతూ, ఇతరులకు తనను ఉన్మత్తునిగా, మూర్ఖునిగా, అంధునిగా, బధిరునిగా కనిపింప చేయుచుండెను. 3









చూ॥ తస్యాపి హ వావాత్మజస్య స విప్రః పుత్రస్నేహానుబద్ధమనా ఆసమావర్తనాత్సంస్కారాన్ యథోపదేశం విదధాన ఉపనీతస్య చ పున శ్శౌచాచమానాదీన్ కర్మనియమాననభిప్రేతానపి సమశిక్షయదనుశిష్టేన హి భావ్యం పితుః. పుత్రేణేతి. 4

టీ:- తస్యేతి. పుత్రస్నేహానుబద్ధం మన యస్య. జడస్యగార్హస్థ్యే అనధి కారాత్. సమావర్తనాంతాన్ సంస్కారాన్ విదధానస్తముపనీయ. ఉప నీతస్య పునశ్శౌచాదీన్ తస్యానభిప్రేతానపి శిక్షితవాన్. తత్ర హేతుః. అనుశిష్టేన హి భావ్యం పితుస్సకాశాత్పుత్రేణేతి. 4

కొడుకుపైన అనురాగముతో కూడిన మనస్సుగల ఆ బ్రాహ్మణుడు ఉన్మత్తుడుగానున్న పుత్రునకు (మూర్ఖునకు గృహస్థా శ్రమాధికారము లేనందున) వివాహమునకంటే ముందుండెడి సమా వర్తనము వరకు గల సమస్త సంస్కారములను యథావిధి గాచేయదలచి అతనికి ఉపనయనమొనరించి, ఆతనిచే కోరబడనప్పటికిని పుత్రునకు బోధించడం తండ్రి కర్తవ్యము కావున శాస్త్రోక్త ప్రకారమున ఆతనికి శౌచాచమనాది కర్మలను నేర్పెను. 4

చూ॥ స చాపి తదుహ పితృసన్నిధావేవాసధ్రీచీనమివస్మ కరోతి ఛందాంస్యధ్యాపయిష్యన్ సహ వ్యాహృతిభిస్సప్రణవశిరస్త్రిపదీం సావిత్రీం గ్రైష్మవాసంతికాన్ మాసానధీయానమప్యసమవేతరూపం గ్రాహయామాస. 5

టీ:- స ఇతి. సోऽపి చ పితుశ్శిక్షానిర్బంధనివృత్తయే అసధ్రీచీన మసమీచీనమివకరోతి స్మ. ఉపాకర్మ వేదవ్రతాద్యనంతరం శ్రావణాది మాసేషు వేదానధ్యాపయిష్యన్. ఆదౌతావద్వ్యాహృతిభిస్సహ ప్రణవ శిరస్సహితాం త్రిపదీం చైత్రాదీన్ చతురో మాసాన్ అధీయానమప్యస మవేతరూపం యథా భవత్యేవం గ్రాహయామాస. తావతాపి కాలేన స్వరానుపూర్వ్యాది యుక్తం వ్యాహృత్యాది తస్య నాగతమిత్యర్థః. 5

భరతుడు తండ్రి బోధనానిర్బంధము తొలగించుకొనవలయు నను ఉద్దేశ్యముతో తండ్రి సన్నిధిలోనే తండ్రి చెప్పినదానికి విరుద్ధ మొనరించుచుండెను. తండ్రి ఉపాకర్మ పిదప శ్రావణాది మాసములలో వేదాధ్యయనము చేయించబూని, మొదట చైత్రాది నాలుగు మాసము -లలో వ్యాహృతులతో గూడిన శిరోమంత్రమగు ప్రణవముతో కూడిన త్రిపద గాయత్రీ మంత్రమును బోధించినప్పటికినీ, భరతునిచే చక్కగా గ్రహింపచేయలేకపోయెను. 5








చూ॥ ఏవం స్వతనుజ ఆత్మన్యనురాగావేశిత చిత్తశ్శౌచాచమనాధ్యయన వ్రతనియమగుర్వనల శుశ్రూషణాద్యౌపకుర్వాణకస్య కర్మాణ్యనభియుక్తాన్యపి సమనుశిష్టేన భావ్యమిత్యసదాగ్రహః పుత్రమనుశాస్య పితా స్వయం తావదనధిగతమనోరథః కాలేనాప్రమత్తేన స్వయం గృహ ఏవ ప్రమత్త ఉపసంహృతః. 6

టీ:- ఏవమితి. ఆత్మభూతే స్వతనుజే. అనురాగేణావేశితం, చిత్తం యేన. శౌచాదీని యాని ఔపకుర్వాణస్య సావధిబ్రహ్మచర్యవతః కర్మాణి తేనానభియుక్తాన్యనాదృతాన్యపి తం పుత్రం ప్రత్యనుశాస్యాపి అప్రాప్త పుత్ర పాండిత్య మనోరథః స్వయం కాలేనోపసంహృతః మృత ఇత్యర్థః . అనుశాసననిర్బంధేన పునస్తమేవ హేతుమాహ - అనుశిష్టేన భావ్యమితి అసన్ అయోగ్యః ఆగ్రహో యస్య. 6

ఈ విధముగా ఆ బ్రాహ్మణుడు పుత్రుడు ఆదరించనప్పటికిని, అతని యందలి అనురాగముతో అతనికి చక్కని శిక్షణ నొసంగవలెనను మోహావేశముతో ఉపకుర్వాణ బ్రహ్మచారి ఆచరించదగు శౌచ, వేదాధ్యయన, వ్రత నియమమగు గురుసేవ, అగ్నిసేవ మొదలగు నియమముల శిక్షణ నొసంగి తన పుత్రుడు సుశిక్షితుడు కావలయునను కోరిక తీరకుండగనే, గృహ కృత్యములలో నిమగ్నుడై కాలధర్మము నొందెను. 6

చూ॥ అథ యవీయసీ ద్విజసతీ స్వగర్భజాతం మిథునం సపత్న్యా ఉపనిధాయ స్వయమనుసంస్థయా పతిలోకమగాత్ - పితర్యుపరతే భ్రాతర ఏనమతత్ప్రభావవిదస్త్రయ్యాం విద్యాయామేవ పర్యవసిత మతయో నపరవిద్యాయాం జడమతిరితి భ్రాతురనుశాసన నిర్బంధాన్న్య వివృత్సంత. 7

ఆ బ్రాహ్మణుని చిన్నభార్య తనకు కలిగిన కవలలను తన సవతికి అప్పగించి సహగమనమొనర్చి తన పతిని చేరెను. ఆ విధముగా తండ్రి మరణించగా త్రయీవిద్యలో నిష్ణాతులు, బ్రహ్మజ్ఞాన రూపమగు పరావిద్య తెలిసినవారగు ఆ తొమ్మండుగురు భ్రాతలు ఈ భరతుని మూర్ఖునిగా భావించి శిక్షణానిర్బంధ మొనరించకుండిరి. 7








టీ:- అథేతి. సపత్న్యై సమర్ప్య అనుసంస్థయా అనుమరణేన. సప్తమ్యంతపాఠేऽప్యయమేవార్థః నిర్బంధాన్న్యవివృత్సంత. నివర్తితు మైచ్ఛన్ నివృత్తా ఇత్యర్థః. 7

చూ॥ స చ ప్రాకృతైర్ద్విపద పశుభిరున్మత్త జడ బధిరేత్యభిభాష్యమాణో యదా తదనురూపాణి ప్రభాషతే కర్మాణి చ కార్యమాణః పరేచ్ఛయా కరోతివిష్టితో వేతనతో వాయాచ్ఞయా వా యదృచ్ఛయా వోపసాదిత మల్పం బహుమృష్టం కదన్నం వాభ్యవహరతి పరం నేంద్రియ ప్రీతి నిమిత్తమ్. 8

ఆ భరతుడు ప్రాకృతిక నరపశువులచేత ఉన్మత్తుడు, మూర్ఖుడు బధిరుడని పలకబడగా, దానికి తగినట్లుగానే పలుకుచూ, ప్రవర్తిస్తూ ఎవరైనా ఏ కార్యమైనా చేయుటకాదేశించిన ఆ కార్యము నిర్వర్తిస్తూ , అనగా పరేచ్ఛగా కార్యములను నిర్వహిస్తూ ఉండేవాడు. అమూల్య-ముగా బలవంతముగా చేయించెడి కర్మ విష్టి . పనిచేసి మూల్యమును గ్రహించుట వేతనము. విష్టి, వేతన, యాచన లేదా దానంతటదే లభించిన స్వాద్వన్నము లేక దురన్నమును జీవిక కొరకై భుజించు-చుండెను. ఇంద్రియ ప్రీతికొరకు మాత్రము భుజించలేదు. (జిహ్వా రుచికొరకై భుజించడము లేదు) 8

టీ:- స ఇతి.యదాభిభాష్యమాణః. తదా తదనురూపాణి ప్రభాషతే మూల్యమంతరేణ బలాద్యత్కర్మకార్యతే సా విష్టిః. వేతనం మూల్యం. విష్ట్యాదిభిరుపసాదితముపహృతం అన్నం అభ్యవహరతి. పరం భుజ్తే. కేవలం. న త్వింద్రియ ప్రీతయే. 8

చూ॥ నిత్య నివృత్త నిమిత్త స్వసిద్ధ విశుద్ధానుభవానంద స్వాత్మ లాభాధి గమస్సుఖ దుఃఖయోర్ద్వంద్వ నిమిత్తయోరసంభావిత దేహాభిమానః. 9

భరతునకు ద్వంద్వ విచారము లేదని తెలుపుతూ రెండు కారణములను తెలుపుచున్నాడు.

భరతునికి స్వభావ సిద్ధముగా అలవడిన విశుద్ధానందము వలన ఆతనికి దేహాభిమానము తొలగిపోయినది. దానితో ద్వంద్వ





టీ:- అత్ర హేతుద్వయమాహ – నిత్యేతి. నిత్యం సదా నివృత్తనిమిత్తం యస్మాత్. ఉత్పాదకశూన్యః స్వసిద్ధః. అభివ్యంజకశూన్యః విశుద్ధః. కేవలో యోఽనుభవః స ఏవానందరూపః స్వాత్మా తస్య లాభః ఏవం భూతోఽహమితి జ్ఞానం. తస్యాధిగమః. ప్రాప్తిర్యస్య ద్వంద్వాని సన్మానావమానాదీని. తద్ధేతుకయోస్సుఖదుఃఖయోః అకృతదేహాభిమానః. తస్మాన్నేంద్రియప్రీతినిమిత్తమభ్యవహరతీత్యన్వయః. 9

చూ॥ శీతోష్ణ వాత వర్షేషు వృష ఇవానావృతాంగః పీనస్సంహననాంగః స్థండిల సంవేశనానున్మర్దనామజ్జన రజసా మహామణిరివా న భివ్యక్త బ్రహ్మవర్చసః కుపటావృత కటిరుపవీతేనోరుమషిణా ద్విజాతిరితి బ్రహ్మబంధురితి సంజ్ఞయా తదజ్ఞజనావమతో విచచార. 10

టీ:- శీతేతి. అత ఏవ శీతోష్ణాదిష్వనావృతాంగస్సన్ విచచారేత్యన్వయః. కీదృశః పీనః పుష్టః. సంహననాంగః సంహన్యంతే నిబిడీ భవంతి అంగాని. అస్య కఠినావయవ ఇత్యర్థః.స్థండిలసంవేశనం భూమి శయనం. అనున్మర్దనం మర్దనాభావః. అనున్మజ్జనం స్నానాభావః. తైర్యద్రజః తేనాప్రకటం బ్రహ్మవర్చసం బ్రాహ్మం తేజో యస్య. యథా రజస్సంవృతో మహామణిరనభివ్యక్తతేజా భవతి. కుత్సితేన పటేనావృతా కటిర్యస్య. ఉరుమషిణా అతిమలేన. తత్త్వతస్తం న జానంతి యే తైర్జ్ఞనైరమతస్సన్. 10

నిమిత్తములగు సుఖ దుఃఖములు అతనికి తెలియలేవు. అనగా ఇంద్రియప్రీతి నిమిత్తము వ్యవహారము చేయకుండెనని అన్వయము. 9

శరీరముపై వస్త్రము ధరించక చలి, వేడి, ఎండ, గాలి, వర్షముల లోను ఎద్దువలె తిరిగెడివాడు. పుష్టికల కఠినములైన అవయవములు కలిగి శరీరమునకు తైల మర్దనములేక, స్నానములేక, మట్టిగొట్టిపోయి, నేలపైననే పడుకొని ఉండేవాడు. మట్టితో కప్పబడిన మణివలె, ప్రకాశించని బ్రహ్మతేజస్సు కలిగి, కేవలము కటి స్థలమున మాత్రము మలినమగు చిన్న వస్త్రముతో, మలినమగు యజ్ఞోపవీతముతో ఉండుటచే అతని నిజతత్వమెరుగక, ద్విజుడని, అధమ బ్రాహ్మణుడని జనులు అవమానించుచుండగా తిరుగుచుండెను. 10

చూ॥ యదా తు పరత ఆహారం కర్మ వేతనత ఈహమానః స్వభ్రాతృభిరపి కేదారకర్మణి నిరూపితస్తదపి కరోతి - కింతు నసమ విషమ న్యూనమధికమితి వేదకణపిణ్యాకఫలీకరణకుల్మాషస్థాలీ పురీషాదీన ప్యమృతవదభ్యవహరతి. 11

టీ:- యదేతి. యదా తు పరేభ్యః కర్మమూల్యేనాహారమపేక్షమాణో భవతి తదా కేదారకర్మణి శాలిక్షేత్రే కర్దమవిలోడనాదౌ ఆహార ప్రలోభనేన నియుక్తస్సన్ కరోతి కింత్వత్రకర్దమస్య ప్రక్షేపే క్షేత్రం సమం భవేత్. ఇత ఉద్ధరణే విషమం స్యాదిత్యాది న వేద. భ్రాతృభిర్దత్తాన్ కణాదీనపి అమృతవదభ్యవహరతి భుఙ్క్తే. కణాః చూర్ణతండూలాః. పిణ్యాకం తైలం యత్రోద్ధృతం తిలపిష్టం. ఫలీకరణం తుషాః. కుల్మాషాః కీటదష్టా మాషాః. స్థాలీపురీషం స్థాలీలగ్నం దగ్ధాన్నం. 11

భరతుడు ఇతరుల పనులు చేసిపెట్టి, ఆహారమును స్వీకరించుచుండ అతని అన్నలును భరతున్ని పొలం పనిలో నియమించిరి. ఆ కర్మనుకూడా ఆచరించుచుండెను. బురదను పల్లములో వేసిన క్షేత్రము సమమగును. బురదను తీసిన విషమము (అనగా ఎత్తుపల్లములు కలిగినది) అగుననికూడా తెలుసుకోలేకపోయెను. తన అన్నలు ఒసగిన నూకలు, తేలికపిండి (నూనెతీసివేయబడిన తిలపిష్టము) తౌడు, ఊక, పురుగులు పట్టిన మినుములు, మాడిన అన్నము మొదలగు వానిని అమృతమువలెనే భుజించుచుండెను. 11

చూ॥ అథ కదాచిత్కశ్చిద్వృషల పతిర్భద్రకాళ్యై పురుష పశుమాలభతాపత్య కామః. 12

టీ:- శ్లో."తస్య రాగాదిరాహిత్యమలౌల్యం చైవమీరితమ్, అథాన్యచ్చరితం ప్రాహచిత్రం మృత్యావసంభ్రమం శ్రీధరీయోయంశ్లోకః. అథేతి వృషలపతిశ్శూద్రసామంతశ్చోరరాజః. ఆలభత ఆలబ్ధుం ప్రవృత్తః. 12

భరతునికి కోరికలు లేకపోవుటను చెప్పి, అతనికి మృత్యువు నందుకూడా సంభ్రమములేని వేరే చిత్రమగు విషయమును తెలుపు-చున్నాడు. (ఇది శ్రీధరాచార్యుల శ్లోకము) . చోరులకు పతియగు శూద్ర సామంతరాజు పుత్రకామనతో భద్రకాళికి పురుషడగు పశువును బలి ఇవ్వదలిచెను. 12

  

చూ॥ తస్య హ దైవముక్తస్య పశోః పదవీం తదనుచరాః పరిధావంతో నిశి నిశీథసమయే – తమసా వృత్తాయామనధిగతపశవః – ఆకస్మికేన విధినా కేదరాన్వీరాసనేన మృగవరాహాదిభ్యోऽభిరక్ష్యమాణమాంగిరస ప్రవణసుతమపశ్యన్. 13

ఆ శూద్రరాజుచే దైవబలికి తీసుకరాబడిన పురుషుడు అదృష్ట వశమున బంధములనుండి తప్పించుకొని పారిపోగా ఆ రాజసేవకులు చీకటితో నిండిన మధ్యరాత్రి వేళలో అతనిని వెదకుచూ. ఆకస్మికముగా, పొలము వద్ద మృగ, వరాహాదుల నుండి పంటను రక్షించుటకు కాపలాగా నిలబడియున్న భరతుని గాంచిరి. 13

టీ:– తస్యేతి. దైవాత్ బంధన విముక్తస్యపశోః. తమసా వ్యాప్తాయాం నిశి. తత్రాపి నిశీథసమయే అర్ధరాత్రావసరే. ఆకస్మికః దైవనిర్మితో విధిః ప్రకారః. తేన వీరాసనేన ఊర్ధ్వావస్థానేన. 13

చూ॥ అథ తఏవమన్యవద్య లక్షణమవమృశ్య భర్తుః కర్మనిష్పత్తిం మన్యమానాః – బద్ధ్వా రశనయా చండికా గృహముపనిన్యుర్ముదా వికసిత నయనాః. 14

ఈ రాజానుచరులు భరతున్ని తమకు కావలసిన లక్షణములున్న వానిగా గ్రహించి ఈతనితో తమ ప్రభు కార్యము సిద్ధించగలదని తలచి, సంతోషముతో ముఖములు వికసించగా భరతున్ని తాళ్ళతో బంధించి కాళికాలయమునకు కొనిపోయిరి. 14

టీ:– అథేతి. అవమృశ్య జ్ఞాత్వా. 14

చూ॥ అథ ఫణయస్తం స్వవిధినాభిషిచ్యాహతేన వాససాచ్ఛాద్య భూష ణానులేపన స్రక్తిలకాదిభిరుపస్కృతం భుక్తవంతం – ధూప దీప మాల్య లాజకిసలయాంకుర ఫలోపహారోపేతయా వైశససంస్థయా మహతా గీతస్తుతిమృదంగ ఫణఘోషేణ చ – తం పురుషపశుం భద్రకాళ్యాః పురుత ఉపవేశయామాసుః. 15

చోరులగు ఆ శూద్రరాజానుచరులు భరతుని తమ పద్ధతి ననుసరించి అభిషేకించి, నూతన వస్త్రములను ధరింపచేసి, చందన పుష్పమాల, తిలకాదులతో అలంకరించి సుష్టుగా భుజింపచేసి ధూపము, దీపము, మాలలు, పేలాలు, చిగురుటాకులు, ఫలములు మున్నగు ఉపహార సామగ్రితో గూడిన బలి (హింసా) పద్ధతితో గీతములు, స్తుతులు, మృదంగము, డోలు, మొదలగు వాని గొప్ప

 






టీ:- అథేతి. ఫణయః చోరాః. అహతేన నూతనేన ఉపస్కృత మలంకృతం వైశససంస్థయా హింసావిధానేన గీతాది ఘోషేణ చ సహ. 15

చూ॥ అథ వృషల రాజఫణిః - పురుషోపశోరసృగాసవేన దేవీం భద్రకాళీం యక్షమాణః - తదభిమంత్రితమసిమతికరాళం నిశితముపాదదే. 16

టీ:- అథేతి. వృషలరాజస్య ఫణిః పురోహితత్వేన వర్తమానశ్చోరః తదభిమంత్రితం భద్రకాళీమంత్రాభిమంత్రితం. 16

చూ॥ ఇతి తేషాం వృషలానాం రజస్తమః ప్రకృతీనాం ధన మదరజ ఉత్సిక్తమనసాం భగవత్కళాయుక్తం వీరకులం కదర్థీకృత్యోత్పథేనస్వైరం విహరతాం హింసావిహారాణాం - కర్మాతి దారుణం యద్బ్రహ్మభూతస్య - సాక్షాద్బ్రహ్మర్షిసుతస్య - నిర్వైరస్య సర్వభూతసుహృదస్సూనాయామప్యనుజ్ఞాతాయామనభిమతమాలంభనం తదుపలభ్య - బ్రహ్మతేజసాతిదుర్విషహేణ. దందహ్యమానేన వపుషా సహసోచ్చచాల సైవ దేవీ భద్రకాళీ. 17

టీ:- ఇతీతి. ధనమద ఏవ రజః. తేనోత్సిక్తం త్యక్తమర్యాదం మనో

ధ్వనులు చేస్తూ, పురుషపశువగు భరతుని కొనిపోయి భద్రకాళి ముందు కూర్చుండబెట్టిరి. 15

ఆ పిమ్మట వృషలరాజ పురోహితుడగు చోరుడు పురుష పశువు యొక్క రక్తముతో భద్రకాళిని పూజించుటకు (తృప్తిపరచుటకు) భద్రకాళీ మంత్రముచే అభిమంత్రితమైన నిశిత ఖడ్గమెత్తెను. 16

ఆ చోరులు రజస్తమగుణోపేతులు. ధనమదము అనే రజోగుణముచే మర్యాదను త్యజించి బ్రాహ్మణులను లెక్కపెట్టక తిరస్కరిస్తూ, ఆపత్సమయములో కూడా నిషేధించబడిన బ్రాహ్మణవధ చేయుటకు పూనుకొనిరి. హింసామార్గానుసారులు కావున బ్రహ్మీభావము నొందినట్టి ఎవరి యందును ద్వేషభావము లేనట్టి సర్వప్రాణులయందు సుహృద్భావముగల సాక్షాత్తు బ్రహ్మర్షి సుతుడగు ఆ భరతుని బలికొరకై వధించబోగా దారుణమగు ఆ బ్రాహ్మణహింసాకర్మనుగాంచిన భద్రకాళి చూచుటకు కూడా శక్యముగాని బ్రహ్మతేజస్సుతో ప్రకాశించే దివ్యమైన శరీరముతో ఆ ప్రతిమనుండి హఠాత్తుగా ప్రత్యక్షమయ్యెను. 17









యేషాం భగవత్కళాయుక్తం వీరాణాం బ్రాహ్మణానాం కులం తుచ్ఛీకృత్య యథేచ్ఛం వర్తమానానాం యత్కర్మ తదుపలభ్యః. దేవీ ఉచ్చచాల ప్రతిమాం త్యక్త్వాబహిన్నిర్గతా కథంభూతం ఆలంబనం సూనాయా జ్ఞాతాయాం అననుజ్ఞాతం భద్రకాల్యైత్యేవ గంతవ్యం యద్వా సూనా-యాం హింసాయామప్యనుమతస్య తస్య దుర్విషహేణ తేజసా. 17

చూ॥ భృశమమర్ష రోషావేశరభసవిలసిత భ్రుకుటీవిటపకుటిల దంష్ట్రా రుణేక్షణాటోపాతిభయానక వదనా – హంతుకామే వేదం మహాట్టహాస మతి సంరంభేణ విముంచంతీ – తత ఉత్పత్య పాపీయసామదృప్తానాం – తేనైవాసినా వివృక్ణ శీర్ష్ణాం గళాత్స్రవంతమసృగాసవమత్యుష్ణం సహ గణేన నిపీయాతి పానమదవిహ్వలోచ్చైస్తరాం – స్వపార్షదైస్సహ. జగౌ న విజహార చ శిరః కందుకలీలయా. 18

టీ:– భృశమితి. అమర్షః అపరాధాసహనం కోపశ్చ వపుషో దాహేన తయోరావేశస్య రభసేన వేగేన విలసితో విజృంభితో భ్రుకుటిలక్షణో విపటశ్శాఖా కుటిలాః దంష్ట్రాశ్చ అరుణాని ఈక్షణాని చ తేషామాటోపః సంభ్రమః. తేనాపిభయానకం వదనం యస్యాః. ఇదం జగద్ధంతు ముద్యతేవ మహాంతం అట్టహాసం సన్నాదం హాసం తతః స్థానాదుత్పత్య వివృక్ణాని ఛిన్నాని శీర్షాణి యేషాం తేషాం గణేన పరివారేణ సహ శిరాంస్యేవ కందుకాని తేషాం లీలయా చిక్రీడ చ. 18

ఆ చోరుల యొక్క అపరాధమును సహించని, పట్టరాని క్రోధావేశముతో కనుబొమ్మలు ముడివేసి, భయంకరమైన కోరలతో ఎర్రబారిన నేత్రముల ఆటోపముతో, మిక్కిలి భయంకరమగు వదనము కల ఆ భద్రకాళి ఈ జగత్తును సంహరించదలచినదా? అన్నట్లు తీవ్ర అట్టహాసముచేస్తూ తన స్థానమునుండి ఎగిరి బ్రాహ్మణ బలికై మంత్రించబడిన ఆ ఖడ్గముతోనే గర్వించినవారు, పాపపు బుద్ధిగల వారగు ఆ చోరుల శిరస్సులను ఖండించి వారి గళముల నుండి స్రవించెడి వేడివేడియగు రక్తమనే ఆసవమును తన పరివారముతో సహా పానముచేసి, మదోన్మత్తంగా గాన, నృత్యము నొనరించుచు చోరుల తలలనే బంతులతో క్రీడించెను. 18









చూ॥ ఏవమేవ ఖలు మహదభిచారాతిక్రమః కార్త్స్న్యేనాత్మని ఫలతి. 19

టీ:- నను కథం దేవ్యారాధకానాం ఏవం విపరీతం? తత్రాహ - ఏవమితి. మహత్సు అభిచారరూపాతిక్రమః అపరాధః. 19

దేవిని ఆరాధించు వారికి ఈ విపరీతమెలా కల్గినదనగా తెలుపుచున్నాడు. మహాత్ముల విషయమున చేయబడిన భయంకరమగు అపరాధము ఈ విధముగా తమకే (చేసినవారికే) దుష్ఫలితమునిచ్చును. ఆత్మ నాశనహేతువగును. 19

చూ॥ న వా ఏతద్విష్ణుదత్తమహాద్భుతం యదసంభ్రమః స్వశిరశ్ఛేద ఆపతితేఽపి, విముక్తదేహాద్యాత్మభావ సుదృఢ హృదయగ్రంథినాం సర్వసత్త్వ సుహృదాత్మనాం నిర్వైరాణాం సాక్షాద్భగవతా నిమిషారివ రాయుధేనా ప్రమత్తేన తైస్తైర్భావైరభిరక్ష్యమాణానాం తత్పాదమూల మకుతశ్చిద్భ యముపసృతానాం భాగవత పరమహంసానామ్. 20

టీ:- నన్వసంభావితమేవేదం యస్మరణేప్యవ్యాకులత్వం మారకేషు క్రోధాభావ ఇత్యాది, తత్రాహ - నేతి. విముక్తో దేహాద్యాత్మభావాదిలక్షణః సుదృఢో హృదయగ్రంథిర్యైః. సర్వసత్త్వానాం సుహృత్ ఆత్మా చ యేషాం తేషాం దేహాద్యభిమానసద్భావేఽపి మరణాదిభయమస్తీత్యాహ - సాక్షాద్భగవతా అభిరక్ష్యమాణానాం.కేన అనిమిషకాలః స ఏవారిః చక్రం తేన వరాయుధేన తైస్తైర్భావైః. అంతర్యామితయా ప్రవర్త్యమానైః భద్రకాళ్యాది రూపైశ్చ న కుతశ్చిదపి భయం యస్మిన్. భాగవతానాం భగవదుపాసకానాం త ఏవ పరమహంసాః తేషాం. 20

మరణమునందును అవ్యాకులత, తనను చంప చూచున్నవారి-పట్ల క్రోధరాహిత్యము ఎటుల సంభవమను విషయమును తెలుపు-చున్నాడు.

ఓ పరీక్షిద్రాజా! దేహాభిమానరూప సుదృఢమగు హృదయగ్రంథి భిన్నమై, సర్వప్రాణులయందు సుహృద్భావము, ఆత్మభావము కలిగి ద్వేషభావము లేక ఎవరుంటారో, సాక్షాత్తుగా భగవంతునిచేత తన కాలచక్రమనెడి శ్రేష్ఠమగు ఆయుధములతో అంతర్యామి యగుటచే ఆయా భావముతో, భద్రకాళ్యాది రూపములతో రక్షించబడుదురో , భగవంతుని పాదముల నాశ్రయించిన అలాంటి భగవద్భక్తులగు పరమహంసలకు భయమెక్కడిది. అలాంటివారికి మరణమునందునూ వ్యాకులతకానీ, చంపెడివారియందు క్రోధముగానీ కలుగదనుటలో ఆశ్చర్యమేమియూలేదు. 20

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, నవమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**



 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

## దశమోऽధ్యాయః

చూ॥ దశమే క్షిపతా రాజ్ఞా శిబికాం స్వాం వహన్మునిః ।
స్వదుర్వాదానువాదేన విజ్ఞాయాశు ప్రసాదితః ॥
ఏవం భూతావికారిత్వమజ్ఞ సర్వజ్ఞయోస్సమమ్ ।
ఇతి సర్వజ్ఞతాసిద్ధ్యై రహూగణకథేరణమ్ ।
రహూగణోనామ సింధుసౌవీరయోః రాజా తత్త్వజిజ్ఞాసుః ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ అథ సింధుసౌవీరపతేరహూగణస్య వ్రజత ఇక్షుమత్యాస్తటే తత్కులపతినా శిబికావాహ పురుషాన్వేషణ సమయే దైవనోపసాదితస్స ద్విజ ఉపలబ్ధః ఏషపీవా యువా సహనాంగో గోఖరవద్ధురం వోఢుమల మితి పూర్వం విష్టి గృహీతైస్సహ గృహీతః ప్రసభమతదర్హ ఉవాహ శిబికాం స మహానుభావః ॥ 1

టీ:- కపిలాశ్రమం యదాగచ్ఛతి తదా యద్వృత్తం తదాహ-అథేతి. ఇక్షుమత్యా నద్యాస్తీరే. తేషాం శిబికావాహకానాం. కులస్యనాథేన పీవా అతిపుష్టాంగః ఏష గౌరివ ఖర ఇవ చ. భారం వోఢుం సమర్థ ఇతి ధియా. పూర్వం యే విష్ట్యా బలాత్ గృహీతాః. తైస్సహ ప్రసభం బలాత్ గృహీతస్సన్అతదర్హోऽంసమహానుభావః. శిబికామువాహేత్యన్వయః. 1

## 10వ అధ్యాయము

ఈ పదియవ అధ్యాయమున భరత మహాముని రహూగణ మహారాజు పల్లకీమోస్తూ రహూగణునకు ఉపదేశమిచ్చుట, భరతునకు గల సర్వజ్ఞత్వసిద్ధి చూపుటకు రహూగణుని కథ తెలుపబడుచున్నది. సింధుసౌవీర దేశాధిపతియగు రహూగణుడను మహారాజు తత్త్వ జిజ్ఞాసుడై కపిలాశ్రమమునకు వెడలుచుండగా జరిగిన వృత్తాంతమును తెలుపుచున్నాడు.

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

సింధుసౌవీర పతియగు రహూగణమహారాజు ఇక్షుమతీనదీ తీరప్రాంతమున పల్లకినధిరోహించి వెడలుచుండగా పల్లకీబోయీల నాయకుడు పల్లకీ మోయుటకై బోయని వెదకుచు దైవవశాత్తుగా, పొలమునకు కావలిగాయున్న ఈ ద్విజశ్రేష్ఠుడగుపించెను. అపుడు ఆతడు ఈ యువకుడు పుష్టిగా కఠినములగు అవయవములు కలిగి వృషభమువలె, గాడిదవలె భారమును మోయసమర్థుడని తలచి పూర్వపు పల్లకీబోయీలతో సమముగా ఈతనిని బలవంతముగా పల్లకిని మోయుటకు నియోగించెను. భరతుడు పల్లకి మోయుటకు అర్హుడు కానప్పటికి ఆ మహానుభావుడు ఏమియు పలుకకక పల్లకిని ఎత్తుకొని మోయుచుండెను. 1

 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 






చూ॥ యదా హి ద్విజవరస్యేష మాత్రావలోకానుగతేర్న సమాహితా పురుష గతిస్తదా విషమగాం శిబికాం రహూగణ ఉపధార్య పురుషానధి వహత ఆహ–హే వోఢారస్సాధ్వభిక్రమత కిమితి విషమమూహ్యతే యానమితి. 2

టీ:– యదేతి. హింసాపరిహారార్థం. ఇషుమాత్ర ప్రదేశావలోకస్య. అను పశ్చాత్ యా గతిః. తస్యా హేతుభూతాయాః పురుషాణాం గతిః న సమ్యగాహితా ఏకరూపా నాభూత్. 2

చూ॥ అథ త ఈశ్వరవచస్సోపాలంభముపాకర్ణ్యో పాయాత్తురీ యాచ్ఛంకితమనసస్తం విజ్ఞాపయాం బభూవుః, న వయం నరదేవ ప్రమత్తాః భవన్నియమానుపథాస్సాధ్వేవ వహామః – కింత్వయమధునైవ ప్రయుక్తోऽపి న ధ్రుతం వ్రజతి నానేన సహ వోఢుమిహవయం పారయామ ఇతి. 3

టీ:– అథేతి. సోపాలంభం సాక్షేపం సామ దాన భేద దండేషూ పాయేషు చతుర్థాచ్ఛంకితచిత్తాః భవన్నియమానుపథాః త్వదాజ్ఞాను–వర్తినః న పారయామః న శక్నుమః. 3

ద్విజశ్రేష్ఠుడగు భరతుడు భూమిపైన సంచరించు క్రిమికీటకాదు లకు హింస కలుగకుండుటకు భూమిపై బాణ ప్రమాణ ప్రదేశముపై మాత్రమే దృష్టిసారించి అడుగులు వేయుచుండ మిగతా బోయీలతో తన గమనము కలువకుండెను. అపుడు పల్లకి ఎగుడుదిగుడుగా కదలటమును గాంచిన రహూగణ మహారాజు బోయీలతో ఓ వాహకులారా! చక్కగా నడవండి. పల్లకి ఎగుడుదిగుడుగా ఎందుకు మోయబడుచున్నదని పలికెను. 2

అపుడు బోయీలు తమ ప్రభువుయొక్క ఆక్షేప వచనములను విని సామ దాన భేద దండోపాయములను నాలుగు ఉపాయముల గురించి శంకించిన మనస్సు కలవారై (రాజు తమను చతుర్విధోపాయ ములతో శిక్షించునను భయముతో) ఓ ప్రభూ! మా దోషమేమియూ లేదు, మీ ఆజ్ఞానుసారము మేము చక్కగానే మోయుచున్నాము కాని ఇతడు ఇపుడే వాహకత్వమున నియమించబడినందున శీఘ్రముగా నడవడము లేదు. ఇతనితో కలసి మేము పల్లకిని మోయలేకున్నాము అని పలికిరి. 3









చూ॥ సాంసర్గికో దోష ఏవ నూనమేకస్యాపి సర్వేషాం సంసర్గికాణాం భవితుమర్హతీతి నిశమ్య కృపణవచో రాజా రహూగణ ఉపాసిత వృద్ధోపి నిసర్గేణ బలాత్కృత ఈషదుత్థితమన్యురవిస్పష్ట బ్రహ్మతేజసం జాతవేదసమివ రజసా వృతం తమసావృతమతి రాహ. 4

టీ:- సాంసర్గిక ఇతి. కృపణానాం వచో నిశమ్య సాంసర్గికః సంసర్గ నిమిత్తః. ఏకస్యాపి దోషః సర్వేషామేవ భవితుమర్హతీతి నిశ్చిత్య రహూగణ ఆహేత్యన్వయః. కథంభూతః. ఉపాసితా. వృద్ధాః యేన. సోऽపి స్వభావేన బలాత్పరవశః కృతస్సన్, కథంభూతం ప్రత్యాహ - న దృష్టం బ్రహ్మతేజో యస్మిన్. భస్మనాచ్ఛన్నమగ్నిమివ స్థితం. 4

చూ॥ అహో కష్టం భ్రాతర్వ్యక్తమురుపరిశ్రాంతోऽసిదీర్ఘమధ్వానమేక ఏవ సుచిరమూహితవాన్ - నాతిపీవా నాతిసహననాంగో జరసా చోపద్రుతో భవాన్ - సఖే నో ఏవాపర ఏతే సంఘట్టిన ఇతి బహు విప్రలబ్ధోప్యవిద్యా విహిత ద్రవ్యగుణకర్మాశయే స్వచరమకళేబరే, అవ స్తుని సంస్థాన విశేషే అహం మమేత్యనధ్యారోపిత మిథ్యాప్రత్యయః, బ్రహ్మభూతస్తూష్ణీం పూర్వవచ్ఛిబికామువాహ. 5

ఆ రహూగణరాజు దీనులగు ఆ బోయీల మాటలు విని దోషము ఒకనిదే అయినను అతనితో సంసర్గముగల అందరికీ దోషము కల్గునని నిశ్చయించి, మహాపురుషసేవ గావించిన వాడైనను క్షత్రియ స్వభావముతో బలవంతమగు తమో గుణముతో ఆవరించబడిన మనస్సుతో, కోపముగలవాడై నివురుగప్పిన నిప్పువలె, స్పష్టపడని బ్రహ్మ తేజస్సుగల ఆ భరతునితో ఇట్లు పలికెను. 4

అయ్యో సోదరా! మిక్కిలి అలసిపోతివి. చాలాదూరము, చాలాసేపు నీవొక్కడవే శిబికను మోసితివి. (నీ సహచరులు నీకు సహకరించరైరి) నీవు బలిష్ఠుడవు కావు. కఠినమైన అవయవములు లేవు. ముసలితనముతో పీడించబడుచున్నావు. ఓ మిత్రమా! ఈ నీ సహ వాహకులు నీకు సహకరించకపోయిరి. అని అనేక విధములుగా వక్రోక్తితో అపహాస్యము చేయబడికూడా, అజ్ఞానముచే నిర్మితములగు పంచభూత ఇంద్రియాంతఃకరణముల సమూహమగు తన యొక్క అంతిమ శరీరమునందు, వివిధాంగముల సమూహముతో





టీ:- అహో ఇతి. భ్రాతరితి సంబోధనం ఆక్షేపాభి ప్రాయం వ్యక్తం నిశ్చితం ఉరు అధికం పరిశ్రాంతోఽసీత్యాదీని విపరీతార్థాని షడ్వక్యాని ఊహితవాన్ ప్రాపితవాన్. తత్రాపి సుచిరం జరసా చ వృద్ధత్వేన. సంఘట్టినః సహచరాః న తథా భవంతి, ఏవం బహుధా విప్రలబ్ధోఽపి వక్రోక్త్యా ఉపహసితోఽపి తూష్ణీం ఉవాహేత్యన్వయః. తూష్ణీంభావే హేతుః – అవిద్యయా రచితాః ద్రవ్యాదయో యస్మిన్. సంస్థాన విశేషే అవయువవిన్యాసవిశేషరూపే. స్వచరమకళేబరే అనధ్యారోపితః మిథ్యాప్రత్యయో యేన తత్ర ద్రవ్యాణి మహాభూతాని గుణాః ఇంద్రియాణి కర్మాణి పుణ్యపాపాని. ఆశయః అంతఃకరణం. యతో బ్రహ్మభూతః. 5

చూ॥ అథ పునస్స్వశిబికాయాం విషమగతాయాం ప్రకుపిత ఉవాచ రహూగణః – కిమిదమర్థే త్వం జీవన్మృతో మాం కదర్థీకృత్య భర్తృ శాసనమతి చరసి ప్రమత్తస్య చ తే కరోమి చికిత్సాం దండపాణిరివ జనతాయాః – యథా ప్రకృతిం స్వాం భజిష్యస ఇతి. 6

టీ:- అథేతి. మామనాదృత్య భర్తుః స్వామినః. మమ శాసనమాజ్ఞాం. అతిక్రామసి. చికిత్సాం శాస్తిం. దండపాణిర్యమః. యథా జన సమూహస్య శాస్తిం కరోతి తథా స్వాం ప్రకృతిం అప్రమత్తతాం. 6

కానబడుచున్నదైనను వస్తుతః అవిద్యమానమగు శరీరమునందు 'నేను' నాదిఅను మిథ్యారోపణభావము నశించినవాడగుటచే బ్రహ్మభూతుడగు ఆ భరతుడు తూష్ణీం భావము (మౌనము) వహించి ఇంతకుముందు వలెనే శిబికను మోయుచుండెను. 5

ఆ పిమ్మట తానధిరోహించిన పల్లకి మళ్లీ ఎగుడుదిగుడుగా చలించుచుండగా మిక్కిలి కోపించిన రహుగణరాజు ఇటుల పలికెను. ఓరే బోయీ! ఇదేమిటి. శాసకుడనగు నా ఆజ్ఞను జీవచ్ఛవమువలె లెక్కచేయక అతిక్రమించుచున్నాడవు. మదించిన నీకు, జనులు చేసే అపరాధములకు యమధర్మరాజు దండన విధించినటుల దండనము గావించెదను. దానితో నీవు అప్రమత్తుడవు కాగలవు. 6






చూ॥ ఏవం బహ్వబద్ధమభిభాషమాణం నరదేవాభిమానినం – రజసా తమసానువిద్ధేన మదేన తిరస్కృతాశేష భగవత్ప్రియనికేతం – పండితమానినం – స భగవాన్ బ్రాహ్మణో బ్రహ్మభూతః – సర్వభూతసుహృదాత్మా యోగేశ్వరచర్యాయాం నాతివ్యుత్పన్నమతిం స్మయమాన ఇవ విగతస్మయ ఇదమాహ. 7

టీ:– ఏవమితి. అబద్ధమనన్వితం పరదేవోऽహమిత్యభిమానో యస్య తం అనువిద్ధేన సంగుణితేన. తిరస్కృతః అశేషః. సంపూర్ణో భగవతః ప్రియో నికేత ఆశ్రయో యేన తం. యద్వా. అశేషణాం భగవత్ప్రియాణాం నికేతః సర్వేషాం భూతానాం సుహృచ్చ. ఆత్మా చ యోగేశ్వరాణాం చర్యా జడాదివదాచరణం తస్యాం చాత్యంతం వ్యుత్పన్నా పరిచితా మతిర్యస్య తం. స్మయమానః హసన్నివేతి ముఖప్రసత్తిర్ద్యోత్యతే. విగతస్మయః గతదర్పః. 7

శ్లో॥ త్వయేరితం వ్యక్తమ విప్రలబ్ధం
భర్తుస్స మే స్యాద్యది వీరభారః ।
గంతుర్యదిస్యాదధిగమ్యమధ్వా
ప్రీవేతిరాశౌ న విదాం ప్రవాదః ॥ 8

ఈ ప్రకారముగా మిక్కిలి అసంబద్ధముగా (అనన్వితముగా) మాటలాడుచున్న, నేను రాజుననే అభిమానము కల్గియున్న, రజస్తమో గుణములచేత కల్గిన మదముతో తిరస్కరించబడిన భగవత్ప్రియాశ్రయము కల్గినట్టి (లేక సమస్త భగవత్ప్రియుల ఆశ్రయమును తిరస్కరించినట్టి) ఆ రహుగణునితో బ్రాహ్మణుడు బ్రహ్మభూతుడు సర్వప్రాణులకు మిత్రుడు. ఆత్మభూతుడునగు ఆ భరతుడు ఎలాంటి దర్పము లేక (అభిమానములేక) చిరునవ్వు నవ్వుచూ ఇటుల పలికెను. (7)

రహూగణుడు వక్రోక్తితో నీవు శ్రాంతుడవుకావు. చాలా దూరము రాలేదు అని ఏదైతే పలికెనో దానికి ఉత్తరముగానే చెప్పుచున్నాడు. ఓ రహూగణా! నీవు చెప్పిన శ్రమాధికము లేదనునది స్పష్టము. అటులనే లోకదృష్టితో సత్యమే కాగలదు. ఓ వీరుడా! భారమనే వస్తువేదైనా ఉన్నయెడల అది వహించువానికే భారమగును. దీపమునకే






టీ:- తత్ర వక్రోక్త్యా యదుక్తం త్వం చ న శ్రాంతః న చ దీర్ఘమధ్వాన మాగత ఇతి తత్రోత్తరమాహ - త్వమేతి యదీరితం ఉక్తం శ్రమాదినాస్తీతి తద్వ్యక్తం స్ఫుటం తత్తథైవ అవిప్రలబ్ధం లోకదృష్ట్యా సత్యం స్యాత్. తదేవాహ - హే వీర యది భారో నామ కశ్చిత్ స్యాత్ స చ భర్తుర్వోఢుః దేహస్య యది స్యాత్ న చ మే యది ప్రసక్తస్స్యాత్ తర్హీదానీం భారాభావాత్ విప్రలం భస్స్యాత్. న త్వేతదస్తి. భారస్య వోఢుశ్చా నిరూప్యత్వాత్. మమ చ తత్సం బంధాభావాత్. తథా గంతురధిగమ్యం ప్రాప్యమధ్వా వా యది స్యాత్ అద్ధేతి పాఠే సాక్షాత్ పరమార్థతః తచ్చ మే యది స్యాదిత్యాది యోజ్యం. యత్త్వయోక్తం నాతిపీవేతి.తత్రాహ - చేతన ముద్దిశ్య పీవేతి ప్రవాదోవిదాం విదుషాం నభవతి. కింతు మూర్ఖాణాం యతోఽయం ప్రవాదః రాశౌ భూతసంఘే దేహేన త్వాత్మని.దేహ ఏవ పీనో నాహమిత్యర్థః. 8

భారముకాని నాకు (ఆత్మకు) కాదు. అటులనే చేరవలసిన మార్గమున్న యెడల వెళ్ళేడు వానికి ఉండును. అది దేహమునకే కాని నాకు (ఆత్మకు) కాదు. మరియు నీవేదైతే "నాతిపీవా" అని పలికితివో అదియూ సరికాదు. చైతన్యము గురించి (ఆత్మను గురించి) బలసినావు అను మాట పండితులు పల్కునట్టిది కాదు. మూర్ఖులు మాత్రమే పల్కునది. ఏలనన బలసినావు అను ప్రవాదము భూతసంఘమగు దేహమునందే కాని ఆత్మయందు పొసగదు. అనగా నా దేహమే బలసియున్నది కాని నేనుకాదని తాత్పర్యము. 8

శ్లో॥ స్థౌల్యం కార్శ్యం వ్యాధయ ఆధయశ్చ
క్షుత్తృడ్భయం కలిరిచ్ఛా జరా చ।
నిద్రా రతిర్మన్యురహం మదశ్చ
దేహేన జాతస్య హి మే న సంతి ॥ 9

టీ:- ఏతత్ప్రపంచయతి - స్థౌల్యమితి. కలిః కలహః. అహంకారో మదశ్చ. దేహేన సహ. తదభిమానేన జాతస్య హి భవంతి మమ తు

దానిని విశదపరచుచున్నాడు. స్థూలత్వం కృశత్వం వ్యాధులు తాపత్రయములు (ఆధులు), ఆకలి దప్పికలు, భయము, కలహము, కోరిక, ముసలితనము, నిద్ర, రాగము, మోహము, అహంకారము, మదము ఇవన్నియు దేహాభిమానముతో జనించిన వారికి అనగా దేహాభిమానము కలవారికే కలుగును. నిరభిమానుడనగు 'నాకు' ఇవేవియు లేవు. 9






నిరభిమానస్య న సంతీత్యర్థః. యద్వా – దేహే జాతే యో జాతస్తస్యైవ తాని. మమ తు తత్ర న జాతస్య న సంతీతి. 9

శ్లో॥ జీవన్మృతత్వం నియమేన
రాజన్నాద్యంతవద్యద్వికృతస్య దృష్టమ్ ।
స్వస్వామిభావో ధ్రువ ఈడ్య యత్ర
తర్హ్యుచ్యతేఽసౌ విధికృత్యయోగః ॥ 10

టీ:– యచ్చోక్తం జీవన్మృతోఽసీతి, తత్రాహ. జీవన్మృతత్వమితి. జీవన్మృతత్వం న కేవలం మమ. కింతు వికృతస్య సర్వస్య పరిణామినో దృష్టం. యద్యస్మాత్. వికృతం ప్రతిక్షణమాద్యంతవత్. యదుక్తం భర్తృశాసనమతిచరసీతి, తత్రాహ – స్వం చ స్వామీ చ తయోర్భావః తత్తా. హే ఈడ్య. యత్ర పక్షే ధ్రువః. యది వ్యవస్థితస్స్యాదిత్యర్థః. తర్హి విధిర్నియోగః కృత్యం కర్మ తయోర్యోగో ధ్రువ ఇత్యుచ్యతే. ఉచితో భవతి"ఉచసమవాయ" ఇతి ధాతుః. యది తవ రాజ్యభ్రంశో మమ రాజ్యం స్యాత్ తదా సర్వమేతద్విపరీతం స్యాదిత్యర్థః. 10

శ్లో॥ విశేషబుద్ధేర్వివరం మనాక్చపశ్యామి యన్న వ్యవహారతోఽన్యత్।
క ఈశ్వరస్తత్ర కిమీశితవ్యమథాపి రాజన్ కరవామ కింతే ॥11

జీవచ్ఛవము అని ఏదైతే పలుకబడినదో దానిని తెలుపుచున్నాడు. ఓ రాజా! జీవన్మృతత్వం కేవలం నాకే కాదు. వికార రూపములగు ఎన్ని పదార్థములైతే కలవో వాటన్నిటిలో ఈ జీవన్మృ తత్వము కానబడుచున్నది. ఏలనన ఆ వికారములన్నియు ఆద్యంతములు కల్గియున్నవి. " భర్తృశాసనమునతిక్రమించుచున్నావ" ని ఏదైతే చెప్పబడినదో దానికి తెలుపుచున్నాడు. ఓ యశోవంతుడా! స్వామి సేవక భావము స్థిరమైనచో అచట యోగకర్మల (ఆజ్ఞపాలన) నియమము స్థిరమైయుండును. నీకు రాజ్యభ్రంశము నాకు రాజ్యము కల్గినయెడల ఇదంతయు విపరీతమగును. అప్పుడు నేను స్వామిని నీవు సేవకుడవగుదువు. కావున ఇవేవియు స్థిరములు కావని భావము. 10

నేనెంతవరకు రాజుగానుందునో అంతవరకు నీకు ప్రభువునే అగుదును అనుదానికి సమాధానము తెలుపుచున్నాడు. రాజు భృత్యుడు











టీ:- నను యావద్రాజాహం తావత్తవ స్వామీ భవామ్యేవేతి చేత్తత్రాహ - విశేషేతి. విశేషో రాజభృత్యాదిభేదస్తద్బుద్ధేః వివరమవకాశం, వ్యవహారాదన్యన్న పశ్యామి. మనాక్చ ఈషదపి, అథాపి తవాయమబి మానశ్చేత్తర్హి బ్రూహి కిం తే కరవామేతి. 11

చూ॥ ఉన్మత్తమూకాంధజడవత్స్వసంస్థాం గతస్యమే వీరచి కిత్సితేన
అర్థః కియాన్ భవతా శిక్షితేనస్తబ్ధ ప్రమత్తస్య చ పిష్టపేషః ॥12

టీ:- యత్తూక్తం ప్రమత్తస్యతే చికిత్సాం కరోమి యథా స్వాం ప్రకృతిం భజిష్యస ఇతి తత్రాహ - ఉన్మత్తేతి. ఉన్మత్తాదివద్వర్తమానస్య, వస్తుతః స్వసంస్థాం బ్రహ్మభావం గతస్య భవతా కృతేన, చికిత్సితేన దండేన, శిక్షితేన వా కియానర్థః ముక్తస్యార్థానర్థ యోరసంభవాత్, యది పునరహం న ముక్తః కింతు ప్రమత్తస్తబ్ధ ఏవ, తథాపి. మమ శిక్షాదికం పిష్టపేషణం వ్యర్థమిత్యర్థః. న హి జడస్య భావః శిక్షయాపి సమ్యక్కర్తుం శక్యత ఇతి భావః. 12

**శ్రీ శుక ఉవాచ**

చూ॥ ఏతావదనువాదపరిభాషయా ప్రత్యుదీర్య - స మునివర్య ఉపశమశీల ఉపరతానాత్మ్యనిమిత్తః-ఉపభోగేన కర్మారబ్ధం వ్యపనయన్ - రాజయానమపి తథైవోవాహ. 13

అను భేదబుద్ధికి అవకాశము కేవలము వ్యవహారమేకాని వేరే కారణము ఏమీ కనపడదు. వాస్తవిక బుద్ధితో ఆలోచించిన ప్రభువెవడు? సేవకుడెవ్వడు? అయిననూ ఓరాజా! నీకుస్వామిత్వాభిమానమున్నచో నేనేమి చేయవలయునో తెలుపుము. 11

ప్రమత్తుడవగు నీకు చికిత్సను (శిక్షను) చేయగలను. అప్పుడు నీవు చక్కబడెదవు అని ఏదైతే పలుకబడినదో దానికి తెలుపుచున్నాడు. ఓ వీరుడా! పిచ్చివానివలె, మూఢునివలె, గుడ్డివానివలె, జడునివలె ఉంటూ స్వస్థితిని, బ్రహ్మభావమును పొందిన నాకు నీచేత ఒసగబడెడి శిక్షచేత ఏమిప్రయోజనము? ముక్తుడైన వాడికి అర్థానర్థములు సంభవించవు గదా! నేను ముక్తుడనుకాక, ప్రమత్తుడను, స్తబ్ధుడనైనచో, నీవు నన్ను శిక్షించడము పిండిని విసరడవంటిదే యగును. వ్యర్థమని భావము ఏలనన జడుని భావమును శిక్షతోకూడా బాగుపరచలేము కదా! 12

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను**

మునిశ్రేష్ఠుడగు జడ భరతుడు యథార్థతత్వమును తన మాటలతో తెలిపి మౌనము వహించెను. దేహాత్మ బుద్ధికి కారణమగు అవిద్య ప్రారబ్ధకర్మానుభవముతోనే తొలగునని తలచిన భరతుడు




 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

టీ:- ఏతావదితి. అనువాదరూపాయా పరిభాషయా భాషణేన తు. ప్రత్యుత్తరం దత్వా. ఉపరతం అనాత్మ్యే దేహాత్మత్వే నిమిత్తమవిద్యా యస్య ఆరబ్ధఫలం కర్మ క్షపయన్. 13

చూ॥ స చ పాండవేయ సింధు సౌవీరపతిస్తత్త్వజిజ్ఞాసాయాం సమ్యక్శ్రద్ధయాధికృతాధికారస్తద్ధృదయ గ్రంథి విమోచనం ద్విజవచ ఉపశ్రుత్య - బహుయోగ గ్రంథ సమ్మతం త్వరయావరూహ్య - శిరసా తత్పాదమూలముపసృతః - క్షమాపయన్ విగతనృదేవస్మయ ఉవాచ. 14

టీ:- స ఇతి. హే పాండవేయ సమ్యక్ యా శ్రద్ధా. తయైవ తత్త్వ జిజ్ఞాసాయాం ప్రాప్తః. అధికారో యేన. యథా దర్శపూర్ణమా సాధికృత స్యైవ గోదోహనేన పశుకామస్య "ఆపః ప్రణయేది"తి గుణఫల సంబంధేऽప్యధికారః ఏవం సాత్త్వికశ్రద్ధాయా మధికృతస్యైవాస్యా మధికార ఇత్యర్థః. బహుయోగగ్రంథ సంమతం. ద్విజస్య తద్వచః శ్రుత్వా. విగతో నృదేవోऽధిరాజ ఇతి గర్వో యస్య. 14

ప్రారబ్ధకర్మను అనుభవించుటకు పూర్వము వలెనే పల్లకిని మోయు చుండెను. 13

ఓ పరీక్షిద్రాజా! ఉత్తమమైన శ్రద్ధతో, దర్శపూర్ణమాస్యాది ఇష్టులలో గోదోహన విధిలో "ఆపః ప్రణయేత్" అని గుణసంబంధమైన రీతిలో ప్రార్థించినట్లు (యజ్ఞాదులలో పశువిశసనము సాత్త్వికమే) సాత్త్వికమైన శ్రద్ధగలవాడై, తత్వజిజ్ఞాసయందు అధికారియైన సింధుసౌవీరపతి యగు రహుగణుడు అనేక యోగగ్రంథములకు సమ్మతమగు, తన హృదయగ్రంథిని (అజ్ఞానమును) తొలగించెడి ద్విజశ్రేష్ఠుడగు ఆ భరతుని వచనములను విని వెంటనే శిబికనుండి దిగి, ఆ భరతుని పాదములపై తలనుంచి ఇటుల పలికెను. 14

 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 






**రహూగణ ఉవాచ**

శ్లో॥ కస్త్వం విగూఢశ్చరసి ద్విజానాం
బిభర్షి సూత్రం కతమోఽవధూతః ।
కస్యాసి కుత్రత్య ఇహాపి కస్మాత్
క్షేమాయ నశ్చేదసి నోత శుక్లః ॥ 15

టీ:- క ఇతి. ద్విజానాం మధ్యే కమతః. యతః సూత్రముపవీతం బిభర్షి. యద్వా. దత్తాత్రేయాదీనాం మధ్యే కతమోఽవధూతః. ఇహాపి కస్మాద్ధేతోః ప్రాప్తః నోఽస్మాకం క్షేమాయ చేత్ప్రాప్తస్తర్హి శుక్లః కపిలో మునిర్నభవసి కిం ఉతేతి వితర్కే.15

**రహూగణుడు ఈ విధముగా పలికెను.**

యజ్ఞోపవీతమును ధరించిన నీవు బ్రాహ్మణులలో ఎవరవు? రహస్యముగా ఏల తిరుగుచున్నావు? దత్తాత్రేయాది అవధూతలలో నీవెవరవు? నీవెవరివాడవు? ఎక్కడివాడవు? ఇచటికెందులకరు దెంచినావు. మా క్షేమమునాశించి వచ్చిన కపిలమునివా ఏమి?15

శ్లో॥ నాహం విశంకే సురరాజ వజ్రాన్న
త్ర్యక్ష శూలాన్న యమస్య దండాత్ ।
నాగ్న్యర్క సోమానిలవిత్తపాస్త్రా
చ్ఛంకే భృశం బ్రహ్మకులావమానాత్ ॥ 16

టీ:- కిమనయా చింతయా శిబికాం తావద్వహామీతి చేదత ఆహ - నాహమితి. విపత్తః కుబేరః. 16

ఈ ఆలోచన అంతయునెందులకు?నేను పల్లకిని మోయగలనని అనునేమోయని ఇటుల పలుకుచున్నాడు. ఓ దేవా! నేను ఇంద్రుని వజ్రాయుధమునకుగాని, శంకరుని త్రిశూలమునకుగాని, యముని దండమునకుగాని, అగ్ని సూర్య చంద్ర వాయు కుబేరుల అస్త్ర శస్త్రములకు గాని భీతినొందను కాని బ్రాహ్మణుల అవమానమునకు మాత్రం భీతి నొందెదను. 16











శ్లో॥ తద్బ్రూహ్యసంగో జడవన్నిగూఢ
విజ్ఞానవీర్యో విచరస్య పారః ।
వచాంసి యోగగ్రథితాని సాధో
న నః క్షమంతే మనసాపి భేత్తుమ్ ॥ 17

టీ:- తదితి.యస్మాత్. భృశం శంకే. తస్మాత్త్వమిత్యాది ప్రశ్నా నాముత్తరం బ్రూహి నిగూఢం పిహితం విజ్ఞానరూపం వీర్యం ప్రభావో యేన అపారః అనంతమహిమా. తత్రహేతుః నో మనసాపి భేత్తుం న క్షమం నశక్యం కింభేత్తుమిత్య పేక్షాయామాహ-తే వంచాసీతి. యద్వా. మనసా యుక్తాః సూక్ష్మదృష్టయోఽపి భేత్తుంనశక్నువంతీత్యర్థః. 17

ఈ సాధూ! ఈ విధముగా మీ విజ్ఞానమును, శక్తిని మరుగు పరచి, విషయాసక్తిని వదిలి మూఢునివలె చరించుచున్న మీరెవరో తెలిసికోలేకున్నాను. మీ యొక్క యోగయుక్తములగు వాక్యములను బుద్ధిద్వారా ఆలోచించియు అర్థముచేసుకోలేకపోతున్నాను. సూక్ష్మదృష్టి కలవారలు కూడా తెలిసికోలేరని భావము. 17

శ్లో॥ అహం చ యోగీశ్వరమాత్మతత్త్వ
విదాం మునీనాం కపిలం గురుం వై ।
ప్రష్టుం ప్రవృత్తః కిమిహారణం య
త్సాక్షాద్ధరిం జ్ఞానకలావతీర్ణమ్ ॥ 18

టీ:- స్వస్య జ్ఞానార్థితాం దర్శయతి - అహమితి. ఇహ సంసారే. యత్ అరణం శరణం తత్కిమితి ప్రష్టుం ప్రవృత్తోఽస్మి జ్ఞానాశక్త్యా వతీర్ణం కపిలం. 18

ఈ విధముగా భరతుని మహిమను తెలిపి తను జ్ఞానార్థినని తెలుపుచున్నాడు. నేను, ఆత్మజ్ఞానవేత్తలగు మునులకు గురువు, సాక్షాత్తు శ్రీమన్నారాయణుని జ్ఞానశక్త్యవతారము, యోగేశ్వరుడగు కపిల మహాముని వద్దకు ఈ లోకమున ఏకమాత్ర శరణ్యుడగు (అనన్య శరణాగతికి) యోగ్యుడెవరని అడిగి తెలిసికొనుటకు వెళ్ళుచున్నాను. 18




శ్లో॥ స వై భవాన్ లోకనిరీక్షణార్థ
మవ్యక్తలింగో విచరస్యపిస్విత్ ।
యోగేశ్వరాణాం గతిమందబుద్ధిః
కథం విచక్షీత గృహానుబద్ధః ॥ 19

టీ:- స ఇతి. స ఏవ భగవాన్ కింస్విదేవం విచరతి. గృహావిష్టః కథం విచక్షీత పశ్యేత్. 19

శ్లో॥ దృష్టశ్రమః కర్మ ఆత్మనో వై భర్తుర్గంతుర్భవతశ్చానుమన్యే ।
యథా సతోదానయనాద్యభావత్సమూలఇష్టోవ్యవహారమార్గః॥20

టీ:- ఏవం తత్స్వరూపం పృష్ట్వా తదుక్తోత్తరాణ్యాక్షిపతి – తత్ర యదుక్తం మమశ్రమో నాస్తీతి, తత్రాహ – దృష్ట ఇతి. యథా ఆత్మనో మమ శ్రమో దృష్టః. తథా ఆత్మసామాన్యాత్. భర్తుర్గంతుశ్చ భవతః. శ్రమమనుమన్యే అనుమిమే అనునూనం చైవం. భవాన్ భార వహనాదినా శ్రాంతః. కర్తృత్వాత్, యః కర్తా సః శామ్యతి. యథాహం యుద్ధాదికర్తేతి. నన్విదం వ్యవహారమాత్రం న తు సత్యం – తదుక్తం 'వ్యవహారతోऽన్యం న పశ్యామీ'తి, తత్రాహ – యథేతి. వ్యవహారమార్గః ప్రపంచః సమూలః స ప్రమాణక ఏ వేష్టః. యథా యథావత్. అసతా

మీరు లోకము యొక్క స్థితిని చూడదలచి మీ రూపమును మరుగుపరచి ఈ విధముగా తిరుగుచున్నారా? (నేను వెదుకుచున్న కపిలమునివరులే కాదు కదా!) అయ్యో! గృహాసక్తులు, వివేకశూన్యులగు పురుషులు (నావంటివారు) యోగీశ్వరుల గమనమును ఎలా కాంచెదరు. (తెలిసికొందురు). 19

ఈ విధముగా ఆ భరతుని స్వరూపం గురించి అడిగి భరతుడు చెప్పిన "మమశ్రమోనాస్తి" నాకు శ్రమాదికములు లేవని తెలిపిన జవాబులను అధిక్షేపించుచున్నాడు. నేను యుద్ధాది కర్మలనాచరించి నపుడు నాకు శ్రమ కలిగినది. అటులనే పల్లకిని మోసినందున, మార్గమున నడచినందున నీకుకూడా శ్రమ కల్గినదని తలంచు చున్నాను. నీవు భారము వహించుట మున్నగు వానిచే అలసట చెందినావు. పై కార్యములకు నీవు కర్తవు. ఎవడైతే కర్తనో (పనిచేసిన వాడు) వాడు అలసట నొందును. ఇదియంతయు వ్యవహారము మాత్రమే కాని సత్యముకాదని "వ్యవహారతోన్యంనపశ్యామి" అని ఏదైతే పలుకబడినదో దానిని గురించి తెలుపుచున్నాడు. వ్యవహారము (ప్రపంచము) సప్రమాణమే సత్యమే. ఏలనన లేనికుండతో నీరు






ఘటాదినా ఉదకానయనాదేరభావాత్. ఏవం ప్రయోగః ప్రపంచః సత్యః అర్థక్రియాకారిత్వాత్. యః పునరసత్యః నాసావర్థక్రియాకారీ. యథా మిథ్యాఘటాదిరితి. 20

శ్లో॥ స్థాల్యగ్ని తాపాత్పయసోऽపి తాప
స్తత్తాపతస్తండులగర్భరంధిః ।
దేహేంద్రియాస్వాశయసన్నికర్షా
త్తత్సంసృతిః పురుషస్యానురోధాత్ ॥ 21

టీ:- యదుక్తం. ఉపాధిధర్మాః. స్థాల్యాదయః వస్తుతో మే న సంతీతి. తత్రచౌపాధికత్వేऽపి సత్యత్వం కింన స్యాదిత్యాహ - స్థాలీతి. స్థాల్యా అగ్నినా తాపాత్తన్మధ్యవర్తినః క్షీరస్య తాపః తస్య తాపాత్తండులానాం బహిర్భాగస్య తతస్తద్గర్భస్య చ రంధిః పాకః న చాత్ర కించిన్మిథ్యా. ఏవం దేహాదిభిస్సన్నికర్షాత్సంబంధాత్తన్నిమిత్తా సంసృతిః పురుషస్య భవతి. అసవః ప్రాణాః ఆశయోమనః. అనురోధాత్ ఉపాధిధర్మానువృత్తేః తథాహి నిదాఘాదినా దేహే తప్తే ఇంద్రియాణాం తాపః తతః ప్రాణస్య తతో మనస ఇత్యేవం. యథాయథమూహ్యం. 21

తేలేముకదా! ఈ విధముగా ప్రపంచము (వ్యవహారము) ప్రయోజన కార్యకారియగుట వలన సత్యమే అసత్యమైన యెడల అసత్యమగు కుండవలె ప్రయోజనకార్యకారికాదు. (లేని కుండలో నీరు తెచ్చుట సాధ్యము కానట్లు) 20

బలియుట, చిక్కిపోవుట శరీర ధర్మాలు, వాస్తవికముగా నాకు (ఆత్మకు) లేవని ఏదైతే పలికితివో దానిలో బలియు, కృశించుటలు శరీర ధర్మములేయైనను సత్యములెందుకు కావనగా తెలుపుచున్నాడు. పొయ్యిమీద నుంచబడిన స్థాలి అగ్నిచే వేడెక్కగా స్థాలిలోని పాలు వేడియగును. ఆ పాలవేడిచే తండులముల పైభాగము వేడియై లోపలిభాగమును పక్వమగును. దీనిలో ఏదియు అసత్యము కాదు. అటులనే దేహము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సుల యొక్క సంబంధ కారణము వలన పురుషునకు (ఆత్మకు) సంసృతి యనగా దేహాధిధర్మల అనుసరణతో శ్రమాధికములు సంభవించును. పంచ క్లేశములతో, తాపత్రయములతో జనించిన వేడిచే శరీరము తప్తముకాగా ఇంద్రియములు తాపమొందును. దానితో ప్రాణమునకును తాపము, దానితో మనస్సునకు తాపము కల్గునని తాత్పర్యము. 21

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









శ్లో॥ శాస్త్రాభిగోప్తా నృపతిః ప్రజానాం
యః కింకరో నైవ పినష్టి పిష్టమ్ ।
స్వధర్మమారాధనమచ్యుతస్య
యదీహమానో విజహాత్యఘౌఘమ్ ॥ 22

టీ:- యదుక్తం స్వస్వామిభావో ధ్రువ ఇతి తత్రాహ–శాస్త్రేతి. అధ్రువత్వేఽపి యదా యోనృపతిః స ప్రజానాం శాస్తాగోప్తాచ.యచోక్తం స్తబ్ధాదే శిక్షాపిష్టపేష ఇతి తత్రాహ–యోఽచ్యుతస్య కింకరః స పిష్టం పినష్టి నిష్ఫలం న కరోతి. స్తబ్ధత్వా ద్యనపగమేఽపి శాస్తురీశ్వరాజ్ఞా సంపాదనేనైవ సఫలత్వాత్తదాహ. స్వధర్మ రూపమచ్యుతస్యారాధనం కుర్వన్. యస్మాదఘౌఘం విజహాతి. 22

స్వస్వామి భావము స్థిరము కాదని చెప్పిన దానిని గూర్చి తెలుపుచున్నాడు.

ఎప్పుడు ఏ రాజు ప్రజలకు శాసకుడో అతడు రక్షకుడు కూడా. ఆ సమయమున స్వామి భావము స్థిరమైయుండును. జడులకు శిక్ష పిష్టపేషణమని ఏదైతే పలుకబడినదో దానికి తెలుపుచున్నాడు. రాజు ప్రజలను శిక్షించుటకు, రక్షించుటకు నియుక్తుడగు దాసుడే. అతను ఉన్మత్తాదులను శిక్షించుట పిష్టపేషణమువలె వ్యర్థముకాదు. ఏలనన తన ధర్మమునాచరించుట ఈశ్వరాజ్ఞను ఆచరించుటయే. అది భగవదారాధనయే యగును. ఆ విధమగు భగవదారాధనము చేస్తూ తన పాపములను నశింపచేసుకొనును. 22

శ్లో॥ తన్మే భవాన్నరదేవాభిమాన
మదేన తుచ్ఛీకృతసత్తమస్య ।
కృషీష్ట మైత్రీం దృశమార్తబంధో
యయాతరే సదవజ్ఞానమంహః ॥23

టీ:- తదితి. యస్మాదేవం మమ. త్వదుక్తం విపరీతం ప్రతిభాతి. తత్తస్మాన్నరదేవాభిమానమదేన తుచ్ఛీకృతాః తిరస్కృతాః. సత్తమా

ఓ దీనబంధో! రాజుననే మదగర్వంతో మీలాంటి సత్పురుషులపై తిరస్కార భావము చూపిన నాపై, మీరు స్నేహ పూర్ణమైన దృష్టిని చూపండి. ఆ మీ దయాదృష్టితో నేను సాధువులను తిరస్కరించిన పాపము నుండి విముక్తి పొందెదను. 23

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.








భవాదృశా యేన. తస్య మైత్రీం దృశం స్నేహయుక్తాం దృష్టిం కృషీష్ట కరోతు. సతామ వజ్ఞారూపం పాపం యయా వితరిష్యామి. 23

శ్లో॥ న విక్రియా విశ్వసుహృత్సఖస్య
సామ్యేవ వీతాభిమతే స్తవాసి।
మహద్విమానాత్స్వకృతాద్ధి మాదృ
జ్నంక్షత్య దూరాదపి శూలపాణి ॥ 24

దేహాభిమానశూన్యులు, విశ్వబంధువగు శ్రీహరికి భక్తులగు మీరు సమదృష్టి కలిగినవారగుటచే మానాభిమానములతో మీలో ఏ వికారము గలుగదు. అయినను గొప్పవారిని అవమానపరచుటచే, నాలాంటివారు శూలము ధరించిన శంకరుని వంటి సామర్థ్యము కల్గియున్ననూ వెంటనే తప్పక నశించెదరు. 24

టీ:- నను మమావజ్ఞాకృతవికారాభావాత్ కుతః పాపం? తత్రాహ - నేతి. యద్యపి తవ క్రియా నాస్తి విశ్వస్య సుహృచ్చాసౌ సఖా చ తస్య అతః సర్వత్ర సామ్యేన స్వదేహే విగతాభిమానస్య. తథాపి మహతామవమానాత్. మాదృశో వినంక్ష్యతి. అదూరాత్ క్షిప్రం. శూలపాణిరివాతిసమర్థోऽపీత్యర్థః. 24

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, దశమోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పదవ అధ్యాయము సమాప్తము.**








## ఏకాదశోऽధ్యాయః

శ్లో॥ ఏకాదశేऽథ సంపృష్టో రహూగణమహీభృతా ।
ఉపాదిశత్పరం జ్ఞానం స యోగీతి నిగద్యతే ॥

బ్రాహ్మణ ఉవాచ

శ్లో॥ అకోవిదః కోవిద వాదవాదాన్
వదస్యథో నాతివిదాం వరిష్ఠః ।
న సూరయో హి వ్యవహారమేవం
తత్త్వావమర్శేన సహామనంతి ॥ 1

టీ:- అకోవిద ఇతి. అకోవిదః అవిద్వానపి. త్వం కోవిదానాం వాదాః ఉద్గ్రహణికాః ఉద్గ్రంథాః తుల్యాన్ వాదాన్ వదసి. అథో అతః అత్యంతం విదుషాం మధ్యే శ్రేష్ఠో న భవసి. కుతః. హి యస్మాత్. యం స్వామి భృత్యాదిలౌకికవ్యవహారం. త్వం సత్యమాత్థ ఏవం సూరయస్తత్త్వ విచారేణ సహ న వదంతి. కింత్వవిచారసుందరం వదంతి. అతో న సత్యః. 1

## 11వ అధ్యాయమయు

ఈ పదకొండవ అధ్యాయములో రహూగణమహారాజుచే ప్రశ్నించగా, యోగియగు భరతుడు శ్రేష్ఠమైన ధర్మమునుపదేశించెను అను విషయము తెలుపబడుచున్నది.

భరతుడు ఈ విధముగా పలికెను.

ఓ రహూగణ మహారాజా! నీవు పండితునివి కాకపోయినను పండితులతో సమమగు తర్కవితర్కములను చేయుచున్నావు. ఈ వాదముతో నీవు పండిత శ్రేష్ఠుడవు కావు. ఏలనన స్వామి భృత్యుడను వ్యవహారమును సత్యమని తలంచుచున్నావు., తత్త్వజ్ఞానవంతులగు పండితులు దీనిని సత్యమైనదిగా తలంచరు కాని విచారరహితమైన సుందరముగా తలంతురు కానీ అది సత్యము కాదు. 1








శ్లో॥ తథైవరాజాన్నురుగార్హ్య మేధ
వితానవిద్యోరు విజృంభితేషు ।
న వేదవాదేషు హి తత్త్వవాదః
ప్రాయేణ శుద్ధో న చకాస్తి సాధుః ॥ 2

టీ:- వైదికోఽపి కర్మఫల వ్యవహారో న సత్య ఇత్యాహ - తథైవేతి. ఉరవో గార్హ్యాః గృహసంబంధినః. మేధాః యజ్ఞాః. తేషాం వితానో విస్తారః. తద్విషయాసు విద్యాసు ఉరు అధికం. విజృంభితేషు విలసితేషు వేదవాదేషు. తత్త్వవాదః పరమార్థవాదః సునిశ్చితం న చకాస్తి న ప్రకాశతే. తథాచ శ్రుతిః. 'నేహ నానాస్తి కించనే'త్యాది. శుద్ధో హింసాది శూన్యః. సాధుః రాగాదిశూన్యశ్చ. ప్రాయేణేతి. ఈశ్వరార్పిత కర్మణాం పరమార్థఫలత్వాభిప్రాయేణోక్తం. 2

శ్లో॥ న తస్య తత్త్వ గ్రహణాయ సాక్షా
ద్వరీయసీరపి వాచస్సమాసన్ ।
స్వప్నే నిరుక్త్యా గృహమేధిసౌఖ్యం
న యస్య హేయానుమితం స్వయం స్యాత్ ॥ 3

టీ:- నను శ్రుతవేదాంతస్యాపి పుంసః.కర్మసు ప్రవృత్తేః కథమసత్యతా? తత్రాహ - నేతి. సాక్షాద్యథావత్. తత్త్వజ్ఞానాయ వరీయసోఽపి. ఉత్కృష్టా అపి అత్రార్షత్వాద్ద్వితీయా. వేదాంతవాచస్తస్య న సమ్యగాసన్

వేదసంబంధమగు కర్మఫల వ్యవహారముకూడా సత్యము కాదని తెలుపుచున్నాడు. ఓ రహూగణరాజా! లౌకిక వ్యవహారముతో సమానముగా గొప్పనైన గార్హ్యస్థ సంబంధమగు యజ్ఞయాగాదుల విస్తారముతో వ్యస్తములగు వేదవాదములలోనూ పరమార్థవాదము (సత్యత్వము) ప్రకాశించదు అనగా అవియును యథార్థములు కావు. (కర్మకాండను ప్రబోధించే విభాగము) ఈ విషయమున 'నేహనా నాస్తికించన' ఇత్యాది శ్రుతులు ప్రమాణము లు. హింసాది శూన్యము, రాగాది శూన్యములైన ఈశ్వరార్పిత కర్మలే పరమార్థఫలములు యథార్థములు. 2

వేదాంతవాక్యములు వినిన పురుషునకును వైదిక కర్మలలో ప్రవృత్తి కలుగుచున్నందున వైదికకర్మలు యథార్థములు ఎందుకు కావు అనగా తెలుపుచున్నాడు. ఎవరికైతే గార్హ్యస్థ ధర్మములగు యజ్ఞ యాగాది కర్మలచే లభించిన స్వర్గాది సుఖములు స్వప్నదృష్టములగు విషయములవలె అసత్యములుగా భాసించవో వారికి తత్త్వజ్ఞానము కల్గించుటకు సాక్షాత్తు ఉపనిషద్వాక్యములు కూడా సమర్థములు కావు. 3







బభూవుః స్వప్నే యా నిరుక్తిః తయా నిరుక్తిః తయా స్వప్నదృష్టాంతేన దృశ్య త్వాదిహేతునా స్వయమేవ హేతుత్వేనానుమితం యస్య న స్యాత్. 3

శ్లో॥ యావన్మనోరజసా పూరుషస్య సత్త్వేన వా తమసా వానురుద్ధమ్।
చేతోభిరాకూతిభిరాతనోతి నిరంకుశం కుశలంవేతరం వా ॥4

టీ:- ఏవం ప్రపంచస్య సత్యత్వం తదుక్తం నిరాకృత సంసారస్యాపి తదుక్తాం సత్యతాం నిరాకర్తుం. తస్య మనోనిమిత్తతామాహ - యావదధ్యాయ పరిసమాప్తి. యావదితి. మనో యావద్రజ ఆదిభిర్గుణైర నురుద్ధం వశీకృతం భవతి. తావత్తన్మనో నిరంకుశం సత్. పురుషస్య కుశలం ధర్మమితరమధర్మం వా. ఆతనోతి. కైః చేతోభిః జ్ఞానేంద్రియైః ఆకూతిభిః కర్మేంద్రియైశ్చ. 4

శ్లో॥ సవాసనాత్మా విషయోపరోక్తో
గుణప్రవాహో వికృతష్షోడశాత్మా ।
బిభ్రత్పృథఙ్నామభిరూప భేద
మంతర్బహిష్ట్వం చ పురైస్తనోతి ॥ 5

టీ:- తతశ్చ ధర్మాధర్మ వాసనాయుక్తం తదేవానేక దేహాదివైచిత్ర్యం కరోతీత్యాహ-సఇతి. పుంస్త్వమాత్మశబ్దవిశేషణత్వేన. తన్మన ఇత్యర్థః.

ఈ విధముగా రహూగణునిచే చెప్పబడిన ప్రపంచ సత్యత్వమును నిరాకరించుటకు మరియు సంసార నిరాకరణము చేసిన వానికి సైతం మనస్సే కారణమని తెలుపబడుచున్నది. (ఈ అధ్యాయ పరిసమాప్తి వరకు) మనసే కారణమని తెలుపబడుచున్నది. ఎప్పటివరకైతే మానవుని మనస్సు సత్వరజస్తమోగుణములకు వశీభూతమగునో అంతవరకు అతని మనస్సు నిరంకుశమై జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియములతో శుభాశుభ (ధర్మాధర్మ) కర్మల నాచరిస్తూ ఉంటుంది. 4

ధర్మాధర్మ వాసనాయుక్తమగు ఆ మనస్సు అనేకములగు దేహాత్మకములగు విచిత్రములను కలుగచేయునని తెలుపుచున్నాడు. (సః అను పుంలింగము ఆత్మ శబ్ద విశేషణముగా వాడబడినది) ఆ మనస్సు ధర్మాధర్మ వాసనాయుక్తమై విషయాసక్తమై సత్త్వ రజస్తమో గుణములచే ప్రేరితమై కామాదులుగా పరిణామమొంది ఇంద్రియాది షోడషములలో ముఖ్యమై, విభిన్నమగు పేర్లతో దేవ, మనుష్య, తిర్యక్










వాసనాయుక్తం ఆత్మోపాధిత్వాదాత్మా. అతో విషయైరుపయుక్తోऽను విద్ధః. అతో గుణప్రవాహః గుణైరితస్తతశ్చాల్యమానః అత ఏవ వికృతః కామాదిపరిణామవాన్. షోడశాత్మా షోడశకళాసు భూతేంద్రియ రూపాసు ముఖ్యః. పృథఙ్నామభిః సహ పృథగ్రూప భేదం దేవతిర్యగాది రూప భేదం బిభ్రత్. అంతర్బహిష్ట్వం ఉత్కృష్టత్వం. నికృష్టత్వం చ పురైస్తై రేవదేహై ర్వేతుభూతైః. తనోతి. నామభిరిత్యత్ర రేఫలోపే దీర్ఘాభావ ఆర్షః. 5

రూపముల ధరించి ఉత్కృష్ట, నికృష్టములగు దేహములకు కారణభూత మగుచున్నది. 5

శ్లో॥ దుఃఖం సుఖం వ్యతిమిశ్రం చ తీవ్రం
కాలోపపన్నం ఫలమావ్యనక్తి ।
ఆలింగ్య మాయారచితాంతరాత్మా
స్వదేహినం సంసృతి చక్రకూటః ॥ 6

టీ:- ఫలం చ తదనురూపం కరోతీత్యాహ - దుఃఖమితి. తీవ్రం దుర్నివారం కాలప్రాప్తం ఫలం. సర్వతోతీవ్రంభివ్యనక్తి సృజతి. నను కథం జడః సృజతి? తత్రాహ - స్వదేహినమాలింగ్య ఆలింగనే కారణ మాహ. మాయయా రచితః. అంతరాత్మా జీవోపాధిః. ఉపాధితామాహ -సంసృతి చక్రం కూటయతి చలయతీతి తథా. యథా గ్రామకూట ఇతి. 6

ఈ ఉపాధులకు తగిన ఫలములనే కల్గించునని తెలుపు-చున్నాడు. ఈ మాయామయమగు మనస్సు సంసార చక్రములో చలిస్తూ దేహాభిమానియగు జీవునితో కలిసి కాలక్రమముగా ప్రాప్తించిన సుఖదుఃఖ మోహరూపములుగా అవశ్యము కలిగెడి ఫలములను అభివ్యక్త మొనరించును. 6











శ్లో॥ తావానయంవ్యవహారస్సదావిఃక్షేత్రజ్ఞసాక్ష్యోభవతిస్థూలసూక్ష్మః ।
తస్మాన్మనోలింగమదో వదంతి గుణాగుణత్వస్యపరాపరస్య ॥ 7

టీ:- ఏవమయం మనోనిబంధనః సంసారో జీవే ఫలతీత్యాహ - తావానితి. ఆవిః ప్రకాశమానః. సదా క్షేత్రజ్ఞస్య.సాక్ష్యః దృశ్యోభవతి. స్థూలసూక్ష్మః జాగ్రత్స్వప్నరూపః. మనసః సంసారహేతుత్వ ముప సంహరన్ మోక్షస్యాపి తదేవ కారణమిత్యాహ - తస్మాదితి. అదో మనః లింగం కారణం. గుణత్వం గుణాభిమానిత్వం. అగుణత్వం తద్రాహిత్యం. తదేవ పరమపరం చ తస్య. 7

శ్లో॥ గుణానురక్తం వ్యసనాయ జంతోః
క్షేమాయ నైర్గుణ్యమథో మనస్స్యాత్ ।
యథా ప్రదీపో ఘృతవర్తిమశ్నన్
శిఖాస్సధూమా భజతి హ్యన్యథా స్వమ్ ॥ 8

టీ:- కథ మేకమేవ విలక్షణయోః కారణం. అవస్థాభేదాదిత్యాహ - గుణేతి. నైర్గుణ్యం నిర్గుణం అథో ఇతి కార్త్స్న్యేన దృష్టాంతేన స్ఫుటయతి - యథేతి. అన్యథా తు ఘృతక్షయే. స్వం పదం శుక్లభాస్వరరూపం. మహాభూతాత్మత్వం వా. 8

ఈ విధముగా మనస్సుకు సంబంధించిన సంసారమే జీవుని యందు ఫలించునని తెలుపుచున్నాడు. ఎంతవరకైతే మనస్సు ఉండునో అంతవరకు జాగ్రత్స్వప్న రూపమగు వ్యవహారము ప్రకాశితమై జీవునకు దృశ్యమగును. అందువలన పండితులు సత్వరజస్తమోగుణమయ -మయిన మనస్సునే హీనమగు సంసారమునకు కారణమనియు మరియు అదే మనస్సు గుణాభిమానాతీతమయినచో పరమోత్కృష్టమగు మోక్షపదమునకు కారణమగునని తెలుపుదురు. 7

ఒకే మనస్సు వేరువేరు లక్షణముగల సంసారమునకు మోక్ష పదమునకు కారణమెట్లగును అను దానికి అవస్థాభేదముతో కాగలదని తెలుపుచున్నాడు.

విషయాస్తకమగు మనస్సు జీవుని సంసారములో పడవేయును. అదే మనస్సు విషయహీనమైనచో శాంతిమయమగు మోక్షపదమున నిలుపుతుంది. ఏ విధముగా అనగా నేయితో వెలిగించిన దీపము వత్తిని కాల్చుతూ పొగను, కాంతిని వెలువరించును. ఘృతము క్షీణము కాగా దీపము ప్రకాశమానరూపమగు అగ్నితత్త్వములో లీనమగును (మహతత్త్వములో) అటులనే విషయాసక్తమగు మనస్సు సంసారము -నకు విషయ హీనమైనచో మోక్షపదమునకు కారణమగును. 8











శ్లో॥ ఏవం తదా గుణకర్మానుబద్ధం
వృత్తిం మనశ్ర్శయతేऽన్యత్ర తత్త్వమ్ ।
ఏకాదశాసన్మనసస్తు వృత్తయ
ఆకూతయః పంచధియోऽభిమానః ॥ 9

టీ:- ఏవమితి. అన్యత్ర. అన్యథావృత్తీర్దర్శయతి - ఏకాదశవృత్తయః ఆసన్ - ఆకూతయః క్రియాకారాః పంచధియశ్చ. జ్ఞానాకారః పంచ అభిమానశ్చేతి. 9

ఈ విధముగా మనస్సు గుణకర్మలతో ఆసక్తమైనపుడు అనేకము -లగు వృత్తులను ఆశ్రయించును. అటుల కానప్పుడు అనగా గుణ కర్మల నాశ్రయించనపుడు ఆత్మతత్త్వములో లీనమగును. క్రియాకారము -లగు పంచకర్మేంద్రియములు; జ్ఞానాకారములగు పంచ జ్ఞానేంద్రియ - ములు అభిమానము అను పదకొండు మనోవృత్తులుగా చెప్పబడును. 9

శ్లో॥ మాత్రాణి కర్మాణిపురం చ తాసాం వదంతి చైకాదశవీరభూమీః
గంధాకృతి స్పర్శ రస శ్రవాంసి విసర్గరత్యార్త్యభిజల్ప శిల్పాః॥10

టీ:- మాత్రాణీతి. హే వీర భూమిః విషయాన్. విషయానేవాహ - గంధాదయః పంచ జ్ఞానేంద్రియద్వారాదివృత్తీనాం విషయాః. ఆకృతిః రూపం శ్రవః శబ్దః. విసర్గాదయః పంచకర్మేంద్రియద్వారా కర్మాకార వృత్తీనాం విషయాః రతిః సంభోగః ఆర్తిః గతిః. 10

ఓ వీరశ్రేష్ఠా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను ఈ ఐదు జ్ఞానేంద్రియ విషయములు, 1. మలవిసర్జనము (పాయువు), 2. సంభోగము (ఉపస్థ), 3. గమనము (పాద), 4. భాషణము (వాక్), 5. తీసుకోవడము-ఇవ్వడము (పాణి) అను ఐదు కర్మేంద్రియ విషయములు. 10









శ్లో॥ ఏకాదశం స్వీకరణం మమేతి
శయ్యామహం ద్వాదశమేక ఆహుః।
ద్రవ్యస్వభావాశయకర్మ
కాలైరేకాదశామీ మనసో వికారాః ॥ 11

టీ:- పురస్యాభిమానవిషయత్వప్రకారమాహ - ఏకాదశమితి. ఏకాదశం పురం స్వీక్రియత ఇతి స్వీకరణం. అయమర్థః - శరీరమభిమానస్య న జ్ఞేయతయా గంధాదివద్విషయః. నాపి కార్యతయా విసర్గాదివత్. కింతు మమేతి భోగాయతనత్వేన స్వీకార్యతయా విషయ ఇతి. ఏకే తు. వివేకినామేవ పురం మమత్వాభిమానవిషయః. న తు మూఢానాం అతో మూఢదృష్ట్యా అహం అహంకారం. ద్వాదశం వృత్త్యంతర మాహుః - తస్య చ పురమేవ శయ్యా సంజ్ఞం ద్వాదశం విషయమాహుః. తత్ర హి జీవః అహంకారేణ శేతే. యతః. పురి శయనాత్పురుష ఇత్యుచ్యతే తాసాం వృత్తీనామవాంతరభేదైరానంత్య మాహ - ద్రవ్యాణామేష స్వభావః పరిణామ హేతుః ఆశయః సంస్కారః కర్మ అదృష్టం. కాలః క్షోభకః తైః నిమిత్తభూతైః. 11

శరీరమునకభిమాన విషయత్వమును తెలుపుచున్నాడు. శరీరమును ఇది నాదియని స్వీకరించడము అభిమానము యొక్క విషయము ఇది పదకొండవ వృత్తి. శరీరమునకు అభిమానము జ్ఞేయము కాదు కనుక గంధాదులవలె విషయముకాదు. కార్యరూపము కూడా కాదు. కానీ, నాది అని భోగములకు గృహముగా స్వీకరించుటచే విషయమగునని కొందరు తెలుపుదురు. వివేకవంతులకే శరీరము మమతాభిమాన విషయము, మూఢులకు కాదు. కావున అహంకారము మనస్సునకు 12 వ వృత్తి దానికి ఆశ్రయమగు శరీరమును 12 వ విషయమని కొందరు తెలిపెదరు. అచట జీవుడు అహంకారముతో నిదురించును. "పురిశయనాత్పురుషః" అని అనబడుచున్నాడు. ఈ మనోవృత్తుల అవాంతర భేదముతో అనంతత్వమును తెలుపుచున్నాడు. ఈ పదకొండు మనోవృత్తులు ద్రవ్యము (విషయము), స్వభావము (పరిణామ హేతువు), ఆశయము (సంస్కారము), కర్మ (అదృష్టము), కాలములను వాటిచే (అనంతములు)(ముందు శ్లోకముతో అన్వయము) 11







శ్లో॥ సహస్రశశ్శతశః కోటిశశ్చ
క్షేత్రజ్ఞతో న మిథోన స్వతస్స్యుః ।
క్షేత్రజ్ఞ ఏతా మనసో విభూతీర్జీవస్య
మాయారచితస్య నిత్యాః ॥ 12

టీ:- సహస్రశ ఇతి. ప్రథమం శతశః తతః సహస్రశః తతః కోటిశః స్యుః. న తు మిథః స్యుః. న చ స్వతః. కింతు క్షేత్రజ్ఞతః పరమేశ్వరాత్. తస్య చానంతశక్తిత్వాత్, అనంతాస్స్యురిత్యర్థః. యద్వా. తాసాం మిథ్యాత్వమనేనోచ్యతే కోటిశో భవంత్యతస్తాః క్షేత్రజ్ఞత ఏవ స్యుః. తత్సత్తయైవ సత్తాం లభేరన్. న చ మిథో న చ స్వత ఇతి. యద్వా. క్షేత్రజ్ఞోజీవః. తస్మాన్న స్యుః. తస్యావికారిత్వాత్. న మిథః ఇతరేతరా శ్రయాపత్తేః. న స్వతః ఆత్మశ్రయత్వాపత్తేః. అతో మిథ్యాభూతా ఏవేతి తదేవం. శ్లోకత్రయేణ గుణకర్మానురుద్ధం మనః వృత్తీః శ్రయత ఇతి. యదుక్తం తత్ప్రపంచితం. అన్యత్ర తత్త్వం శ్రయత ఇతి యదుక్తం తత్తత్త్వమాహ - క్షేత్రజ్ఞ ఇతి. జీవస్య జీవోపాధేః. 12

ఈ మనోవృత్తులు ద్రవ్య స్వభావ ఆశయ కర్మకాలములను వాటిచే అనంతములగుచున్నవి. మొదట వందలుగా ఆ పిదప వేలుగా ఆ పిదప కోట్లకొలదిగా తయారగుచున్నవి. ఇవి పరస్పరాశ్రయముగానే కానీ, సొంతముగా కానీ కావు. కాని పరమేశ్వరుడు అనంతశక్తిమయుడ గుటచే ఆ పరమేశ్వరుడివలన అనంతములగుచున్నవి. దీనివలన అవి మిథ్యాభూతములగుచున్నవి, లేక క్షేత్రజ్ఞుడు జీవుడు అధికారి కావున ఆత్మవలనకానీ ఒకదానినొకటి ఆశ్రయించి యుండవు. అలాగే పరస్పరముగాకానీ ఆత్మనాశ్రయించవు కావున స్వతహాగాకాని అనంతములు కావు. అందువలన ఆ వికారములు మిథ్యాభూతములే. ఈ విధముగా మూడు శ్లోకములలో గుణకర్మాసక్తమగు మనస్సు అనేక వృత్తులను ఆశ్రయించును అనుదానిని విశదీకరించి మనస్సు విషయాసక్తము కానప్పుడు ఆత్మతత్త్వమును ఆశ్రయించును అను దానిని విశదపరచుచున్నాడు. ఈ విధముగా అనంతత్వము నొందుచున్ననూ, మనస్సునకు క్షేత్రజ్ఞునికి (జీవునికి) ఏమియు సంబంధములేదు. ఇది జీవునకు మాయానిర్మితమగు ఉపాధి కావున ఆ మాయానిర్మిత ఉపాధికి మాత్రమే నిత్యములగుచున్నవి. 12








శ్లో॥ ఆవిర్హితాః క్వాపి తిరోహితాశ్చ
శుద్ధో విచష్టే హ్యవిశుద్ధకర్తుః।
క్షేత్రజ్ఞ ఆత్మా పురుషఃపురాణ
స్సాక్షాత్స్వయం జ్యోతిరజః పరేశః ॥ 13

టీ:- ఆవిర్హితా ఇతి. అవిశుద్ధకర్తుర్మనసః.నిత్యాః ప్రవాహరూపేణ అవిచ్ఛిన్నాః జాగ్రత్స్వప్నయోరావిర్భూతాః. పశ్యతి క్వాపి సుషుప్తౌ తిరోభూతాః నశ్యతి. అవస్థాత్రయసాక్షి క్షేత్రజ్ఞ ఆత్మాతత్త్వమిత్యర్థః. క్షేత్రజ్ఞో ద్వివిధః,త్వం పదార్థో జీవః. తత్పదార్థ ఈశ్వరశ్చ.తత్రాద్యో నిరూపితః ఇదానీం తత్రాప్యమీశ్వరం నిరూపయతి - క్షేత్రజ్ఞ ఇతి. క్షేత్రజ్ఞః ఆత్మ వ్యాపీ. పురాణో జగత్కారణభూతః పురుషః పూర్ణః. సాక్షాదపరోక్షః. స చ స్వయం జ్యోతిః న తు జ్ఞానస్య విషయత్వేనాశ్రయత్వేన వా పరోక్షః అజో జన్మాదిశూన్యః. పరేషాం బ్రహ్మాదీనామపీశ్వరః. 13

ఈ వికారములు తరచుగా అవిశుద్ధ కర్మలనాచరించు మనస్సున నిత్యములై ప్రవాహ రూపముగా అవిచ్ఛిన్నములై , జాగ్రత్స్వప్నావస్థలలో ఆవిర్భవించును. సుషుప్త్యవస్థలో తిరోభావము నొంది నశించును. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థా త్రయమున సాక్షియగు క్షేత్రజ్ఞుడే ఆత్మతత్త్వము. ఈ క్షేత్రజ్ఞుడు రెండు రకములు. త్వం పదార్థభూతుడగు జీవుడు తత్పదార్థభూతుడగు ఈశ్వరుడు. త్వం పదార్థభూతుడగు జీవనిరూపణము పైన ఒనరించి ఇపుడు తత్పదార్థ ప్రాప్యుడగు ఈశ్వరుని నిరూపించుచున్నాడు. తత్పదార్థభూతుడగు ఈశ్వరుడు ఆత్మవ్యాపి, జగత్తునకు కారణభూతుడు, పూర్ణపురుషుడు, అపరోక్షుడు, స్వయంప్రకాశుడు, జన్మాదిశూన్యుడు. ఆ బ్రహ్మాదులకు కూడా ఈశ్వరుడు. 13

శ్లో॥ నారాయణో భగవాన్ వాసుదేవః
స్వమాయయాత్మ న్యవసీయ మానః।
యథానిల స్థావరజంగమానా
మాత్మ స్వరూపేణ వినిష్ట ఈశేత్।
ఏవం పరో భగవాన్ వాసుదేవః
క్షేత్రజ్ఞ ఆత్మదమనుప్రవిష్టః ॥ 14

సమస్త జీవులకు ఆశ్రయభూతుడు, ఐశ్వర్యాది షడ్గుణ సంపన్నుడగు వాసుదేవుడు తన అధీనములో నుండెడి మాయాచేత సర్వభూతములను ఆశ్రయించి అందరి అంతఃకరణములలో ఉంటూ ఏ విధముగా వాయువు స్థావర జంగమాదిప్రాణులలో ఆత్మరూపముగా అనగా ప్రాణరూపముగా ప్రవేశించి నియామకుడు(నియంత)గా అగుచున్నదో అటులనే పరమాత్మ, భగవంతుడును అగు వాసుదేవుడు



టీ:- నారాయణ ఇతి. నారం జీవసమూహః సః అయనం యస్య అయంతు భగవాన్ ఐశ్వర్యాదిషడ్గుణవాన్. వాసుదేవః సర్వభూతానా మాశ్రయః. స్వాధీనయా మాయయా ఆత్మని జీవే అవధీయమానః అవస్థాప్యమానః. కర్మకర్తరిప్రయోగః. తన్నియంతృత్వేన వర్తమాన ఇత్యర్థః. ఏతత్స దృష్టాంతమాహ - యథేతి. ఆత్మస్వరూపేణ ప్రాణరూపేణ ఈశ్వేత్. ఈశితా నియంతా స్యాత్. ఇదం విశ్వం. 14

శ్లో॥ న యావదేతాం తనుభృన్నరేంద్ర
విధూయ మాయాం వయునోదయేన ।
విముక్తసంగో జితషట్సపత్నో
వేదాత్మతత్త్వం భ్రమతీహ తావత్ ॥ 15

టీ:- తదేవమాత్మనః శుద్ధత్వం సంసారస్య చ మిథ్యాత్వం ప్రదర్శ్య ఇదానీం తన్నివృత్తి క్రమమాహ - న యావదితి. తనుభృత్ దేహీ వయునోదయేన జ్ఞానోత్పత్త్యా యావన్మాయాం విధూయ ఆత్మతత్త్వం న వేద తావదిహ భ్రమతి. 15

శ్లో॥ న యా వదేతన్మన ఆత్మలింగం
సంసారతాపావపనం జనస్య ।
యచ్ఛోక మోహామయరాగ లోభ
వైరానుబంధం మమతాం విధత్తే ॥ 16

సర్వసాక్షియగు ఆత్మస్వరూపముతో ఈ సంపూర్ణ జగత్తునకు ప్రేరకుడగుచున్నాడు. (నియామకుడగుచున్నాడు) 14

ఈ విధముగా ఆత్మయొక్క శుద్ధత్వమును సంసారముయొక్క అసత్యమును తెలిపి ఇపుడు ఆ సంసార నివృత్తి క్రమమును తెలుపుచున్నాడు. ఓ రాజా! దేహి జ్ఞానోదయముతో మాయను తొలగించుకొని, కామ క్రోధాది అరిషడ్వర్గమును జయించి, సంగమును వదిలి (ఆసక్తిని వదిలి) ఆత్మతత్త్వమును ఎంతవరకు తెలుసుకొనడో అంతవరకు ఈ సంసారములో భ్రమించుచునే యుండును. 15

ఎంతవరకైతే విషయాసక్తమగు మనస్సే అనర్థమునకు కారణమని తెలుసుకొనలేడో అంతవరకు వైరాగ్యము లేకపోవుటచే సంసార పరిభ్రమణమే కలుగుతుందని తెలుపుచున్నాడు. ఎంతవరకు ఉపాధి రూపమగు మనస్సును సంసార దుఃఖములకు స్థానమని

టీ:- యావచ్చ విషయానురక్తం మన ఏవానర్థహేతురితి న వేద. తావన్నిర్వేదాభావాత్పరిభ్రమ ఏవేత్యాహ - నేతి. ఆత్మనో లింగముపాధి భూతం మనః సంసారతాపానామావపనం క్షేత్రం యావన్న వేదతావ ద్భ్రమతీత్యనుషంగః. తాపావపనత్వే హేతుః. యన్మనః శోకాద్యాను బంధం మమతాం చ విధత్తే. 16

తెలిసికొనలేడో అంతవరకు వైరానుబంధమును మమతను కల్గించును. (16)

శ్లో॥ భ్రాతృవ్యమేనం త్వమదభ్రవీర్య
ముపేక్షయాధ్యేధితమప్రమత్తః ।
గురోర్హరేశ్చరణోపాసనాస్త్రో జహి
వ్యళీకం స్వయమాత్మమోషమ్ ॥ 17

నీ ఉపేక్షచే వృద్ధిచెందిన, బలవంతమైన శత్రువైన, స్వయముగా మిథ్యాభూతమైన, ఆత్మను ఆచ్ఛాదనమొనరించెడి ఈ మనస్సును, నీవు అప్రమత్తుడవై గురుడనే హరిచరణోపాసనమను అస్త్రముతో జయించుము. 17

టీ:- భ్రాతృవ్యమితి. తస్మాద్భ్రాతృవ్యం శత్రుం అధ్యేధితం సంప్రవృద్ధం స్వయం వ్యళీకం మిథ్యాభూతం తథాప్యాత్మానాం ముష్ణాతీతి తథా తం. గురురేవ హరిః తస్య చరణోపాసనమే వాస్త్రం యస్య తథా భూతస్సన్ జహి ఘాతయ. 17

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,**
**ఏకాదశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు**
**పదకొండవ అధ్యాయము సమాప్తము.**





## ద్వాదశోऽధ్యాయః

శ్లో॥ ద్వాదశే పునరాపృష్టస్సందేహేన మహీభృతా ।
స యోగీ సర్వసందేహానపానుదదితీర్యతే ॥

### రహూగణ ఉవాచ

శ్లో॥ నమో నమః కారణ విగ్రహాయ
స్వరూపతుచ్ఛీకృత విగ్రహాయ ।
నమోऽవధూత ద్విజబంధులింగ
నిగూఢనిత్యాను భవాయ తుభ్యమ్ ॥ 1

టీ:- నమో నమ ఇతి. కారణమీశ్వరః తస్యైవ లోకరక్షణార్థో విగ్రహో దేహో యస్య స్వరూపేణ పరమానందప్రకాశేన తుచ్ఛీకృతో విగ్రహో యేన. హే అవధూత యోగేశ్వర ద్విజబంధోర్లింగేన వేషేణ నిగూఢో నిత్యానుభవో యేన తస్మై నమః. 1

## 12వ అధ్యాయము

ఈ పన్నెండవ అధ్యాయమున రాజగు రహూగణమహారాజు సందేహముతో మళ్ళీ ప్రశ్నించగా, ఆ యోగి (భరతుడు) అతని సమస్త సందేహములను తొలగించెనను విషయమును తెలుపబడుచున్నది.

### రహూగణమహారాజు ఈ విధముగా పలికెను.

జగదుద్ధారమునకై ఈ రూపమును ధరించిన, పరమానందమయ స్వరూపానుభవముచే స్థూలశరీరాభిమానము తొలగిన జడబ్రాహ్మణ రూపముతో నీ యొక్క నిత్యజ్ఞాన స్వరూపమును జన సామాన్యులకు మరుగుపరచిన ఓ అవధూతా నీకు నమస్కారము. 1







శ్లో॥ జ్వరామయార్త్తస్య యథాగదం స
న్నిదాఘదగ్ధస్య యథా హిమాంభః ।
కుదేహమానాహి విదృష్టదృష్టే
బ్రహ్మన్వచస్తేఽమృతమౌషధం మే ॥ 2

టీ:- విశేషతః ప్రష్టుం, తద్వాక్యమభినందతి. జ్వరేతి. జ్వర ఏవామయో రోగః. తేనార్త్తస్య యథా సత్ స్వాదు ఆగదమౌషధం యథా చ నిదాఘేన దగ్ధస్య సంతప్తస్య హిమాంభః శీతలముదకం గంధోదకం వా తథా హే బ్రహ్మన్ కుత్సితేదేహే యోఽభిమానః అహంకారః స ఏవ అహిః సర్పః. తేన విశేషేణ దష్టా దృష్టిర్వివేకలక్షణా యస్య తస్య మే తవేదం వచః. అమృతతుల్యమౌషధం. 2

విశేషముగా ప్రశ్నించుటకై మొదట భరతునివాక్కులను అభినందించుచున్నాడు.

ఓ బ్రాహ్మణా! జ్వరరోగముతో బాధచెందు వానికి యోగ్యమైన ఔషధమువలె, ఎండచే తాపమొందినవానికి చల్లని నీటివలె, తుచ్ఛమగు దేహాభిమానమనే విషసర్పముచే కరవబడిన నాకు నీ మాటలు అమృత సమమగు ఔషధములాంటివి. 2

శ్లో॥ తస్మాద్భవంతం మమసంశయార్థం
ప్రక్ష్యామి పశ్చాదధునా సుబోధమ్ ।
అధ్యాత్మయోగగ్రథితం త్వయోక్త
మాఖ్యాహి కౌతుహలచేతసో మే ॥ 3

టీ:- తస్మాదితి. మమ సంశయవిషయమర్థం. పశ్చాత్ ప్రక్ష్యామి అధునా తావత్ త్వదుక్తంవచః. అధ్యాత్మయోగేన గ్రథితం దుర్బోధం. సుబోధం యథా భవేత్యవం వ్యాఖ్యాహి. కౌతూహలయుక్తం చేతో యస్య తస్య మమ. 3

అందువలన నేను నాకు కలిగిన సందేహముల నివృత్తికై తరువాత ప్రశ్నించెదను. నీవు అధ్యాత్మయోగముతో కూడిన వాక్యములనేవైతే చెప్పితివో అవి నాకు బోధపడలేదు. వాటిని తెలిసికొనవలెనను కోరికతో కూడిన మనస్సుగల నాకు ఇప్పుడు వాటిని బోధపడునటుల తెలుపుము. 3







శ్లో॥ యదాహ యోగేశ్వరదృశ్యమానం
క్రియాఫలం సద్వ్యవహారమూలమ్ ।
న హ్యంజసా తత్త్వవిమర్శనాయ
భవానముష్మిన్ భ్రమతే మనో మే ॥ 4

టీ:- యదితి. శ్లో.''త్వయోదితం వ్యక్తమవిప్రలబ్ధమి''త్యాదినా భారవహనాది క్రియాతత్ఫలం చశ్రమాది ప్రత్యక్షాదిభిర్ద ృశ్యమానం సత్. అభాదితమపి వ్యవహారమాత్రస్య మూలం యద్వా - సతః అబాధితవ్యవహారస్య మూలం కారణమపి. శ్లో.''న హ్యంజసా తత్త్వవిమర్శనాయ క్షమమి''తి. భవాన్ యదాహ అముష్మినర్థే మే మనో భ్రమతి. 4

నీవు త్వయోదితం వ్యక్తమవిప్రలబ్ధి మిత్యాది శ్లోకముతో భారమును మోయు క్రియకు శ్రమ మున్నగునవి ఫలములుగా ప్రత్యక్షముగా కనిపించుచూ సత్యముగా కనిపించుచున్ననూ, వ్యవహార మూలకారణముగానే అలా కనిపించుచున్నవని, నిజముగా అవి బాధితములు కావనియు "నహ్యంజసా తత్త్వవిమర్శనాయక్షమం" అని వాస్తవములో తత్త్వ విమర్శయందు నిలువవు కావున సత్యములు కావని తెలిపితివి. ఈ విషయమున నా మనస్సు భ్రమనొందుచున్నది అనగా నాకు బోధపడుటలేదని భావము. 4

**బ్రాహ్మణ ఉవాచ**

శ్లో॥ అయం జనో నామ చలన్ పృథివ్యాం
యః పార్థివః పార్థివ కస్య హేతోః ।
తస్యాపి చాంఘ్ర్యోరధిగుల్ఫ జంఘా
జానూరుమధ్యోర శిరోధరాంసాః ॥ 5

టీ:- అబాధితత్వమసిద్ధమిత్యాహ - అయమితి హే పార్థివ యః పార్థివో వికారః. కస్య హేతోః కస్మాచ్చిత్కారణాత్. పృథివ్యాం చలన్న

**బ్రాహ్మణుడు పలికెను**

ఈ విధముగా రహూగణుడు ప్రశ్నించగా బ్రాహ్మణుడగు భరతుడు ఇలా చెప్పెను. శ్రమాదికము ప్రత్యక్షముగా కానబడుచు బాధితము కాకయున్నది అని చెప్పబడిన దానికి అబాధితత్వము సిద్ధించదు అని తెలుపుచున్నాడు. ఓ పృథ్వీపతీ! పృథ్వి వికారమగు (భూతత్త్వమైన) ఈ దేహమునకు, పృథ్వి వికారమగు శిలకు భేదమేమి. పృథివిపై తిరుగుచు ఉండెడివాడు భారవాహకజనుడని ప్రసిద్ధి నొందును. కదలకుండా ఉండు పృథివి వికారము (మార్పుచెందుటచే)







యం భారవాహకాదిర్జనోనామ ప్రసిద్ధః. యస్తు న చలతి స పాషాణాది రిత్యేతావానేవ భేదః. తస్య చ జడత్వాన్న భారః శ్రమశ్చ. కించ భవేదేవం యది శ్రమస్యాశ్రయో నిరూప్యేత న త్వేతదస్తి. అవయవవ్యతిరేకేణ శ్రమాస్పదస్యావయవినః అనిరూపణాదిత్యాశయేనాహ - తస్యాపీతి. తస్యాపి పృథివీవికారస్యాపిఉ. అంఘ్ర్యోరధి ఉపర్యుపరి గుల్ఫాదయః . అత్ర ఉరశ్శబ్దస్య సలోప ఆర్షః. 5

రాయిరప్పు అగును ఇంతయే భేదము. ఆ రాయి జడమైనది కాన దానికి బరువుకాని శ్రమకాని లేదు. అనినచో శ్రమకు ఆశ్రయ భూతమగునదేదో నిరూపించబడవలయును, అని ఆ నిరూపణ జరుపబడలేదు. అవయవ వ్యతిరేకముతో, శ్రమకు ఆస్పదమగు అవయవిని నిరూపించలేమను ఆశయముతో తెలుపుచున్నాడు. ఆ పృథివి వికారమునకు రెండు పాదములు వాటిపై చీలమండలు, పిక్కలు, మోకాళ్ళు, తొడలు వాటిపై నడుము, వక్షము, శిరస్సు, భుజములు (తరువాతి శ్లోకముతో అన్వయము). 5

శ్లో॥ అంసే చ దార్వీ శిబికా చ యస్యాం
సౌవీరరాజే త్యపదేశ ఆస్తే ।
యస్మిన్ భవాన్ రూఢనిజాభి మనో
రాజాస్మి సింధుష్వితి దుర్మదాంధః ॥ 6

టీ:- శిబికాయామప్య వయమిత్వం నాస్తి. త్వయ్యపి నాస్తి తదాహ - సౌవీరరాజ ఇత్యపదేశో నామమాత్రం యస్య. స పార్థివో వికార ఆస్తే రాజ్యేత్యత్ర సంధిరార్షః. (యద్వా సమాసాంత విధేరనిత్యత్వాట్ట జభావ ఇత్యపి సమాధేయం) యస్మిన్ భవాన్ నిరూఢాత్మాభిమానః సింధుషు రాజాస్మీతి దుర్మదేనాంధస్సన్. 6

(పై శ్లోకమునుండి) భుజముపై దారుమయమగు పల్లకి దాని యందు (పల్లకియందు అవయవిత్వం లేదు, నీలోకూడా అవయవిత్వం లేదని తెలుపుచున్నాడు) సౌవీరరాజను నామమాత్రముగల పార్థివ వికారమున్నది. ఆ పార్థివ వికారమునందు, ఆత్మాభిమానము వదిలిన నీవు, నేను సింధుదేశపు రాజును అను దురభిమానముతో అంధుడవై యున్నావు. 6









శ్లో॥ శోచ్యానిమాన్ స్వానతికష్టదీనాన్ విష్ట్యా
నిగృహ్ణన్నిరనుగ్రహోऽసి।
జనస్య గోప్తాస్మి వికత్థమానో
న శోభసే వృద్ధసభాసు దుష్టః ॥ 7

టీ:- శోచ్యానితి. శోచ్యాన్ విష్ట్యానిగృహ్ణన్ నిష్కృపోవర్తసేఅతో వృథైవ గోప్తాస్మీతి. శ్లాఘమానోమహతాం సభాసు న శోభసే యతో దుష్టః. 7

నీవు, గొప్ప కష్టముననుభవించుచూ దీనులు, శోచనీయులు నగు ఈ బోయీలను నిగ్రహించి పల్లకిని మోయు కర్మయందు నియమించిన దయలేని దుష్టుడవు. మహనీయుల సభలలో నేను జనులను రక్షించువాడనని ప్రగల్భాలు పలుకుచున్నావు. ఇది నీకు శోభనొసంగదు. 7

శ్లో॥ యదాక్షి తావేవ చరాచరస్య
విదామనిష్ఠాం ప్రభవం చ నిత్యం।
తన్నామతోऽన్యద్వ్యవహారమూలం
నిరూప్యతాం సత్క్రియయానుమేయమ్ ॥ 8

టీ:- న చోత్తరోత్తరావయవభారః. పూర్వాపూర్వా వయవానాం భవేదితి వాచ్యం. తేషామప్యనిరూపణాదిత్యాశయేనాహ - యదేతి. నిష్ఠాం నాశం ప్రభవముత్పత్తిం. విదామ విద్మః. తత్తదా క్షితేరన్యస్య వికారస్యాభావాత్ నామమాత్రాదన్యత్ వ్యవహారస్య మూలం కారణం అర్థక్రియయాసదిత్యనుమేయం నిరూప్యతాం న కిమపీత్యర్థః. తథా చశ్రుతిః 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమి'తి. 8

పైపై అవయవముల బరువు క్రింది క్రింది అవయవములపై పడుననియు పలుకరాదు, అవి కూడా నిరూపించబడలేదను భావముతో పలుకుచున్నాడు. సంపూర్ణములగు చరాచరములన్నియు ఎల్లప్పుడు పృథివి నుండియే ఉత్పన్నములగును. పృథ్విలోనే లీనములగును. అని తెలిసికొన్నారము, పృథ్వికంటే వేరు వికారము లేనందున క్రియాభేద కారణముతో వేరువేరు నామములు కలుగుచున్నవి. కాని పృథ్వికంటే వేరు వికారము లేనేలేదు. ఏదేనియున్నచో నిరూపించుము. ఈ విషయమును "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమి"తి అని శ్రుతి తెలుపుచున్నది. 8

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








శ్లో॥ ఏవం నిరుక్తం క్షితిశబ్దవృత్త
మసన్నిధానాత్పరమాణవో యే ।
అవిద్యయా మనసా కల్పితాస్తే
యేషాం సమూహేన కృతో విశేషః ॥ 9

టీ:- తర్హి క్షితేః సత్యతాస్యాత్తత్రాహ - ఏవమితి. ఏవం క్షితి శబ్దస్యాపి వృత్తం వర్తనం అర్థం వినైవ నిరుక్తం యద్వా క్షితిశబ్దస్య వృత్తం యస్మిన్ తదపి మిథ్యాత్వేన నిరుక్తమిత్యర్థః. కుతః. అసత్సు సూక్ష్మేషు పరమాణుషు స్వకారణభూతేషు నిధానాత్ విలయాత్ అతః పరమాణువ్యతిరేకేణ క్షితిర్నాస్తీత్యర్థః. పరమాణవస్తర్హి సత్యాస్స్యుః, తత్రాహ - తే మనసా కార్యానుపపత్త్యా వాదిభిః కల్పితాః. కల్పనా బీజమాహ - యేషాం సమూహేన విశేషః కృతః యేషాం సమూహే పృథ్వీ బుద్ధ్యాలంబనమిత్యర్థః. అవయవినో నిరస్తత్వాత్సమూహ గ్రహణం తథాపి తే సత్యాస్స్యుః న అవిద్యయా ప్రపంచస్య భగవన్మాయావిలసితత్వాదజ్ఞానేన కల్పితాః. 9

అటులైన పృథ్వికి సత్యత్వము కల్గునని అంటే దానికి అలాకాదు అని తెలుపుచున్నాడు. పృథ్వీ శబ్దవ్యవహారమును మిథ్యయేకాని సత్యముకాదు ఎందుకనగా ఆ పృథ్వి సూక్ష్మములగు పరమాణువులలో విలయము చెందును. పరమాణువులకు వ్యతిరేకముగా పృథ్విలేదని తాత్పర్యము మరి పరమాణువులు సత్యములా అవియు సత్యములు కావు. పరమాణు సమూహముల కలయికచే పృథ్వి సిద్ధించునని చెప్పబడిన, పరమాణువులు ప్రపంచము భగవన్మాయా విలసిత మగుటచే అజ్ఞాన మూలకమగు మనస్సుచే కల్పించబడినవి కావున అవియు సత్యములు కావు. 9







శ్లో॥ ఏవం కృశం స్థూలమణుర్బృహద్య
దసచ్చ సజ్జీవమ జీవమన్యత్ ।
ద్రవ్యస్వభావాశయ కాలనామ్నా బుద్ధ్యా
జయావేహి కృతం ద్వితీయమ్ ॥ 10

టీ:- ఏవమితి.ఏవమన్యదపి కృశత్వాదికం కర్మబుద్ధ్యా ప్రతీతం ద్వితీయం ద్వైతం ద్రవ్యాదినామ్నా ఉపలక్షితయా అజయామాయయా కృతమ వేహి. తత్ర కృశం హ్రస్వం. స్థూలం తత్ప్రతియోగి. అణు బృహతోః పృథగు పాదానాత్. అసత్ కారణం సత్ కార్యం జీవం చేతనం. అజీవం జడం. 10

ఇదే విధముగా కృశత్వం, స్థూలత్వం, అణుత్వం, బృహత్వం కారణము, కార్యము, చేతనము, జడము అనునవి కర్మబుద్ధితో ప్రతీయమానమగు మాయామయ ద్వైత ప్రపంచముగా తెలిసి కొనుము. అవికూడా ద్రవ్య, స్వభావ ఆశయ, కాల, కర్మాది నామములు గల భగమన్మాయ యొక్క కార్యములే కావున సత్యములు కావు. 10

శ్లో॥ జ్ఞానం విశుద్ధం పరమార్థమేక
మనంతరం త్వబహిర్బ్రహ్మసత్యం ।
ప్రత్యక్ప్రశాంతం భగవచ్ఛబ్దసంజ్ఞం
యద్వాసుదేవం కవయో వదంతి ॥ 11

టీ:- తర్హి కిం సత్యం? తదాహ - జ్ఞానమితి. జ్ఞానం సత్యం. వ్యావ హారికసత్యత్వం వ్యావర్తయతి - పరమార్థం వృత్తి జ్ఞాన వ్యవచ్ఛేదార్థాని షడ్విశేషణాని. విశుద్ధం తత్తు ఆవిద్యకం ఏకం. తత్తు నానా రూపం. అనంతరం త్వబహిః. బాహ్యాభ్యంతరశూన్యం. తత్తు విపరీతం. బ్రహ్మ

మరి సత్యమైనదేదియన తెలుపుచున్నాడు. జ్ఞానము సత్యమైనది. వ్యవహారికజ్ఞానము వ్యవహారమున్నంతవరకే సత్యముగా గోచరించును. కావున అది సత్యముకాదు. విశుద్ధమైన, పరమార్థ రూపమైన, అద్వితీయమైన బాహ్యాభ్యంతర శూన్యమైన, పరిపూర్ణమైన సర్వాంతర్వర్తియైన నిర్వికారమైన జ్ఞానము సత్యము. ఐశ్వర్యాది షడ్గుణ సంపన్నుడగు భగవచ్ఛబ్దవాచ్యుడగు వాసుదేవుడే జ్ఞానమని పండితులు చెప్పుదురు. 11


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ







పరిపూర్ణం. తత్తు పరిచ్ఛిన్నం. ప్రత్యక్. తత్తు విషయాకారం. ప్రశాంతం నిర్వికారం. తదేవం స్వర్గరూపజ్ఞానం సత్యమిత్యుక్తం. కీదృశం. సత్. ఐశ్వర్యాదిషడ్గుణత్వేన. భగవచ్ఛబ్దస్సంజ్ఞా యస్య. యచ్చ జ్ఞానం వాసుదేవం వదంతి. 11

శ్లో॥ రహూగణైె తత్తపసా న యాతి
న చేజ్యయానిర్వపణాద్గృహాద్వా ।
నచ్ఛందసా నోతజలాగ్ని సూర్యై
ర్వినా మహత్పాదరజోభిషేకమ్ ॥ 12

టీ:- ఏతత్ప్రాప్తిశ్చ మహత్సేవాం వినా న భవతీత్యాహ - రహూగణేతి. హే రహూగణ. ఏతత్ జ్ఞానం తపసా పురుషో న యాతి. ఇజ్యయా వైదికకర్మణా నిర్వపణాత్ అన్నాది సంవిభాగేన. గృహాద్వా తన్నిమిత్త పరోపకారేణ. ఛందసా వేదాభ్యాసేన. జలాగ్న్యాదిభిరుపాసితైః. 12

శ్లో॥ యత్రోత్తమశ్లోకగుణానువాదః
ప్రస్తూయతే గ్రామ్యకథావిఘాతః ।
నిషేవ్యమాణోఽనుదినం ముముక్షో
ర్మతిం సతీం యచ్ఛతి వాసుదేవే ॥ 13

ఈ జ్ఞానప్రాప్తి మహత్సేవలేక లభించదని తెలుపుచున్నాడు. ఓ రహూగణా! ఈ జ్ఞానమును పురుషుడు తపస్సుచేతగాని, యజ్ఞాది వైదిక కర్మలచేతగాని, అన్నాది దానములచేతగాని, గార్హ్యస్థధర్మములగు అతిథిసేవ, దీనజనసేవ మున్నగు పరోపకార ధర్మాచరణచేతగాని, వేదాధ్యయనముచేతగానీ, జలాగ్ని సూర్యోపాసనలచేతగాని పొందలేడు. కేవలము మహా పురుషుల పాదధూళిని శిరస్సున ధరించడముచేతనే పొందగలడు. 12

మహాపురుషసేవతో జ్ఞానప్రాప్త్యుపాయమును తెలుపుచున్నాడు. మహాపురుషసేవతో, విషయవార్తలను నాశనమొనరించెడి సదా పవిత్ర కీర్తిమంతుడగు శ్రీహరి గుణ గానచర్చ నిత్యము సేవించబడుటచే మోక్షకాంక్షియగు పురుషుని బుద్ధి భగవంతుడగు వాసుదేవునియందు









టీ:- మహత్సేవాయాస్తత్ప్రాప్త్యుపాయతామాహ - యత్రేతి. యత్ర యేషు. మహత్సు గ్రామ్యకథానాం విఘాతో యస్మాత్. 13

శ్లో॥ అహం పురా భరతో నామ రాజా
విముక్త దృష్ట శ్రుత సంగబంధః।
ఆరాధనం భగవత ఈహమానో
మృగో భవం మృగసంగాద్ధతార్థః ॥ 14

టీ:- విషయసంగస్తు యోగభ్రంశక ఇతి కథయన్. కస్త్వం నిగూఢశ్చరసీతి ప్రశ్నస్యోత్తరమాహ-ద్వాభ్యాం. అహమితి. విముక్తో దృష్ట శ్రుతాభ్యాం సంగనిమిత్తో బంధో యేన. హతోऽర్థః ప్రయోజనం యస్య. 14

శ్లో॥ సా మాంస్మృతిర్మృగదేహేऽపి వీర
కృష్ణార్చన ప్రభవానో జహాతి ।
అథో అహం జనసంగాద్విముక్తో
విశంకమానోऽవివృతశ్చరామి ॥ 15

టీ:- శ్రీకృష్ణార్చనం. భ్రష్టమప్యుద్ధరతీత్యాహ - సేతి. జన సంగాద్విశంకమానః అవివృతః అప్రకటః. 15

లగ్నమగును. (సత్పురుష సేవ మోక్షగామియగు పురుషుని బుద్ధిని వాసుదేవునియందు లగ్నముగా నుంచును). 13

విషయాసక్తి యోగభ్రష్టునిగా చేయునని "కస్త్వంని గూఢశ్చరాశి" అను ప్రశ్నకు ఉత్తరమును రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు.

నేను పూర్వజన్మలో భరతుడనే రాజును, ఐహిక, పారలౌకిక విషయములనుండి విరక్తుడనై భగవదారాధనమును చేయగోరుచుండి కూడా ఒక జింకపిల్లపై ఆసక్తితో పరమార్థము నుండి భ్రష్టుడనై లేడిగా జన్మించితిని. (మృగమునైతిని). 14

భ్రష్టుడనైనవాడిని కూడా శ్రీకృష్ణార్చన ఉద్ధరించునని తెలుపుచున్నాడు. ఓ వీరుడా! శ్రీకృష్ణార్చన ప్రభావముతో మృగజన్మలో కూడా నన్ను నా పూర్వజన్మ స్మృతి వదలలేదు. అందువలన మృగ జన్మానంతరము బ్రాహ్మణుడుగా జన్మించిన నేను జన సంసర్గమునకు భీతిల్లి అనాసక్త భావముతో ఇలా నిగూఢముగా చరించుచున్నాను. 15








శ్లో॥ తస్మాన్నరో సంగసుసంగ జాత
జ్ఞానాసినైవేహ వివృక్ణమోహః ।
హరింతదీహాకథన శ్రుతాభ్యాం
లబ్ధస్మృతిర్యాత్యతిపారమధ్వనః ॥ 16

టీ:- తస్మాదితి. అసంగైర్మహద్భిః. యః సుసంగస్తేన జాతం జ్ఞానమేవాసిః. తేన ఛిన్నమోహస్సన్. అధ్వనః సంసారమార్గస్య అతిశయితం శ్రేష్ఠం. పారం హరిం యాతి. యద్వా పారమతిక్రమ్య హరింయాతి సూ. "అతిరతి క్రమణే చే"తి కర్మ ప్రపంచనీయత్వాద్ద్వితీయా. తస్య హరేరీహానాం కథన శ్రుతాభ్యాం లబ్ధా స్మృతిర్యేన సః. 16

అందువలన జీవి అనాసక్తులగు మహాపురుషుల సాంగత్యముచే కలుగిన జ్ఞానమనే ఖడ్గముచే ఈ లోకములోని మోహబంధములను త్రెంచుకొని శ్రీహరి లీలాకథన శ్రవణములతో భగవస్మృతి (వాసుదేవుని గూర్చిన జ్ఞానము) నొంది సంసార మార్గమును వదిలి భగవంతుని చేరును. 16

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, ద్వాదశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పన్నెండవ అధ్యాయము సమాప్తము.**








## త్రయోదశోऽధ్యాయః

శ్లో॥ త్రయోదశే విరక్తాయ వృథా తత్త్వనిరూపణం ।
ఇతి వైరాగ్యదార్ఢ్యాయ భవాటవ్యుపవర్ణ్యతే ॥

**బ్రాహ్మణ ఉవాచ**

శ్లో॥ దురత్యయేऽధ్వన్యజయా నివేశితో
రజస్తమస్సత్త్వ విముక్త కర్మ దృక్ ।
స ఏష సార్థోऽర్థపరః పరిభ్రమన్
భవాటవీం యాతి న శర్మవిందతి ॥ 1

టీ:- అధ్వనః పారమిత్యుక్తం తమేవాధ్వానం ప్రసిద్ధ మార్గరూపేణ వైరాగ్యాయ ప్రపంచయతి. దురత్యయ ఇతి. దురత్యయే దుస్తరే. అధ్వని ప్రవృత్తిమార్గే రజస్తమస్సత్త్వైర్విభక్తాని కర్మాణి. కార్యతయా పశ్యతీతి. తథా స ఏష ప్రసిద్ధః. సార్థో జీవసమూహః. అర్థ పరః సుఖార్థీసన్, యథా వణితద్వత్ అస్యాధ్యాయస్య వ్యాఖ్యాత రూపతమోత్తరాధ్యాయోऽభివర్ణితః, తథాపి. సుఖ ప్రతిపత్తయే కించిద్వ్యా ఖ్యాయతే .1

## 13వ అధ్యాయము

ఈ పదమూడవ అధ్యాయమున వైరాగ్యవంతునకు తత్త్వబోధ వ్యర్థమని, వైరాగ్య దృఢత్వమునకై సంసారారణ్యము వర్ణించబడినది.

**బ్రాహ్మణుడు ఈ విధముగా పలికెను.**

పై అధ్యాయమున చివరన అధ్వనపారం అని చెప్పబడినది. ఆ ప్రసిద్ధమైన మార్గమును వైరాగ్యము కొరకు విశదపరచుచున్నాడు.

ఓ రాజా! దుస్తరమగు ప్రవృత్తిమార్గములో సత్త్వ. రజో, తమో గుణములచే విభక్తములగు అనేక కర్మలను కార్యములుగా తలచే జీవుడు సుఖకాంక్షియై వ్యాపారస్థులు ధనమును సంపాదించుటకు అరణ్యములో తిరుగు రీతిలో త్రిగుణాత్మకములగు నానా కర్మలతో పరిభ్రమిస్తూ సంసారారణ్యమును చేరును. అచట సుఖము నొందదు. ( ఈ అధ్యాయమునకు వ్యాఖ్యగా తరువాతి అధ్యాయము చెప్పబడినది ఐనను సుఖావబోధన కొరకు ఇచట వ్యాఖ్యానించబడినది). 1








శ్లో॥ యస్యామిమే షణ్ణరదేవదస్యవస్సార్థం
విలుంపంతి కునాయకం బలాత్ ।
గోమా యవో యత్ర హరంతి సార్థకం
ప్రమత్తమావిశ్య యథోరణం వృకాః ॥ 2

టీ:- యస్యామితి. యస్యాం భవాటవ్యాం. ఇమే ఇంద్రియనామానః షడ్దస్యవః. చోరాః కుత్సితో నాయకః. సారథిర్బుద్ధిర్యస్య తం. సార్థం విలుంపంతి తస్య ధర్మం ధనముపభోగేన ముష్ణంతీత్యర్థః. గోమాయవః సృగాలతుల్యా దారాపత్యాదయః. త్వమ్మే భర్తా పితేత్యేవం ప్రవిశ్య మత్తం సార్థకం సార్థే స్థితం హరంతి ఇతస్తతః ఆకర్షంతి. ఉరణం మేషం. 2

ఈ భవారణ్యములో దుష్టబుద్ధియను సారథిగల, జీవుడనే నాయకుని యొక్క ధర్మమనెడు ధనమును ఇంద్రియములనెడు ఆరుగురు చోరులు, భోగేచ్ఛతో దొంగిలించుదురు. జంబుకములతో సమానులగు దారాపుత్రాదులు నీవు నా భర్తవు, తండ్రివి అని మత్తుడగు ఆ జీవునిచేరి మేకలమందలో చేరిన తోడేలు మేకలను లాక్కొని వెడలినటుల అతనిని భోగములవైపునకే ఆకర్షింపజేయుదురు. 2

శ్లో॥ ప్రభూతవీరుత్తృణగుల్మగహ్వరే
కఠోరదంశైర్మశకైరుపద్రుతః ।
క్వచిత్తు గంధర్వపురం ప్రపశ్యతి
క్వచిత్క్వచిచ్చాశురయోల్ముక గ్రహమ్ ॥ 3

టీ:- ప్రభూతేతి. వీరుధో లతాః. తృణాని చ గుల్మాని చ లతాజాలాని ప్రభూతైరేతైర్గహ్వరే దుష్ప్రవేశక్షేత్రే. కఠోరైస్తీవ్రైర్దంశైః మక్షికావిశేషైః. మశకైశ్చ యథాకశ్చిదుపద్రుతో భవతి. ఏవం కామకర్మాదిభిర్గహ్వరే గృహాశ్రమే. వర్తమానో దుర్జనైరుపద్రుతో భవతీత్యర్థః. గంధర్వ పురవద

గొప్పనగు లతలచే, తృణములచే, పొదలచే ప్రవేశింప శక్యము గాని ఆ ఆరణ్యమున తీవ్రములగు ఈగలచే (మక్షికావిశేషము లచే), దోమలచే బాధింపబడుచు ఒకానొకప్పుడు గంధర్వ పట్టణమును (లేని పట్టణమును ఊహించుకొని అందులోని భోగానుభవ నిమిత్తమై) ప్రవేశించును. అనగా కామకర్మాదులతో గహ్వరమగు గృహస్థాశ్రమ-ములో ఉంటూ దుష్టులచే బాధలనొందుచు అసత్యమగు దేహాదికమును సత్యమని తలంచునని భావము. మరొక్కప్పుడు మిక్కిలి వేగమంతమగు కొరవిదయ్యముగా గాంచును. అనగా పిశాచగ్రహముతో సమానమగు బంగారమును గ్రహించదగినదిగా చూచునని భావము. 3







ఘటమానమేవ దేహాదికం ప్రకర్షేణ సత్యమేవేదమితి పశ్యతి. క్వచిత్. క్వచిత్క్వాపి. ఆశురయః అతివేగః. య ఉల్ముకాకారో గ్రహః పిశాచః తత్తుల్యం సువర్ణముపాదేయత్వేన ప్రపశ్యతీత్యర్థః. 3

శ్లో॥ నివాసతో యద్ద్రవిణాత్మ బుద్ధి
స్తతస్తతో ధావతి భో అటవ్యామ్ ।
క్వచిచ్చ వాత్యోత్థితపాంసుధూమ్రా
దిశో న జానాతి రజస్వలాక్షః ॥ 4

టీ:- నివాసత ఇతి. నివాసాదిష్వాత్మా స్వభావో యస్యాస్సాబుద్ధిర్యస్య సః. తతస్తతో ధావతీత్యుభయత్ర తావానేవార్థః. భో పార్థివ! వాత్యా చక్రవాతః. తస్యాముత్థితః పాంసుస్తేన ధూమ్రా దిశః. రజస్వలే రజోవ్యాప్తే అక్షిణీ యస్య. స యథా న జానాతి. తథా వాత్యేవ భ్రమయంతీ యా స్త్రీ తస్యాముద్గతైరాగాదిభిః ధూమ్రా అప్రకాశమానా దిగ్దేవతాః. కర్మసాక్షిభూతా న జానాతీత్యర్థః. 4

అతడు (వ్యాపారి) తన నివాసస్థానమందు, ధనాదులయందు నాది అనుబుద్ధితో ఈ (భవా) అరణ్యములో అటునిటు తిరుగు చుండును. ఒక్కొక్కసారి సుడిగాలితో ఎగరగొట్టబడిన ధూళితో దిక్కులు కప్పివేయబడగా, ధూళితో నిండిన కళ్ళతో దిక్కులను తెలిసికొనలేదు. జీవుడు సుడిగాలిలాంటి స్త్రీతో ఈ సంసారమనే అరణ్యములో త్రిప్పబడుచు ఆమె యందు అనురాగాదులతో కళ్ళు మూసుకుపోయి అప్రకాశములు, కర్మసాక్షిభూతములగు దేవతలనుగూడా తెలిసికొనలేదు. (4)

శ్లో॥ అదృశ్యఝిల్లీస్వనకర్ణశూల
ఉలూక వాగ్భిర్వ్యథి తాంతరాత్మా ।
అపుణ్యవృక్షాన్ శ్రయతే క్షుధార్దితో
మరీచితో యాన్యభిధావతి క్వచిత్ ॥ 5

ఆ వణిజుడు (జీవుడు) అరణ్యములో కన్పించకుండగా ధ్వనించెడి చిమ్మట పురుగులు చేసే కర్ణశూలను కల్గించే ధ్వనులతో, గుడ్లగూబల కూతలతో బాధనొంది, ఆకలి బాధచే విభీతక్యాది వృక్షముల (ఈ వృక్షములనీడ దప్పిక కల్గించును) నాశ్రయించును. ఆ వృక్షములతో







టీ:- అదృశ్యేతి. అదృశ్యానాం ఝిల్లీనాం భృంగాళికా సంజ్ఞానాం కిట విశేషాణాం. స్వనైః కర్ణయోః శూలం వ్యథా యస్య ఉల్లూకాః మూకా స్తేషాం వాగ్భిర్వ్యథితోఽంతరాత్మామనో యస్య. అత్ర చ పరోక్షమప్రియ వక్తారో ఝిల్లీతుల్యాః. ప్రత్యక్షమపి ప్రియవక్తారో మూకతుల్యాః. యేషాం ఛాయా పిపాసహేతుః. తే అపుణ్యవృక్షాః విభీతకాః తత్తుల్యానధార్మికాన్ సేవతే మరీచితోయానీతి. నిష్ఫలత్వేన విజ్ఞాతానపి వితోయాన్. 5

సమానులగు అధార్మికులను సేవించును. ఎండమావులను గాంచి నీటికై పరుగెత్తును. భవాటవిలో పరోక్షముగా చెడును పలికెడి వారి మాటలతో, ప్రత్యక్షముగా ఇష్టమును పలికెడి వారి మాటలతో బాధపడుచూ నిష్ఫములని తెలిసియూ కర్మల నాచరించుచుండును. 5

శ్లో॥ క్వచిద్వితోయాస్సరితోఽభియాతి
పరస్పరం చాలషతే నిరన్నః ।
ఆసాద్య దావం క్వచిదగ్నితప్తో
నిర్విద్యతే క్వచ యక్షైర్హృతాసుః ॥ 6

టీ:- క్వచిదితి. వితోయాసు సరిత్సు పతితస్య గాత్రభంగాత్సద్యో దుఃఖం భవతి. న చోదకలాభః. తద్వదిహ చ పరత్ర చ దుఃఖదాన్పాషండానభియాతి అలషతే అభిలషతే. దాయాదిభ్యః. అన్నాది వాంఛతి. ఉభయత్రాపి స ఏవార్థః. దావం దావాగ్నితుల్యం దుఃఖదం గృహం ప్రాప్య శోకాగ్నినా తప్తో నిర్విద్యతే విషీదతి. క్వచిత్తత్ర చ. యక్షైఃరాక్షస తుల్యై రాజభిః హృతమసువత్ప్రేష్ఠం ధనం యస్య సః నిర్విద్యతే. 6

వణిజుడు అరణ్యములో ఒక్కొక్కసారి నీళ్ళులేని సరస్సులలోబడి శరీరము భగ్నమై దుఃఖమొందును. నీరులేక అన్నము లభించక ఆకలితో పక్కవారిని యాచించును. ఒక్కొక్కసారి దావాగ్నిలోబడి అగ్నిచే కాల్చబడి బాధనొందును. ఒక్కసారి రాక్షసులచే ప్రాణములను హరించబడే స్థాయిలో బాధనొందును. భవాటవిలో జీవుడు ఇహలోక, పరలోక ములలో దుఃఖమును కలిగించెడి పాషండులను చేరుకొనును. అనగా దావాగ్నివలె దుఃఖప్రధమగు గృహమునొంది శోకాగ్ని తప్తుడగును. జ్ఞాతుల నాహారము కోరును. రాక్షసతుల్యులగు రాజులచే ప్రాణ తుల్యమగు ధనము హరించబడి బాధనొందును. 6











శ్లో॥ శూరైర్హృతస్వః క్వ చ నిర్విణ్ణచేతా
శోచన్విముహ్యన్నుపయాతి కశ్మలమ్ ।
క్వచిచ్చ గంధర్వపురం ప్రవిష్టః
ప్రమోదతే నిర్వృతవన్ముహూర్తమ్ ॥ 7

టీ:- శూరైరితి. అన్యైశ్చ శూరైర్హృతం స్వం విత్తం యస్య. నిర్విణ్ణం విషణ్ణం చేతో యస్య. కశ్మలం మూర్ఛాం. గంధర్వపురమివ మనోరథోపగత పితృ పుత్రాది సమాజం ప్రవిష్టస్సన్. 7

శ్లో॥ చరన్ క్వచిత్కంటక శర్కరాంఘ్రి
ర్నగారురుక్షుర్విమనా ఇవాస్తే ।
పదేపదేऽభ్యంతర వహ్నినార్దితః
కౌటుంబికః క్రుధ్యతి వై జనాయ ॥ 8

టీ:- చరన్నితి. కంటకాదివిద్ధాంఘ్రిరివ విఘ్నైరభిభూతస్సన్. నగతుల్యం మహత్కర్మారోహం కర్తుమిచ్ఛుర్విమనా ఇవాస్తే. పదే పదే క్షణే క్షణే. అభ్యంతరేణ వహ్నినా జాఠరేణ. 8

వణిజుడు అరణ్యములో తనకంటె బలవంతులచేత ధనము హరించబడి నిర్వేదము నొందిన మనస్సుతో దుఃఖిస్తూ మూర్ఛితుడగుచు ఒక్కొక్కసారి గంధర్వపురమును (ఊహానగరము) ప్రవేశించి క్షణకాలము సుఖదుఃఖముల మరిచి సంతోషమొందును. భవారణ్యమున జీవుడు బలిష్ఠులగు ఇతరులచేత ధనము హరించబడి నిర్విణ్ణ చేతస్కుడై దుఃఖ మోహములతో అచైతన్యస్థితినొందును. తన మనోరథముతో ప్రాప్తించిన పితృపుత్రాది సమూహమునుచేరి సుఖదుఃఖాదులు అన్నీ లభించినవాని రీతిగా తలచి లేనివానివలె క్షణికానందము పొందును. 7

అరణ్యములో వణిజుడు పర్వతారోహణము చేయబోయి మార్గములో కంటకాదులతో పాదములు చీల్చబడి ఉదాసీనుడగును. మధ్యమార్గమున దావాగ్నిచే బాధనొంది పక్కవారిపై కోపముచూపును. జీవుడు భవారణ్యమున గొప్ప కార్యముల నొనర్చబోయి విఘ్నములచే అడ్డగించబడినవాడై ఉదాసీనుడగును. కుటుంబభారము పెరిగి ఆహారము దొరకక జఠరాగ్నిచే బాధనొందుచు ఆకలిమంటచే స్వజనులపై కోపముచూపించును. 8









శ్లో॥ క్వచిన్నిగీర్ణోऽజగరాహినా జనో
నావైతి కించిద్విపినేऽపవిద్ధః ।
దష్టస్స్మ శేతే క్వచదందశూకై
రంధోऽంధకూపే పతితస్తమిస్రే ॥ 9

టీ:- క్వచిదితి. అజగరాహినా నిద్రారూపేణ నిగీర్ణో గిరితో న వేత్తి. విపినే త్యక్తః శవ ఇవ దందశూకైః హింస్రైః దుర్జనైః దష్టః పీడితః. అంధో లుప్తవివేకః. అంధకూపే మోహేపతితః తమిస్రే దుర్నివేశే. శేతే లీయతే. 9

అరణ్యములో వణిజుడు కొండచిలువకు ఆహారమై, అరణ్యములో పడవేసిన శవమువలె పడియుండును. లేదా విష జంతువులచేత కరవబడి విషప్రభావముచే గ్రుడ్డివాడై చీకటిగల బావిలో పడియుండును. సంసారాటవిలో జీవుడు అజగరములాంటి నిద్రకు లోనై అరణ్యములో శవము పడియుండినటుల పడుకొని ఏమియు నెరుగడు. హింసా స్వభావములగు దుష్టులచే పీడింపబడి వివేకశూన్యుడై మోహావిష్టుడై దుఃఖమయమగు అజ్ఞానాంధకారములో అచేతనుడైపడియుండును. 9

శ్లో॥ కర్హిస్మచిత్ క్షుద్రరసాన్విచిన్వన్
తన్మక్షికాభిర్వ్యథితో విమానః ।
తత్రాతికృచ్ఛ్రాత్ప్రతిలబ్ధమానో
బలాద్విలుంపంత్యథ తాంస్తతోऽన్యే ॥ 10

టీ:- కర్హీతి. క్షుద్రరసాన్ పరయోషాదీన్ విచిన్వన్ గవేషయన్ తన్మక్షికాభిః యోషాదిస్వామిభిః.విమానః అవజ్ఞాతః తాడితస్సన్.వ్యథితో భవతి యది కథంచిత్తత్రాతిక్లేశేన ప్రతిలబ్ధమానః ప్రాప్తయోషాదిర్భవతి తాదా బలాదన్యే అపహరంతితాన్ యదాభియుంక్తే తదాప్యన్యే హరంతి. 10

అరణ్యములో వ్యాపారి ఒకసారి తేనెను వెదుకుచు ఆ తేనెటీగలతో కరవబడి వ్యధనొందును. అతి కష్టముగా దానిని (తేనెను) పొందినను ఆతని నుండి ఆ తేనెను బలవంతముగా ఇతరులు లాగుకొందురు, భవారణ్యములో జీవుడు ఇతరుల స్త్రీలకై వెంపర్లాడుచు ఆ స్త్రీల భర్తలచే కొట్టబడి వ్యధనొందును. మిక్కిలి కష్టముతో ఇతర స్త్రీలను పొందినను ఆ స్త్రీని ఇతరులు అపహరించెదరు. 10








శ్లో॥ క్వచిచ్చ శీతాతపవర్షవాత
ప్రతిక్రియాంకర్తుమనీశ ఆస్తే ।
క్వచిన్మిథో విహర యచ్చ కించి
ద్విద్వేష మృచ్ఛత్యథ విత్తశార్యాత్ ॥ 11

టీ:- క్వచిదితి. యత్కించిత్ అత్యల్పమపి మిథో వ్యవహరన్ క్రియాదినా గృహ్ణన్ విత్త శార్యాత్ ధనవంచనాత్. 11

అరణ్యములో వణిజుడు ఒకప్పుడు చలి, ఎండ, వర్షము, వాయువులచేత బాధించబడి తనను వాటినుండి రక్షించుకొనుటకు అసమర్థుడగును. ఒక్కొక్కప్పుడు మిగతా వణిజులతో వ్యాపార మొనరించి ధనలోభముతో ఇతరులను మోసగించి ద్వేష్యుడగును. భవాటవిలో జీవుడు ధనార్జనకై ఎండయనక, వానయనక ప్రయాస నొందును. ధనలోభముచే ఇతరులను మోసగించి ద్వేష్యుడగును. 11

శ్లో॥ క్వచిత్క్వచిత్ క్షీణధనస్తు తస్మిన్ శయ్యాసన స్థాన విహార హీనః
యావత్పరాదప్రతిలబ్ధకామః పారక్యదృష్టిర్లభతేఽవమానమ్ ॥12

టీ:- క్వచిదితి. శయ్యాదిహీనః. ఆస్యతేఽస్మిన్నిత్యాసనం కంబళాది స్థీయతేఽస్మిన్నితిస్థానం గృహం. విహరంత్యనేనేతి విహారో యానాది. తాన్ యాచ మానోఽపి యదాపరస్మాదప్రాప్తకామః. తదా పరకీయే వస్తుని దృష్టిరభిలాషో యస్య సోఽవమానం ప్రాప్నోతి. 12

అరణ్యములో వణిజుడు ధనము నాశించినవాడై శయ్య, ఆసన, నివాసస్థాన, ప్రయాణసాధనయానహీనుడై ఇతరులను యాచించును. వారు వాటిని ఇవ్వకపోగా ఇతరుల వస్తువులపై సంగ్రహణ దృష్టిని ఉంచి అవమానమొందును. సంసారారణ్యమున జీవుడు ధనవిహీనుడై శయ్య కంబళాది ఆసన గృహ ప్రయాణసాధనాది హీనుడై ఇతరులను యాచించి అవి లబ్ధము కాకపోగా ఇతరుల వస్తువులను గ్రహించు దృష్టి కలవాడై ఇతరులచే అవమానించబడును. 12

శ్లో॥ అన్యోన్య విత్తవ్యతిషం గవృద్ధవైరానుబంధో వివహన్మిథశ్చ ।
అధ్వన్యముష్మిన్నురుకృచ్ఛ్రవిత్తబాధోపసర్గైర్విహరన్విపన్నః ॥13

టీ:- అన్యోన్యేతి. ఏవమన్యోన్యం విత్తవ్యతిషంగేణ ధనవినిమయేన

అరణ్యమున వణిజుడు వ్యవహార విషయమున ఇతరులతో ద్వేషభావము పెరిగినను, ఆ వణిజుల సమూహము తమలో తాము వివాహసంబంధముల నొనర్చుకొనుచు, అరణ్య మార్గమున అనేక రకములగు కష్టములనొందుచు ధన నాశనాది కష్టములనొందుచు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.









వివృద్ధో వైరానుబంధోయస్య తథా విథోऽపి పరస్పరం వివహన్ వివాహదిసంబంధం కుర్వన్. ఉరుభిః కృచ్ఛ్రైః శ్రమైర్విత్తబాధాత్తబాధాభిః ఉపసర్గైశ్చ ద్వేషాదిభిః విపన్నః. మృతప్రాయో భవతి. 13

మృతప్రాయుడగును. సంసారారణ్యమున జీవుడు పరస్పరము ధనవినిమయముతో వృద్ధిచెందిన వైరభావము కల్గియు పరస్పరము వివాహాది బంధములనేర్పరచుకొని గొప్ప కష్టములతో, ధనబాధలతో, ద్వేషాదులతో బాధనొందుచు బ్రతికియున్ననూ మరణించినవానితో సమానమై ఉండును . 13

శ్లో॥ తాంస్త్వాన్విపన్నాన్ స హి తత్ర తత్ర
విహాయ జాతం పరిగృహ్యసార్థః ।
ఆవర్తతేతత్రద్యాపి న కశ్చిదత్ర
వీరాధ్వనః పారముపైతి యోగమ్ ॥ 14

టీ:- దురత్యయత్వమధ్వనో దర్శయతి – తానితి. తాంస్తాన్ విపన్నాన్ మృతాన్ విహాయజాతం జాతం పరిగృహ్య విహరన్ యతః ప్రతిష్ఠితః తం ప్రతి నానువర్తతే. హే వీర అధ్వనః పారం యో యోగస్తం చ నోపైతి అత్ర సార్థే కశ్చిదతి సమర్థోతత్రపి. 14

ఆ అరణ్యమార్గము దుస్తరమైనదని తెలుపుచున్నాడు. ఆ అరణ్యమున వణిజులు పయనిస్తూ ఆ మార్గమున మృత్యులైన వారిని వదిలివేస్తూ, జనించిన వారిని వెంబడి తీసికొని భ్రమించెదరు. ఓ వీరుడా! ఈ విధముగా అరణ్యమున సంచరించిన వారలెవరును తిరిగి రాకపోయిరి. వీరుగూడా ఇంత ఇష్టమగు మార్గమును దాటి సంతోషకరమగు యోగమునొందరైరి. ఈ ప్రవృత్తి మార్గము దుస్తరమైనదని తెలుపుచున్నాడు. ఈ భవాటవిలో జీవుడు పరిభ్రమిస్తూ మరణించిన వారిని వదిలివేస్తూ, జన్మించిన వారిని గ్రహిస్తూ పరిభ్రమించుచునే యుండును. ఓ వీరశ్రేష్ఠా! మిక్కిలి దుస్తరమగు ఈ ప్రవృత్తి మార్గమున పరిభ్రమించుచు వారెవరూ సంసార చక్రమును దాటి నివృత్తి మార్గమునకు చేరరైరి. ఎంతసామర్థ్యము కలవారైననూ ఈ ప్రవృత్తిమార్గము యొక్క అంతము కనుగొని పరమానందమయమగు యోగము పొందజాలకున్నారు. 14










శ్లో॥ మనస్వినో నిర్జితదిగ్గజేంద్రా
మమేతి సర్వే భువి బద్ధవైరాః ।
మృథేశయీరన్న తు తద్వ్రజంతి
యన్న్యస్తదండో గతవైరోऽభియాతి ॥ 15

టీ:- తదేవాహ - మనస్విన ఇతి. మనస్వినః శూరాః నిర్జితా దిగ్గజేంద్రా యైః మమేయం భూర్మమేయమితి భువి భూమినిమిత్త భూతాయాం బద్ధం వైరం యైః న్యస్తదండః సన్న్యాసీ. యద్విష్ణోః పదమభియాతి తత్తున వ్రజంతి. 15

ఆ విషయమునే దార్ఢ్యత కొరకు తెలుపుచున్నాడు. అరణ్యమున శూరులు ఏనుగులను జయించి భూవిషయమున నాది నాదియని వైరము పెంచుకొని చచ్చెదరు. (మృత్యువునొందుదురు) కాని వైరమును వదిలి సుఖముగా నుందరు. భవాటవిలో జీవులుశూరులై దిగ్గజముల లాంటి వారిని గూడా జయించి భూ విషయమున (ఈ భూమి నాదంటే నాదియని) వైరమును పెంచుకొని యుద్ధభూమిలో పడిపోదురు గాని విరోధ భావము నొదలి దండమును ధరించి, సన్న్యాసులైనవారు పొందెడి విష్ణుపదమును మాత్రము పొందరు. 15

శ్లో॥ ప్రసజ్జతి క్వాపి లతా భుజాశ్రయ
స్తదాశ్రయావ్యక్తపద ద్విజ స్పృహః ।
క్వచిత్కదాచిద్ధరి చక్రతస్త్రసన్
సఖ్యం విధత్తే బక కంక గృధ్రైః ॥16

టీ:- సింహావలోకనేన పునర్భవాటవీమేవానువర్ణయతి - ప్రసజ్జతీతి. ప్రసజ్జతి. ఆసక్తిం కరోతి. కీదృశః లతానాం భుజాః శాఖాః. తద్వత్సుకుమారా యే స్త్రీణాం భుజాః. తదాశ్రయస్సన్ తదాశ్రయా అవ్యక్త పదాః అస్ఫుటాక్షరాః. కలభాషిణో యే ద్విజాః పక్షిణః. తత్తుల్యేషు

ఆ వణిజులు అరణ్యమున ఒక్కొక్కప్పుడు లతల శాఖాసమూ - హము నాశ్రయించెదరు. ఆ లతలపైనుండెడు మధుర కూజితముల నొనర్చు పక్షులనుగాంచి మోహితులగుదురు. ఒక్కొక్కసారి సింహ సమూహమునకు భీతిల్లి కొంగలు, కాకులు, గ్రద్దలు మున్నగువాటితో సఖ్యము చేసెదరు. భవాటవిలో జీవులు లతల లాంటి సుకుమారము లగు స్త్రీల భుజములనాశ్రయించి స్త్రీసంగ ప్రసక్తితో కలిగిన అస్ఫుటాక్షరములుగల భాషణములొనరించి, సంతానమందు మోహముతో ఆసక్తి నొందుదురు. సింహసమూహముతో సమమగు కాలచక్ర నిమిత్తమగు జననమరణాదుల తలచి భీతిల్లియు, ఆ










స్త్రీసంగ ప్రసక్తేష్వపత్యేషు స్పృహా యస్య. తాదృశో భూత్వా. హరిచక్రం సింహసమూహః. తత్తుల్యాత్కాలచక్రనిమిత్తాజ్జన్మ మరణాదేః త్రసన్ తత్పరిహాయ కైశ్చిత్ ప్రలోభితో బకాదివద్వంచకైః క్షుద్రైః క్రూరైశ్చ పాషండైస్సహ సఖ్యం కరోతి తేషు ప్రవిశతి. 16

శ్లో॥ తైర్వంచితో హంసకులం సమావిశన్న
రోచయన్ శీలముపైతి వానరాన్ ।
తజ్జాతిరాసేన సునిర్వృతేంద్రియః
పరస్పరోద్వీక్షణవిస్మృతావధిః ॥ 17

టీ:- తైరితి. తైర్వంచితః తత్రఫలాభావం జ్ఞాత్వా హంసానాం బ్రాహ్మణానాం కులం పునః ప్రవిశన్. తేషాం శీలం ప్రాయశ్చిత్త పూర్వకం. పునరుపనయనాద్యాచారరూపం. అరోచయన్. అప్రియం పశ్యన్. వానర తుల్యాన్ భ్రష్టసదాచారాన్ శూద్రప్రాయానుపైతి. తజ్జాతిరాసేన వానర జాతిక్రీడయాస్త్రియా మిథునీభూయ, పరస్పర ముఖోద్వీక్షణేన విస్మృతో జీవితావధిర్యేన. 17

భయమును వదిలి కొందరిచే ప్రలోభితులై, కొంగలలాంటివారగు వంచకులు, క్షుద్రులు, క్రూరులగు పాషండులతో స్నేహమొనర్చెదరు. (16)

ఆ అరణ్యమున వణిజులునొక కొంగ గృధ్రములతో మోసగించబడి హంసల సమూహమును చేరును. ఆ హంసల నడవడిక నచ్చక, వానరములజేరి, వానరజాతి స్వభావమగు దాంపత్య సుఖములతో ఇంద్రియములను సంతృప్తిపరచుచు ఒకరిముఖమునొకరు గాంచుచు తన ఆయువుయొక్క అవధిని తెలియకుందురు. భవాటవిలో జీవుడు. ఆ పాషండులచేమోసగించబడి తనకు వారిచే ఫలము ఏమియులేదని గ్రహించి బ్రాహ్మణకులములో తిరిగి ప్రవేశించి ప్రాయశ్చిత్త పూర్వక ఉపనయనాది ఆచారములు రుచించక, వానరులతోసములు ఆచార భ్రష్టులునగు శూద్రులనుచేరి, స్త్రీలతో సుఖించుచు స్త్రీముఖావ- లోకనము గావిస్తూ తన జీవితావధిని తెలియకుందురు. 17








శ్లో॥ ద్రుమేషు రంస్యన్ సుతదారవత్సలో
వ్యవాయదీనో వివశస్స్వబంధనే ।
క్వచిత్ప్రమాదాద్గిరికందరే పతన్
వల్లీం గృహీత్వా గజభీత ఆస్థితః ॥ 18

టీ:- ద్రుమేష్వితి. ద్రుమవత్కేవలదృష్టార్థేషు గృహేషు వ్యవాయదీనః సురతేచ్ఛయా కృపణః. ఏవం స్వస్య యద్బంధనం ప్రాప్తం తస్మిన్వివశః పరిహర్తుమశక్తః. పాఠాంతరే తు. వనే సంసారే చరన్నిత్యర్థః. గిరికందర వదతిభయానకే రోగాది దుఃఖే పతన్. కందరస్థః గజతుల్యాత్ మృత్యో ర్భీతస్సన్ వల్లీ తుల్యం ప్రాచీనం కర్మావలంబ్యాస్థితో భవతి. 18

ఆ అరణ్యమున వణిజుడు వానరమువలె చెట్లపై విహరిస్తూ దారాపుత్రాదులయందు స్నేహముగలవాడై మైథునేచ్ఛతో అనేకము లగు దుర్వ్యవహారములతో దీనుడై తన బంధనములను తొలగించు కొనుటకు అశక్తుడై ప్రమాదవశాత్తు పర్వత గుహలలోపడి, ఏనుగులకు భయపడి తీగలను పట్టుకొని కాలము గడుపును. భవారణ్యమున జీవుడు చెట్టువలె కేవలము కనిపించెడి ఫలములగల గృహములలో సుఖించుచు దారాపుత్రాదులయందు వాత్సల్యముతో దాంపత్య సుఖేచ్ఛతో తీనుడై తనకు ప్రాప్తించిన బంధనములను తెంచుకొనలేని వాడై, పర్వత గుహలవలె భయంకరమగు రోగక్లేశములోబడి గజముతో సమమగు మృత్యువునకు భీతిల్లుచూ తీగలవంటి ప్రాచీన కర్మల నవలంబించి యుండును. 18

శ్లో॥ అతః కథంచిత్స విముక్త ఆపదః
పునశ్చ సార్థం ప్రవిశత్యరిందమ ।
అధ్వన్యముష్మిన్నజయా నివేషితో
భ్రమన్ జనోఽద్యాపి నయాతి పారమ్ ॥ 19

టీ:- అత ఇతి. సార్థం ప్రవిశతీ - యథాపూర్వం ప్రవృత్తిమార్గే రమతే. 19

ఓ శత్రుసూదనా! ఏదో విధముగా ఆ ఆపదనుండి విముక్తి నొంది నను తిరిగి అదే ఆపదలో పడును. ఏ మానవుడైతే మాయయొక్క ప్రేరణతో ఈ ప్రవృత్తి మార్గమును చేరునో అతడు ఆ మార్గముననే భ్రమిస్తూ చివరివరకు తన పరమపురుషార్థము నెరుగడు. 19









శ్లో॥ రహూగణ త్వమపిహ్యధ్వనోఽస్య
సన్న్యస్తదండః కృత భూత మైత్రః ।
అసజ్జితాత్మా హరిసేవయా శితం
జ్ఞానాసి మాదాయ తరాతిపారమ్ ॥ 20

టీ:- రహూగణేతి. హే రహూగణ త్వమపి అధ్వని నివేశిత ఇత్యనుషంగః - అతోఽస్యాధ్వనః పారమతితర. అసజ్జితాత్మా వియేష్వ నభివేశిత చిత్తస్సన్. హరిసేవయా శితం తీక్ష్ణీకృతం. 20

ఓ రహూగణమహారాజా! నీవుగూడా ఈ భవారణ్య మార్గము లోనే పరిభ్రమించుచున్నావు. అందువలన నీవు ఇప్పటికైనా ప్రజలను శాసించు కార్యమును వదిలి, సమస్త ప్రాణులయందు సమత్వభావము పూని విషయములలో చిత్తమునుంచక, భగవత్సేవతో మొనదేలిన జ్ఞానమనే ఖడ్గమును ధరించి ఈ భవాటవీ మార్గపు దరిని చేరుము. (భవాటవి మార్గమును దాటుము). 20

**రాజోవాచ**

శ్లో॥ అహో నృజన్మాఖిలజన్మ శోభనం
కిం జన్మభిస్త్వపరైరప్యముష్మిన్ ।
నయద్ధృషీకేశ యశః కృతాత్మనాం
మహాత్మనాం వః ప్రచురస్సమాగమః ॥ 21

టీ:- అహో ఇతి. అఖిలజన్మసు. శోభనం నృజన్మైవ పరం శ్రేష్ఠం యేభ్యో దేవాదిజన్మభ్యః. తైరపి కిం. అముష్మిన్ స్వర్గేఽపి జన్మభిః కిం. న కించిత్. తత్ర కారణమాహ - యత్ యేషు జన్మసు యత్ర స్వర్గే వా. వో మహాత్మనాం సమాగమః ప్రచురో న భవతి. వః కథం భూతానాం. హృషీ కేశస్య యశసా కృతః శోధిత ఆత్మా యైస్తేషాం. 21

**రహూగణరాజు ఈ విధముగా పలికెను.**

సమస్త జన్మలలో మానవ జన్మనే శ్రేష్ఠమైనది. (దేవాది జన్మలలో ఏమి ప్రయోజనము?). స్వర్లోకములోని జన్మలతో ఏమి ప్రయోజనము. ఆ జన్మలతో ప్రయోజనమేమియు లేదు. ఎందుకనగా నరజన్మలో లభించు భగవంతుడగు హృషీకేశుని పవిత్రమగు కీర్తితో శుద్ధాంతః- కరణముగల మీలాంటి మహాత్ముల సమాగమము ఆ జన్మలో లభించదు కదా! (నరజన్మలోనే లభించునని భావము) 21







శ్లో॥ న హ్యద్భుతం త్వచ్చరణాబ్జ రేణుభి
ర్హతాంహసో భక్తిరధోక్షజేఽమలా ।
మౌహూర్తికాద్యస్య సమాగమాచ్చమే
దుస్తర్కమూలోఽపి హతోఽవివేకః ॥ 22

టీ:- నేతి. సంతతముపాసితైః త్వత్పదాంబుజరేణుభిః. హతమంహో యస్య. తస్యాధోక్షజే నిర్మలా భక్తిర్భవతీతి నైవాద్భుతం. యస్య తవ ముహూర్తభవాత్సమాగమాదపి. దుస్తర్కేణ బద్ధమూలోఽపి. మమ అవివేకో నష్టః. 22

శ్లో॥ నమో మహద్భ్యోఽస్తు నమశ్శిశుభ్యో
నమో యువభ్యో నమ ఆవటుభ్యః ।
యే బ్రాహ్మణా గామవధూతలింగా
శ్చరంతి తేభ్యశ్శివమస్తు రాజ్ఞామ్ ॥ 23

టీ:- బ్రహ్మ విదః కేన రూపేణ విచరంతీత్యజ్ఞానాత్సర్వాన్నమస్యతి. నమ ఇతి. యే వటవః క్రీడారతత్వాదశ్రద్ధేయధౌరేయాస్తానప్యభివ్యాప్య సర్వేభ్యో నమ ఇత్యర్థః. స్వదృష్టాం తేన రాజ్ఞాం మహదవజ్ఞాం సంభావ్యాహ - రాజ్ఞాం శివమస్త్వితి. 23

మీ పాదాబ్జధూళిని సేవించడముచే పాపములు తొలిగిన వారికి భగవంతుడగు అధోక్షజునియందు విశుద్ధమైన భక్తి కలుగుననుటలో ఆశ్చర్యమేమిలేదు. ఏలనన నాకు మీతో కొద్ది కాల సమాగమము చేతనే కుతర్కమూలమగు అజ్ఞానము నశించినది. 22

బ్రహ్మవేత్తలు ఏ రూపముతో చరించుదురో అనునది తెలియనందున, అందరిని నమస్కరించుచున్నాడు. బ్రహ్మవేత్తలలో ఎవరు వయోవృద్ధులో వారికి నమస్సులు. అల్ప వయస్కులకు, యువకు లకు, క్రీడాసక్తులకు, బాలకులకును నమస్సులు. ఎవరైతే బ్రహ్మజ్ఞాన వంతులైన బ్రాహ్మణులు అవధూత వేషముతో ఈ భూమిపై చరించెదరో వారివలన నాలాంటి ఐశ్వర్యమత్తులగు రాజులకు శుభముకలుగు గాక. (జ్ఞానము ప్రాప్తించుగాక!) 23









శ్రీ శుక ఉవాచ

చూ॥ ఇత్యేవముత్తరామతః స వై బ్రహ్మర్షిసుతస్సింధుపతయ ఆత్మ తత్త్వమవిగణయతే విగణిత పరమానుభావః పరమ కారుణికతయోప దిశ్య - రహూగణేన స కరుణమభివందితచరణః పూర్ణార్ణవ ఇవ నిభృతకరుణోర్మ్యాశయో ధరణీమిమాం విచచార. 24

టీ:- ఇతీతి. ఉత్తరా మాతా యస్య తస్య సంబోధనం. అవిగణితః అగణితః పరమః అనుభావో యస్య సః. అవగణయతే అవమంత్రేఽపి పరమకరుణాకరత్వేన సింధుపతయే ఆత్మతత్త్వముపదిశ్య నిభృతాః శాంతాః. కరుణానామూర్తయో యస్మిన్ స ఆశయో యస్య. 24

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

ఉత్తరకుమారా! ఈ విధముగా బ్రహ్మర్షి పుత్రుడగు ఆ బ్రాహ్మణుడు రాజుగారు తననవమానపరచినను అవమానమును లెక్కించక సింధురాజగు రహూగణునకు గొప్పదయతో ఆత్మతత్త్వము నుపదేశించెను. దీనభావముతో రహూగణుడు పాదాక్రాంతుడాయెను. తరువాత, జలరాశితో పూర్ణమగు సముద్రమువలె కరుణారసముతో కూడిన శాంతచిత్తుడగు ఆ బ్రాహ్మణుడు ఉపరతేంద్రియుడై భూమిపై చరించుచుండెను. 24

చూ॥ సౌవీరపతిరపి - సుజనసమవగతపరమాత్మసుతత్త్వః ఆత్మన్య విద్యారోపితాం దేహాత్మాభిమతిం విససర్జ. ఏవం హి నృపభగవదాశ్రితా శ్రితానుభావః. 25

టీ:- సౌరవీరేతి. సుజనాత్తస్మాత్సమ్యగవగతం పరమాత్మసుతత్త్వం యేన తథాభూతస్సన్ తదానీమేవ దేహే ఆత్మమతిం చ విససర్జ హే నృప భగవదాశ్రితో భరతః తదాశ్రితో రహూగణః తస్యానుభావః సద్యో దేహాహంకారత్యాగః. 25

ఓ పరీక్షిద్రాజా! భగవదాశ్రితుడగు ఆ బ్రాహ్మణుని (భరతుని) ఆశ్రయించిన రహూగణుడు వెంటనే అజ్ఞానావృతమైన అంతః-కరణములోని దేహాహంకార త్యాగముగల వాడయ్యెను. (దేహాత్మ భావమును వీడెను). 25








**విష్ణురాత ఉవాచ**

శ్లో॥ యోహవా ఇహ బహువిదామహాభాగత్వయాభిహితః పారోక్ష్యేణ వచసా జీవలోకస్య భవాధ్వాసహ్యార్య మనీషయా కల్పిత విషయో నాంజసా వ్యుత్పన్న లోక సమధిగమః. అథ తదేవైతద్దురవగమం సమవేతానుకల్పేన నిర్దిశ్యతామితి. 26

టీ:- య ఇతి. -పారోక్ష్యేణ వణిక్సార్థరూపకేణ ఆర్యాణాం వివేకినాం మనీషయైవ దస్యుస్థానీయాంనీంద్రియాణి గోమాయుస్థానీయాన్య పత్యాదీనీత్యేవం కల్పితవిషయః. అవ్యుత్పన్నస్య తు లోకస్య జనస్య సమ్యగధిగమ్యో న భవతి. అతః తదేవ భవాధ్వరూపం సమవేతాను -కల్పేన ప్రస్తుతత త్తదను రూపార్థోపకల్పనేన. 26

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, త్రయోదశోऽధ్యాయః**

**పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.**

ఓ మహాభాగవతోత్తముడవగు శుకయోగీంద్రా! బహువిషయ వేత్తలగు మీరు పరోక్షముగా వణిక్సార్థ రూపమగు వాక్కులతో, వివేకవంతుల బుద్ధిలో ఇంద్రియములు చోరస్థానీయములని, సంతానాదులు జంబుక స్థానీయములని కాల్పనిక విషయముగా తెలిపితిరి. అవ్యుత్పన్న మతులగు (అల్పబుద్ధులగు) జనులకు ఇది సుగమము (అర్థము) కాదు. అందువలన దురధిగమమగు భవమనే అరణ్యస్వరూపమును స్పష్టముగా తెలియు సులభమైన శబ్దములతో తెలుపుమని కోరు-చున్నాను. 26

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పదమూడవ అధ్యాయము సమాప్తము.**








## చతుర్థశోऽధ్యాయః

శ్లో॥ చతుర్దశే భవారణ్యరూపకృత్యా కృతిః కృతా ।
ప్రస్తుతే దస్యుగోమాయుమశకాద్యర్థ కల్పనైః ॥

సహోవాచ

చూ॥ య ఏష దేహాత్మమానినాం సత్త్వాదిగుణవిశేష వికల్పిత కుశలా కుశలమిశ్ర వినిర్మిత వివిధ దేహావళిభిః–వియోగ సంయోగాద్యనాది సంసారానుభవస్య ద్వారభూతేన షడింద్రియవర్గేణ–తస్మిన్ దుర్గాధ్వ వదసుగమేऽధ్వన్యాపతిత ఈశ్వరస్య భగవతో విష్ణోర్వశవర్తిన్యా మాయయా జీవలోకోऽయం యథావణిక్సార్థోऽర్థ పరస్స్వదేహ నిష్పాదిత కర్మానుభవః–శ్మశానవదశివతమాయాం సంసారటవ్యాం గతో నాద్యాపి విఫల బహుళ ప్రతియోగేహః తత్తాపోపశమనీం హరిగురుచరణార వింద మధురానుపదవీమవరుంధే. 1

టీ:– సహోవాచేతి. యః పరీక్షితా పృష్టః సః శుకః. ఉవాచ హేతి సూతో క్తిః. అత్రాపి హేతిప్రసిద్ధౌ. శ్లో. "దురత్య యేऽధ్వన్యజయా నివేశిత"ఇతి యదుక్తం. తదేవ వననివేశేన ప్రకార కథనేన ప్రపంచయతి –య ఇతి. య ఏషః ప్రసిద్ధః. అయం జీవలోకః విష్ణోర్మాయయా

## 14వ అధ్యాయము

ఈ పదునాల్గవ అధ్యాయమున భవారణ్యము చోర, జంబుక, మశకాద్యర్థకల్పనతో భవారణ్య రూపాకృతితో వర్ణించబడుచున్నది. పరీక్షిత్తు అడుగగా శుకుడు పలుకుచున్నాడు.

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

"దురత్యయేధ్వన్యజయానివేశిత" అని ఏదైతే తెలుపబడినదో దానిని అరణ్య ప్రవేశ ప్రకార కథనముతో విశదపరచుచున్నాడు. మాయకు, తన కార్యనిర్వహణద్వారా సంసారమార్గములో పడుటకు కారణత్వము తెలుపబడుచున్నది. దేహమే ఆత్మగా తలచెడివారికి (దేహాభిమానవంతులకు) సత్త్వ, రజస్తమో గుణ భేదములచేత శుభాశుభ మిశ్రకర్మలు లభించును. ఆ కర్మలచే ప్రాప్తములగు అనేక శరీరములతో కలిగెడి సంయోగ వియోగాదులతో కూడిన అనాది సంసారానుభవము నకు ద్వారభూతమగు షడింద్రియ సమూహము(ఐదు జ్ఞానేంద్రియ–ములు, మనస్సు) చేత, దుర్గమ మార్గమువలె కఠినమగు సంసారరూప మార్గములో పడవేయబడి, సర్వేశ్వరుడు, భగవంతుడునగు విష్ణువునకు ఆధీనమై ఉండే మాయలో జీవుల సమూహము వణిక్సమూహము వలె ధనముపై ఆశతో తన దేహముతో ఆచరించబడిన కర్మఫలమను – భవిస్తూ శ్మశానమువలె అమంగళకరమగు సంసారాటవిని చేరి,







అసుగమే అధ్వని ఆపతితః భవాటవీం గతస్సన్ హరిరూపస్య గురోః చరణారవిందే యే మధుకరాః. సేవకాస్తేషామనుపదవీం తైరనుష్ఠితం భక్తిమార్గం అద్యాపి నావరుంధేన ప్రాప్నోతీత్యన్వయః. మాయాయాః స్వకార్యద్వారేణ సంసారమార్గపాత హేతుత్వమాహ-దేహాత్మమానినాం సత్త్వాద్విగుణవిశేషైః. వికల్పితాని విభక్తాని యాని కుశలాకుశల మిశ్రకర్మాణి తైర్విర్మితాభిర్వివిధదేహావళిభిః. వియోగసంయోగాదిః. యోగాదిః యోऽనాదిః సంసారః. తదనుభవస్య ద్వారభూతేన షడింద్రియ వర్గేణ తస్మిన్ సంసారరూపే దుర్గమ మార్గవదసుగమే అధ్వని ఆపతితః. యథా వణిజాం సార్థః సమూహః అర్థార్జనపరః స్వదేహ నిష్పాదితానాం కర్మణాం ఫలద్వారేణానుభవో యస్య విఫలాశ్చ బహుళప్రతియోగాః బహు విఘ్నాశ్చ ఈహాః చేష్టాః యస్య సః. తస్యాం సంసారాటవ్యాం యే తాపాస్తేషాముపశమనీం నాశనీం. 1

చూ॥ యస్యాముహవా ఏతే షడింద్రియనామానః కర్మణా దస్యవ ఇవ తే. 2

టీ:- యస్యామిత్యాదివ్యాచష్టే-యస్యామితి. యస్యాంభవాటవ్యాం 2

ఫల రహితములైన, అనేక విఘ్నములుకల చేష్టలు కలవారై సంసారారణ్యములోని తాపముల నశింపచేసెడి విష్ణురూపుడగు గురువు యొక్క చరణారవింద మకరంద రసికులగు సేవకులచే అనుష్ఠించబడెడి భక్తి మార్గమును ఇప్పటికినీ పొందుచులేరు. (భగవంతుని, గురువును సేవించే భక్తుల మార్గమును ఎప్పటికీ పొందలేరు) 1

ఈ భవారణ్యమున మనస్సుతో కూడిన ఆరు జ్ఞానేంద్రియములు తమ కర్మలచే చోరులవలె ఉంటాయి. (మనస్సు + జ్ఞానేంద్రియములు) (2)








చూ॥ తద్యథా పురుషస్య యత్కించిద్ధనం ధర్మౌపయికం బహూకృచ్ఛ్రాది గతం యత్సాక్షాత్పరమపురుషారాధనలక్షణో యోऽసౌ ధర్మస్తం తుసాంపరాయికముదాహరంతి - తద్ధర్మ్యం ధనం - దర్శన స్పర్శన శ్రవణాస్వాదనావఘ్రాణ సంకల్ప వ్యవసాయ గృహ గ్రామ్యోపభోగేన-కునాథస్యాజితాత్మనో యథా సార్థస్య విలుంపంతి. 3

టీ:- దస్యుతుల్యం తేషాం కర్మ దర్శయతి-తద్యథేతి. ధర్మౌపయికం ధర్మకారణం తమేవ స్వాభిప్రేతం ధర్మమాహ-సాక్షాదితి. తం తు సాంపరాయికం పరలోకార్థముదాహరంతి. తద్ధర్మ్యం ధర్మార్థం ధనం దర్శనాద్యాః పంచజ్ఞానేంద్రియాణాం వృత్తయః. సంకల్ప వ్యవసాయౌ అంతఃకరణస్య. ఏతైర్గృహే యో గ్రామ్య ఉపభోగః తేన కునాథస్య కుబుద్ధేః అజితాత్మనో విలుంపంతి యథా చోరాః. కుపాలకస్యానవహితాత్మనః సార్థస్య ధనం హరంతి తద్వత్. 3

చూ॥ అథ చ యత్ర కౌటుంబికస్య దారాపత్యాదయో నామ్నా కర్మణా వృక సృగాలా ఏవానిచ్ఛతః కదర్యస్య కుటుంబిన ఉరణవత్సం రక్ష్యమాణం మిషతోऽపహరంతి. 4

చోరులతో సమమగు ఆ షడింద్రియ కర్మలను తెలుపుచున్నాడు. అది ఎట్లనగా పురుషుడు మిక్కిలి కష్టముతో సంపాదించిన ధనము ధర్మములలో ఉపయోగపడవలెను. ఈ ధర్మము సాక్షాత్తు పరమాత్మ యగు పురుషోత్తముని ఆరాధన రూపమైనచో మాత్రమే ఆ ధర్మము పరలోక నిఃశ్రేయసమునకు హేతువుగా తెలుపబడినది. కానీ ఏ మానవుని యొక్క బుద్ధి రూపమగు సారథి, వివేకహీనమై మనస్సున కధీనమగునో వద్దగల ధర్మమునకు ఉపయోగించాల్సిన ధనము, మనస్సుతో కూడిన షడింద్రియముల వృత్తులగు దర్శన, స్పర్శన, శ్రవణ, రసాస్వాదన గంధాఘ్రాణ, సంకల్ప, వికల్ప నిశ్చయములచే, (సంకల్ప, వికల్ప నిశ్చయములు అంతఃకరణవృత్తులు) గృహస్థోచితములగు విషయోపభోగములలో ముంచి దుర్మార్గుడగు కుపాలకుని ధనమును చోరులు అపహరించినటుల లూఠీచేయును. ( ధర్మమునకు వినియోగపడని ధనమే ఆ ధనాధిపతిని ముంచును) 3

"గోమాయవో యత్ర" అను దానిని విశదపరచుచున్నాడు. ఇంతియేకాదు ఆ సంసార వనములోనుండెడి దారాపుత్రాదులనే కుటుంబీకులు అతి లుబ్ధుడగు కుటుంబీకుని యొక్క ధనమును ఆతనికి ఇష్టము లేకున్నను, రక్షించబడుచున్నవైనను మేకపిల్లలను తోడేళ్ళు, నక్కలు చూస్తుండగనే హరించినటుల కపటముగా హరించెదరు. 4


ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.





 


టీ:- గోమాయవో యత్రేత్యే తద్వ్యాచష్టే - అథ చేతి. అథ చేత్యర్థాంతరోపన్యాసే. కర్మణా తు వృకాః సృగాలాశ్చ కదర్యస్యాతి లుబ్ధస్య. 4

చూ॥ యథా హ్యానువత్సరం కృష్యమాణమప్యదగ్ధ బీజం క్షేత్రం పునరేవా వపన కాలే గుల్మతృణ వీరుద్భిర్గహ్వరమివ భవత్యేవమేవ గృహాశ్రమః కర్మక్షేత్రం యస్మిన్నహి కర్మాణ్యుత్సీదంతి - యదయం కామకరండ ఏష ఆవ సథః. 5

టీ:- ప్రభూతవీరుత్తృణగుల్మగహ్వర ఇత్యేతద్వ్యాచష్టే - యథా హీతి. న దగ్ధాని బీజాని యస్మిన్. యద్యస్మాత్ యోఽయమావసథ ఆశ్రమః ఏష కామనాం కరండః. యథా కర్పూరభాజనే కర్పూరక్షయోఽపి పరిమళో న క్షీయతే. ఏవమత్ర వాసనానామక్షీణత్వాన్న కర్మాణ్యుత్సీదం తీత్యర్థః. 5

చూ॥ యత్తత్ర రతో దంశమశకసమాపశదైర్మనుజైశ్శలభ శకుంత తస్కర మూషకాదిభిరుపరుధ్యమాన బహిఃప్రాణః క్వచిత్పరివర్తమానోఽస్మిన్నధ్వన్యవిద్యా కామకర్మభిరుపరక్తమనసానుపన్నార్థం నరలోకం గంధర్వ నగరోపమముపపన్నమితి మిథ్యాదృష్టిరనుపశ్యతి. 6

ప్రభూతవీరుత్తృణగుల్మగహ్వర అను దానిని విశదీకరించుచున్నాడు.

కలుపు మొక్కలకాధారమగు విత్తనములను కాల్చని యెడల ప్రతిసంవత్సరమూ ప్రధానపంట మొలకలతో అవి తిరిగి మొలకెత్తి ఆ పొలమును గడ్డి, లతలు, గుల్మలములతో నిండినదైనటుల ఈ గృహస్థాశ్రమము కర్మభూమి. దీనిలో కర్మ నాశనమెపుడును కాదు. ఎందుకనగా ఈ గృహస్థాశ్రమము కర్మలకు పేటిక వంటిది. కర్పూరముంచిన పేటికలో కర్పూరము క్షీణించినను కర్పూరపు వాసన తొలగనటుల ఇచటను వాసన నాశనముకానందున కర్మలు నశించవు. (5)

ఆ గృహస్థాశ్రమంలోనే అనురక్తుడై దంశ మశకములతో సమానులగు నీచులచేత, మిడుతలు, పక్షులు, చోరులు, ఎలుకలు మున్నగు వాటితో ప్రాణభూతమగు ధనము అపహరించబడినవాడై కూడా ఆ సంసారారణ్య మార్గముననే పరిభ్రమిస్తూ, అజ్ఞానముచే









టీ:- యదితి. దంశమశకతుల్యైరపశద్రైః నీచైః శలభాదిభిశ్చ ఉపరుధ్య మానః – పీడ్యమానః. బహిఃప్రాణో విత్తం యస్య. తథా విధోऽప్యస్మిన్న ధ్వని పరిభ్రమన్ అవిద్యాదిభిరుపరక్తేన మనసా గంధర్వపురుతుల్యమ ఘటమానం నరలోకం సత్త్వతయా మిథ్యాదృష్టిరనుప్రపశ్యతి. 6

కామకర్మలతో, కలుషితమగు మనస్సుతో గంధర్వనగరము (మిథ్యానగరము)వలె అసత్యభూతమగు, అఘటమానమగు నరలోకములో నున్ననూ దానిని మిథ్యాదృష్టితో సత్యమైన దానినిగా చూచును. 6

చూ॥ క్వచిదాతపోదక నిభాన్విషయానుపధావతి పాన భోజన వ్యవాయాది వ్యసన లోలుపః. 7

టీ:- ప్రపశ్యతీతి ప్రశబ్దసూచితమర్థాంతరం దర్శయతి–క్వచిదితి. తత్ర చ గంధర్వపురే క్వచిదాతపోదకం మృగతృష్ణాజలం తత్తుల్యాన్ విషయానుప ధావతీతి. 7

ప్రప్రశ్యతి అను ప్ర శబ్దముచే సూచించబడిన అర్థాంతరమును సూచిస్తున్నాడు.

గంధర్వ పురముతో సమమగు గార్హ్యస్థమున తినడము, తాగడము, స్త్రీ సంగమము మున్నగు వ్యసనములలో మునిగి ఎండమావులలోని నీటితో సమానమగు మిథ్యా విషయముల వెంబడి పయనించును. 7

చూ॥ క్వచిచ్చాశేష దోష నిషదనం పురీష విశేషం తద్వర్ణగుణ నిర్మిత మతిస్సువర్ణముపాదిత్సత్యగ్ని కామకాతర ఇవోల్ముకపిశాచమ్. 8

టీ:- క్వచిత్ క్వచిచ్చాశురయోల్ముక గ్రహమిత్యేతద్వ్యాచష్టే–క్వచిచ్చా శేషాణాం నిషదం స్థానం పురీషవిశేషం అగ్నేర్విష్ఠాం తస్య పురీషస్యేవ లోహితోవర్ణో యస్య రజో గుణస్య తే నిర్మితా తద్విషయా మతిర్యస్య సః. సువర్ణముపాదతుమిచ్ఛతి. అగ్నికామేన కాతరః పరవశః ఉల్ముకం దృశం పిశాచమివ శీతాతురో హ్యరణ్యే అగ్నివజ్జాజ్వల్యమానం తతస్తతో

క్వచిచ్చాశురయోత్మికగ్రహ అను దానిని విశదపరచుచున్నాడు.

ఒక్కొక్కప్పుడు రజోగుణ ప్రభావితమగు బుద్ధితో అన్ని అనర్థములకు మూలమగు అగ్ని మలరూపమగు (అగ్నిచే కాలి, తినివేయగా మిగిలినదని అర్థము) సువర్ణమును సుఖసాధనముగా తలచి దానిని పొందుటకు లాలసుడై అరణ్యములో చలి బాధతో అగ్నిని చేరుటకు దీనత్వముతో అటునిటు పరిభ్రమిస్తూ కొరవి దయ్యమునుచూచి అగ్నియను భ్రమతో దానిని చేరుటకు పరుగెత్తుచూ, దానిని పొందలేక ఒకవేళ అతి కష్టముగా చేరిననూ, ఆ







 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమోభగవతేవాసుదేవాయ. 

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ధావంతముల్మక పిశాచమగ్నిబుద్ధ్యా ఆశు ధావతి న తు తం ప్రాప్నోతి. కథంచిత్ ప్రాప్తశ్చేత్. తర్హి తేన భక్షితస్సన్ మ్రియతే ఏవం సువర్ణము పాదాతుమనుధావన్నపీత్యర్థః. 8

చూ॥ అథ కదాచిన్నివాస పానీయ ద్రవిణాద్యనేకాత్మోపజీవ్యాభినివేశ ఏతస్యాం సంసారాటవ్యామితస్తతః పరిధావతి. 9

టీ:- నివాసతో యద్రవిణేత్యేతద్వ్యాచష్టే-అథేతి. నివాసాదిష్వనేకేష్వాత్మన ఉపజీవ్యేష్వభినివేశో యస్య సః. 9

చూ॥ క్వచిచ్చ వాత్యోపమయా ప్రమదయారోహమారోపితస్తత్కాల రజసా రజన్యాం భూతా ఇవ సాధుమర్యాదా రజస్వలాక్షో దిగ్దేవతా అతిరజస్వలమతిర్న విజానాతి. 10

టీ:- క్వచిచ్చ వాత్యోత్థితేత్యేతద్వ్యాచష్టే-క్వచిచ్చేతి. ఆరోహం అంకం తస్మిన్ కాలే యద్రజః రాగః. తేన స్వదృష్ట్యావారకేణ రజన్యాం రాత్రౌ భూతా ఇవ. హ్రస్వపాఠే రజనీభూత స్తమోమయ ఇవ అతీవ రజసా ఛన్నమతిః అత ఏవ రజోవ్యాప్తచక్షురివ దిక్షు స్థితా మర్యాదాతిక్రమ సాక్షిభూతా దేవతాః న జానాతి. 10

కొరవిదయ్యముతో భక్షితుడై మృతిచెందునటుల ఆ సువర్ణము కోసమే ప్రయత్నించుచుండును. 8

"నివాసతోయద్రవిణ" అను దానిని విశదపరచుచున్నాడు.

ఒకానొకప్పుడు శరీరమునకు జీవనాధారములగు అన్నము, నీరు, ధనము మొదలగువాటిలో ఆసక్తుడై ఈ సంసారణ్యములో ఇటునటు పరిభ్రమించును. 9

"క్వచిచ్చవాత్యోత్తిత" అను దానిని వ్యాఖ్యానిస్తున్నాడు.

ఒక్కొక్కప్పుడు నేత్రములలో ధూళిని నింపెడు సుడిగాలితో సమానమగు స్త్రీ ఒడిలోనుండి, రాగాంధుడై సత్పురుషుల మర్యాదను గురించి ఆలోచించడు. ఆ సమయమున నేత్రములలో రజోగుణమనెడి ధూళి నిండడముచే రజోగుణాయత్తమగు బుద్ధి, కర్మసాక్షులగు దేవతలను గూడా మరపించును. 10









చూ॥ క్వచిత్సకృదవగత విషయవైతథ్యః స్వయం పరాభిధ్యానేన విభ్రంశితస్మృతిస్తయైవ మరీచి తోయ ప్రాయాంస్తానేవాభిధావతి. 11

టీ:- అనుపాదేయమేవోపాదేయతయా గృహ్ణాతీతి ప్రక్రమ సాజాత్యాదుత్తరశ్లోకచతుర్థపాదం ప్రథమం వ్యాచష్టే-క్వచిదాతపోదక నిభానిత్యత్ర దేహాభినివేశేన మిథ్యావిషయేషు లంపటత్వముక్తం నివాసతోయేత్యత్ర తదార్జనప్రయాస ఉక్తః. అత్ర తు బాధితేష్వపి పునః ప్రవృత్తిరుచ్యత ఇత్యపౌనరుక్త్యం. క్వచిదితి. స్వయమేవం సకృదవగతం విషయాణాం వైతథ్యం విఫలత్వం యేన పరాభిధ్యానేన దేహాభినివేశేన విభ్రంశితా స్మృతిర్యస్యతయైవ విభ్రంశితయా స్మృత్యా స్మృతిభ్రంశాదే వేత్యర్థః. 11

ఆచరించదగని కర్మల నాచరించదగిన వానిగా గ్రహించునను దానిని ప్రక్రమసాజాత్యముతో తరువాతి శ్లోకములోని నాల్గవ పాదమును వ్యాఖ్యానించుచున్నాడు. "క్వచిదాతపోదనిభాన్" అనుచోట దేహాభిమానముతో అసత్య విషయలంపటత్వము తెలుపబడినది. "నివాసతోయా" ననుచోట వాని నార్జించుటయందు ఆయాసము తెలుపబడినది. ఇచట బాధించబడిన వాటియందును తిరిగి ప్రవృత్తి తెలుపబడుచున్నది. కావున పౌనరుక్తి దోషములేదు. ఒక్కొక్కప్పుడు దేహాభిమానముతో వివేకము నశించి ఎండమావుల్లోని నీటితో సమమగు అసత్య విషయములవైపు ఆసక్తుడగును. 11

చూ॥ క్వచిదులూకఝిల్లీస్వనవదతిపరుష రభసాటోపం ప్రత్యక్షం పరోక్షంవా రిపురాజకుల నిర్భర్త్సితేనాతివ్యథితకర్ణమూలహృదయః. 12

టీ:- అదృశ్యఝిల్లీస్వనేత్యేతద్వ్యాచష్టే-క్వచిదులూకేతి. అతిపరుషో రభస ఉత్సాహస్తేనాటోపః సంభ్రమో యథా భవత్యేవం రిపూణాం రాజకులస్య చ నిర్భర్త్సితేన అతివ్యథితం కర్ణమూలం హృదయం చ యస్య. 12

క్వచిదులూకఝిల్లీస్వనవత్ అను దానిని విశపరచుచున్నాడు.

ఒకానొకప్పుడు ప్రత్యక్షముగా ధ్వనించెడి గుడ్లగూబతో సమమగు శత్రురాజుల యొక్క, మరియొకప్పుడు పరోక్షముగా ధ్వనించెడి చిమ్మట పురుగుల వంటి శత్రు రాజుల రభసోత్సాహాటోపసంభ్రమముల కల్గించెడి మిక్కిలి కఠోరమగు ధ్వనులతో ఈ జీవికి కర్ణములు మనస్సు వ్యథ నొందును. 12








చూ॥ స యథా దుగ్ధ పూర్వసుకృతస్తదాకారస్కరకాకతుండ్యాదపుణ్య ద్రుమలతా విషోదపానవదుభయార్థ శూన్యద్రవిణాన్ జీవన్మృతాన్ స్వయం జీవన్ మ్రియమాణ ఉపధావతి. 13

టీ:- అపుణ్య వృక్షానిత్యేతద్వ్యాచష్టే-స యథేతి. దుగ్ధముపభుక్తం పూర్వసుకృతం యేన తదాకారస్కరో విషతిందుః తత్ప్రముఖా యేఽ పుణ్య ద్రుమాః. తథావిధా లతాశ్చ విషోదపానాశ్చ విషకూపాః. తత్తుల్యాన్ దృష్టాదృష్టప్రయోజనశూన్యధనాన్. 13

చూ॥ ఏకదా సత్ప్రసంగాన్నికృతమతిర్నిరుదకస్రోతస్ఖలనవదుభయతోఽపి దుఃఖదం పాషండమభిధావతి. 14

టీ:- క్వచిద్వితోయాః సరిత ఇత్యేతద్వ్యాచష్టే. ఏకదేతి. ఏకదా క్వచిత్ అసతాం ప్రసంగాత్ నికృతా వంచితా మతిర్యస్య సః నిరుదకనదీ గర్తపాతే యథా సద్యశ్శిరః స్ఫుటతి పశ్చాదపి చ తద్వేదనానువర్తతే. ఏవమిహ చ పరత్ర చ దుఃఖదం. 14

చూ॥ యదా తు పరబాధయాంధ ఆత్మనేనోపనమతి - తదాహి పితృ పుత్ర బర్హిష్మాన్ పితౄన్ పుత్రాన్వా ఖలు భక్షయతి. 15

అపుణ్యవృక్షాన్ అను శ్లోకమును విశదపరచుచున్నాడు.

పూర్వ పుణ్యము క్షీణించిన జీవి విశపూరితమైన తుమ్మికి చెట్ల లాంటి దుష్టమైన అపుణ్యప్రదములగు వృక్షములను అలాంటివేయగు దూషిత లతలను విషతుల్యమగు జలముగల కూపములనువలె , దృష్టాదృష్టఫల శూన్యములగు ధనమును కలిగి మృతప్రాయములగు వారిని జీవచ్ఛవమువలె నాశ్రయించును. 13

“క్వచిద్వితోయాః సరితః” అను దానిని విశపరచుచున్నాడు.

నీరు లేనటువంటి నదిలోని గుంతలోపడి తల పగిలి బాధ నొందిన వానితో సమానముగా, అసత్పురుష ప్రసంగముతో వంచితమగు బుద్ధితో ఇహలోక పరలోకములలోను దుఃఖములను కల్గించు పాషండ మతముననుసరించును. 14

“పరస్పరంచాలషతేనిరన్నం”అను దానిని విశదపరచు-చున్నాడు.






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ






టీ:- పరస్పరం చాలషతే నిరన్న ఇత్యేతద్వ్యాచష్టే-యదాత్వితి. అంధః అన్నం నోపనమతి నోపతిష్ఠతే. పిత్రు పుత్రాణాం బర్హిః కుశః. తద్వతః పితుః పుత్రాణాం వా. కుశాది తృణమపి యేషు పశ్యతి తాన్ భక్షయతి. బాధత ఇత్యర్థః. పిత్రు పుత్ర బర్హిష్మానితి తు పాఠస్సుగమః. 15

ఎప్పుడైతే ఇతరులను బాధించినను అన్నము (ఖాద్యవస్తువు) లభించదో అపుడు పిత్రు పుత్రాది బంధమును తృణ ప్రాయముగా త్యజించి పితరులను గాని, పుత్రులనుగాని భక్షించును. (ఆకలిమంటచే పిత్రు, పుత్ర సంబంధమును మరచి బాధించునని భావము). 15

చూ॥ క్వచిదాసాద్యగృహం దావవత్ప్రియార్థ విధురమసుఖోదర్కం శోకాగ్ని నా దహ్యమానో భృశం నిర్వేదముపగచ్ఛతి. 16

ఆసాద్యదావమను దానిని వ్యాఖ్యానించుచున్నాడు.

టీ:- ఆసాద్య దావమిత్యేతద్వ్యాచష్టే. క్వచిదాసాద్యేతి. 16

ఒక్కొక్కసారి ప్రియవిషయ శూన్యము చివరకు దుఃఖమయ మునగు దావాగ్నితో సమానమైన గృహమును చేరి, ఇష్ట జన వియోగాది దుఃఖాగ్నిచే దహించబడుచు మిక్కిలి ఖిన్నుడగును. 16

చూ॥ క్వచిత్కాల విషమిత రాజకుల రక్షసాపహృత ప్రియతమధనా సుర్మృత ఇవ విగతజీవలక్షణ ఆస్తే. 17

"నిర్విద్యతేక్వచయక్షైర్హృతాసుః" అను దానిని విశదీకరించు చున్నాడు.

టీ:- నిర్విద్యతే క్వ చ యక్షైర్హృతాసురిత్యేతద్వ్యాచష్టే. క్వచిత్కాలేన విషమితం ప్రతికూలతాం నీతం. యద్రాజకులం తదేవ రక్షః తేనోపహృతాః ప్రియత మధనరూపాః ఆసవో యస్య. విగతాని జీవ లక్షణాని హర్షాదీని యస్య శూరైర్హృతస్వ ఇత్యప్యనేనైవ వ్యాఖ్యాతం. 17

కొంతకాలమునకు రాజసమూహమనెడు రాక్షసులు వారి ధనమును, ప్రాణసమానులైన ప్రియతమములను అపహరించగా ప్రాణములేని జీవునివలె హర్షాదులు లేకుండా ఉండును. 17










చూ॥ కదాచిన్మనోరథోపగత పితృ పితామహాద్యసత్సదితి స్వప్న నిర్వృతి లక్షణమనుభవతి. 18

టీ:- క్వచిచ్చ గంధర్వపురం ప్రవిష్ట ఇత్యేతద్వ్యాచష్టే. కదాచిదితి. కదాచిన్మనోరథప్రాప్తం పిత్రాద్యసదేవ సదితి మత్వా పూర్వం గంధర్వ పురవదఘటమాన దర్శనముక్తం. ఇదానీం తన్నిమిత్తసుఖాసక్తిరుచ్యత ఇతి భేదః. 18

చూ॥ క్వచిద్గృహాశ్రమ కర్మచోదనాతిభర గిరి మారురుక్షమాణో లౌకిక వ్యసన కర్షితమనాః కంటకశర్కరా క్షేత్రం ప్రవిశన్నివ సీదతి. 19

టీ:- చరన్ క్వచిదిత్యేతద్వ్యాచష్టే. క్వచిద్గృహాశ్రమే యాః కర్మచోదనా స్తాసామతిభరోఽతి విస్తారః స ఏవ గిరిస్తమారురుక్షన్ తదంతం గంతుమిచ్ఛన్. 19

చూ॥ క్వచిచ్చ దుస్సహేన కాయాభ్యంతర వహ్నినా గృహీతసారః - స్వకుటుంబాయ క్రుధ్యతి. 20

టీ:- పదేపదేఽభ్యంతర వహ్నినేత్యే తద్వ్యాచష్టే-క్వచిచ్చదుస్స హేనేతి. 20

"క్వచిచ్చ గంధర్వపురం ప్రవిష్ట" అను దానిని విశదపరచు -చున్నాడు.

ఒకప్పుడు మనోరథములోని పదార్థములవలె మిక్కిలి అసత్యములగు పితృ పితామహాది సంబంధములు సత్యమని తలచి, వారి సహవాసముతో స్వప్న సమానమగు క్షణిక సుఖమునుభవించును. పూర్వము గంధర్వపురమువలె లేని దానిని దర్శించడము చెప్పబడినది. ఇపుడు అదే కారణముగా సుఖాసక్తి పొందటం తెలుపబడినది. ఇదియే భేదము. 18

"చరన్ క్వచిత్" అనుదానిని విశదీకరించుచున్నాడు.

ఒకప్పుడు గృహస్థాశ్రమములోని పర్వతారోహణము వంటి కర్మ విస్తారమును పొందగోరు జనులచే ప్రేరేపించబడి తానును అటుల ఆచరించదలచి ముళ్ళచే, రాళ్ళచే నిండి మిక్కిలి దుఃఖదాయకమగు క్షేత్రమును చేరిన వానివలె దుఃఖితుడగును. 19

"పదేపదేఽభ్యంతర వహ్నినా" అనుదానిని విశదపరచు చున్నాడు. ఒకప్పుడు జఠరాగ్నిని సహించలేక ధైర్యము కోల్పోయి దుర్బలుడై తన కుటుంబముపై కోపించును. 20









చూ॥ స ఏవ పునర్నిద్రాజగర గృహీతోఽంధే తమసిమగ్నః శూన్యారణ్య ఇవ శేతే నాన్యత్కించన వేద శవ ఇవాపవిద్ధః. 21

టీ:- క్వచిచ్చ నిగీర్ణోఽజగరాహినేత్యేతద్వ్యాచష్టే-స ఏవేతి. 21

చూ॥ కదాచిద్భగ్నమాన దంష్ట్రో దుర్జన దందశూకైరలబ్ధ నిద్రాక్షణో వ్యథిత హృదయేనానుక్షీయమాణవిజ్ఞానోఽంధకూపేఽంధవత్పతతి. (22)

టీ:- దష్టస్స్మశేత ఇత్యేత్తేతద్వ్యాచష్టే-కదాచిదితి. మానో గర్వ ఏవ దంష్ట్రావర పీడాకరత్వాత్. భగ్నా మానం దంష్ట్రా యస్య. అత ఏవ లబ్ధో నిద్రాయాః క్షణోఽపి యేన. 22

చూ॥ కర్హిచిత్ స్మ కామ మధులవాన్విచిన్వన్-యదా పర దార పర ద్రవ్యాణ్యవరుందానో రాజ్ఞా స్వామిభిర్వానిహతః పతత్యపారే నిరయే. 23

టీ:- కర్హిస్మచిత్ క్షుద్రరసానిత్యేతద్వ్యాచష్టే-కర్హీతి. యదా నిహతో భవతి. తదా సద్య ఏవ నిరయే పతతి. 23

"క్వచిచ్చ నిగీర్ణోఽజగరాహినా" అనుదానిని విశదీకరించు-చున్నాడు.

ఆ జీవుడే నిద్రయనెడు అజగర సర్పముతో గ్రహించబడి, అజ్ఞానమనెడి చీకటిలో మునిగి శూన్యారణ్యమున పడవేసిన శవమువలె వేరేదియు తెలియక పడుకొని పడియుండును. 21

"దష్టస్స్మశేతి" అనుదానినిమ విశదపరచుచున్నాడు.

ఒకానొకప్పుడు రాక్షసులవంటి దుర్మార్గులచే గర్వభంగమొంది (అనగా దుర్మార్గులచే తిరస్కరించబడి) ఒక్కక్షణము కూడా నిద్రనొందక, బాధాతప్తహృదయుడై, జ్ఞానము నశించగా అంధునివలె చీకటి కూపములో (సంసారములోనే) పడియుండును. 22

"కర్హిస్మచిత్ క్షుద్రరసాన్" అనుదానిని విశదీకరించుచున్నాడు.

ఒకానొకప్పుడు క్షుద్ర రసాల (తేనె)వంటి పరస్త్రీ, పరధనములకై యత్నించును. అపుడు తేనెటీగల వంటి పరస్త్రీ నాథులచేగాని, రాజులచేగాని హతుడై అంతులేని నరకములో పడును. 23











చూ॥ అథ చ తస్మాదుభయథా విహిత కర్మాస్మిన్నాత్మనస్సంసారావపనముదా హరంతి. 24

టీ:- ప్రసంగాత్ప్రవృత్తస్య కర్మణః సంసారహేతుత్వం స్ఫుటయతి - అథ చేతి. యద్యస్మాదేవం తస్మాత్. అథ అనంతరమేవ ఉభయథా ఇహ చ పరత్ర చ. అస్మిన్ ప్రవృత్తిమార్గే సంసారస్యావపనం జన్మక్షేత్రం కర్మోదాహరంతి. 24

చూ॥ ముక్తస్తతో యది బంధాద్దేవదత్త ఉపాచ్ఛినత్తి - తస్మాదపి విష్ణుమిత్ర ఇత్యనవస్థితి. 25

టీ:- తత్రాతికృచ్ఛ్రాత్ప్రతిలబ్ధమాన ఇవేత్యేతద్వ్యాచష్టే-ముక్త ఇతి. యది బంధాన్ముక్తో భవతి. తర్హి తతస్సకాశాదన్యో హరతి. తస్మాదప్యన్యః న త్వసౌ భోక్తుం లభత ఇత్యర్థః. 25

చూ॥ క్వచిచ్చ శీతా తపవాతాద్యనేకాధి దైవిక భౌతికాత్మీయానాం దశానాం ప్రతినివారణాయాకల్పో దురంత చింతయా విషణ్ణ ఆస్తే. 26

టీ:- క్వచిచ్చ శీతాతపేత్యేతద్వ్యాచష్టే-క్వచిచ్చేతి. శీతాదయః. అనేకా ఆధిదైవికాద్యా యా దశాః. దుఃఖావస్థాః. తాసాం. 26

ప్రాసంగికముగా ప్రవృత్తమగు కర్మకు సంసార కారణత్వమును స్పష్టమొనరించుచున్నాడు.

అందువలన ప్రవృత్తి మార్గమున వర్తిస్తూ ఆచరించెడి లౌకిక పారలౌకిములగు (ఐహికాముష్మికరూప) రెండు రకముల కర్మలు జీవికి జనన మరణరూప సంసార ప్రాప్తిని కలిగించు కర్మలుగానే చెప్పుదురు. (24)

తత్రాతికృచ్ఛ్రాత్ప్రతిలబ్ధమానఇవ అనుదానిని విశదీకరించుచున్నాడు.

రాజాది బంధములనుండి మిక్కిలి కష్టముగా విడిపించ కొనినను అన్యాయముగా హరించబడిన పరస్త్రీ, పరధనాదులను అతనినుండి దేవదత్తుడనువాడు, వాడినుండి విష్ణుమిత్రుడనువాడు లాగుకొందురు. ఈ విధముగా ఆ భోగవస్తువులు ఒకనినుండి ఇంకొకనికి వద్దకు చేరుచుండును కాని భోగించుటకు లభించవని అర్థము. 25

“క్వచిచ్చ శీతాతప” అనుదానిని విశదపరచుచున్నాడు.

ఒకానొకప్పుడు శీతాతపవాతాది అనేక ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, దుఃఖావస్థలను నివారించుటకు అసమర్థుడై అపారమగు చింతతో విషాదమొందును. 26










చూ॥ క్వ చిన్మిథోఽన్యేభ్యో వాకాకణికా మాత్రమప్యేవ వ్యవహరన్ యత్కించిద్వావిద్వేషమేతి విత్త శర్యాత్. 27

టీ:- క్వచిన్మిత ఇత్యేతద్వ్యాచష్టే:. క్వచిన్మిథ ఇతి. క్వచిన్మిథో యత్కించి ద్ధనం వ్యవహరన్. కాకణికామాత్రం. వింశతికపర్దికామాత్రం తతోఽపి న్యూనం యత్కించిదపహరన్ విద్వేషమేతి. 27

చూ॥ అధ్వన్యముష్మిన్నిమ ఉపసర్గాస్తథా సుఖ దుఃఖ రాగ ద్వేష భయాభిమాన ప్రమోద మోద శోక మోహ మాత్సర్యేర్ష్యా వ్యవమాన క్షుత్పిపాసాధి వ్యాధి జన్మ జరా మరణాదయః. 28

టీ:- అధ్వన్యముష్మిన్నురుకృచ్ఛ్రవిత్తబాధోపసర్గైరిత్యుక్తానుపసర్గాన్ప్ర పంచయతి–అధ్వన్యముష్మిన్నిమే ఉరుకృచ్ఛ్రవిత్తబాధాదయః తథా ఉపసర్గాః సుఖదుఃఖాదయశ్చ. 28

చూ॥ క్వాపి దేవమాయయా స్త్రియా భుజలతోపగూఢః ప్రస్కన్న వివేక విజ్ఞానస్తద్విహారగృహారంభాకుల హృదయ సదాశ్రయావసక్త సుత దుహితృ కళత్రాభాషితావలోక విచేష్టితాపహృత హృదయ ఆత్మాన

"క్వచిన్మిథ" అను దానిని విశదపరచుచున్నాడు.

ఒకానొకప్పుడు పరస్పరము ఇవ్వడము, తీసికోవడము అను వ్యవహారములో ధనముపై లోభముతో ఇతరుల యొక్క ఏదో కొంచెము ధనమును, ఇరువది గవ్వలు (ద్రవ్యమానము) లేక అంతకు తక్కువగానో హరించి ద్వేషభావమును పెంచుకొనును. (అనగా స్వల్పంగానైనా హరించి ద్వేషాన్ని కొనితెచ్చుకొనునని భావము) 27

"అధ్వన్యముష్మిన్నురుకృచ్ఛ్రవిత్తబాధోపసర్గై" అని చెప్పబడిన విఘ్నములను స్పష్టము చేయుచున్నాడు.

ఈ ప్రవృత్తి మార్గమున గొప్పనగు శ్రమ, ధనము మొదలగు బాధలు, ద్వేషాదులగు విఘ్నములేకాక సుఖము, దుఃఖము, అనురాగము, ద్వేషము, అభిమానము, ప్రమోదము, మోదము, శోకము, మోహము, మాత్సర్యము, ఈర్ష్య, అవమానము, ఆకలి దప్పిక, ఆధి , వ్యాధి, ముసలితనము, జన్మము, మరణాదులను విఘ్నములు కలవు. ఈ విఘ్నమార్గములో జీవుడు భ్రమించుచుండును. 28

పై అధ్యాయమున "ప్రసజ్జితిక్వాపి" అను మొదలుగాగల శ్లోకమున సింహావలోకన న్యాయముతో చెప్పబడిన అర్థమునపకర్షించి క్రమముగా విశదపరచుచున్నాడు.









మజితాత్మా పారేఽంధ తమసి ప్రహిణోతి. 29

టీ:- శ్లో. వ్యుత్క్రమైః పునరుక్తైశ్చ నానాపాఠైరతః పరం, దుర్గమోఽపి భవాధ్యాయస్సంప్రదాయేన తీర్యతే. తత్ర ప్రసజ్జతి క్వాపీత్యాదినా సింహావలోకనన్యాయోక్తమర్థమపకృష్య క్రమేణ వ్యాచష్టే-క్వాపీతి. ప్రస్కన్నం అపగళితం వివేక విజ్ఞానం యస్య. తస్యాః స్త్రియా విహార గృహం క్రీడా గృహం. తదారంభే ఆకులం హృదయం యస్య అనేన ప్రసజ్జ తీత్యాది వ్యాఖ్యాతం. తదాశ్రయేత్యాది వ్యాచేష్టే - తస్యాః ఆశ్రయేఽవసక్తాః సంలగ్నాః సుతా దుహితరశ్చ కళత్రం చ సైవ స్త్రీ తేషాం భాషితాదిభిరపహృతం హృదయం యస్య. ప్రహిణోతి ప్రక్షిపతి. 29

చూ॥ కదాచిదీశ్వరస్య భగవతో విష్ణోశ్చక్రాత్పరమాణ్వాది ద్విపరార్ధా పవర్గకాలోపలక్షణ పరివర్తితేన వయసా రంహసా హరత ఆబ్రహ్మస్తంబ పర్యంతాదీనాం భూతానామనిమిషతో నిమిషతాం విత్రస్తహృదయ స్తమేవేశ్వరం కాలచక్రం నిజాయుధం సాక్షాద్భగవంతం యజ్ఞపురుష మనాదృత్య పాషండదేవతాః కంక గృధ్ర బకప్రాయా ఆర్యసమయ పరిహృతాః సాంకేత్యేనాభిధత్తే. 30

ఒకానొక సమయమున దేవమాయారూపిణియగు స్త్రీ యొక్క బాహుపాశములో చిక్కుకొని, వివేకహీనుడై, విజ్ఞానము నశించి, ఆ స్త్రీ కొరకు విహార భవనాదులను నిర్మించుటకు వ్యాకుల చిత్తుడగును. (దీనితో ప్రసజ్జతి అను మొదలుగాగలది వ్యాఖ్యానించబడినది. "తదాశ్రమేత్యాది" వాక్యమును విశదీకరించుచున్నాడు). అటులనే ఆ స్త్రీని ఆశ్రయించి ఉండెడు పుత్ర, పుత్రికా, పత్నుల మధురములగు మాటలతో, హృదయాకర్షకమగు చూపులతో, చేష్టలతో హృదయము హరించబడి, ఇంద్రియదాసుడై అనగా ఇంద్రియములను జయించలేని వాడై తనను తాను అపారాంధకారయుతమైన నరకములో పడవేసి-కొనును. 29

క్వచిత్కదాచిదరిచక్రతత్రసన్ అనుదానిని విశదపరచుచున్నాడు.

పరమాణువు నుండి ద్విపరార్ధము వరకు గల లక్షణములు ఘడియలు మొదలగు కాలమునకుగల ఉపలక్షణములకు జగదధీశ్వ-రుడు, భగవంతుడునగు విష్ణువునకాయుధమగు కాలచక్ర పరిభ్రమణ-ముతో, వేగముగా పరిభ్రమించెడి బాల్య యౌవనాది వయస్సులను బ్రహ్మ మొదలుకొని అతి చిన్నవగు తృణముల వరకు సమస్త భూతములను హరించెడి, ఎదురులేనట్టి, ఆ కాలచక్రము వలన భీతిల్లిన





టీ:- క్వచిత్కదాచిదరిచక్రతః త్రసన్నిత్యేతద్వ్యాచష్టే. కదా చిదితి. పరమాణురాదిః ద్విపరార్థోऽపవర్గోచితః యస్య కాలస్య స కాల ఉపలక్షణం యస్య. పరివర్తితస్య. తేన పరవర్తితేన పరిభ్రమణేన. కాలోపలక్షణాదితి పృథక్పదత్వేన పాఠే. కాలస్వరూపాదిత్యర్థః. రంహసా శీఘ్రేణ. పరివర్తితేన పరిభ్రమణేన. వయసా బాల్యాదిక్రమేణ. బ్రహ్మాణ మభివ్యాప్య తృణస్తంబాదీని భూతాని. హరతః చక్రతః సకాశాత్. విత్రస్త హృదయస్సన్ పాషండ దేవతా అభిముఖ్యేన ధత్త ఇత్యన్వయః. అనిమిషతః నిమేషమకుర్వతః. అప్రమత్తాదిత్యర్థః. నిమిషతాం ప్రతీ కారం కర్తుమశక్తానామిత్యర్థః. కర్మాణి షష్టీ కూలచక్రం నిజం నిత్యమా యుధం యస్య. సాంకేతేన మూలప్రమాణశూన్యేన. పాషండాగమేన. 30

హృదయముగలవాడై కూడా ఆ కాలచక్రమే ఆయుధముగాగల భగవంతుడు మరియు యజ్ఞపురుషుడునగు ఆ ఈశ్వరుని ఆదరించక (ఆరాధించక)మందమతియగు జీవి వైదికశాస్త్రబహిష్కృతమగునట్టి మూలప్రమాణ శూన్యమగు పాషండాగమమునాశ్రయించి (వంచనా-వృత్తిగల) కాకి గద్ద కొంగలతో సమానములగు పాషండ దేవతల నాదరించును. 30

చూ॥ యదా తు పాషండైరాత్మాభివంచితైరురువంచితో బ్రహ్మకులం సమావిశం స్తేషాం శీలముపనయనాది శ్రౌత స్మార్త నిత్యకర్మానుష్ఠానేన భగవతో యజ్ఞపురుషస్యారాధనమేవ తదరోచయన్ శూద్రకులం భజతి నిగమాచారే అశుద్ధితో యస్య మిథునీభావః కుటుంబభరణం చ యథా వానర జాతేః 31

టీ:- తైర్వంచిత ఇత్యేతద్వ్యాచష్టే-యదా త్వితి. ఆత్మా అభివంచితో యైస్తైః. ఉరు అధికం వంచితస్సన్ తేషాం బ్రాహ్మణానాం.

"తైర్వచింత" అనుదానిని విశదపరచుచున్నాడు.

తమను తామే మోసగించుకొనుచున్న పాషండులచే మోసగించ-బడిన ఆ జీవి బ్రాహ్మణులనాశ్రయించును కాని, ఉపనయన శ్రౌత స్మార్తకర్మల అనుష్ఠానముతో, యజ్ఞపురుషుడగు భగవంతుని ఆరాధనయే శీలముగాగల వారి వేదోక్తాచారములతో తనకు శుద్ధి కలగక పోవుటచే, రుచించక వానరజాతివలె అగ్నిహోత్రాదులు లేనట్టి, కుటుంబపోషణ మరియు స్త్రీ సేవనయే వ్యాపారముగాగల శూద్రులను ఆశ్రయించును. (31)






యచ్ఛీలముపనయనాది. తదరోచయన్ శూద్రవద్వర్తతే. నిగమోక్తాచారే అశుద్ధితః స్వస్య శుద్ధ్య భావాత్. యస్య శూద్రస్య కేవలం మిథునీభావః కుటుంబభరణం చ వ్యాపారః నాగ్నిహోత్రాది. 31

చూ॥ తత్రాపి నిరవరోధస్స్వైరేణ విహరన్నతి కృపణ బుద్ధిరన్యోన్య ముఖ నిరీక్షణాది గ్రామ్యకర్మణైవ విస్మృతకలావధిః. 32

టీ:- తజ్జాతి నిరాసేనేత్యాది వ్యాచష్టే-తత్రాపీతి. తత్రాపి నిరవరరోధః ప్రతిబంధరహితః. స్వైరేణ స్వేచ్ఛయా క్రీడన్ విస్మృత మృత్యు కాలస్సన్. 32

"తజ్జాతినిరాసే" అను దానిని విశదపరచుచున్నాడు.

ఆ శూద్ర జాతిలో, ప్రతిబంధరహితుడై, అడ్డు అదుపు లేకుండా విహరించుటచే మిక్కిలి దయనీయమగు బుద్ధిగలవాడై పరస్పర ముఖ విలోకాది విషయోపభోగ కర్మలలోమునిగి తన అంతిమ సమయమును (మృత్యువును) మరచిపోవును. 32

చూ॥ క్వచిద్రుమవద్దైహికార్థేషు గృహేషు రంస్యన్ యథా వానరస్సుత దార వత్సలో వ్యవాయక్షణః. 33

టీ:- ద్రుమేషు రంస్యన్నిత్యేతద్వ్యాచష్టే-క్వచిదితి. వానరో ద్రుమవత్ వృక్షేష్వివ గృహేషు రంస్యన్ క్రీడన్ వ్యవాయక్షణః మైథునోత్సవో భవతి. 33

"ద్రుమేషు రంస్యన్" అనుదానిని విశదీకరించుచున్నాడు.

కోతులు వృక్షములపై రమించినటుల కళత్ర పుత్రాదుల యందాసక్తుడై దేహసంబంధములైన సుఖములే ఫలములుగాగల వృక్షముల వంటి గృహములలో, తన సమయమునంతటిని మైథునాది విషయోప భోగములలోనే గడుపును. 33








చూ॥ ఏనమధ్వన్యవరుంధానో మృత్యు గజభయాత్తమసి గిరికందర ప్రాయే. క్వచిచ్చ శీతవాత వర్షాద్యనేకాధిదైవిక భౌతికాత్మీయానాం దశానాం ప్రతినివారణాయాకల్యో దురంత చింతయా విషణ్ణ ఆస్తే. 34

టీ:- క్వచిత్రప్రమాదాదిత్యేతద్వ్యాచష్టే-ఏవమితి. ఏవమధ్వని సుఖ దుఃఖాద్యవరుంధానః. గిరికందరప్రాయే తమసి. రోగాద్యాపది. పతన్నితి శేషః క్వచిచ్చ శీతవాతేత్యాది పూర్వస్మాదధికోక్తిః. రోగాద్యాపది పతితస్సన్ శీతాదిభిః క్లిశ్యన్నాస్త. ఇత్యర్థః. 34

చూ॥ క్వచిన్మిథో వ్యవహరన్ కాకణి కామాత్రమపి హరన్ యత్కించిద్వా విద్వేషముపయాతి విత్త శాఠ్యేన కదాచిత్. 35

టీ:- తదేవం సింహావలోకనన్యాయేనోక్తమర్థమపకృష్య వ్యాఖ్యాయ. క్రమస్థమనువర్తయితుం. పూర్వోక్త మేవానువదతి-క్వచిన్మిథ ఇతి. యత్కించిద్ధనం హరన్ ద్వేషముపయాతి. 35

చూ॥ క్వచిత్క్వచిత్ క్షీణధనశ్శయ్యాసనాద్యుపభోగ విహీనో యావద ప్రతిలబ్ధమనోరథోపగతస్వాదానే. వ్యవసితమతిస్తతోऽవమానాదీని లభతే. 36

"క్వచిత్రప్రమాదాది" అనుదానిని విశదపరచుచున్నాడు.

ఈ విధముగా జీవి ప్రవృత్తిమార్గములో సుఖ దుఃఖాదులతో అడ్డగించబడుచూ రోగ రూపములగు పర్వత గుహలలో పడి, మృత్యు - రూప గజమునకు భీతిల్లుచూ, ఒక్కొక్కప్పుడు చలి, గాలి, ఎండ మొదలగు అనేక ప్రకారములగు ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికము-లగు తన దుఃఖములను నివారించుకొనుటకశక్తుడై అపారమగు విషయ -చింతతో విషణ్ణుడై యుండును. 34

ఈ విధముగా సింహావలోకన న్యాయముతో చెప్పిన విషయము -ను తిరిగి చెప్పి విశదీకరించి క్రమమగు విషయమునుసరించుచూ పూర్వము తెలిపిన దానిని అనువదించుచున్నాడు. ఒక్కొక్కప్పుడు పరస్పరము క్రయవిక్రయాది వ్యాపారమొనరించుచు ద్రవ్యముపైన లోభముతో ఇరువది గవ్వలు(కొలత)మాత్రము హరించి, విద్వేషభావము నొందుచున్నాడు. 35

"క్వచిత్ క్షీణధన" అనుదానిని విశదపరచుచున్నాడు.

ఒకానొకప్పుడు ధనము నశించిగా, పడక, ఆసన, భోజనాది ఉపభోగ వస్తుహీనుడై, కోరినది లభించనందున దొంగతనము మున్నగు










టీ:- క్వచిత్క్వచిత్ క్షీణధన ఇత్యేతద్వ్యా చష్టే-క్వచిదితి. అప్రతిలబ్ధం యన్మనోరథేనోపగతం వాంఛితం. యత్స్వం తస్యాదానే స్వీకారే. నిశ్చితమతిస్సన్. 36

చూ॥ ఏవం విత్తవ్యతిషంగ వృద్ధవైరానుబంధోऽపి పూర్వవాసనయా మిథ ఉద్వహన్ స ఏవోద్వహత్యపవహతి చ. 37

టీ:- అన్యోన్యవిత్త వ్యతిషంగేత్యేతద్వ్యాచష్టే-ఏవమితి. అపవహతి త్యజతి. 37

చూ॥ ఏతస్మిన్ సంసారాధ్వని నానా క్లేశోపసర్గబాధితే-ఆపన్నో విపన్నో యస్తముహవేతరస్తత్ర తత్ర వియుజ్య జాతం జాతముపాదాయ శోచన్ ముహ్యన్ ఖిద్యన్ వినదన్ సంహృష్యన్ గాయన్నహ్యమానస్సాధు వర్జితో నైవావర్తతేऽద్యాపి యత ఆరబ్ధ ఏష నరలోకసార్థస్తమధ్వనః పారముప విశతి. 38

టీ:- అధ్వన్యముష్మిన్నిత్యేతదాది వ్యాచష్టే-ఏతస్మిన్నితి. ఆపన్నః ఆపదం ప్రాప్తః. విపన్నో వినష్టః. యః తమితరస్తత్రైవ విసృజ్య నహ్యమానః బధ్యమానః సాధువర్జితః సాధువ్యతిరిక్తః. 38

వాటితో వాటిని పొందుటకు యత్నించి ఇతరులచే అవమానములను పొందును. 36

"అన్యోన్యవిత్తవ్యతిషంగ" అను దానిని విశదపరచుచున్నాడు.

ఈ విధముగా ధనముపై మోహముతో పరస్పరము విరోధ భావము చెందినను జీవి పూర్వ వాసనలతో వివశుడై పరస్పరము వివాహాది బంధములనేర్పరుచుకొనుచూ, వైరభావముతో వివాహాది బంధములనుగూడా త్రెంచుకొనుచుండును. 37

"అధ్వన్యముష్మిన్" అను మొదలుగాగల దానిని విశదపరచు-చున్నాడు.

ఈ సంసార మార్గమున అనేక రకములగు కష్టములు, విఘ్నములతో బాధనొందుచుగూడా ఆ మార్గమున ఎవరికైన ఆపద వచ్చినను లేక మృతినొందినను వారినక్కడే విడచుచూ క్రొత్తగా పుట్టిన వారిని వెంటతీసుకొనుచు దుఃఖిస్తూ, మూర్ఛనొందుచూ ఖేదముతో నినాదములు చేయుచు (పెడబొబ్బలు పెడుతు) సంతోషిస్తూ, గానము చేస్తూ బంధించబడుతూ, సత్పురుషులచే వదలబడినవాడై (సత్సంగము లేక) ముందుకు సాగుతూ, తానెచటినుండి ఈ ప్రయాణము నారంభించినాడో, ఈ ప్రయాణమునకంతమెక్కడో తెలియక ఈ





  

చూ॥ యదిదం యోగానుశాసనం నామ న వా ఏతదవరుంధతే యే న్యస్తదండా మునయ ఉపరతాత్మానస్సమవ గచ్ఛంతి. 39

టీ:- అన్యావృత్తౌ హేతుమాహ-యదిదమితి. 39

చూ॥ యదపి దిగిభజయినో యే వై రాజర్షయో నైవైతద్రజంతి కింతు పరం మృథేశ యీరన్ మమైవేయం మహీతి కృతవైరానుబంధాః -యాం విసృజ్య స్వయముపసంహృతాః. 40

టీ:- మనస్విన ఇత్యాది వ్యాచష్టే-యదపీతి. యే వై రాజర్షయః. తేSపి నావరుంధతే. కింతు. పరం కేవలం. మృథేశయీరన్. 40

చూ॥ కర్మవల్లీమవలంబ్య తత ఆపదః కథంచిన్నరకాద్విముక్తః పునర ప్యేవం సంసారాధ్వన్య నివర్తమానో నరలోకసార్థమేవోపయాత్యేవము పరిగతోSపి. 41

మార్గమునకు అంతిమావధియగు పరమాత్మని చేరలేడు. (ప్రవేశించ లేడు) 38

పరమాత్మను చేరలేకపోవుటకు కారణమును తెలుపుచున్నాడు.

యోగశాస్త్రముద్వారాగూడా ఈ మార్గమునకు అవధియగు పరమాత్మను చేరుటకు సాధ్యముకాదు. ఎవరైతే సమస్త శాసనములను త్యజించి నివృత్తి పరాయణులు సంయతాత్ములునగుదురో వారే ఈ మార్గమునకవధియగు పరమాత్మను చేరుదురు. 39

"మనస్విన" అని మొదలుగాగల దానిని విశదపరచుచున్నాడు.

దిగ్గజములను జయించి, గొప్పయజ్ఞముల నాచరించిన రాజర్షులును ఈ మార్గమునకు పరమావధి చేరలేరు. ఆ రాజర్షులు ఈ పృథ్వి నాదినాదియని వైరము పెంచుకొని ఆ భూమియందే పడి ప్రాణ పరిత్యాగ మొనరించి పరలోక గతులగుదురు కాని ఈ సంసారాధ్వము అవధిని పొందలేరు. 40

"ప్రసజ్జతి" అని మొదలుకొని గిరికందర అను చివరి వరకు గ్రంథమును తెలిపి గృహీత్వా అనుదానిని విశదీకరించుచున్నాడు. జీవి తనయొక్క పుణ్యకర్మరూపమగు లతలాంటి ఆపదలనుండి లేక

 






టీ:- ప్రసజ్జతీత్యాదిగిరికందర ఇత్యేతదంతం, అపకృష్య వ్యాఖ్యాతం గ్రంథమతిక్రమ్య. వల్లీం గృహీత్వేత్యాది గ్రంథం వ్యాచష్టే-కర్మవల్లీమితి. ఏవముపరి స్వర్గం గతోऽపి నరలోకసార్థమేవోపయాతి. 41

నరకమునుండి ఏదో విధముగా విముక్తుడైనను తిరిగి యథా ప్రకారముగా సంసారమార్గమున భ్రమిస్తూ ఈ సాధారణ జన సమూహములో కలసిపోవును. ఈ స్థితి స్వర్గాది ఊర్ధ్వ లోకముల వారికినీ కలుగును. 41

చూ॥ తస్యేదముపగాయంతి. 42

టీ:- తదేవం భరతోక్తిం వ్యాఖ్యాయ. తచ్చరితే సంగ్రహ శ్లోకానాహ -తస్యేతి. తస్యేదం కర్మ. శ్లోకైరుపగాయంతి. 42

ఈ విధముగా భరతుని మాటలను వ్యాఖ్యానించి ఆతని చరిత్రను, కర్మను సంగ్రహ శ్లోకములలో తెలుపుచున్నాడు. 42

చూ॥ ఆర్షభస్యేహ రాజర్షేర్మనసాపి మహాత్మనః ।
నానువర్త్మార్హతి నృపో మక్షికేవ గరుత్మతః ॥ 43

టీ:- ఆర్షభస్యేతి. ఆర్షభస్య ఋషభపుత్రస్య. అన్యో నృపః అనువర్త్మ నార్హతివర్త్మ అనుగంతుం న శక్నోతి. 43

గరుత్మంతుని మార్గమును ఈగ అనుసరించలేనట్లే ఋషభదేవుని పుత్రుడు, రాజర్షి, మహాత్ముడునగు భరతుని మార్గమును వేరే ఏ రాజును మనస్సుతో గూడా అనుసరించలేడు. 43

చూ॥ యోదుస్త్యజాన్ దారా సుతాన్ సహృద్రాజ్యం హృదిస్పృశః ।
జహౌ యువైవమలవదుత్తమశ్లోక లాలసః ॥ 44

**ఆ విధముగా అనుసరించలేకపోవుటకు కారణమును తెలుపు చున్నాడు.** ఈ ఋషభదేవుని పుత్రుడగు భరతుడు పుణ్య కీర్తిమంతుడగు శ్రీహరిపై ఆసక్తితో యువావస్థలోనే మనోహరములగు




 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- తత్రహేతుమాహ-య ఇతి. సుహృద్రాజ్యయోర్ద్వంద్వైక్యం. యో దుస్త్యజాన్ దారాదీన్. విష్ఠామివ జహౌ, తస్యార్షభస్యేతి సంబంధః దుస్త్యజత్వే హేతుః. హృదిస్పృశః మనోజ్ఞాన్. త్యాగే హేతుః. ఉత్తమశ్లోకే లాలసః లంపటః యః. 44

కళత్ర, పుత్ర మిత్రులను, రాజ్యమును, మలమును విసర్జించినటుల వదిలెను. 44

శ్లో॥ యో దుస్త్యజాన్ క్షితిసుతస్వజనార్థ దారాన్
ప్రార్థ్యాం శ్రియం సురవరైస్సదయావలోకామ్ ।
నైచ్ఛన్నృపస్తదుచితం మహతాం మధుద్విట్సే
వానురక్త మనసామభవోఽపి ఫల్గుః ॥ 45

టీ:- తస్యైవం విషయత్యాగో ఉచిత ఇత్యాహ-యఇతి. య ఏవం భూతోఽసౌ నృపః. సః క్షిత్యాదీన్ నైచ్ఛదితి యత్తదుచితం. సదయావలోకాం భరతస్య దయా యథా భవత్యేవమవలోకో యస్యా ఇతి. పరిజనావలోకః శ్రియాముపచర్యతే, యతః మధుద్విషః సేవాయామనురక్తం మనో యేషాం తేషాం మహతాం అభవో మోక్షోఽపి ఫల్గుః తుచ్ఛఏవ. 45

ఆ భరతునకు విషయత్యాగము తగియున్నదని తెలుపుచున్నాడు.

ఓ రాజా! మిక్కిలి దుస్త్యజములగు భూ, సుత, స్వజన, సంపత్తి, కళత్రములను భరతుడు కోరలేదు. లక్ష్మీదేవి దయాదృష్టి కొరకై ఆమెపై దేవతలు దృష్టిని నిలిపెదరు. అటువంటి లక్ష్మీదేవిని కూడా కోరలేదు అనునది ఆ భరతునకు తగియున్నది. ఏలనన మధుసూదనుని సేవానురక్తచిత్తులగు మహాత్ములకు మోక్షపదముకూడా తుచ్ఛమైన -దగును. 45

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








శ్లో॥ యజ్ఞాయ ధర్మపతయే విధినైపుణ్యాయ
యోగాయ సాంఖ్యశిరసే ప్రకృతీశ్వరాయ ।
నారాయణాయ హరయే నమ ఇత్యుదారం
హాస్యన్మృగత్వమపి యస్సముదాజహార ॥46

టీ:- సేవానురాగమేవాహ -యజ్ఞాయేతి. యజ్ఞరూపాయ. ధర్మపతయే యజ్ఞాదిఫలప్రదాత్రే. విధౌ నైపుణ్యం యస్య తస్మై ధర్మానుష్ఠాత్ర ఇత్యర్థః. యోగోऽష్టాంగస్తస్మై. సాంఖ్యం జ్ఞానం తచ్ఛిరః ప్రధానం ఫలం యస్య తస్మై ప్రకృతీశ్వరాయ మాయానియంత్రే. అత ఏవ నారం జీవసమూహః. స ఏవాయనమాశ్రయో యస్య సర్వజీవ నియంత్ర ఇత్యర్థః. ఏవం కర్మజ్ఞానదేవతాకాండైః ప్రతిపాదితాయ. హరయే నమ ఇతి. ఉదారం ఉచ్చైః. యః సమ్యగుచ్చారితవాన్. మృగత్వం మృగదేహమపి. హాస్యన్ త్యక్ష్యన్. యః ఏవంభూతః తస్య. తదుచితమితి వా. తస్యానువర్త్మ నార్హతీతి వా సంబంధః. 46

భరతుని శ్రీహరి సేవాసక్తిని తెలుపుచున్నాడు. ఆ భరతుడు మృగశరీరమును వదులుచుకూడా యజ్ఞరూపుడగు యజ్ఞాదులలో ఫలప్రదాతయగు, శాస్త్రవిధిలో నిపుణుడైన ధర్మానుష్ఠాతయగు, అష్టాంగ యోగరూపుడగు, జ్ఞానమే ప్రధానమైన ఫలమైనవాడగు, మాయా నియంతయగు, జీవసమూహమే ఆశ్రయముగా కల్గినవాడగు, సర్వజీవనియంతయగు, కర్మ, జ్ఞాన, దేవతాకాండలతో ప్రతిపాదితుడగు శ్రీహరి కొరకు నమస్సులు అని బిగ్గరగా, బాగుగా పలికెను. అట్టి భరతునకు పై విషయముల త్యాగము ఉచితమే. (లేక) అలాంటి భరతుని మార్గమును వేరెవ్వరును అనుసరించలేరు. 46








చూ॥ ఇదం భాగవతసభాజితావదాత గుణకర్మణో రాజర్షేర్భరతస్యా నుచరితం స్వస్త్యయనమాయుష్యం ధన్యం యశస్యం స్వర్గ్యమపవర్గ్యం చానుశ్రుణోత్యాఖ్యాస్యత్యభినందతి చ సర్వా హ్యేవాత్మన ఆశిష ఆసాస్తే కాంచిన్నపరత ఇతి. 47

టీ:- భరతచరిత శ్రవణాదిఫలమాహ - ఇదమితి. భాగవతైః సభాజితాః అవదాతాః శుద్ధాః గుణాః కర్మాణి చ. యస్య తస్య భరతస్యానుచరితం యో ను శ్రుణోతి. స ఆత్మన ఏవ సకాశాత్ సర్వా ఆశిష ఆశాస్తే స్వత ఏవ ప్రాప్నోతి న తు కాంచిదపి పరస్మాదపేక్షత ఇత్యర్థః. 47

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,**
**చతుర్దశోऽధ్యాయః**

భరతచరిత్ర వినుటవలన కలుగు ఫలమును తెలుపుచున్నాడు.

భాగవతోత్తములచే కొనియాడబడెడి శుద్ధమగు గుణకర్మలుగల రాజర్షియగు భరతుని చరిత్రము శుభకరము, ఆయుర్ధన వృద్ధికరము. కీర్తికరము, స్వర్గమోక్షములనొసగెడిది. ఇట్టి చరిత్రను ఎవరైతే విందురో చెప్పుదురో కొనియాడుదురో వారికి అన్ని కోరికలు స్వయముగనే సంపూర్ణముగా సిద్ధించును. ఇతరులనుండి కొరునదేది యుండదు. (47)

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు**
**పద్నాల్గవ అధ్యాయము సమాప్తము.**










## పంచదశోऽధ్యాయః

శ్లో॥ ఏవమష్టభిరధ్యాయైర్భరతస్యోక్తమిహితమ్ ।
తతః పంచదశే తస్య కీర్త్యంతే వంశజా నృపాః ॥

**శ్రీ శుక ఉవాచ**

చూ॥ భరతస్యాత్మజస్సుమతిర్నామాభిహితోऽయముహవావ కేచిత్పాషండిన ఋషభ పదవీమనువర్తమానమనార్యామవేదస మామ్నాతాం దేవతాం స్వమనీషయా పాపీయస్యాం కలౌ కల్పయిష్యంతి తస్మాద్ధ్రువసేనాయాం దేవతాజిన్నామ పుత్రోऽభవత్. 1

టీ:- భరస్యేతి. ఋషభపదవీం జీవన్ముక్తిమార్గం. అనువర్తమానం. యం దృష్ట్వేతి శేషః. యద్వాయం సుమతిం అవేదసమామ్నాతాం దేవతాం కల్పయిష్యంతి. బుద్ధోऽయం సాక్షాదవతీర్ణ ఇతి మన్యంత ఇత్యర్థః. 1

చూ॥ అథాసుర్యాం తతనయో దేవద్యుమ్నస్తతో ధేనుమత్యాం సుతః పరమేష్ఠీ - తస్య సువర్చలాయాం ప్రతీహ ఉపజాతః య ఆత్మవిద్యా మాఖ్యాయ స్వయం సంశుద్ధో మహాపురుషమనుసస్మార. 2

## 15వ అధ్యాయము

ఈ ప్రకారము ఎనిమిది అధ్యాయములలో భరతుని చరిత్రను తెలిపి ఈ పదిహేనవ అధ్యాయమున భరతవంశజులగు రాజులను కీర్తించుచున్నాడు.

**శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.**

భరతుని పుత్రుడు సుమతి. ఈయన ఋషభదేవుడు బోధించిన జీవన్ముక్త మార్గమున‌నుసరించుచుండగా పాపయుతమగు ఈ కలికాలమున కొందరు పాషండులు ఈ సుమతిని దుర్మార్గులు ఆదరించెడి అవైదికమగు దేవతగా భావించెదరు. బుద్ధుడు సాక్షాత్తుగా ఇలా అవతరించినాడని తలంతురు. ఈ సుమతికి ధ్రువసేన అను భార్యయందు దేవతాజిత్తు అను పుత్రుడు కలిగెను. 1

దేవజిత్తునకు అసురయందు దేవద్యుమ్నుడు. ఆ దేవధ్యుమ్నునకు ధేనుమతియందు పరమేష్ఠియను పుత్రుడు కలిగిరి. ఆ పరమేష్ఠికి సువర్చలా అను నావిడయందు ప్రతీహుడు అనువాడు జన్మించెను.








టీ:- అథేతి. తత్తనయః దేవతాజితః పుత్రః. ఆత్మవిద్యా బహుభ్యః ఆఖ్యాయ వ్యాఖ్యానేనైవ స్వయం సంశుద్ధోऽనుసస్మార అపరోక్షతయా అనుభూతవాన్. 2

ఈ ప్రతీహుడు ఆత్మవిద్యను అనేకులకు బోధించి ఆ బోధనతో శుద్ధుడై మహాపురుషుడగు శ్రీమన్నారయణుని అపరోక్షాను భూతినొందెను. 2

చూ॥ ప్రతీహాత్సువర్చలాయాం ప్రతిహర్త్రాదయస్త్రయ ఆసన్నిజ్యా కోవిదాస్సూనవః -ప్రతిహర్తుస్స్తుత్యాంవ్యోమభూమానాజనిషాతామ్. 3

టీ:- ప్రతీహాదితి. ప్రతిహర్తా ప్రస్తోతా ఉద్గాతేతి. త్రయో యజ్ఞనిపుణాః సూనవ ఆసన్ అజనిషాతాం జాతౌ. 3

ఈ ప్రతీహునకు సువర్చల అను భార్యయందు ప్రతిహర్తా, ప్రస్తోతా, ఉద్గాతా అను ముగ్గురు పుత్రులు కలిగిరి. వీరు యజ్ఞకర్మలలో నిపుణులు. ప్రతిహర్తకు స్తుతి అను ఆవిడయందు వ్యోముడు, భూముడు అను ఇద్దరు పుత్రులు కలిగిరి. 3

చూ॥ భూమ్నా ఋషికుల్యాయాముద్గీథస్తతః ప్రస్తోతా దేవకుల్యాయాం ప్రస్తోతుర్వరరుత్సాయాం హృదయజ ఆసీద్విభుః. 4

భూమునకు ఋషికుల్యయందు ఉద్గీథుడు. ఆ ఉద్గీథునకు దేవకుల్యయందు ప్రస్తోతి, ప్రస్తోతకు వరరుత్సయందు విభుడు పుత్రుడుగా జన్మించిరి. 4

చూ॥ విభోర్భారత్యాం చ పృథుషేణః - తస్మాన్నక్తఆకుత్యాం జజ్ఞే. 5

విభునకు భారతి యందు పృథుషేణుడు. ఆ పృథుషేణునకు ఆకూతియందు నక్తుడు జన్మించిరి. 5

చూ॥ నక్తాద్దృష్టి పుత్రో గయోనామ రాజర్షి ప్రవర ఉదారశ్రవా అజాయత. 6

టీ:- భూమ్న ఇతి. హృదయజః పుత్రః. (4-6)

నక్తునకు దృష్టి అను నావిడ యందు గొప్ప కీర్తిమంతుడు రాజర్షి శ్రేష్ఠుడునగు గయుడు జన్మించెను. 6












చూ॥ సాక్షాద్భగవతోవిష్ణోర్జగద్రి రక్షిషుతయా గృహీత సత్త్వస్య కళాత్మవత్త్వాది లక్షణేన మహాపురుషతాం ప్రాప్తః. 7

టీ:- సాక్షాదితి. జగతో రిరక్షిషుతయా గృహీతం సత్త్వం యేన తస్య విష్ణోః. కళా అంశస్సన్. 7

చూ॥ స వై ధర్మేణ ప్రజాపాలన ప్రీణనోపలాలనానుశాసన లక్షణే నేజ్యాదినా చ భగవతి మహాపురుషే పరాపరే బ్రహ్మణి సర్వాత్మానార్పిత పరమార్థ లక్షణేన - బ్రహ్మవిచ్చరణాను సేవయోపాసాదిత భగవద్భక్తి యోగేన చాభీక్ష్ణశః పరిభావిత శుద్ధమతిరుపరతానాత్మ్యేస్వాత్మని స్వయముపలభ్యమాన బ్రహ్మాత్మానుభవోపి నిరభిమాన ఏవావని - మజూగుపత్. 8

టీ:- మహాపురుషత్వమేవాహ - సవా ఇతి. ధర్మః తస్య ద్వివిధః అభిషిక్తత్వాత్ప్రజాపాలనాదిరేకః. గృహస్థత్వాదిజ్యాదిశ్చాపరః ద్వివిధోऽపి భగవతి సర్వాత్మనా అర్పితస్సన్ పరమార్థలక్షణః తేన పరిభావితా సంస్కృతా అతో విశుద్ధా మతిర్యస్య అతఏవోపరతమనాత్మ్యం దేహాద్యహంభావో యస్మిన్ తస్మిన్ ఆత్మనిచిత్తే స్వయమేవోపలభ్యమానే బ్రహ్మణ్యాత్మానుభవో యస్య తాదృశోऽపి నిరభిమాన ఏవ అవనిం అజూగుపత్ పాలయామాస. (8-9)

ఈ గయుని జగత్తును రక్షించుటకు సత్త్వగుణమును స్వీకరించిన సాక్షాద్భగవదంశగా తలచెదరు. సంయమనాది అనేక గుణములలో ఆత్మజ్ఞాన లక్షణములలో మహాపురుషుడుగా తలచ -బడును. 7

గయుని మహాపురుషత్వమును తెలుపుచున్నాడు.

ఆ గయమహారాజు రాజగుటచే ప్రజాపరిపాలన, గృహస్థుడగు- టచే యజ్ఞాదుల నిర్వహణ అను రెండు ధర్మములను నిర్వర్తించు- చుండెను. గయుడు ప్రజలను రక్షించుట, పోషించుట, సంతోష- పెట్టుట, లాలించుట, శాసించుట అను లక్షణముగల ధర్మమును, యజ్ఞాదులనాచరించుట అను ధర్మములను నిష్కామయోగముతో భగవత్ప్రీతి కొరకు ఆచరించి, పరమపురుషుడు, పరమాత్మ, పరబ్రహ్మ యగు శ్రీహరికి తన కర్మలన్నింటిని అర్పించి పరమార్థ లక్షణులగు వారిని సేవించడమే పరమార్థ లక్షణమని బ్రహ్మవిదులగు మహా -పురుషుల సేవతో భగవద్భక్తియోగముపొంది నిరంతరము భగవచ్చింతనతో పరిశుద్ధాంతరంగుడై, దేహాదులగు అనాత్మవస్తువులలో ఆత్మభావమును త్యజించి తన ఆత్మలో బ్రహ్మానుభూతినొందియు (అభేద దృష్టి కలిగియూ) అభిమానరహితుడై పృథ్విని పాలించుచుండెను. 8


ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.








చూ॥ తస్యేమాం గాథాం పాండవేయ పురావిద ఉపగాయంతి. 9

ఓ పరీక్షిద్రాజా! ప్రాచీనేతిహాసవేత్తలు ఆ గయమహారాజు యొక్క కథను ఇలా స్తుతింతురు. 9

శ్లో॥ గయం నృపః కః ప్రతియాతి
కర్మభిర్యజ్వాభిమానీ బహువిద్ధర్మగోప్తా ।
సమాగత శ్రీస్సదసస్పతిస్సతాం
సత్సేవకోఽన్యో భగవత్కళామృతే ॥10

టీ:- గయమితి. కర్మభిర్గయం కః ప్రతియాతి అనుకరోతి? న కోఽపీత్యర్థః. అత్ర హేతుః. యజ్వాదిరూపః. భగవత్కళాం గయమృతే అన్యః క ఇత్యనుషంగః. అభిమానీ సర్వతో మానాస్పదం. మనస్వీతిహ సమాగతా సంప్రాప్తా శ్రీర్యేన యమితి వా. సతాం సదసః సభాయాః పతిః సతాం సేవకః. యద్వా యజ్వాదిరూపోఽపి. భగవత్కళామృతే గయం కోఽన్యః. ప్రతియాతీత్యన్వయః. 10

ఈ గయమహారాజు చేసే విధంగా సత్కర్మలు ఎవరు చేయగలరు? ఎవరును అనుకరించలేరని అర్థము. భగవదంశ సంభూతుడగు గయుని కంటే యజ్ఞముల నాచరించువాడు, మనస్వీ, అనెక విషయములు తెలిసినవాడు, ధర్మమును రక్షించువాడు, సంపదలనొందినవాడు, సాధు శిరోమణి, సత్పురుషుల నిజమైన సేవకుడు వేరొకడు లేడు. 10

శ్లో॥ యమభ్యషించన్ పరయా ముదా
సతీస్సత్యాశిషో దక్షకన్యాస్సరిద్భిః ।
యస్య ప్రజానాం దుదుహే ధరాశిషో
నిరాశిషో వై గుణవత్సస్నుతోధాః ॥ 11

సత్సంకల్పముగల సాధ్వులగు శ్రద్ధా, దయ, మైత్రి మున్నగు దక్షప్రజాపతి పుత్రికలు గంగాది నదులతో కలిసి ఏ గయుని అభిషేకించిరో, ఆవు తనదూడపై ప్రేమతో పాలను కురిపించినటుల, ఏ గయుడు ఆశించనప్పటికిని వసుంధర ఆతని గుణగణములకు








టీ:- యమితి. సతీః సత్యః అత్రార్షత్వాత్ప్రథమార్థే ద్వితీయా. సత్యాః ఆశిషో యాసాం తాః. దక్షకన్యాః శ్రద్ధామైత్రీదయేత్యాద్యాః నిరాశిషోऽపి యస్య ప్రజానామాశిషః కామాన్ ధరా దుదుహే తస్య గుణ ఏవ వత్సః తేన స్నుతమూధో యస్యాః పృథివ్యాః. యచ్ఛబ్దానాం తం గయం కః ప్రతియాతీతి సంబంధః. 11

శ్లో॥ ఛందాంస్య కామస్య చ యస్య కామాన్
దుదుహ్రు రాజహ్రురథో బలిం నృపాః ।
ప్రత్యంచితా యుధి ధర్మేణ విప్రాయథా
శిషాం షష్ఠమంశం పరేత్య ॥ 12

టీ:- ఛందాంసీతి. ఛందాంసి వేదాః. తద్విహిత కర్మాణి చ దుదుహ్రుః దుదుహుః. యుధి ప్రత్యంచితాః బాణైః ప్రతిపూజితాః నృపాః యస్య బలిమాజహ్రుః అర్పయామాసుః. ధర్మేణ పాలనేన దక్షిణాదిభిశ్చ యథా ప్రత్యంచితా విప్రాః తథా పరేత్య లోకాంతరే ఆశిషాం ధర్మఫలానాం షష్ఠమంశమాజహ్రుః. శ్లో. "పుణ్యాత్ షడ్భాగమాదత్తే న్యాయేన పరిపాలయన్ని" తి స్మృతేః. 12

మురిసి అతని పాలనలోని ప్రజలకు సమస్త అభీష్ట వస్తువుల ఇచ్చెనో అట్టి గయునితో సమమగు వాడెవ్వడుండును? 11

నిష్కాముడగు ఆ గయమహారాజునకు వేదములు, వేద విహిత కర్మలు అన్నిరకముల కోరికలను తీర్చినవి. యుద్ధములలో రాజులు అతని బాణములచే ప్రతిపూజితులై కానుకలనొసంగిరి. ధర్మ పాలనతో, దక్షిణలతో సేవించబడిన బ్రాహ్మణులు ఆశీస్సులతో పరలోకములో తమకు లభించెడి ఫలములలో ఆరవ భాగమునిచ్చిరి. న్యాయబద్ధముగా పరిపాలించు రాజు పాలితుల పుణ్యము నుండి ఆరవ భాగము గ్రహించునని స్మృతి వాక్యము. అలాంటి గయునితో సమమగు వారెవ్వరుందురు. 12








శ్లో॥ యస్యాధ్వరే భగవానధ్వరాత్మామఘోనిమాద్యత్యురు సోమపీతే
శ్రద్ధాతి శుద్ధాచల భక్తియోగ సమర్పితేజ్యా ఫలమాజహార ॥13

టీ:- యస్యేతి. ఉరుసోమపీథే బహుసోమపానే అధ్వరే యజ్ఞే మఘోని ఇంద్రేమాద్యతి మదం ప్రాప్నువతి సతి. శ్రద్ధయా విశుద్ధో యః అచలో భక్తియోగః. తేన సమర్పిత మిజ్యాఫలం ఆజహార అర్హణమివ ప్రత్యక్షతః స్వీకృతవానిత్యర్థః. 13

ఏ గయునియొక్క యజ్ఞములో గొప్పగా సోమపానము చేసి ఇంద్రుడు మదించినవాడుకాగా, మిక్కిలి శ్రద్ధతో పరిశుద్ధమగు అచంచల భక్తిభావముతో, ఆ గయునిచే ఒసగబడిన యజ్ఞఫలమును బహుమానము స్వీకరించినటుల యజ్ఞపురుషుడు స్వయముగా స్వీకరించెనో అట్టి గయునితో సమానుడెవడుండును; 13

శ్లో॥ యత్ప్రీణనాద్బర్హిషి దేవతిర్య
ఙ్మనుష్యవీరుత్తృణమావిరించాత్ ।
ప్రీయేత సద్యస్సహ విశ్వజీవః
ప్రీతస్స్వయం ప్రీతిమగాద్గయస్య ॥ 14

ఏ భగవంతుని తృప్తిపరచుటచే బ్రహ్మాది దేవతలు మొదలుకొని మనుష్యులు, పశుపక్ష్యాదులు, వృక్షములు, తృణముల వరకు తృప్తినొందునో అలాంటి విశ్వాత్ముడగు శ్రీహరి గయుని భక్తియోగము -నకు తృప్తినొందితినని స్వయముగా ప్రకటించినాడు. అలాంటి గయునితో సముడెవ్వడుండును? 14

చూ॥ చూ. గయాజ్జయంత్యాం చిత్రరథః స్వాతిరవరోధన ఇతి త్రయః పుత్రా బభూవుః. 15

గయునకు జయంతియందు చిత్రరథుడు, స్వాతి, అవరోధను డను ముగ్గురు పుత్రులు కలిగిరి. 15

చూ॥ చిత్రరథాదూర్ణాయాం సమ్రాడజనిష్ట - తత ఉల్కాయాం మరీచిర్మరీచేర్బిందుమత్యాం బిందుమానుదజాయత. 16

చిత్రరథునకు ఊర్ణయను నామెయందు సమ్రాట్ జనించెను. ఆ సమ్రాట్‌నకు ఉల్కయందు మరీచి, మరీచికి బిందుమతి యందు బిందుమంతుడు (బిందుమానుడు) జన్మించెను. 16








టీ:- యదితి. యస్య భగవతః ప్రీణనాత్. దేవాదీనాం ద్వంద్వైక్యం తత్ సద్యః ప్రీయేత ప్రీతిం గచ్ఛేత్. స విశ్వజీవః సర్వాంతర్యామీ స్వయం ప్రీతిరూప ఏవ బర్హిషి యజ్ఞే గయస్య హ స్ఫుటం. ప్రీతిమగాత్ తృప్తోऽస్మీతి ప్రత్యక్షం ప్రీతిమావిష్కృతవానిత్యర్థః. (14-16)

చూ॥ తస్మాత్సరఘాయాం మధుర్నామాభవత్ మధోస్సుమనసి వీరవ్రతః. 17

ఆ బిందుమానునకు సరఘయందు మధువు అనువాడు కలిగెను. మధువునకు సుమనసియందు వీరవ్రతుడు జన్మించెను. 17

చూ॥ తతో భోజాయాం మన్యుప్రమన్యూ జజ్ఞాతే - మన్యోస్సత్యాయాం భువనః. 18

వీరవ్రతునకు భోజఅనునామెయందు మన్యు, ప్రమన్యులు జన్మించిరి. మన్యునకు సత్యయందు భువనుడు జన్మించెను. 18

చూ॥ తతోదోషాయాం త్వష్టాజనిష్ట-త్వష్టుర్విరోచనాయాం విరజః. 19

భువనునకు దోషయందు త్వష్ట. త్వష్టకు విరోచనయందు విరజుడు కల్గిరి. 19

చూ॥ తస్య శతజిత్ప్రవరం పుత్రశతం కన్యా చ విషూచ్యాం కిల జాతమ్. 20

ఆ విరజునకు విషూచియందు శతజిత్ మొదలగు వందమంది పుత్రులు ఒక కన్య జన్మించిరి. 20

టీ:- తస్మాదితి. సుమనసి స్త్రియాం. (17-20)










చూ॥ తత్రాయంశ్లోకః-ప్రైయవ్రతం వంశమిమం విరజశ్చరమోద్భవః
అకరోదత్యలం కీర్త్యా విష్ణుస్సురగణం యథా ॥ 21

టీ:- ప్రైయవ్రతమితి. కీర్త్యాఅ తిశయేన అలమకరోత్ భూషితవాన్. 21

ఈ విరజుని కీర్తి ఇలా ప్రసిద్ధి చెందియున్నది. విష్ణుమూర్తి దేవతాగణమునకు శోభచేకూర్చినటుల ప్రియవ్రతుని వంశమున చివరిగా జన్మించిన విరజుడు ప్రియవ్రతుని వంశమును అసమాన యశస్సుతో అలంకరించెను. 21

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, పంచదశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పదిహేనవ అధ్యాయము సమాప్తము.**








## షోడశోऽధ్యాయః

శ్లో॥ పూర్వోక్త ద్వీపసింధ్వాదిమాన చిహ్న స్వరూపతః ।
స్పష్టం ప్రవక్తుమారబ్ధా పంచాధ్యాయీ హ్యతః పరమ్ ॥

షోడశేऽధస్తథా చోర్ధ్వం పరితస్సన్నివేశితః ।
మేరోః స్థితిర్మహీకంజకర్ణికా చోపవర్ణ్యతే ॥

ప్రియవ్రత చరిత్రోక్తా సప్తద్వీపాది కల్పనా ।
తద్విశేష విజిజ్ఞాసుః కథాంతే పరిపృచ్ఛతి ॥

రాజో ఉవాచ

చూ॥ ఉక్తస్త్వయా భూమండలాయామవిశేషో యావదాదిత్యస్తపతి యత్ర చాసౌ జ్యోతిషాం గణైశ్చంద్రమావా సహ దృశ్యతే తత్రాపి ప్రియవ్రత రథ చరణ పరిఘాతైస్సప్త సింధవ ఉపక్ల్ప్తాః. 1

టీ:- ఉక్త ఇతి. కిం పర్యంతముక్తస్తదాహ - యావదాదిత్యస్తపతి. యత్ర యత్ర చాసౌ శుక్ల కృష్ణ పక్షయోర్నక్షత్రగణైస్సహ చంద్రమా వా దృశ్యతే తావత్. 1

## 16వ అధ్యాయము

పూర్వము ప్రియవ్రత చరిత్రలో చెప్పబడిన ద్వీపసముద్రాదుల పరిమాణములు, చిహ్నములు, సర్వరూపములను స్పష్టముగా తెలుపుటకు ఈ 16 వ అధ్యాయము నుండి ఆరంభించి అయిదు అధ్యాయములతో చెప్పుచున్నాడు. ఈ పదునారవ అధ్యాయమున పైన చుట్టూ నివేశితమై యున్న మేరుపర్వతి స్థితి మహీ కంజ కర్ణికా (భూమియను పుష్పపు దుద్దు) వర్ణించబడినది. ప్రియవ్రత రాజు చరిత్రలో చెప్పబడిన ఏడు ద్వీపాదుల రచనలోని విశేషములను తెలిసికొనగోరి పరీక్షిత్తు ప్రశ్నిస్తున్నాడు.

**పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.**

ఓ శుకమహర్షీ! మీరు భూమండలముయొక్క విస్తార విశేషము, సూర్యాదుల ప్రకాశము ఎంతవరకు ఉండునో, ఎంతవరకు నక్షత్రములతోకూడిన చంద్రుడు కానబడునో తెలిపి, ప్రియవ్రతుని రథ చక్రముల ఒరిపిడితో ఏడుసముద్రములు రచించబడినవి (ఏర్పడినవి) అని తెలిపితిరి. 1


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








చూ॥ యత ఏతస్యాస్సప్తద్వీపవిశేష వికల్పస్త్వయా భగవన్ ఖలు సూచితః. 2

టీ:- యత ఇతి. యతః యేభ్యః సింధుభ్యః ఏతస్యాః భువః. సూచితః సంక్షేపతో దర్శితః. 2

ఓ భగవన్! మీరు ఈ ఏడు సముద్రముల వలన భూమి సప్తద్వీపములుగా అయినదని సంక్షిప్తముగా తెలిపితిరి. 2

చూ॥ ఏతదేవాఖిలమహం మానతో లక్షణతశ్చ సర్వం జిజ్ఞాసామి భగవతో గుణమయ ఏవ స్థూలరూప ఆవేశితం మనోహ్యగుణేऽపి సూక్ష్మతమ ఆత్మజ్యోతిషి పరే బ్రహ్మణి భగవతి వాసుదేవాఖ్యే సాక్షాత్సమావేశితం - తదుహైవైతద్గురోహ్యర్హస్యనువర్ణయితుమితి. 3

టీ:- జిజ్ఞాసాయాః ఫలమాహ - భగవత ఇతి. 3

మీరు తెలిపిన సమస్తమును పరిమాణముతో, లక్షణములతో కూడా తెలిసికొనగోరుతున్నాను. (ఈ తెలిసికొను కోరికకు ఫలమును తెలుపుచున్నాడు) ఎందుకనగా భగవంతుని గుణమయమగు స్థూల రూపమున లగ్నమయిన పిదప మనస్సు, నిర్గుణము సూక్ష్మాతిసూక్ష్మము, ఆత్మస్వరూపము, భగవంతుడగు వాసుదేవుడనబడు పరబ్రహ్మ యందు సాక్షాత్తుగా లగ్నమౌతుంది. అందువలన ఓ గురుశ్రేష్ఠా! ఈ విషయమును సవిస్తరముగా విశదపరచ ప్రార్థన. (సవివరముగా తెలుపుటకు నీవే తగియున్నావు). 3

**శ్రీశుక ఉవాచ**

చూ॥ న వై రాజన్మహాభగవతో మాయాగుణవిభూతేః స్థాన విశేషాణాం నామరూపతః కాష్ఠాం మనసా వచసా వాధిగంతుమలం విబుధా యుష్యేణాపి పురుషస్తస్మాత్ప్రాధాన్యేనైవ భూగోళవిశేషం నామరూప లక్షణతో వ్యాఖ్యాస్యామః. 4

**శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.**

ఓ పరీక్షిద్రాజా! దేవతలతో సమమగు ఆయుష్యముగల పురుషుడుకూడా భగవంతుని యొక్క మాయాగుణ విభూతులను మనస్సుతోగాని, వాక్కులతోగాని తెలిసికొనలేడు. భగవంతుని మాయాగుణ విభూతులు అంత గొప్పవి. అందువలన నేను భూలోక


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








టీ:- నేతి. యా మాయా గుణవిభూతిస్తస్యాః. కాష్ఠాం అంతం. రూపం సన్నివేశః. లక్షణం చిహ్నం. 4

చూ॥ యో వాయం ద్వీపః కువలయ కమలకోశాభ్యంతర కోశో నియుతయోజన విశాలస్సమవర్తులో యథా పుష్కరపత్రం – యస్మిన్నవ వర్షాణి నవ యోజన సహస్రాయామాన్యష్టభిర్మర్యాదాగిరిభిస్సు విభక్తాని భవంతి. 5

టీ:- య ఇతి. కువలయం భూమండలం. తదేవ కమలం. తస్య కోశాః సప్తద్వీపాః. తేష్వభ్యంతరకోశః. ప్రథమో జంబూద్వీపః. నియుతయోజన విశాలః లక్షయోజనవిస్తీర్ణః నవయోజన సహస్రం ఆయామో యేషాం. ఆయామోऽత్ర విస్తారః. ఏతచ్చేళావృత భద్రాశ్వ కేతుమూలవ్యతిరేకేణ ద్రష్టవ్యం. ఇళావృతస్య చతుస్త్రింశద్యోజన సహస్రాయామత్వాత్. తయోశ్చైకత్రింశద్యోజన సహస్రాయామత్వాత్. కేచిత్తు నీలనిషధయోః సంలగ్నాద్ర్యోః సమగ్ర ప్రదేశమంగీకృత్య తయోరపి మధ్యే సంకుచితత్వేన నవయోజనసహస్రాయామత్వం సంపాదయంతి. సన్నివేశశ్చ వాయునోక్తః. శ్లో. "ధనుర్వృత్సం స్థితే జ్ఞేయే ద్వే వర్షే దక్షిణోత్తరే, దీర్ఘాణితత్ర చత్వారి చతురశ్రమిళావృతమి"తి. 5

విషయములను నామ, రూప, పరిమాణ, చిహ్నములలో ముఖ్యమైన వాటిని మాత్రమే తెలిపెదను. 4

ఈ జంబూద్వీపము భూమండలమనెడు పద్మమునకు కోశస్థానీయములగు సప్తద్వీపముల మధ్యలో నుండి లక్షయోజనముల విస్తీర్ణము కలిగి తామరాకువలె వర్తులాకారములోనున్నది. ఈ జంబూద్వీపమున తొమ్మిది వర్షములు (భాగములు) తొమ్మిదేసివేల యోజన విస్తారము కలిగి, ఎనిమిది పర్వతములచే హద్దులుగా విభాగము చేయబడుచున్నవి. ఈ తొమ్మిదివేల యోజన విస్తారము ఇళావృత, భద్రాశ్వకేతుమూలవర్షములు తప్ప మిగిలిన వర్షములలో చూడవలెను. ఎందుకనగా ఇళావృత వర్షము ముప్పదినాల్గువేల యోజనముల చొప్పున విస్తీర్ణము కల్గియున్నది. భద్రాశ్వకేతుమూల వర్షములు. ఒక్కొక్క భాగము ముప్పదిఒక్కవేల యోజనముల చొప్పున విస్తీర్ణము కల్గియున్నవి. కొంతమంది నీలనిషధ పర్వతముల, సంలగ్న పర్వతముల సముద్ర ప్రదేశమును స్వీకరించి ఆ పర్వతముల మధ్య సంకుచితముగా నుండెడి విస్తీర్ణముతో తొమ్మిదివేల యోజనముల విస్తీర్ణత్వమును తెలుపుదురు. ఈ విషయమున వాయుపురాణములో "ధనుర్వృత్యంస్థితే జ్ఞేయేద్వేవర్షే దక్షిణోత్తరే దీర్ఘానితత్ర చత్వారి చతురశ్రమిళావృత అని చెప్పబడినది. 5











చూ॥ ఏషాం మధ్యే ఇళావృతం నామాభ్యంతరం వర్షం – యస్య నాభ్యామవస్థితస్సర్వతస్సౌవర్ణః కులగిరిరాజో మేరుః – ద్వీపాయామ సమున్నాహః కర్ణికాభూతః కువలయకమలస్య మూర్ధనిద్వా త్రింశత్సహస్రయోజన వితతో మూలే షోడశసహస్రయోజన వితత స్తావతాంతర్భూమ్యాం ప్రవిష్టః. 6

టీ:– ఏషామితి. నాభ్యాం మధ్యే. ద్వీపస్యాయామో లక్షయోజన ప్రమాణస్తావాన్ సమున్నాహః ఉచ్ఛ్రాయో యస్య. మూలే షోడశయోజన సహస్రవితతః. తావతా షోడశయోజన సహస్రమానేన. చతురశీతీ యోజన సహస్రమానేన చ. బహిర్దృశ్యతే. ఏవం లక్షయోజన సమున్నాహః. 6

ఈ ద్వీపముల మధ్యలో ఇళావృతమను అభ్యంతర వర్షము కలదు. ఈ ఇళావృత వర్షమునకు మధ్యన కులపర్వతములకు రాజగు బంగారుమయమగు మేరు పర్వతము జంబూద్వీప విస్తీర్ణముతో సమమగు లక్షయోజనముల ఎత్తు (నిడివి) కలిగి భూ వలయమనెడు పద్మమునకు కర్ణిక (దుద్దు) వలె ఉన్నది. ఈ మేరుపర్వత శిఖరము ముప్పదిరెండువేల యోజన వైశాల్యముతో, మూలమున (క్రింది భాగమున) పదహారు యోజనముల వైశాల్యము కలదై పదహారువేల యోజనములు భూమిలోనికి చొచ్చుకొనియున్నది. భూమిపైన ఎనుబది నాలుగువేల యోజనముల ఎత్తు కలిగియున్నది. ఈ విధముగా 16వేలు + 84 వేలు = మొత్తం లక్ష యోజనముల ఎత్తు (నిడివి). 6

చూ॥ ఉత్తరోత్తరేణేళావృతం నీలః శ్వేతః శృంగవానితి త్రయోరమ్య కహిరణ్మయ కురూణాం త్రయాణాం వర్షాణాం మర్యాదా గిరయః ప్రాగాయతాః – ఉభయతః క్షారోదావధయో ద్వి సహస్రం పృథవ ఏకై కశః పూర్వస్మాత్పూర్వస్మాదుత్తరోత్తరో దశాంశాదధి కాంశేన దైర్ఘ్య ఏవ హ్రసంతి. 7

టీ:– ఉత్తరోత్తరేణేతి. ఉత్తరోత్తరేణేళావృతం. ఇళావృతస్యోత్తరోత్తరతః

ఇళావృత వర్షమునకు ఉత్తరోత్తరముగా క్రమముగా నీలము, శ్వేతము, శృంగవంతమను మూడు పర్వతములు రమ్యక హిరణ్మయ కురు అను వర్షములకు సరిహద్దు పర్వతములు ప్రాక్, పశ్చిమ భాగముల వరకు వ్యాపించి, ప్రాక్, పశ్చిమ భాగములు లవణ సముద్రము అవధులుగా కలవై రెండువేల యోజనముల వెడల్పు కలిగి ఒక్కొక్కటి పూర్వపూర్వమునకంటే, ఉత్తరోత్తరము క్రమముగా దశాంశమునకంటే కొంచెము ఎక్కువయగు అంశము పొడవులో



క్రమేణ నీలాదయస్త్రయో మర్యాదాగిరయః. ప్రాగాయతాః. పూర్వతో దీర్ఘాః క్షారోద ఏవావధిర్యేషాం ద్వి సహస్ర యోజనవిస్తీర్ణాః. దశాంశాదిషదధికో యోऽంశస్తేన దైర్ఘ్య ఏవ హ్రసంతి. న తూచ్చత్వే పృథుత్వే వా. యథోక్తం విష్ణుపురాణే. శ్లో."లక్షప్రమాణౌ ద్వౌ మధ్యే దశహీన స్తథాపర" ఇతి. ఏతశ్చ స్థూలదృష్ట్యైవోక్తం తయోరపి యథావన్మధ్యసంస్థత్వాభావేన లక్షప్రమాణత్వాభావాత్. 7

తగ్గియున్నవి. ఎత్తులో, వెడల్పులో సమముగా యున్నవి. విష్ణు-పురాణమున లక్ష "ప్రామాణేద్వే మధ్యేదశహీనస్తథాపరః" అని చెప్పబడినది. ఈ విష్ణుపురాణోక్తి స్థూలదృష్టితో చెప్పబడినదే. ఏలనన ఆ రెండును మధ్యలోనుండడము అసంభవము. లక్షప్రమాణ మను-నదియు అసంభవము కావున స్థూలదృష్టితో చెప్పబడినదే అగును. 7

చూ॥ ఏవం దక్షిణేనేళావృతం నిషధో హేమకూటో హిమాలయ ఇతి ప్రాగాయతాః - యథానీలాదయోऽయుతయోజనోత్సేధా హరివర్ష కింపురుష వర్ష భారతవర్షాణాం యథాసంఖ్యం. 8

టీ:- ఏవమితి. అయుతయోజన ఉత్సేధ ఉచ్ఛ్రాయో యేషాం. అయం చోత్సేధో నీలాదీనామపి ద్రష్టవ్యః. నీలాదిపృథుత్వం చైషామపి ద్రష్టవ్యం. యథాసంఖ్యం మర్యాదాగిరయ ఇతి శేషః. 8

ఇదే విధముగా ఇళావృతమునకు దక్షిణమున ఒకదానితర్వాత మరొకటి నిషధము, హేమకూటము, హిమాలయములను పర్వతములు ప్రాగాయతములై (తూర్పు పడమరల పొడుగు కలవై) నీలాది పర్వతము వలె పదివేల యోజనముల ఎత్తు కలిగి క్రమముగా హరివర్ష, కింపురుష, భరతవర్షములకు హద్దులై యున్నవి. ఈ పదివేల యోజముల ఎత్తు నీలాది పర్వతములకు విచారింపవలయును. నీలాది పర్వతముల వైశాల్యము నిషధాది పర్వతములకు విచారించవలయును. (ఇవి పరస్పరము కొలతల విషయములో సంబంధములైనవి) 8

చూ॥ తథైవేళావృతమపరేణ పూర్వేణ చ మాల్యవద్గంధమాదనా వానీల నిషధాయతౌ ద్వి సహస్ర పృథూ కేతుమాల భద్రాశ్వయోస్సీమానం విదధాతే. 9

అదే విధమున ఇళావృతమునకు తూర్పు పడమర దిక్కులలో ఉత్తరమున నీల పర్వతమునుండి దక్షిణములోని నిషధ పర్వతము వరకు వ్యాపించి గంధమాదనము, మాల్యవంతము అను పర్వతములు రెండు గలవు. వీటి వెడల్పు రెండేసి యోజనములు. ఈ రెండు

టీ:- తథైవేతి. ఆనీలానిషయధాయతౌ ఉత్తరతో నీలపర్యంతం దక్షిణతో నిషధపర్యంతం చ దీర్ఘౌ. పృథూ విస్తీర్ణౌ భవతః. తావేవ కేతుమాల భద్రాశ్వయోర్వర్షయోః, సీమానం కుర్వాతే. నన్వేవం సతి. పూర్వాపర రేఖాయామిళావృత వేష్టితో మేరుర్మధ్యే. తతః పూర్వాపరతో గిరిద్వయం వర్షద్వయం చ. నాతః కించిదస్తి. దక్షిణోత్తరరేఖాయాం తు, తథైవేళావృతవేష్టితో మేరుః ఉభయత స్త్రీణి త్రీణి వర్షాణి. గిరయశ్చ షట్. తత్కంథం సర్వతో లక్షయోజన ప్రమాణత్వం జంబూద్వీపస్య? ఉచ్యతే – మేరోః షోడశసహస్రాణి సర్వతః స్థితత్వాదిళావృతస్యాష్టాదశ. అన్యేషాం షణ్ణాం చతుః పంచాశత్. గిరీణాం ద్వాదశేత్యేనం దక్షిణోత్తరరేఖాయాం తావల్లక్షం పూర్వాపరరేఖాయామపి సమేరోరిళా వృతస్య చతుస్త్రింశత్. గిర్యోః చత్వారి సహస్రాణి. ద్విషష్టి సహస్రాణి. పూర్వాపరవర్షయోరాసముద్రం దైర్ఘ్యేణ ద్రష్టవ్యాని. అతో న విరోధః9

పర్వతములు భద్రాశ్వ, కేతుమాల అను రెండు వర్షములకు హద్దులను కావించుచున్నవి. జంబూద్వీపమున ఈ విధముగా ప్రాక్పశ్చిమరేఖలో ఇళావృతములో పరివేష్టితమగు మేరు పర్వతము మధ్యన తూర్పున ఒక పర్వతము, ఒక వర్షము పశ్చిమమున ఒక పర్వతము, ఒక వర్షములు కలవు. ఇంతకంటే వేరేదియు లేదు. దక్షిణోత్తరరేఖలో మధ్యన ఇళావృత పరివేష్టిత మేరుగిరి దక్షిణమున మూడు పర్వతములు, మూడు వర్షములు, ఉత్తరమున మూడు పర్వతములు, మూడు వర్షములు ఉన్నవి. మరి అటులైన జంబూద్వీపమునకు లక్ష యోజన విస్తీర్ణత్వ మెటుల కలుగును? చెప్పబడుచున్నది. దక్షిణోత్తర రేఖ మధ్యలో నుండెడి మేరువు విస్తీర్ణము 16 వేల యోజనములు. ఇళావృతవర్ష వైశాల్యము 18వేల యోజనములు. దక్షిణోత్తరములలోని ఆరు వర్షముల విస్తీర్ణము 6X9=54 యోజనములు, ఆరు పర్వతముల విస్తీర్ణము 6X2=12 వేలయోజనములు. ఈ విధముగా మొత్తము 16వేలు+18వేలు+54వేలు+12వేలు=100000 విస్తీర్ణము (లక్ష యోజనములు)ప్రాక్పశ్చిమరేఖలో మేరువు పదహారువేల యోజనములు ఇళావృతము 18 వేల యోజనములు రెండు పర్వతములు 4 వేల యోజనములు ఆసముద్రము వరకు వ్యాపించిన పూర్వాపర కేతుమాల భద్రాశ్వ వర్షములు దైర్ఘ్యములో (పొడవు) 31+31=62 వేల యోజనములు కలిసి మొత్తము 16+18+4+62=100000






యోజనములు. విధముగా జంబూద్వీప విస్తీర్ణము లక్ష యోజనములు. ఈ విషయమున విరోధ మేమియులేదు. 9

చూ॥ మందరో మేరుమందరః సుపార్శ్వః కుముద ఇత్యయుత యోజన విస్తారోన్నాహా మేరోశ్చతుర్దిశమవష్టంభ గిరయ ఉపక్ల్ప్తాః. 10

టీ:- మందర ఇతి. అయుత యోజన ప్రమాణౌ విస్తారోన్నాహౌ యేషాం. విస్తీర్ణ మూర్ధ్వో మేరోరవష్టంభత్వాత్. పూర్వపశ్చిమౌగిరీ. దక్షిణోత్తరవిస్తారౌ దక్షిణోత్తరౌ చ. పూర్వాపరవిస్తారౌ ద్రష్టవ్యౌ. సర్వతో దశయోజన సహస్ర విస్తారాంగీకారే త్విళావృతలోపాత్. పూర్వేణే ళావృతముప్లావయతీత్యాదివిరోధస్స్యాత్. 10

మేరుపర్వతమునకు నాలుగు దిక్కులలో మందరము, మేరుమందరము, సుపార్శ్వము, కుముదము అను నాలుగు పర్వతములు పదివేల యోజనముల చొప్పున ఎత్తు వైశాల్యము కలిగి క్రమముగా ప్రాగాది దిశలలో ఉన్నవి. మధ్యలో ఎత్తుగానున్న మేరుపర్వతమను మధ్యస్తంభమునకు నాలుగు దిక్కులలో నాలుగు చిన్న స్తంభములుగా కల్పించబడి యున్నవి. ప్రాక్పశ్చిమ పర్వతములు దక్షిణోత్తర దిశలలో విస్తారము కలవై దక్షిణోత్తర పర్వతములు ప్రాక్పశ్చిమములలో విస్తారము కలవై ఉన్నవని అనుకోవలయును. అలాకాకుండా ఒకవేళ అన్నివైపులలోను పదివేల యోజనముల విస్తారము కలవని అంగీకరించిన ఎడల ఇళావృతము లేకుండా పోవును. దానితో పూర్వేనేళావృతమును ప్లావయతీ అని మొదలుగాగల వాక్యమునకు విరోధమేర్పడును. 10

చూ॥ చతుర్ష్వపి తేషు చూత జంబూ కదంబన్యగ్రోధాశ్చత్వారః పాదప ప్రవరాః పర్వతకేతవ ఇవాధిక శత సహస్ర యోజనోన్నాహాస్తావ ద్విటపవితతయః. 11

ఈ నాలుగు పర్వతములపైన ధ్వజములవలె, పదకొండువందల యోజనముల ఎత్తు కలిగిన కొమ్మల సమూహములు గల మామాడి, నేరేడు, కదంబ, మఱ్ఱి అను వృక్షరాజములు కలవు. 11










టీ:- చతుర్ష్వితి. అధికశతసహస్రమేకాదశశతాని ఉన్నాహో యేషాం. తావత్ప్రమాణా విటపవితతిర్యేషాం. 11

చూ॥ శతయోజన పరీణాహాః హ్రదాశ్చత్వారః పయోమద్వీక్షు రస మృష్టజలాః యదుపస్పర్శిన ఉపదేవగణా యోగైశ్వర్యాణి స్వాభావికాని భరతర్షభ ధారయంతి. 12

టీ:- శతయోజనేతి. శతయోజనం పరీణాహో విస్తారో యేషాం. యదుపస్పర్శినః. యత్సేవినః. 12

చూ॥ దేవోద్యానాని భవంతి చత్వారి నందనం చైత్రరథం – వైభ్రాజికం – విశ్వతోభద్రమితి – యేష్వ మరపరిబృఢాః సహ సుర లలనా లలామ యూథపతయః – ఉపదేవగణైరుపగీయమానమహిమానః కిల విహరంతి. 13

టీ:- దేవోద్యానానీతి. దేవోద్యానాని చ స్పష్టం. లలామో భూషణం. సురలలనాం భూషణ భూతాః శ్రేష్ఠాః యాః స్త్రియః తాసాం యూథస్య పతయః సహ సంభూయ యేషు విహరంతి. 13

ఓ భరతశ్రేష్ఠా! ఈ పర్వతములపై వందేసి యోజనముల వైశాల్యము కలిగిన నాలుగు సరస్సులు క్రమముగా పాలు, తేనె, చెఱకు రసము, మంచినీళ్ళతో నిండియున్నవి. వీటిని సేవించెడి యక్ష కిన్నరాది ఉపదేవతల సమూహము సహజముగా యోగసిద్ధుల నొందుదురు. 12

ఈ పర్వతములపైన నందనం, చైత్రరథం, వైభ్రాజసం, విశ్వతో భద్రములను నాలుగు దేవోద్యానములు కలవు. ఈ ఉద్యాన వనములలో దేవతాస్త్రీలకు, చక్కగా అలంకరించుకొన్న శ్రేష్ఠులగు స్త్రీలకు నాయకులైన దేవతా శ్రేష్ఠులు విహరించుచుందురు. అచట గంధర్వాది ఉపదేవతా సమూహములు ఆ దేవతా శ్రేష్ఠుల మహిమలను గానము చేయుచుందురు. 13








చూ॥ మందరోత్సంగ ఏకాదశ శతయోజనోత్తుంగ దేవచూత శిరసోగిరి శిఖర స్థూలాని ఫలాన్యమృతకల్పాని పతంతి. 14

టీ:- మందరేతి. ఏకాదశ శతయోజన ముత్తుంగో యో దేవచూతః తస్య శిరసః సకాశాత్. ఫలప్రమాణముక్తం వాయుపురాణే. శ్లో. "అరత్నీనాం శతాన్యష్టావేకషష్ట్యధికాని చ, ఫలప్రమాణమాఖ్యాత మృషిభిస్తత్త్వదర్శిభిరి" తి. 14

మందర పర్వతముపై పదకొండు వందల యోజనముల ఎత్తుగల మామిడి చెట్టునుండి పర్వత శిఖరములంతటి పెద్దపెద్ద, అమృత తుల్యములగు పండ్లు పడగలవు. ఈ ఫలముల ప్రమాణము వాయు పురాణమున చెప్పబడినది. ఒక్కొక్క పండు ఎనిమిది వందల అరువది ఒక్క మూరల ప్రమాణము కలిగియుండునని తత్వదర్శులగు మునులు చెప్పిరి అని ...14

చూ॥ తేషాం విశీర్యమాణానామతి మధుర సురభి గంధి బహుళారుణ రసో దేవారుణోదా నామ నదీ మందర గిరివర శిఖరాన్ని పతంతీ - పూర్వేణేళావృతముపప్లావయతి - యదుపజోషణాద్భవాన్యా అనుచరీణాం పుణ్యజనవధూనామవయవస్పర్ప సుగంధహరో వాతో దశయోజనం సమంతాదనువాసయతి. 15

టీ:- తేషామితి. అతిమధురశ్చాసౌ స్వతస్సురభిశ్చ సుగంధిశ్చ. న చాన్యేషాం గంధైరనువాసితః. బహుళశ్చారుణశ్చ యో రసః స ఏవ ఉదముదకం. తేన. యదుపజోషణాత్ యస్య రసస్య సేచనాత్. 15

ఆ ఫలములు పగిలి వాటిలోనుండి మిక్కిలి మధురమైన, సహజంగానే మంచి సువాసనగల, మిక్కిలి ఎఱ్ఱని వర్ణముగల రసము స్రవించును. ఆ రసమే 'అరుణోదా' అను పేరుగల నదియై మందర పర్వతశిఖరము నుండి జారి ఇళావృత వర్షపు పూర్వభాగమున ప్రవహించుచున్నది. ఆ నదీ జలముతో తడిసిన పార్వతీదేవి అనుచరులగు పుణ్యస్త్రీలను స్పర్శించి సుగంధభరితముగా మారిన వాయువు చుట్టూ పదియోజనముల పర్యంతము సువాసనభరిత మొనరించును. (15)









చూ॥ ఏవం జంబూఫలానామత్యుచ్చ నిహత విశీర్ణానామనస్థి ప్రాయాణామిభకాయ నిభానాం రసేన జంబూనదీ మేరు మందర శిఖరాదయుత యోజనాదవనీతలే నిపతతి. 16

టీ:- ఏవమితి. అనస్థిప్రాయాణాం అతిసూక్ష్మబీజానాం యత్ర నిపతతి. 16

చూ॥ దక్షిణేనాత్మానాం యావదిళావృతముపస్యందయతి - తావదుభయోరపి రోధసోర్యా మృత్తికాతద్రసేనానువిధ్యమానా చవాయ్వర్క సంయోగ విపాకేన సదామరలోకాభరణం జాంబూనదం నామ సువర్ణం భవతి - యదుహ వావ విబుధాదయస్సహ యువతి భిర్మకుట కటక కటిసూత్రాద్యాభరణ రూపేణ ఖలు ధారయంతి. 17

టీ:- దక్షిణేనేతి. తత ఆరభ్యాత్మనో దక్షిణతః సర్వ మిళావృతం వ్యాప వహతీత్యర్థః. తావత్సర్వతః రోధసోస్తటయోః. 17

చూ॥ యస్తు మహాకదంబస్సుపార్శ్వ నిరూఢస్తస్య కోటరేభ్యో వినిస్సృతాః పంచాయామపరీణాహాః పంచ మధుధారాః - సుపార్శ్వ శిఖరాత్పతంత్యోపరేణాత్మా నమిళావృతమనుమోదయంతి. యా హ్యుపయుంజానానాం ముఖనిర్వాసితో వాయుస్సమంతాచ్ఛత యోజనమనువాసయతి. 18

ఇదే విధముగా అతి సూక్ష్మములగు బీజములు కలిగి ఏనుగులంత పరిమాణముగల నేరేడు పళ్ళు మిక్కిలి ఎత్తునుండి పడడముచేత పగులగా వాటిలో నుండి స్రవించు రసముతో కూడిన జంబూనది పదివేల యోజనముల ఎత్తుగాగల మేరుమందర పర్వతము నుండి భూమిపై పడి ప్రవహించును. 16

ఈ విధముగా ఆ జంబూనది తనకు దక్షిణముగా ఇళావృత ద్వీపమున ప్రవహించుచున్నది. ఆ జంబూనది యొక్క రెండు పక్కల ఒడ్డులలోని మట్టి ఆ నీటితో (రసముతో) తడిసి గాలి, సూర్యకిరణ సంయోగముతో పక్వమై (ఎండినదై) స్వర్లోకమునకాభరణమగు జంబూనదమను బంగారమగుచున్నది. ఈ జంబూనదముతో (ఆ బంగారముతో) దేవతాదులు తమ యువతులతోసహా కిరీటము, కంకణము, వడ్డాణములు మొదలుగు ఆభరణములను చేసుకొని ధరించెదరు. 17

సుపార్శ్వ పర్వతమున ఉన్న గొప్పనైన కదంబ వృక్షము కలదు. ఆ కడిమిచెట్టు కోటరములనుండి (చెట్టుమాను రంధ్రములనుండి) అయిదు బారల వెడల్పుతో ఐదు మధుధారలు బయలు వెడలి సుపార్శ్వ శిఖరము నుండి క్రిందికి పడుచూ, ఇళావృతపరిసర పశ్చిమ ప్రాంతమును సువాసిత మొనరించుచున్నవి. ఈ మధువును పానము







టీ:- య ఇతి. ఆయామోऽత్రవ్యామః. స చ. శ్లో."వ్యామో బాహ్వోస్సకరయోస్తతయోస్తిర్యగంతరమి" త్యుక్త లక్షణః. పంచవ్యామాః. పరీణాహః స్థౌల్యం యాసామిత్యర్థః. కేచిత్తు పంచవ్యామపరీణాహా ఇత్యేవం పఠంతి. 18

చూ॥ ఏవం కుముద నిరూఢో యశ్శతవల్శోనామ వటస్తస్య స్కంధేభ్యో నీచీనాః పయోదధిఘృత మధు గుడాన్నాద్యంబర శయ్యాసనాభరణా దయస్సర్వఏవ కామదుఘా నదాః – కుముదాగ్రాత్పతంతస్తముత్తరేణేళా వృత ముపభాజయంతి. 19

టీ:- ఏవమితి. నీచీనా అధోముఖాః. 19

చూ॥ యానుపజోషమాణానాం కదాచిదపి ప్రజానాం వళిపలితక్లమ స్వేద దౌర్గంధ్య జరా మరణామయాపమృత్యు శీతోష్ణ వైవర్ణ్యోపసర్గా దయస్తాప విశేషా న భవతి – యావజ్జీవం సుఖం నిరతిశయమేవ కురంగ కురరకుసుంభవైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖ వైడూర్య చారువిహంగర్షభ నాగ కాలాంజన నారదాదయో మేరోః కర్ణికాయా ఇవ కేసర భూతాః మూలదేశే పరిత ఉపక్లృప్తాః – జఠరదేవకూటామేరుంపూర్వేణాష్టాదశ యోజన సహస్రము

చేసిన వారి ముఖములనుండి వెలువడు వాయువు చుట్టూ నూరు యోజనముల వరకు సువాసనభరితమొనరించును. ఆయమమనగా వ్యాయము. శ్లో. "వ్యాయోబాహ్వోస్సకరయోస్తయోస్తిర్యగంతరం" అని వ్యాయ లక్షణము చెప్పబడినది. అనగా బార అని అర్థము. 18

ఇదే విధముగా కుముద పర్వతముపైనున్న శతవల్కమను పేరు గల చెట్టుయొక్క స్కంధములనుండి (ఊడలనుండి) పాలు, పెరుగు, నేయి, తేనె, గుడము (బెల్లము), అన్నము, వస్త్రము, శయ్య, ఆసన, ఆభరణాది వాంఛితములనొసగెడి అనేకములగు నదులు అధోముఖములై ప్రవహిస్తూ ఇళావృతవర్షోత్తర భాగవమున ప్రవహించుచున్నవి. 19

ఈ నదుల నీటిని సేవించెడు ప్రజలకు ఎప్పుడు కూడా చర్మము ముడుతలు పడడము, వెంట్రుకలు తెల్లబడడము, అలసట కల్గడము, చెమట పట్టడము, దుర్వాసన రావడము, ముసలితనము, వ్యాధులు, మృత్యువు, శీతము, వేడిమి, శరీరము కాంతివిహీనమవడము, అవయవములు శిథిలవములవడము మున్నగు తాపములేవియు కల్గవు. యావజ్జీవము నిరతిశయ సుఖము కల్గును. కమల కర్ణికకు చుట్టు ఉండెడి కేసరములవలె మేరుపర్వతమునకు మూలప్రాంతమున కురంగ కురర, కుసుంభ, వైకంకత, త్రికూట, శిశిర, పతంగ, రుచక, నిశిధ,





దగాయతౌ ద్విసహస్రముదగాయతౌ ద్విసహస్రపృథూత్తుంగౌ భవతః – ఏవమపరేణ పవన పారియాత్రౌ దక్షిణేన కైలాసకరవీరౌ ప్రాగాయతౌ ఏవముత్తరత స్త్రిశృంగమకరావిత్యష్టభిరేతైః – పరిశ్రితోఽగ్నిరివ పరితశ్చకాస్తి కాంచనగిరిః. 20

టీ:– యానితి. చతుర్దిక్షు మేరుమూలాద్యోజన సహస్రం త్యక్త్వా అగ్నేః పరితః పరిధయ ఇవ జఠరదేవకూటాదయస్తిష్ఠంతి అతోఽష్టాదశ యోజన సహస్రం ప్రమాణం. అత్రోక్తం వైష్ణవాది పురాణేషు పరిమాణాది. యత్పునరన్యథా వర్ణితం. తత్తు కల్పభేదాద్యపేక్షయా. ద్విసహస్రం పృథూ చ తుంగౌ చ. 20

శితివాస, కపిల, శంఖ, వైఢూర్యచారు విహంగ ఋషభనాగ, కాలాంజన నారదము మున్నగు పర్వతములు చతుర్దిశలలో ఉన్నవి. మేరు పర్వత మూలమున వేయి యోజనముల స్థలము వదిలి (అనగా మేరుపర్వతమునకు చుట్టూరా వేయి యోజనముల దూరములో) అగ్నికి నాలుగు దిశలలో పరిధులవలె తూర్పుదిక్కున జఠర, దేవకూట పర్వతములు, పశ్చిమమున పవన పారియాత్రములను రెండు పర్వతములు, దక్షిణోత్తరములలో పద్దెనిమిదివేల యోజనముల పొడవు తూర్పుపడమరలలో రెండువేల యోజనముల వెడల్పు కలిగి రెండువేల యోజనముల ఎత్తుగల్గి యున్నవి. మేరువునకు దక్షిణమున కైలాస కరవీరములను రెండు పర్వతములు ఉత్తరమున త్రిశృంగ మకరములను రెండు పర్వతములు, తూర్పుపడమరలలో 18వేల యోజనముల పొడవు ఉత్తరదక్షిణములలో రెండువేల యోజనముల వెడల్పుకల్గి రెండువేల యోజనముల ఎత్తుతో మొత్తము ఎనిమిది పర్వతములు నాలుగు దిశలలో ఉన్నవి. నాలుగు దిశలలో ఎనిమిది పర్వతములు కలిగి మేరుపర్వతము అగ్నివలె ప్రకాశించుచున్నది. ఈ విధముగా మేరుపర్వతమునకు 18వేల యోజనముల విస్తీర్ణము తెలుపబడినది. విష్ణుపురాణాదులలో వైశాల్యము వేరు విధముగా వర్ణించబడినది. కల్పభేదము వలన వేరు విధముగా వర్ణించబడినది అని భావము. 20








చూ॥ మేరౌ మూర్ధ్ని భగవత ఆత్మయోనేర్మధ్యత ఉపక్ల్ప్తాం పురీమయుత యోజన సాహస్రీం సమచతురశ్రాంశాతకౌంభీం వదంతి తామనుపరితోऽష్ట లోకపాలానాం యథా దిశం యథారూపం తురీయమానేన పురోऽష్టావుపక్ల్ప్తాః. 21

టీ:- మేరావితి. యథాదిశం ప్రాచ్యాదిదిక్షు. యథా రూపం ఇంద్రాది వర్ణానతిక్రమేణ. తురీయమానేన సార్ధద్విసహస్ర ప్రమాణేన. నామాని పురాణాంతరాత్. జ్ఞాతవ్యాని. యథోక్తం. శ్లో. "మేరౌ నవ పురాణి స్యుర్మనోవత్యమరావతీ, తేజోవతీ సంయమనీ తథా కృష్ణాంగనా పరా, శ్రద్ధావతీ గంధవతీ తథా చాన్యా మహోదయా, యశోవతీ చ బ్రహ్మేంద్రవహ్న్యాదీనాం యథాక్రమమి"తి. 21

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, షోడశోऽధ్యాయః

మేరుశిఖరముపైన మధ్యన పదివేల యోజనముల పొడవు, అంతియే వెడల్పుగల సమ చతురస్రముగా భగవంతుడగు బ్రహ్మదేవుని శాతకౌంబ అను నగరము కల్పించబడినది. ఆ శాతకౌంభీ నగరమును అనుసరించి చుట్టురా ప్రాచ్యాది దిక్కులలో యథా క్రమముగా నాలుగవ భాగము వైశాల్యముతో అనగా రెండువేల ఐదువందల యోజనముల పొడవు, వెడల్పుగల అష్టదిక్పాలకుల ఎనిమిది నగరములు కల్పించబడినవి. ఆ పురముల నామములు వేరే పురాణములలో తెలుపబడినవి. శ్లో. "మేరౌ నవ పురాణి స్యుర్మనోవత్యమరాతేతీ, తేజోవతీ సంయమనీ తథా కృష్ణాంగనా పరా, శ్రద్ధావతీ గంధవతీ తథా చాణ్యా మహోదయా, యశోవతీ చ బ్రహ్మేంద్రవహ్న్యాదీనాం యథాక్రమమితి". మేరు పర్వతమున మనోవతీ, అమరావతీ, తేజోవతీ, సంయమినీ, కృష్ణాంగనా, శ్రద్ధావతీ, గంధవతీ, మహోదయా, యశోవతీ అను తొమ్మిది నగరములు. బ్రహ్మ, ఇంద్రాది అష్టదిక్పాలకుల పురములు కలవు. పై శ్లోకమున బ్రహ్మపురము మనోవతీ అను పేరుతో కానబడుచున్నది. భాగవతమున శాతకౌంబ అని చెప్పబడినది. 21

శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పదహారవ అధ్యాయము సమాప్తము.










## సప్తదశోऽధ్యాయః

శ్లో॥ తతస్సప్తదశే గంగాగమనం తచ్చతుర్దిశమ్ ।
ఇళావృతే చ రుద్రేణ సంరక్షణ నిషేవణమ్ ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ తత్ర హ భగవతస్సాక్షాద్యజ్ఞలింగస్య విష్ణోర్విక్రమతో వామ పాదాంగుష్ఠ నఖ నిర్భిన్నోర్ధ్వాండకటాహ వివరేణాంతః ప్రవిష్టా యా బాహ్యా జలధారా తచ్చరణ పంకజావనేజనారుణ కింజల్కా కుంకుమో పరంజితాఖిల జగదఖిల మలాపహోపస్పర్శనామలా సాక్షాద్భగవత్పదీత్య నుపలక్షిత వచోऽభిధీయమానాతి మహతా కాలేన యుగసహస్రోప లక్షణేన దివోమూర్ధన్యవతతార. 1

టీ:- తత్రేతి. యజ్ఞలింగస్య బలేః యజ్ఞే లింగం త్రివిక్రమమూర్తిర్యస్య విక్రమతః. దక్షిణేన పదాభువం క్రాంత్వా వామపదముత్ క్షిపతః వామపదాంగుష్ఠ నఖేన నిర్భిన్న మూర్ధ్వముపరిభాగో యస్యాండ కటాహస్య తస్య వివరేణాంతః ప్రవిష్టా యా బాహ్యాజలధారా సా దివో మూర్ధన్యవతతారేత్యన్వయః. తస్య యచ్చరణపంకజం తస్యావనేజనేన క్షాళనేన అరుణం తద్గతం కుంకుమం తదేవ కింజల్కాః. తైరుపరంజితా

## 17వ అధ్యాయము

ఈ పదిహేడవ అధ్యాయమున గంగానది ఉద్భవము అది ఇళావృతములో నాలుగు దిశలలో ప్రవహించడము. శంకరుడు విష్ణువును సేవించడము వర్ణించబడుచున్నది.

### శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

బలిచక్రవర్తి యజ్ఞమున సాక్షాద్యజ్ఞమూర్తియగు విష్ణువు వామనుడై, త్రివిక్రముడై తన పాదములతో బ్రహ్మాండమును కొలచుచు కుడిపాదముతో భూమి నాక్రమించి మిగిలిన రెండు పాదములతో కొలచుటకై ఎడమ పాదమునెత్తునపుడు ఎడమపాదము బొటనవేలు నఖముతో బ్రహ్మాండ కటాహముపైభాగము భిన్నమై ఆ రంధ్రమునుండి స్రవించి బయటకు వచ్చిన జలధార ఆ వామనుని చరణకమలములను కడుగగా, ఆ పాదముల కుంకుమ అంటి, ఎఱ్ఱనిదై, తన స్పర్శతో సమస్త జగముల మాలిన్యమునము తొలిగించియు తాను అమలినమై సాక్షాత్తు గా “భగవత్పదీ“ అని పిలవబడుచూ, వేలయుగముల (గొప్ప) కాలము గడచిన పిదప స్వర్గలోకపు శిరోభాగమున అవతరించెను. ఆ సమయ మున ఆ జలధారకు భగవత్పదీ అను పేరుమాత్రమే ఉండి తరువాత జాహ్నవి, భాగీరథీ, ఇత్యాది నామములు కలిగినవని భావము. 1






 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

అతఏవాఖిలస్య జగతః. అఖిలమలాపహముపస్పర్శనం యస్యాః. తథాప్యమలా తన్మల సంగశూన్యా సాక్షాద్భగవత్పదీతి యదనుపలక్షితం జాహ్నవీ భాగీరథీత్యాద్యుపలక్షణాంతరరహితం వచోనామ తేనాభి ధీయమానా. తస్మిన్ సమయే భగవత్పదీతి నామ పశ్చాన్నామాంతరాణి జాతానీతి భావః. 1

చూ॥ యత్తద్విష్ణు పదమాహుః. 2

టీ:- కోఽసౌ దివో మూర్ధా? తమాహ - యదితి. 2

చూ॥ యత్ర హ వా వీరవ్రత ఔత్తానపాదిః పరమభాగవతోఽస్మత్కుల దేవతాచరణారవిందోదకమితి యామనుసవనం వర్ధమాన భగవద్భక్తి యోగేన దృఢం విక్లిద్యమానాంతర్హృదయ ఔత్కంఠ్య వివశామీలిత లోచన యుగళ కుట్మల విగళితామల బాష్పకళయాభి వ్యజ్యమాన రోమ పులక కులకోఽధునాపి పరమాదరేణ శిరసా బిభర్తి. 3

టీ:- కిం తద్విష్ణుపదం? తదాహ - యత్రేతి. వీరవ్రతః దృఢసంకల్పః అస్మత్కులదేవతాయాః శ్రీహరేః చరణారవిందోదకమితి హేతోః పరమాదరేణ బిభర్తీత్యన్వయః. కథంభూతస్సన్? ప్రతిక్షణం వర్ధమానేన

స్వర్గలోక శిరోభాగమేదో తెలుపుచున్నాడు. ఆ గంగ అవతరించిన స్వర్లోక శిరోభాగమును విష్ణుపథమని యందురు. 2

దృఢ సంకల్పుడగు ఉత్తానపాదుని పుత్రుడు, పరభాగవతోత్తము -డగు ధ్రువుడు తమ కులదేవతయగు విష్ణుచరణ కమలోదకమని ఆ జలమును ప్రతిక్షణము ఉప్పొంగే భక్తిభావముతో, ప్రేమావేశముతో మిక్కిలి గద్గదమగు అంతర్హృదయముతో ఉత్కంఠతతో వివశుడై మూయబడిన నేత్రములనెడు మొగ్గలనుండి రాలెడు ఆనంద బాష్పములతో అభివ్యక్తములగు పులకాంకురములతో ఇప్పటికిని ఆదరమున తలపై ధరించుచున్నాడు. 3





భగవద్భక్తియోగేన దృఢమత్యంతం క్లిద్యమానమంతర్హృదయం యస్య అతఏవ ఔత్కంఠ్యేన వివశమామీలితం యల్లోచనయుగళం తదేవ కుట్మలే తాభ్యాం విగళితమమలం బాష్పం తస్య కళయా సహ అభివ్యజ్యమానం రోమపులకానాం కులం యస్య. 3

చూ॥ తతస్సప్త ఋషయస్తత్ప్రభావాభిజ్ఞా ఇయం నను తపస ఆత్యంతికీ సిద్ధిరేతావత్యేవేతి భగవతి సర్వాత్మని వాసుదేవేऽనవరత భక్తియోగ లాభేనైవోపేక్షితాన్య పురుషార్థత్మ గతయో ముక్తిమివాగతా ముముక్షవ ఇవ సబహుమానమద్యాపి జటాజూటైరుద్వహంతి. 4

(అచటినుండి)సర్వాత్మభూతుడు, భగవంతుడునగు వాసుదేవుని యందు సంతత భక్తియోగ ప్రాప్తితో ఆత్మజ్ఞానాది మిగతా పురుషార్థములనుపేక్షించినట్టి (భక్తియోగమే శ్రేష్ఠమని తలచి మోక్షమునుగూడా ఉపేక్షచేసి) ఆత్మనిష్ఠులగు సప్తర్షులు ఆ భగవత్పదీ ప్రభావమునెరిగినవారై ఇది తపస్సునకు ఆత్యంతికమగు సిద్ధియని దీనికంటే గొప్పదేదియు లేదను అభిప్రాయముతో, ప్రత్యక్షముగా వచ్చిన ముక్తిని ముముక్షు జనులు స్వీకరించినట్లు పరమాదరముతో తమ జటాజూటములలో ధరించెదరు. (శిరస్సున ధరించెదరు). 4

టీ:- తత ఇతి. తతః సప్త ఋషయః తస్యా గంగాయాః ప్రభావాభిజ్ఞాస్సంతః యాం జటాజూటైరుద్వహంతీత్యన్వయః. ఏతావత్యేవ నాతోऽధికాస్తీత్యభిప్రాయవంతః. తత్ర హేతుః - భగవతి సంతతం భక్తియోగ లాభేనైవోపేక్షితాః. అన్యే పురుషార్థాః. ఆత్మజ్ఞానం చ యైః. కామిన కఇవ ధారయంతి ప్రత్యక్షం ముక్తిమివ తామాగతాం ముముక్షవో జనా ఇవ తే. 4

శ్లో॥ తతోऽనేక సహస్రకోటి విమానానీక సంకుల దేవయానేనావ తరంతీందుమండలమావార్య బ్రహ్మసదనే నిపతతి. 5

అక్కడినుండి వేలకోట్ల విమానములతో సంకులమగు ఆకాశ మార్గమున అవతరిస్తూ, చంద్రమండలమున ప్రవహించి మేరు





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- తత ఇతి. తతోऽనేక సహస్రకోటీనాం విమానానామనీకైః. సంకులేన దేవయానేనాకాశ మార్గేణావతరంతి. సప్త ఋషిభ్యోऽర్వాగేవ ప్రాయశః కర్మిణాం గతిరితి. తతోऽర్వాగేవ సంకులత్వముక్తం. ఆవార్య ఆప్లావ్య మేరుమూర్ధస్థే బ్రహ్మసదనే నిపతతి. 5

చూ॥ తత్ర చతుర్ధాభిద్యమానా చతుర్భిర్నామభిశ్చతుర్దిశమభిస్యందంతీ నద నదీపతిమేవాభినివిశతి సీతాలకనందాచక్షుర్భద్రేతి. 6

టీ:- తత్రేతి. అభిస్యందంతీ అభితో గచ్ఛతీ. 6

చూ॥ సీతా తు బ్రహ్మసదనాత్కేసరావష్టం భాదిగిరి శిఖరేభ్యః కుముద కుకురాది శిఖరాణ్యతీత్యాధోధః ప్రస్రవంతీ గంధమాదన మూర్ధసు పతి త్వాంతరేణ భద్రాశ్వవర్షం ప్రాచ్యాం దిశి క్షారసముద్రమభి ప్రవిశతి. 7

టీ:- సీతేతి. కేసరాచలానాం మేరుసమానచ్ఛాయత్వాత్ప్రథమం తేషా మాది శిఖరేషు ముఖ్యశృంగేషు పతతి తతస్తేభ్యోऽధోధః ప్రస్రవంతీ సతీ. 7

శిఖరమున నున్న బ్రహ్మపురిలో ప్రహించును. (పడును). "సప్త ఋషిభ్యో అర్వాగేవ ప్రాయేణ కర్మిణాం గతి" అని సప్తఋషుల తరువాతనే కర్మవంతుల గమనమని చెప్పబడుటచే సప్తఋషుల స్థానము తర్వాతనే విమానముల సంకులత్వము చెప్పబడినది. 5

ఆ బ్రహ్మపురిలో భగవత్పదీ నాలుగు విభాగములై సీతా, అలకనందా, చక్షు, భద్రా అను నాలుగు పేర్లతో నాలుగు దిశలలో ప్రవహిస్తూ నద నదీపతియగు సముద్రమును చేరును. 6

బ్రహ్మసదనమునుండి సీతా అను గంగానది పాయ మేరు పర్వత కేసరములగు అవష్టంభ పర్వతముల ముఖ్య శిఖరములపై పడి అక్కడినుండి క్రింది క్రిందికి ప్రవహిస్తూ గంధమాదన శిఖరములపై పడి భద్రాశ్వ వర్షమున ప్రవహించి ప్రాగ్దిశలో లవణ సముద్రమున ప్రవేశించుచున్నది. 7

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

  

చూ॥ ఏవం మాల్యవచ్ఛిఖరాన్నిష్పతంతీ - తత ఉపరతవేగా కేతుమాలమభితశ్చక్షుః ప్రతీచ్యాం దిశి సరిత్పతిం ప్రవిశతి. 8

టీ:- ఏవమితి. మాల్యవచ్ఛిఖరాత్కేతు మూలస్యాభిముఖం నిష్పతంతి చక్షుస్సంజ్ఞాః. 8

అదేప్రకారము చక్షువు అను గంగానదీ పాయ మాల్యవత్పర్వత శిఖరమునుండి పడుచూ వేగము తగ్గినదై కేతుమాల వర్షమునంతట ప్రవహించి పశ్చిమదిశలో లవణసముద్రమున ప్రవేశించుచున్నది. 8

చూ॥ భద్రా చోత్తరతో మేరుశిఖరాన్నిష్పతంతీ సా గిరిశిఖరాద్గిరి శిఖర మతిహాయ శృంగవతశ్శ ృంగాదపస్యందమానా మానసోత్తరాంస్తు కురూనభిత ఉదీచ్యాం దిశి లవణార్ణవం ప్రవిశతి. 9

టీ:- భద్రేతి. గిరిశిఖరాదితి కుముదశిఖరాదుచ్చలితా నీలశిఖరం తత ఉచ్చలితా శ్వేతశిఖరం తదప్యతిహాయ శృ,గవతః శృంగాదధః ప్రస్రవంతీ. 9

భద్రయను గంగానదీ పాయ మేరుపర్వత శిఖరమునుండి ఉత్తర దిక్కుగా దిగుచు కుముదగిరి శిఖరమునుండి ప్రవహిస్తూ నీలగిరి శిఖరమును చేరి అచటినుండి శ్వేత పర్వత శిఖరమును అచటినుండి శృంగవత పర్వత శిఖరమున ప్రవహించి శృంగవత పర్వతము నుండి క్రిందికి ప్రవహిస్తూ ఉత్తర కురు దేశమున ప్రవహించి ఉత్తరపు దిక్కున లవణ సముద్రమున ప్రవేశించుచున్నది. 9

చూ॥ తథైవాలకనందా దక్షిణేన తు బ్రహ్మ సదనాద్బహూని గిరికూటా న్యతిక్రమ్య హేమకూట హిమకూటాన్యతిరభసతర రంహసా లుఠంతీ భారతమభివర్షం కర్మక్షేత్రం దక్షిణస్యాం దిశి జలధిమను ప్రవిశతి. 10

టీ:- తథైవేతి. అతిరభసతరరంహసా అస్ఖలితతీవ్రతరవేగేన. 10

అదేవిధముగా అలకనందాయను గంగానదీ పాయ బ్రహ్మపురి నుండి దక్షిణ దిశలో అనేక పర్వతశిఖరములను దాటి హేమకూట పర్వతమును చేరి అచటినుండి హిమవత్పర్వతమును దాటి మిక్కిలి వేగముతో ప్రవహిస్తూ కర్మక్షేత్రమగు భరత వర్షమున ప్రవహించి దక్షిణదిశలో సముద్రమున ప్రవేశించుచున్నది. 10

 






చూ॥ అన్యే చ నదా నద్యశ్చ వర్షే వర్షే సంతి బహుశో మేర్వాదిగిరిదుహితరశ్శత సహస్రశః. 11

టీ:- అన్యఇతి. బహూధా మేర్వాది గిరీణాం దుహితరః తత్ప్రసూతాః (11)

ఈ తొమ్మిది వర్షములలో ప్రత్యేకముగా మేరువు మొదలగు పర్వతములునుండి జనించిన వందలు, వేలకొలది అనేక నదీనదములు కలవు. 11

చూ॥ అత్రాపి జంబూద్వీపే - భారతమేవ వర్షం కర్మక్షేత్రమన్యాన్యష్ట వర్షాణి స్వర్గిణాం పుణ్యశేషోపభోగస్థానాని భౌమస్వర్గపదాని వ్యపదిశంతి. 12

టీ:- అత్రాపీతి. దివ్యభౌమబైలభేదాత్ త్రివిధః స్వర్గః తత్ర భౌమ స్వర్గస్య పదాని స్థానాని వ్యపదిశంతి. 12

జంబూద్వీపములోని తొమ్మిది వర్షములలో భరత వర్షమే కర్మ క్షేత్రము మిగిలినవి ఎనిమిది వర్షములు స్వర్లోక వాసుల మిగిలిన పుణ్యమునకు ఉపభోగ స్థానములగు భూలోక స్వర్గములుగా తెలుపుదురు. దివ్యము, భౌమము, బైలము అను మూడు విధములుగా స్వర్గ భేదములు కలవు. భరత వర్షాతి రిక్తములగు అష్ట వర్షములను భౌమస్వర్గ స్థానములుగా తెలుపుదురు. 12

చూ॥ ఏతేషు పురుషాణామయుత పురుషాయుర్వర్షాణాం దేవకల్పానాం నాగాయుత ప్రాణానాం వజ్ర సంహన నబలవయోమోద ప్రముదిత మహాసౌరతమిథునవ్యవాయాపవర్గైక వర్షాయుర్ధృతైక గర్భ కళత్రాణాం త్రేతాయుగసమః కాలోऽపవర్తతే. 13

టీ:- ఏతేష్వితి. ఆయుతం పురుషమానేన ఆయుర్వర్షాణి యేషాం వజ్రవత్ దృఢం సంహననం శరీరం తస్మిన్ బలవయోమోదాః. తైః

భరతవర్షము తప్ప మిగిలిన ఎనిమిది వర్షములలోని దేవతుల్యులగు పురుషులు మానవమానములో పదివేల సంవత్సరముల (మానవుని వయస్సు = 10,000) ఆయుష్యము కలిగి పదివేల ఏనుగులబలముకలిగి వజ్రమువలె దృఢమగు శరీరములతో శక్తి, యౌవన, ఉల్లాసములతో సంతుష్టులై చాలా సమయము మైథున మున్నగు విషయోపభోగములను భోగిస్తూ ఆయుష్యములో కేవలము ఒక సంవత్సరము మిగిలియున్న సమయములో గర్భము ధరించు








ప్రముదితాని యాని యాని మహాసౌరతాని మిథునాని తేషాం వ్యవాయాపవర్గే సంభోగావసానే ఏకవర్ష శేషే ఆయుషి ధృత ఏకో గర్భో యైః తాదృశాని కళత్రాణి యేషాం. త్రేతాయుగసమః విషయ సుఖోత్కర్షాత్. కృతయుగే హి సర్వే ధ్యాననిష్ఠాః ద్వాపరాదౌ తు దుఃఖ బహుళాః. 13

చూ॥ యత్ర హ దేవపతయస్స్వైస్స్వైర్గణ నాయకైర్విహిత మహార్హణా స్సర్వర్తు కుసుమస్తబక ఫలకిసలయశ్రియా నమ్యమాన విటప లతావిట పిభిరుపశుంభ మానరుచిర కాననాశ్రమాయతనవర గిరి ద్రోణీషు తథా చామల జలాశయేషు వికచ వివిధ నవ వనరుహామోదముదిత రాజహంస జల కుక్కుట కారండవ సారస చక్రవాకాదిభిర్మధుకర నికరాకృతిభిరుపకూజితేషు జలక్రీడాభిర్వి చిత్రవినోదై స్సులలిత సుర సుందరీణాం కామకలిత విలాసహాసావలోకా కృష్ట మనోదృష్టయః స్వైరం కిల విహరంతి. 14

టీ:- యత్రేతి. యత్ర హయేషు హి వర్షేషు దేవపతయస్స్వై స్సేవకగణేషు ముఖ్యైః కృతమహోపచారాస్సంతః. స్వైరం విహరంతి కిలేత్యన్వయః. కేషు స్థానేషు సర్వేషు ఋతుషు కుసుమస్త బకాదీనాం

కళత్రములు కలవారై (అనగా ఒకేసంతానము కలిగి) విషయ సుఖోన్నతిలో త్రేతాయుగ సమాన సమయము కలవారై ఉందురు. అనగా విషయ భోగములలో చాలాకాలము మునిగియుందురు అని అర్థము. కృతయుగములో అందరు ధ్యాన నిష్ఠులై ద్వాపరములో దుఃఖ పరులై ఉందురు అని తెలుపబడినది. దీనితో త్రేతాయుగమున సుఖ వంతులై ఉందురని ద్యోతకమగుచున్నది. 13

ఆ వర్షములలో సమస్త ఋతువులలో పూగుత్తులతో, పండ్లతో చిగురుటాకులతో, శోభాయమానముగా వంగిన కొమ్మలపై పూలతీగలు గల వృక్షసమూహములతో సుందరములగు వనభూములలో తమ గృహభూతములగు శ్రేష్ఠములైన గిరి గుహలలో విచిత్రములగు వినోదములతో అటులనే బాగుగ వికసించిన అనేక రకములగు కొత్తనగు జలజముల సుగంధములతో మోదమందిన రాజహంసలు, నీటికోళ్ళు కారండములు (పక్షి విశేషములు) సారసములు కొంగలు, చక్రవాకములు మున్నగు పక్షుల మధుర కూజితములతో, తుమ్మెదల మధుర ఝుంకారములతో రమ్యములగు, స్వచ్ఛమగు, జలాశయము లలో జలక్రీడలతో, సుందరులగు దేవతాస్త్రీలు కామోన్మాదకరములగు విలాసములతో, హాసములతో, చూపులతో, ఆకర్షించబడిన మనోదృష్టులుకల దేవాధిపతులు వారి ముఖ్య సహచరగణ నాయకులతో









శ్రియా సమృద్ధ్యా అత్యంతం నమ్యమానా విటపాః తదాశ్రితా లతాశ్చ యేషు తైః. విటపిభిః. ఉపశుంభమానాని శోభమానాని రుచిరాణి కాననాని యేషు తేషు ఆశ్రమాయతనేషు వరగిరి ద్రోణీషు చ తథా ఆమలేషు జలాశయేషు చ వికచాని వివిధాని నవాని చ యాని వనరుహాణి నీరజాని తేషామామోదేన ముదితైః రాజహంసాదిభిః మధుకరనికరాణాం చాకృతిభిర్జాతి విశేషైరుప కూజితేషు కామేన కలిలైః క్షుభితైః విలాసాదిభిరాకృష్టం మనో దృష్టిశ్చ యేషాం తే. 14

సేవించబడుచు స్వచ్ఛందముగా విహరించుచుందురు. 14

చూ॥ నవస్వపి వర్షేషు భగవాన్నారాయణో మహాపురుషః- పురుషాణాం తదనుగ్రహా యాత్మతత్త్వవ్యూహేనాత్మనాద్యాపి సన్నిధీయతే. 15

ఈ తొమ్మిది వర్షములలోనుండెడి ప్రాణులననుగ్రహించుటకు మహాపురుషుడు, భగవన్నారాయణుడు ఇప్పటికిని విభిన్నములగు తన రూపములతో సన్నిహితుడగును. (ప్రకాశించును). 15

టీ:- నవస్వితి. నవస్విపి వర్షేషు యే పురుషాస్తేషాం తదనుగ్రహాయ. స చాసౌ వక్ష్యమాణోఽనుగ్రహః. తదర్థమాత్మతత్త్వవ్యూహేన స్వమూర్తి సమూహేన సన్నిధీయతే సన్నిహితో భవతి. 15

చూ॥ ఇళావృతే తు భగవాన్భవ ఏక ఏవ పుమాన్న హ్యన్య స్తత్రా పరః ప్రవిశతి - భవాన్యాశ్శపనిమిత్తానభిజ్ఞో యత్ర ప్రవిశ్య కశ్చన సానుచరః స్త్రీ స్వభావం గతః - తత్పశ్చాద్వక్ష్యామః. 16

ఇళావృత వర్షమున భగవంతుడగు శంకరుడొక్కడే పురుషుడు. ఈ ఇళావృతమున శంకరునికంటే వేరు పురుషుడెవరు ప్రవేశించడు. పార్వతీదేవి శాపవిషయము తెలియని ఒకడు అచట ప్రవేశించి తన









టీ:- ఇళావృతేతి. అపరః అర్వాచీనః పశ్చాత్ నవమ స్కంధే. 16

చూ॥ భవానీనాథ స్త్రీ గణార్బుదసహస్రైరవరుధ్యమానో భగవతశ్చతు ర్మూర్తేర్మహాపురుషస్య తురీయాం తామసీం మూర్తిం ప్రకృతిమాత్మన స్సంకర్షణ సంజ్ఞామాత్మ సమాధిరూపేణ సన్నిధాప్యైతదభిగృణన్ భవ ఉపధావతి. 17

టీ:- భవానీతి. భవానీనాథా స్వామినీ యేషాం తైః. స్త్రీ గణానామ ర్బుదసహస్రైః. అవరుధ్యమానః. సర్వతః సేవ్యామానః ఆత్మనః ప్రకృతిం కారణం ఆత్మని సమాధిర్ధ్యానం. యస్య తేన రూపేణ ఏతద్వక్ష్యమాణం మంత్రాదికం అభిగృణన్ జపన్. 17

శంకర ఉవాచ

చూ॥ ఓం నమో భగవతే వాసుదేవాయ ।

సర్వగుణ సంఖ్యానాయావ్యక్తాయ నమ ఇతి ॥ 18

టీ:- ఓమితి. సర్వేషాం గుణానాం సంఖ్యానం ప్రకాశో యస్మాత్ స్వయం తు అవ్యక్తాయ అప్రమేయాయ. 18

అనుచరగణముతో సహా స్త్రీత్వము నొందెను. ఆ విషయము నవమ స్కంధమున తెలిపెదను. 16

అచట భగవంతుడగు శంకరుడు పార్వతీదేవి అనుచరులగు అర్బుదములకొద్ది స్త్రీ గణములతో సేవించబడుచూ (మహాపురుషుడు, పరమాత్మ) భగవంతుని యొక్క వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణులను నాలుగు మూర్తులలో నాలుగవదగు తామసమూర్తి తనకు కారణభూతమగు సంకర్షణుడను నామముగల మూర్తిని తనలో ధ్యానరూపముగా నుంచుకొని చెప్పబోవు మంత్రమును జపిస్తూ స్తుతించుచుండును. 17

శంకరుడు ఈ విధముగా పలికెను.

సమస్త గుణములను ప్రకాశింపచేసెడి అవ్యక్తస్వరూపుడు, ఓంకారరూపుడు, భగవంతుడగు వాసుదేవునకు నమస్కారము అని జపిస్తూ ఉండును. 18








శ్లో॥ భజే భజ న్యారణ పాదపంకజం
భగస్య కృత్స్నస్య పరం పరాయణం ।
భక్తేష్వలంభావిత భూతభావనం
భవాపహం త్వాం భవభావమీశ్వరం ॥ 19

టీ:- భజ ఇతి. హే భజస్య భజనీయ త్వాం పరమేశ్వరం భజ ఇత్యన్వయః. అరణం శరణం పాదపంకజం యస్య కృత్స్నస్య భగస్య ఐశ్వర్యాదిషాడ్గుణస్య పరమయనమాశ్రయం భక్తేషు అలమత్యర్థం భావితం ప్రకటితం. భూతభావనం స్వరూపం యేన భవాపహం సంసారహరం భక్తేష్విత్యనుషంగః. భవం భావ యతీతి తథా తం అర్థాదభక్తేష్వితి ద్రష్టవ్యం. 19

ఓ భజనీయ ప్రభూ! నీ చరణకమలములు భక్తజన శరణ్యములు. నీవు సంపూర్ణములగు ఐశ్వర్యాది షడ్గుణములకు ఆశ్రయభూతుడవు. భక్తులలో మిక్కిలిగా ప్రకటించబడిన భూతభావన స్వరూపము కలవాడవు. భక్తుల సంసారమును హరించువాడవు. భక్తిలేని వారిని సంసార బంధనములో పడవేసెడివాడవు. సర్వేశ్వరుడవు అట్టి నిన్ను భజించెదను. 19

శ్లో॥ నయస్య మాయాగుణ చిత్తవృత్తి
భిర్నిరీక్షతో హ్యణ్వపి దృష్టిరజ్యతే ।
ఈశే యథా నోఽజితమన్యురంహసాం
కస్తం న మన్యేత జిగీషురాత్మనః ॥ 20

టీ:- ఈశ్వరత్వ ముపాదయంస్తామసత్వేన ప్రసక్తమనాదరం వారయతి - నయస్యేతి. యస్య నిరీక్షమాణస్యాసి. దృష్టిః

సంకర్షణునకు ఈశ్వరత్వమును కల్పిస్తూ తామసమూర్తి అగుటచే కల్గిన అనాదరమును నివారించుచున్నాడు. జగన్నియామక - మునకై నిరంతరము సాక్షిభూతుడవై రక్షించుచున్నావు. నీ యొక్క దృష్టి మాయాగుణములగు విషయములతో మనోవ్యాపారములతో (కరణములతో) కొంచెముకూడా అంటకుండా యుండును. కాని క్రోధావేశమును జయించని మాయొక్క దృష్టి ఆ విధముగా మనోవిషయ ములను మనోవ్యాపారములను అంటకుండా యుండదు.








మాయాగుణైర్విషయైః చిత్తవృత్తిభిః కరణైశ్చ. అణ్వపి ఈషదపి నాజ్యతే న లిప్యతే కిమర్థం. నిరీక్షమాణస్య. ఈశే ఈశనాయ నియమనాయ. ఈశనమీట్. సంపదాదిత్వాత్ భావే క్విప్. అత్ర వైధర్మ్య దృష్టాంతః యథా అజిత క్రోధవేగానాం. నోఽస్మాకం. దృష్టిరజ్యతే న తథేతి. అత ఆత్మనః ఇంద్రియాణి జిగీషుర్జేతుమిచ్ఛుః. ముముక్షుః. తం కోన మన్యేత నాద్రియేత? 20

(మనస్సులోని తారతమ్యము చెప్పబడినది) అట్టి నిన్ను ఇంద్రియ జయేచ్ఛ కల్గిన ముముక్షువెవడు ఆదరించడు? ఆదరించునని తాత్పర్యము. 20

శ్లో॥ అసద్దృశో యః ప్రతిభాతి మాయయా
క్షీబేవ మధ్వాసవ తామ్రలోచనః ।
ననాగవధ్వోఽర్హణ ఈశిరే హ్రియా
యత్పాదయోస్స్పర్శన ధర్షితేంద్రియాః ॥ 21

టీ:- నను సురాసవాభ్యాం మత్తస్య కుతో దృష్టేర్నాజ్యతే? తత్రాహ – అసదితి. అసతీదృక్ దృష్టిర్యస్య తస్య.స్వమాయయా క్షీబో మత్త ఇవ యో భయంకరః ప్రతిభాతి ఇవార్థే వేత్యవ్యయం. మధ్వాసవాభ్యాం ఆతామ్రలోచనఇవ చ.నాగవధూవిమోహనేన చ తథా ప్రతిభా సంయుక్త మిత్యాహ – నేతి. అర్హణే పాదార్చనే యస్య పాదయోస్స్పర్శనేన ధర్షితం మోహితమింద్రియం మనో యాసాం తాః. హ్రియా లజ్జయా పూజాద్య ర్హణేనేశిరే న శేకుః. కస్తం న మన్యేతేతి పూర్వేణైవాన్వయః. 21

సుర, మద్యములతో మత్తుడగువాని దృష్టి విషయాదులతో లంపటము కాకుండా ఎలా ఉండును? అను విషయమును తెలుపు చున్నాడు. సన్మార్గదృష్టిలేని వారు సుర, మద్యాదిపానముచేసి ఎఱ్ఱవారిన నేత్రములు కలవారు, మదించినవారివలె, మాయకు వశీభూతులై మిథ్యాదర్శనము చేయుదురు. నీ పాదస్పర్శతో మోహమందిన (నీ పాద స్పర్శతో పులకించి నీ మోహములో పడిన) ఇంద్రియములు గల నాగకన్యలు చిత్తచాంచల్యమంది లజ్జతో పూజించదగిన నిన్ను పూజించుటకశక్తులైరి. 21










శ్లో॥ యమాహురస్య స్థితి జన్మ సంయమం
త్రిభిర్విహీనం యమనంతమృషయః ।
న వేద సిద్ధార్థమివ క్వచిత్ స్థితం
భూమండలం మూర్ధసహస్రధామసు ॥ 22

టీ:- యమితి. యస్య విశ్వస్య స్థితి జన్మ సంయమహేతుం యమాహుః. అత ఏవ త్రిభిః స్థిత్యాదిభిః. విహీనం అనంతం చ. యమాహుః. ఋషయో మంత్రాః. ఛందోऽనురోధేన దీర్ఘ పాఠే ఋకారో దేవమాతా లక్ష్మీః సా చ ఋషయశ్చేత్యర్థః. అనంతత్వం దర్శయతి – మూర్ధసహస్ర మేవ. ధామాని స్థానాని. తేషు క్వచిదేకదేశే స్థితం భూమండలం, యోన వేద. సిద్ధార్థం సర్ష పమివ. తస్మై నమ ఇతి చతుర్థేనాన్వయః. 22

వేదమంత్రములు, లక్ష్మీదేవి (ఋషులు) ఈ ప్రపంచ జనన స్థితి లయములకు కారణభూతునిగా యెవరినైతే తెలిపెనో, ఆ విధముగా జన్మ స్థితి లయములకు కారణమై యుండిగూడా జన్మస్థితి లయములు లేనివానినిగా అనంతునిగా తెలిపినవి. ఆ అనంతత్వమును తెలుపు చున్నాడు. ఈ భూమండలము నీ వేయి శిరస్సులపై ఆవగింజవలె ఏకదేశముననున్నది. ఆ విధముగా ఉన్నదను విషయము తెలియని నీకు కూడా నమస్కారము (అనగా నిర్వికార, నిరంజనత్వము) అని ఇచటి నుండి నాలుగవ శ్లోకముతో అన్వయము. 22

శ్లో॥ యస్యాద్య ఆసీద్గుణ విగ్రహో మహాన్వి
జ్ఞాన ధిష్ణ్యో భగవానజః కిల ।
యత్సంభవోऽహం త్రివృతా స్వతేజసా
వైకారికం తామసమైంద్రియం సృజే ॥ 23

మహత్తత్వము ద్వారాజన్మాది కారణమును తెలుపుచున్నాడు. సత్వమునకాశ్రయభూతుడగు ఎవని నుండి సత్వరజస్తమోగుణ కారణాత్మకమగు, చిత్తవికారమగు సత్త్వ ప్రధానమగు మహతత్త్వమను రూపమావిర్భవించెనో, ఆతడే వాసుదేవాభిన్నుడగు ఆదిదేవుడు. (వాసుదేవుడే) ఆ మహతత్త్వరూపమే బ్రహ్మ. ఆ బ్రహ్మ నుండి సంభవించిన నేను రుద్రుడను . త్రిగుణముల విభూతితో, అహంకార



టీ:- తత్ర జన్మ హేతుత్వం మహదాది ద్వారేణ ప్రపంచయతి - యస్యేతి. యస్య గుణనిమిత్తో మహాన్నామవిగ్రహ ఆసీత్, విజ్ఞానం సత్త్వం ధిష్ణ్యమాశ్రయో యస్య సః. తస్య చిత్తరూపత్వేన సత్త్వ ప్రధాన త్వాత్ స ఏవ కిలాదిదేవః శ్రీవాసుదేవాభేద వివక్షయా. భగవానజో బ్రహ్మా. యత్సంభవః యస్మాత్ బ్రహ్మణస్సకాశాత్ సంభూతః అహం రుద్రః త్రివృతా త్రిగుణేన స్వతేజసా విభూతిరూపేణాహంకారేణ వైకారికం దేవతావర్గం. తామసం భూతవర్గం ఐంద్రియం ఇంద్రియ వర్గం చ సృజామి. 23

రూపముతో దేవతావర్గమును తామస ప్రధానమగు భూత సమూహ - మును ఇంద్రియ సమూహమును సృజించుచున్నాను. 23

శ్లో॥ ఏతే వయం యస్య వశే మహాత్మనః
స్థిరాశ్శకుంతా ఇవ సూత్రయంత్రితాః ।
మహానహం వైకృతతామసేంద్రియా
స్సృజామ సర్వే యదనుగ్రహాదిదమ్ ॥ 24

టీ:- యత ఇతి. కించ ఏతే వయం మహదాదయః సర్వే యస్యానుగ్రహాదిదం బ్రహ్మాండం సృజామః. కథంభూతాః. యస్య మహాత్మనో వశే స్థితాస్సంతః. యతః సూత్రేణ క్రియాశక్త్యా యంత్రితాః ప్రోతాః. శకుంతాః పక్షిణ ఇవ లౌకికేన సూత్రేణ వయమిత్యుక్తం తానేవాహ - మహానహంకారశ్చ వైకృతాదయః. పూరోక్తా వర్గాశ్చ. 24

మహత్తత్త్వము, అహంకారము ఇంద్రియాభిమానులగు దేవతలు ఇంద్రియములు పంచభూతములు మొదలగు మేమందరము దారముచే కట్టబడిన పక్షులవలె నీయొక్క క్రియాశక్తికి వశ్యులమై నీ దయతోనే లౌకిక క్రియారూపమగు ఈ జగత్తును సృజించుచున్నారము. 24






శ్లో॥ యన్నిర్మితాం కర్హ్యపి కర్మ పర్వణీం
మాయాం జనోऽయం గుణసర్గమోహితః ।
న వేద నిస్తారణ యోగమంజసా
తస్మై నమస్తద్విలయోదయాత్మనే ॥ 25

టీ:- స్థితిలయ హేతుత్వం దర్శయన్ ప్రణమతి. - యదితి. యేన నిర్మితామేతాం మాయామేవ అయం జనోऽంజసా వేద న తు తన్నిస్తారే యోగముపాయం కర్హిచిదపి వేదేతి స్థితి హేతుత్వం దర్శితం. కీదృశీం? కర్మాణ్యేవ పర్వాణి గ్రంథయః తాని నయతి ప్రాపయతీతి తథా తాం ప్రళయ హేతుత్వమాహ - విలీయతేऽస్మిన్నితి విలయః . ఉదేత్యస్మాదితి ఉదయః. తస్యాః విల యశ్చోదయశ్చాత్మా స్వరూపం యస్య తస్మై నమః. 25

భగవంతుడగు వాసుదేవునకు స్థితి లయ కారణత్వమును చూపిస్తూ నమస్కరించుచున్నాడు.

సత్త్వాదిగుణ సృష్టితో మోహితుడగు జీవుడు నీచే సృష్టించబడిన కర్మబంధములలో బంధించెడి మాయను గురించి తెలిసికొనినను, ఆ మాయను తొలగించు యోగమును తెలిసికొనలేడు. అలాంటి మాయకు జగత్తునకు లయ కారణభూతుడవగు, జన్మ కారణ భూతుడవగు, ఆత్మస్వరూపుడవగు నీకు నమస్కారము. 25

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, సప్తదశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పదిహేడవ అధ్యాయము సమాప్తము.**







## అష్టాదశోऽధ్యాయః

శ్లో॥ అష్టాదశే తతో మేరోః పూర్వాదిక్రమతేస్త్రిషు ।
త్రిషు చోత్తర వరేషు సేవ్యసేవక వర్ణనమ్ ॥

**శ్రీశుక ఉవాచ**

చూ॥ తథా చ భద్రశ్రవానామ ధర్మస్తుతస్తత్కులపతయః పురుషా భద్రాశ్వేవర్షే సాక్షాద్భగవతో వాసుదేవస్య ప్రియాం తనుం ధర్మమయీం హయశీర్షాభిధానాం పరమేణ సమాధినా సన్నిధాప్యేదమభిగృణంత ఉపధావంతి. 1

టీ:- తథేతి. భద్రశ్రవాః వర్షపతిః. తస్యకులపతయఃసేవకముఖ్యాః. 1

**భద్రశ్రవస ఉవాచ**

చూ॥ ఓం నమో భగవతే ధర్మాయాత్మవిశోధనాయ నమ ఇతి. 2

టీ:- భద్రశ్రవస ఊచురితి. ప్రాణభృత ఉపధావంతీతి వత్. తద్గుణ లక్షణయా తద్యోగాద్గుణిషు లింగసమవాయన్యాయేన బహువచనం. 2

## 18 వ అధ్యాయము

ఈ పదునెనిమిదవ అధ్యాయమున మేరుపర్వతమునకు ప్రాగాది క్రమముగా మూడు దిశలలోనుండెడి వర్షములలోని, సేవ్య సేవకులను వర్ణించుచున్నాడు.

**శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.**

భద్రాశ్వ వర్షమునకు ధర్మసుతుడగు భద్రశ్రవుడను పేరుగలవాడు అధిపతి. అతడు, అతని సేవకులు సాక్షాత్తుగా భగవంతుడగు, వాసుదేవుని ధర్మమయమగు హయగ్రీవుడను ప్రియమగు మూర్తిని, గొప్పనైన సమాధినిష్ఠతో హృదయములో నుంచుకొని ఈ మంత్రమును జపిస్తూ స్తుతించెదరు. 1

**భద్రశ్రవుడు ఈ విధముగా పలికెను.**

'ప్రాణభృత ఉపధావంతి' అనుదానివలె ఆ గుణలక్షణముతో ఆ గుణములుండటచే గుణవంతులయందు లింగసమవాయ న్యాయముతో భద్రశ్రవసః అని బహువచనము.

ఆ భద్రశ్రవుడు, ఆతని అనుచరులు పలికిరి. చిత్తమును పరిశుద్ధమొనర్చు ఓంకార రూపుడు, భగవంతుడునగు ధర్మునకు నమస్కారము అని (జపిస్తూ స్తుతించెదరు). 2








శ్లో॥ అహో విచిత్రం భగవద్విచేష్టితం
ఘ్నంతం జనోऽయం హి మిషన్న పశ్యతి ।
ధ్యాయన్నసద్యర్హి వికర్మ సేవితుం
నిర్హృత్య పుత్రం పితరం జిజీవిషు ॥ 3

టీ:- అహో ఇతి. అయంజనో మిషన్నపి పశ్యన్నపి ఘ్నంతం హింసంతం న పశ్యతి నాలోకయేతితి భగవద్విచేష్టితమేవ. తచ్చ విచిత్రం ఆదర్శేనే లింగం పుత్రం బాలం. పితరం చ వృద్ధం. మృతం నిర్హృత్యదగ్ధ్వా స్వయం తదుభయధనైః. జిజీవిషుః చిరకాలం జీవితు మాకాంక్షమాణస్సన్ వర్తతే. జిజీవిషతీతి పాఠాంతరే ఛందోవిరోధ ఆర్ష ఇతి మంతవ్యం. కిం ధర్మాద్యర్థం? న-యర్హి యతః. అసత్ తుచ్ఛం విషయసుఖం సేవితుం వికర్మ పాపమేవ ధ్యాయన్. 3

భగవంతుని లీలలు చాలా విచిత్రమైనవి. ఈ జనులు సంపూర్ణ లోకములను కబళించెడి మృత్యువును గాంచియు చూడనివారివలె నుందురు. ఆ విధము కాంచకపోవడానికి కారణమును తెలుపు-చున్నాడు. మృతినొందిన తమ పుత్రుని, వృద్ధుడగు తండ్రిని తామే స్వయముగా దహనమొనరించి తుచ్ఛములగు విషయ సుఖములనను భవించుటకు పాపమునే తలంచుచు, తాము మాత్రము చిరకాలము జీవించవలయునని కోరిక కలిగియుందురు. (భగవంతుని లీల చాలా విచిత్రమైనది). 3

చూ॥ వదంతి విశ్వం కవయస్మ్న నశ్వరం పశ్యంతి చాధ్యాత్మవిదో విపశ్చితః తథాపి ముహ్యంతి తవాజమాయయా సువిస్మితం కృత్యమజరి నతోऽస్మితమ్. 4

టీ:- నన్వవిద్వాన్న పశ్యతి. కిమిత్ర చిత్రం? తత్రాహ.-వదంతీతి. నశ్వరం వదంతి శాస్త్రతః పశ్యంతి చ. సమాధౌ హే అజ తథాపి మాయయా మహ్యంతి ఏతచ్ఛ తవ కృత్యం విచేష్టితం సువిస్మితం అతిచిత్రం, అతః శాస్త్రాదిశ్రమం విహాయ తం త్వామజం నతోऽస్మి. 4

జ్ఞానహీనులు కాంచలేరు ఇచట విచిత్రమేమి? అనగా తెలుపు చున్నాడు.

ఆధ్యాత్మవేత్తలు, విద్వాంసులు శాస్త్రదృష్టితో సమాధిలో ఈ ప్రపంచమును నశ్వరమైనదిగా (అశాశ్వతముగా) దర్శించెదరు. ఐనప్పటికి నీ మాయతో మోహితులగుదురు. ఈ నీ చేష్ట మిక్కిలి విచిత్రమైనది. అందువలన శాస్త్రాదిశ్రమను వదిలి జన్మరహితుడవగు నీకు నమస్కరించుచున్నాను. 4








శ్లో॥ విశ్వోద్భవస్థాననిరోధ కర్మ తే
హ్యకర్తురంగీకృతమప్యపావృతః ।
యుక్తం న చిత్రం త్వయి కార్యకారణే
సర్వాత్మని వ్యతిరిక్తే చ వస్తుతః ॥ 5

టీ:- ఇదమపరం చిత్రవత్ప్రతీయమానమపి త్వయి నాతిచిత్ర మిత్యాహ-విశ్వేతి. విశ్వోద్భవాదికర్మ అకర్తురపి అపగతా ఆవృత్ ఆవరణం యస్మాత్ తాదృశస్యాపి తే అంగీకృతం వేదేన త్వయి తన్నం చిత్రం యతః.మాయయా ఆర్వాత్మని కార్యకారణే స్రష్టరి యుక్తం వస్తుతః సర్వవ్యతిరిక్తే నిరుపాధౌ అనాద్యతత్వమకర్తృత్వంచ యుక్తం. 5

శ్లో॥ వేదాన్ యుగాంతే తమసా తిరస్కృతాన్
రసాతలాద్యోనృతురంగవిగ్రహః ।
ప్రత్యాదదే వై కవయేऽభియాచతే
తస్మైనమస్తేऽవితథేహితాయ ॥ 6

టీ:- పరమేశ్వరత్వేన స్తుత్వా ప్రస్తుతావతారచరితమాహ-వేదానితి. తమసా దైత్య రూపేణ శంఖాసురేణ తిరస్కృతాన్ అపనీతాన్ నాచతురంగశ్చ నృతురంగౌ తద్రూపో విగ్రహో యస్య కవయే బ్రహ్మణే తదర్థం అవితథేహితాయ సత్యసంకల్పాయ. 6

ఇది మరొక విచిత్రముగా ప్రతిభాసమగునది కూడా నీయందు విచిత్రమేమి కాదని తెలుపుచున్నాడు.

హే భగవన్ నీవు అకర్తవు, మాయావరణానాచ్ఛాదితుడ వయినపుడు నీ యందు ప్రపంచము యొక్క ఉద్భవ స్థితి లయ కర్మలను వేదములు అంగీకరించినవి. ఇది యుక్తమే. దీనిలో ఆశ్చర్యమేమియు లేదు ఎందుకనగా మాయతో సర్వాత్మ స్వరూపుడవగు నీవు సంపూర్ణ కార్యములకు కర్తవు, స్రష్టవు కావున జగదుత్పత్తి, స్థితి, లయ కర్మ కూడా యుక్తమైనదే. వాస్తవముగా నిరుపాధి భూతుడవగు నీ యందు అనాద్యత్వము అకర్తృత్వమే యుక్తము. 5

హయవదనుని పరమేశ్వరునిగా స్తుతించి ప్రస్తుత హయగ్రీవా అవతార చరితను తెలుపుచున్నాడు.

ప్రళయకాలములో రాక్షసరూపుడగు శంఖాసురుని చేత అపహరించబడిన వేదములను, బ్రహ్మదేవుని ప్రార్థనతో, నరాశ్వరూపుడై రసాతల లోకము నుండి తెచ్చి యిచ్చిన సత్య సంకల్పుడగు హయగ్రీవునకు నమస్కారము. 6











చూ॥ హరివర్షే చాపి భగవన్నరహరి రూపేణాస్తే-తద్రూప గ్రహణ నిమిత్తముత్తరత్రాభిధ్యాస్యే. 7

టీ:- హరివర్షేతి. ఉత్తరత్ర ప్రహ్లాదచరిత్రే. 7

హరివర్షములో భగవంతుడు నరహరి (నృసింహ) రూపములో నుండును. భగవంతుడు నరహరి రూపమును ధరించుటకు కారణమును సప్తమస్కంధమున ప్రహ్లాద చరిత్రలో తెలిపెదను. 7

చూ॥ తద్దయితం రూపం మహాపురుష గుణ భాజనం మహాభాగవతో దైత్యదానవకుల తీర్థీకరణ శీలాచరితః-ప్రహ్లాదోవ్యవధానానన్యభక్తి యోగేన సహ తద్వర్షపురుషైరుపాస్తే. 8

టీ:- తదితి. మహాపురుషస్య గుణానాం భాజనం ఆశ్రయః, దైత్య దానవకులస్య తీర్థీకరణం శీలమాచరితం చ యస్య ఫలం సంకల్పేన వ్యవధానశూన్యశ్చాసావనన్యశ్చావ్యభిచారీ భక్తియోగః తేన ఉపాస్తే సేవతే. 8

మహాపురుషగుణాశ్రయుడు దైత్యరాక్షసకులమును పవిత్రమైన నడవడికగల ప్రహ్లాదుడు అనవరతము అనన్యమైన, నిష్కామ భక్తి యోగముతో ఆ హరివర్షములోని ఇతర పురుషులతో కలిసి భగవంతుని ప్రియమైన రూపమును (నరహరి రూపమును) సేవించుచుండును. 8

చూ॥ ఇదం చోదాహరంతి ఓం నమో భగవతే నరసింహాయ-నమస్తే జస్తేజసే-ఆవిరావిర్భవ-వజ్రనఖ-వజ్రదంష్ట్ర-కర్మాశయాన్ రంధయ రంధయ-నమ ఉగ్రస్వభావాయ మహాత్మనే తమో గ్రస గ్రస-స్వాహా -అభయమభయమాత్మని భూయిష్ఠా ఇతి. 9

ఓంకారరూపుడు భగవంతుడునగు నరసింహునకు నమస్కారము. అగ్ని మొదలగు తేజస్సులకు, తేజస్సునను నారసింహునకు నమస్కారము. నీవు మాకు ఎల్లప్పుడు ప్రత్యక్షముగానే ఉండుము. ఓ వంకరలు తిరిగిన నఖములు కలవాడా! వజ్రముల వంటి దృఢమగు దంష్ట్రలు (కోరలు) కలవాడా! మా కర్మ వాసనలను



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









టీ:- ఇదమితి. తేజసామపి తేజసే ఆవిరావిః అతిప్రకటో భవ వీప్సావా. కర్మాశయాన్ కర్మవాసనాః. కర్మాశ్రయానితి పాఠే రాగాదీన్ రంధయ నిర్దహ భూయిష్ఠాః. భూయాః. 9

దహించుము, దహించుము. మహాత్ముడవగు ఉగ్రస్వభావముగల నీకు నమస్సులు. మా అజ్ఞానమను చీకటిని తొలగించుము, తొలగించుము. (మ్రింగుము) మా అంతఃకరణములో భయము కలుగకుండుగాక అని స్తుతించును. 9

శ్లో॥ స్వస్త్యస్తు విశ్వస్య ఖలః ప్రసీదతాం
ధ్యాయంతు భూతాని శివం మిథోధియా ।
మనశ్చ భద్రం భజతాదధోక్షజే
హ్యావేశ్యతాం నో మతిరప్యహైతుకీ ॥ 10

టీ:- స్వస్తీతి, విశ్వస్య స్వస్తిప్రార్థనే ఖలస్యాపి భవేత్. తచ్చ సాధుపీడాం వినా న స్యాత్. అన్యోన్యం మంగళం ధ్యాయతాం చ భూతానామన్యోన్య ఘాతం వినా న భవేత్ ఇత్యాశంక్యాహ-ఖలః ప్రసీదతాం క్రౌర్యం త్యజతు. భూతాని చ మిథశ్శివమేవ ధ్యాయంతు. తేషాం మనశ్చభద్రం ఉపశమాదికం భజతు. నోऽస్మాకమపి మతిః. అపిశబ్దాత్ భూతానాం చ మతిః, అహైతుకీ నిష్కామా సతీ. 10

ఈ జగత్తునకు కల్యాణమగుగాక! జగత్తునకు కల్యాణము కోరిన యెడల దుర్మార్గునకును కల్యాణము కలుగును. సత్పురుషులకు పీడలేకుండా దుర్మార్గునకు శుభము కలుగదు. ప్రాణులు పరస్పరము కల్యాణమునే కోరిన కూడా ప్రాణులకు పరస్పరము హాని కలుగకుండా ఆ కల్యాణము కలుగదని శంక కలిగినచో ఇలా తెలుపుచున్నాడు. దుర్మార్గుడు క్రౌర్యమును వదిలివేయుగాక! అనగా దుష్టుల బుద్ధి క్రౌర్యరహితమై ఉండు గాక! సమస్తప్రాణులు పరస్పరము శుభమునే కోరుదురుగాక సమస్త ప్రాణులు పరస్పరం సద్భావన కలిగి ఇతరులకు శుభమునే కోరుదురుగాక! ప్రాణుల మనము ఉపశమనశీలమగుగాక, మా బుద్ధియు, (అపి శబ్దముతో) ప్రాణులందరి బుద్ధియు నిష్కామమై అధోక్షజుని యందు ప్రవేశించుగాక. 10






చూ॥ మాగారదారాత్మజ విత్త బంధుషు
సంగో యది స్యాద్భగవత్ప్రియేషు నః ।
యః ప్రాణవృత్త్యా పరితుష్ట ఆత్మవాన్
సిధ్యత్యదూరాన్న తథేంద్రియ ప్రియః ॥ 11

టీ:- మేతి. నః సంగః. క్వాపి మా స్యాత్. యది కథంచిత్స్యాత్. తర్హి అగారాదిషు మా స్యాత్ కింతు భగవత్ప్రియేష్వేవ అగారాదిసంగే దోషమాహ-య ఇతి. ఇంద్రియప్రియో గృహాద్యాసక్తః. 11

ఓ ప్రభూ! గృహ కళత్ర పుత్ర ధన బంధువుల యందు ఆసక్తి (సంగము) కలుగకుండుగాక. ఒకవేళ ఆసక్తి కలిగిన యెడల భగవంతుని ప్రియభక్తుల యెడల ఆసక్తి (సంగము) కలుగుగాక. గృహాదుల యందు సంగము వలన దోషమును తెలుపుచున్నాడు. ప్రాణములు నిలుపుకొనుటకు మాత్రమే అన్నాదులతో పరితృప్తినొందు ఆత్మజ్ఞాని (తొందరగా) సిద్ధినొందినట్లు, ఇంద్రియలోలుడు (ఇంద్రియ ములను తృప్తి పరచుటకై అన్నాది భోగములను భోగించువాడు) సిద్ధినొందలేడు. 11

చూ॥ యత్సంగలబ్ధం నిజవీర్యవైభవం
తీర్థమ్ముహుస్సంస్పృశతాం హి మానసమ్ ।
హరత్యజోऽంతశ్శ్రుతిభిర్గతోऽంగజం
కో వై న సేవేత ముకుందవిక్రమమ్ ॥ 12

టీ:- భగవత్ప్రియసంగే గుణమాహ-యదితి. యేషాం భగవత్ప్రియాణాం సంగాత్ లబ్ధం ముకుందవిక్రమం శ్రుతిభిః శ్రవణాదిభిః. సంస్పృశతాం సేవమానానాం పుంసామన్తర్గతః అజః. మానసం మలం హరతి కథంభూతం విక్రమం నిజమసాధారణం వీర్యవైభవం ప్రభావాతిశయో యస్య తీర్థం తు గంగాది. ముహుస్సంస్పృశతాం.

భగవద్భక్తుల సాంగత్యము వలన కలుగు ప్రయోజనమును తెలుపుచున్నాడు. గంగాది తీర్థసేవనము కేవలము దైహికమైన మలమునే తొలగించునే కానీ, భగవద్భక్తుల సాంగత్యముతో లభించిన ముకుందుని అసాధారణ వీర్యవైభవ చరిత్ర శ్రవణము, సేవనాచరించిన యెడల, ఆ పురుషుల యొక్క అంతరంగమందుండెడి మనోసంబంధి - యగు దోషము హరించబడును. అనగా భగవంతుని చరిత్ర శ్రవణేంద్రియముల ద్వారా హృదయమున ప్రవేశించి దైహిక, మానసిక మలములను తొలగించును. అందువలన భగవద్భక్తుల సాంగత్యమును ఎవరు భజించరు? అనగా అందరునూ భజించవలెనని తాత్పర్యము. (12)








అంగజం మలం కేవలం. హరతి. న తు వాసనాః విముక్తాన్కో వై న సేవేతేత్యన్వయః. 12

శ్లో॥ యస్యాస్తి భక్తిర్భగవత్యకించనా
సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః ।
హరావభక్తస్య కుతో మహద్గుణా
మనోరథేనాసతి ధావతో బహిః ॥ 13

టీ:- మానసమలాపగమఫలమాహ-యస్యేతి. అకించనా నిష్కామా. మనశ్శుద్ధౌ హరేర్భక్తిర్భవతి. తతశ్చ తత్ప్రసాదే సతి. సర్వే దేవాః సర్వైర్గుణైర్ధర్మ జ్ఞానాదిభిస్సహ తత్ర సమ్యగాసతే నిత్యం వసంతి. గృహాద్యాసక్తస్య తు. హరిభక్త్య సంభవాత్. కుతో మహతాం గుణాః. జ్ఞానవైరాగ్యాదయో భవంతి. అసతి విషయే సుఖే. మనోరథేన బహిర్ధావతః. 13

శ్లో॥ హరిర్హి సాక్షాద్భగవాన్ శరీరిణామాత్మా
ఝషాణామివ తోయమీప్సితం ।
హిత్వా మహాంస్తం యది సజ్జతే గృహే
తదా మహత్త్వం వయసా దంపతీనామ్ ॥ 14

హృదయమాలిన్య క్షాలనచే కలుగు ఫలితమును తెలుపుచున్నాడు.

ఎవరికైతే భగవంతునిపై నిష్కామమగు భక్తి కలుగునో అనగా మనశ్శుద్ధితో శ్రీహరిపై భక్తి కలిగి తద్వారా శ్రీహరి అనుగ్రహము సిద్ధించునో, ఆతని హృదయములో ధర్మ జ్ఞానాది గుణములతో దేవతలు నివసించెదరు. అసత్యములగు విషయ సుఖాదుల యందు సంకల్ప వికల్పాత్మకమగు కోరికలతో పరిభ్రమించెడి గృహాదులందాసక్తులైన వానికి భక్తిసిద్ధించనందున జ్ఞానవైరాగ్యాది మహద్గుణములు ఎలాకలుగును? కలుగవు. 13

ఈ ప్రపంచములో హరిభక్తి విముఖులై గృహాదులయందు ఆసక్తులైన వారికి గూడా గొప్పతనము(మాహాత్మ్యం) కానబడుచున్నది. అని అపహాసమునకు స్థానముగా కానబడుచులేదుకదా (అని హేళనము చేయు వీలున్నది కదా) యనగా దానికి నిరాకరణముగా ఉత్తరమును తెలుపుచున్నాడు. మీనములకు జీవనాధారమగు నీరు



టీ:- నను హరి విముఖస్య గృహాద్యాసక్తస్యాపి లోకే మహత్త్వం దృశ్యతే సతి న దృశ్యతే తత్త్వపహాసాస్పదమితి సహేతుకమాహ-హరిరితి యథా ఝుషాణాం మీనానాం ఈప్సితం తోయమేవాత్మా. తేన వినా జీవనాభావాత్. మహానతిప్రసిద్ధోఽపి గృహే యది సజ్జతే. తదా. దంపతీనాం మిథునానాం. శూద్రాదిష్వసి ప్రసిద్ధం. వయసైవ కేవలం యన్మహత్త్వం. తదేవ తస్య భవతి న తు జ్ఞానాదినా. మిథునేషు పూజ్యమానేషు. స్త్రీభ్యః పుంసాం మహత్త్వం బాలమిథునేభ్యశ్చ వృద్ధ మిథునానాం మహత్త్వం యథేత్యర్థః. 14

శ్లో॥ తస్మాద్రజో రాగవిషాదమన్యు
మానస్పృహా భయ దైన్యాది మూలమ్ ।
హిత్వా గృహం సంసృతి చక్రవాళం
నృసింహపాదం భజతాం కుతో భయమ్ ॥ 15

టీ:- యస్మాదేవం తస్మాద్గృహం హిత్వా అకుతోభయం నృసింహ పాదం భజతేత్యసురానుపదిశతి-తస్మాదితి. కీదృశం గృహం? రజస్తృష్ణా రాగోఽభినివేశః. రజ ఆదీనాం మూలం కారణం. అత ఏవ సంసృతీనాం జన్మమరణాదీనాం. చక్రవాళం మండలమవిచ్ఛేదో యస్మాత్. 15

ఏ విధముగా మిక్కిలి ప్రియమైనదో అదే విధముగా అందరికీ శ్రీహరియే ప్రియమైన ఆత్మయగుచున్నాడు. అలాంటి శ్రీహరిని వదిలి మహత్వాభిమానముతో ఎవరైతే గృహాదులలో ఆసక్తులగుదురో వారు కేవలము మిథునములలో, (దంపతులలో) శూద్రాదులలో ప్రసిద్ధమగు వయస్సు తోనే వృద్ధుడగును. కేవలము వయస్సుతోనే గొప్పవాడగునుగాని, జ్ఞానాదులతో కాదు. అనగా ఈ ప్రపంచమున పూజించదగినవారిలో స్త్రీలకంటే పురుషులకు, బాలురకంటే వయస్సుచే పెద్దవారికి మహత్త్వము (పూజనీయత) సంభవించును. 14

అలాంటి గృహమును వదిలి భయరాహిత్యమునొసగెడి నరసింహుని పాదములను సేవించుమని అసురులకు ప్రహ్లాదుడు ఉపదేశించుచున్నాడు. అందువలన తృష్ణ అభినివేశము దుఃఖము, కోపము, అభిమానము, కోరిక, భయము, దీనత్వము మానసిక రుగ్మతలకు కారణమగు జనన, మరణ రూప సంసార చక్రమునకు ఆశ్రయభూతమగు గృహమును వదిలి అభయప్రదమగు నరసింహుని చరణకమలములను ఆశ్రయించండి, సేవించండి. 15






చూ॥ కేతుమాలే భగవాన్ కామదేవ స్వరూపేణ లక్ష్మ్యాః ప్రియ చికీర్షయా ప్రజాపతేర్దుహితౄణాం పుత్రాణాం చ తద్వర్షపతీనాం పురుషాయుషాహోరాత్ర పరిసంఖ్యా నానాం-యాసాం గర్భా మహా పురుష మహాస్త్రతేజసోద్వేజితమనసాం విధ్వస్తావ్యస వస్సంవత్సరాంతే నిపతంతి. 16

టీ:- కేతుమాల ఇతి. కేతుమాలేऽపి కామదే స్వరూపేణ ఆస్తే ఇతి శేషః. కిమర్థమాస్తే? తదాహ-లక్ష్మ్యా ఇతి. ప్రజాపతిస్సంవత్సరః. "సంవత్సరో వై ప్రజాపతిరి"తి శ్రుతేః. తస్య దుహితరో రాత్ర్యభిమానిన్యో దేవతాః. పుత్రాః. దివసాభిమానినో దేవాః. తేషాం చ ప్రియ చికీర్షయా. పురుషాయుషా పురుషవర్షశతేన యాన్యహోరాత్రాణి. తైః పరిసంఖ్యానం గణనా యేషాం. షట్త్రింశత్సహస్రాణామిత్యర్థః. యాసాం దుహితౄణాం మహాపురుషస్య మహాస్త్రం చక్రం తస్య తేజసా. 16

కేతుమాల వర్షమున భగవంతుడు లక్ష్మీదేవికి మరియు సంవత్సరరూపమగు ప్రజాపతి పుత్రీ పుత్రులగు (రాత్ర్యహస్సులను) ఆ కేతుమాల వర్షపతులకు ప్రియమొనర్చుటకై కామదేవ స్వరూపములో ఉండును. "సంవత్సరోవై ప్రజాపతిః" అని శ్రుతి సంవత్సరమనే ప్రజాపతికి రాత్ర్యాభిమాన దేవతలు పుత్రికలు దివాభిమానదేవత పుత్రులు. వీరి సంఖ్య పురుషుని యొక్క ఆయుః ప్రమాణమగు వంద సంవత్సరములలో ఎన్ని పగళ్లు, రాత్రులు గలవో అన్ని అనగా ముప్పది ఆరువేల చొప్పున ఉండును. ఆ రాత్ర్యాభిమాన దేవతలగు పుత్రికల మనస్సులు మహాపురుషుడగు శ్రీహరి అస్త్రమగు సుదర్శన చక్ర తేజస్సునకు భీతిల్లగా వారి గర్భములు ప్రతి సంవత్సరాంతమున పాతములగును. 16

చూ॥ అతీవ సులలిత గతి విలాస లసిత రుచిర హాసలేశావలోక లీలయా -కించిదుత్తంభిత సుందర భ్రూమండల సుభగవదనారవింద శ్రియా రమాం రమయన్నాత్మేంద్రియాణి రమతే. 17

టీ:- అతీవేతి. రమాం రమయన్. స్వీయానీంద్రియాణి. రమయతే

ఆ కేతుమాల వర్షమున భగవంతుడు కామదేవ రూపముతో తన యొక్క మిక్కిలి సుందరమగు గతి విలాసముతో ప్రకాశించు రమ్యమగు చిరుహాసావలోకనలీలతో రమణీయములగు కనుబొమ్మలను కొంచం పైకెత్తి రమ్యమగు ముఖకమలశోభతో లక్ష్మీదేవిని రమింపజేస్తూ తానును రమించుచుండును. 17

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.









కేన సాధనేన రమయన్? తదాహ-అతీవ సులలితయా గత్యా. యో విలాసస్తేన విలసితః. రుచిరో హాసలేశో మందస్మితం తత్సహితోऽవ లోక ఏవ లీలా. తయా కించిదుత్తంభితం ఉత్తుంగితం. సుందరం యత్ భ్రూమండలం. తేన సుభగం వదనారవిందం. తస్య క్రియా. 17

చూ॥ తద్భగవతో మాయామయం రూపం పరమ సమాధియోగేన రమాదేవీ సంవత్సరస్య రాత్రిషు ప్రజాపతేర్దుహితృభిరుపేతాహస్సు చ తద్భర్తృభిరుపాస్తే. 18

టీ:- తదితి. తద్భర్తృభిర్దివసాధిష్ఠాతృభిరుపేతా. 18

చూ॥ ఇదం చోదాహరంతి-ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వగుణవిశేష విలక్షితాత్మనే-ఆకూతీనాం-చిత్తానాం-చేతసాం చ-విశేషాణాం చాధిపతయే-షోడశకళాయ-ఛందోమయాయ అన్నమయాయ అమృతమయాయ సర్వమయాయ సహసే ఓజసే బలాయ - కాన్తాయ - కామాయనమస్తే - ఉభయత్ర భూయాదితి. 19

టీ:- ఇదమితి. సర్వైర్గుణవిశేషైః, శ్రేష్ఠవస్తుభిర్విలక్షితో లక్షీకృత ఆత్మా

అచట లక్ష్మీదేవి పరమసమాధి యోగముతో ఆ భగవంతుని మాయామయమగు రూపమును రాత్రులలో సంవత్సరమను ప్రజాపతి పుత్రికలతో కూడి, పగటి వేళలలో సంవత్సర ప్రజాపతి పుత్రులతో గూడి ఆరాధించును. (ఉపాసించును) 18

ఈ మంత్రమును జపిస్తూ ఆరాధించుచుండునని తెలుపు చున్నాడు. సమస్తములగు శ్రేష్ఠవస్తువులచేత లక్షీకృతమగు ఆత్మగల క్రియలకు, జ్ఞానములకు, సంకల్పాధ్యవసాయాదులకు ఆయా విషయములకధిపతియగు (అనగా క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తుల కధిపతియగు) ఏకాదశేంద్రియములు, పంచవిషయ లక్షణములగు శోడశ కళారూపుడగు వేదోక్త కర్మలచే ప్రాప్యుడగు అన్నమయుడు, అమృతమయుడు, సర్వమయుడునగు మానసిక ఇంద్రియ శారీరక బలస్వరూపుడగు, పరమసుందరుడునగు ఓం హ్రీం హ్రూం లం



యస్య ఆకూతీనాం క్రియాణాం. చిత్తీనాం జ్ఞానానాం చేతసాం సంకల్పాధ్యవసాయాదీనాం. విశేషాణాం తత్తద్విషయాణాం. షోడశకళా అంశాః. ఏకాదశేంద్రియ పంచ విషయ లక్షణా యస్య ఛందోమయాయ వేదోక్త కర్మప్రాప్యాయ. అన్నమయాయ. అన్నాద్యుపభోగ్యత్వాత్. అమృతమయాయ పరమానందవికారత్వాత్. సర్వమయాయ సర్వవిషయత్వాత్. సహసే, ఓజసే. బలాయ. తద్ధేతుత్వాత్ ఏవం విధాయ కాంతాయ కామాయ ఉభయత్ర మనసా వచసా. 19

శ్లో॥ స్త్రియో వ్రతైస్త్వాం హృషీకేశ్వరం స్వతో
హ్యారాధ్య లోకేపతిమాశాసతేఽన్యమ్ ।
తాసాం న తే వై పరిపాంత్యపత్యం
ప్రియం ధనాయూంషి యతోఽస్వతంత్రాః ॥ 20

టీ:- త్వత్కామేనైవ త్వత్సేవకత్వాదహం కృతార్థాస్మి. అన్యకామనయా తు త్వామర్చయంత్యో న పరిపూర్ణ మనోరథాస్స్యురిత్యాహ-స్త్రియ ఇతి. స్వత ఏవ హృషీకాణామీశ్వరం పతిం సంతం. త్వామారాధ్య. యాః స్త్రియోఽన్యం పతిం ప్రార్థయంతే. పతికామానాం హి కామారాధనం వ్రతేషు ప్రసిద్ధం. తాసామపత్యాదీని తేప తయో న పాతుం శక్తాః. 20

అను బీజమంత్ర స్వరూపుడు, ఓంకారరూపుడగు భగవంతుడు, హృషీకేశుడునగు కామధేనువునకు మనసావచసా నమస్కారము. 19

నీపై కోరికతోనే నేను నీసేవ నొనర్చి కృతార్థురాలనైతిని. ఇతరులను కోరి నిన్నర్చించెడివారు పూర్ణమనోరథులు కారని తెలుపుచున్నాడు. స్వతహాగా ఇంద్రియములకధిపతియగు నిన్ను పూజించే, యే స్త్రీలైతే వేరే మంచి భర్తను కోరుదురో అలాంటి స్త్రీల యొక్క భర్తలు వారి ప్రియపుత్రులను, ధనమును, ఆయుష్యమును రక్షించలేరు. ఏలనన వారు అస్వతంత్రులు. పతిని కాంక్షించువారు కామారాధనము చేయుదురని ప్రసిద్ధి. 20








చూ॥ స వై పతిస్స్యాదకుతోభయస్స్వయం
సమంతతః పాతి భయాతురం జనమ్ ।
స ఏక ఏవేత రథా మిథో భయం
నైవాత్మ లాభాదధిమన్యతే పరమ్ ॥ 21

టీ:- అతస్తే పతయ ఏవ న భవంతీత్యాహ-సవా ఇతి. స చైవంభూతః పతిః భవానేక ఏవ నాన్యః. యో భవానాత్మలాభాత్పరమన్యదధికం న మన్యతే. ఇతరథా అన్యాధీన సుఖస్య అస్వతంత్రతా. స్వతంత్రనానాత్వే మండలేశ్వరాణామివ మిథో భయం స్యాదిత్యర్థః. 21

చూ॥ యా తస్య తే పాదసరోరుహార్హణం
నకామయేత్సాఖిల కామలంపటా ।
తదేవరాసీప్సితమీప్సితోర్చితో
యద్భగ్న యాచ్నా భగవన్ ప్రతప్యతే ॥ 22

టీ:- కించ నిష్కామ భజనే అప్రార్థితా ఏవ సర్వే కామా భవంతి. సకామ భజనేతు. కామితమాత్ర మనిత్యం చేత్యాహ-యేతి యా స్త్రీ. తస్య ఉక్తలక్షణస్య తే. పాదసరోరుహస్యార్హణం పూజామేవ కామయేత్. న ఫలాంతరం. సా అఖిలేషు కామేషు లంపటా. సర్వాన్. కామాన్

నిన్ను సేవించి, నిన్నుగాక ఇతరులను పతులుగా పొందినచో వారు పతులేకారని తెలుపుచున్నాడు. ఎవరైతే స్వయముగా భయరహితుడై, భయాతురలగు జీవులను రక్షించునో వాడే నిజమైన పతి. అటువంటి పతివి నీవొక్కడవే. నీవు ఆత్మప్రాప్తికంటే వేరే ఏ దేనిని గొప్పదిగా తలంచవు. కాకున్నచో (ఒకరికంటే ఎక్కువమందిని ప్రభువులనుగా తలంచినయెడల) ఇతరాధీనమైన సుఖమునకు అస్వాతంత్ర్యత కలుగును. స్వాతంత్ర్యత విషయమున నానాత్వము కల్గినచో సామంతరాజులకు వలె పరస్పరము భయము కలుగును. 21

నిష్కామముగా సేవించినయెడల కోరనప్పటికిని అన్ని కోరికలు సిద్ధించును. కోరికతో సేవించిన యెడల కోరిన కోరిక ఒకటే సిద్ధించును. అదికూడా శాశ్వతముగా నుండదని తెలుపుచున్నాడు. ఏ స్త్రీ అయితే ఏ కోరికలు లేకుండా నీ పాదకమలముల సేవను కోరునో ఆమెకు సమస్త వాంఛలీడేరును. అటులకాక ఎవరైతే ఏదో ఒక కోరికతో నీ సేవ చేయుదురో వారికి ఆ ఒక్క కోరికనే తీర్చెదవు. ఆ కోరిక యొక్క భోగ సమాప్తికాగా దానికై పరితపించవలసిన అగత్యమేర్పడును. 22



ప్రాప్నోతీత్యర్థః. ఈప్సితమీప్సితః ఫలాంతరమాప్తుమపేక్షితస్సన్. అర్చితశ్చేత్తర్హి తథైవైకం. రాసి దదాసి. కించ. యద్యతః ఫలభోగాదనంతరం భగ్నా యాచ్నాయాచితోఽర్థో యస్యాః సా. ప్రతప్యతే దుఃఖం ప్రాప్నోతి. తదేవ రాసి న తు నిత్యం. 22

శ్లో॥ మత్ప్రాప్తయేజేశ సురాదయః ప్రభో
తప్యంత ఉగ్రం తప ఐంద్రియే ధియః ।
ఋతే భగత్పాదపరాయణాన్న మాం
విందంత్యహం త్వద్ధృదయాయతో జితః ॥ 23

టీ:- నను మమార్హణే. కుతస్సర్వకామప్రాప్తిః. త్వమేవ హి కామార్థిభిస్సేవ్యసే అత ఆహ-మదితి. మత్ప్రాప్తయే. బ్రహ్మాదయస్తపస్తప్యంతే కుర్వతే కథంభూతాః ఐంద్రియే సుఖే ధీర్యేషాం. అలుక్సమాసః. తథాపి భవత్పాదపరాయణాదృతే మాం న విందంతి మత్కటాక్షవిలసితా విభూతీర్న లభంత ఇత్యర్థః. యతః త్వయ్యేవ హృదయం యస్యాస్సా. అహం త్వత్పరతంత్రత్వాత్ త్వదనువర్తినమేవ విలోకయామ-నాన్యమిత్యర్థః. 23

ఓ అజితా! నన్ను సేవించుటచే సర్వకామప్రాప్తి ఎలా కలుగుతుంది? నీవే (లక్ష్మీదేవియే) కామార్థులచే సేవించబడెదవు కదా అను శంకా నివృత్తికై తెలుపుచున్నాడు.

ఇంద్రియ సుఖ కాంక్షులగు బ్రహ్మ రుద్రాది దేవతాగణము నా (లక్ష్మీదేవి) ప్రాప్తికై కఠినమైన తపమాచరించెదరు. కాని నీ చరణకమలముల నాశ్రయించిన వారు తప్ప నన్నెవరునూ పొందలేరు ఏలనన నా మనస్సు నీ యందు లగ్నమై యుండును కదా! 23






శ్లో॥ సత్త్వం మమాప్యచ్యుత శీర్ష్ణివందితం
కరాంబుజం యత్త్వదధాయి సాత్వతామ్ ।
బిభర్షి మాం లక్ష్మవరేణ్యమాయయా క
ఈశ్వరస్యేహితమూహితుం విభుః ॥ 24

టీ:- ఇదానీం తత్కృపాం ప్రార్థయతే-సత్త్వమితి. యద్భజనం వినా స కశ్చిత్పురుషార్థః సత్త్వం. త్వదితి. త్వయా. యత్కరాంబుజం సాత్వతాం భక్తానాం శీర్ష్ణి అధాయి కృపయా న్యస్తం. తన్మమాపి శీర్ష్ణిని ధేహీతి శేషః. కధంభూతం. వందితం సర్వకామవర్షిత్వేన సద్భిః స్తుతం. న చ మయి తవానాదరః. యతః హే వరేణ్య మాం వక్షసి లక్ష్మ బిభర్షి. అహో విచిత్రమేతత్. మయి కేవలమాదరమాత్రం భక్తేషు తు పరమకృపా. అత ఈశ్వరస్య తవ. యత్ మాయయా ఈహితం. తత్కో వితర్కయితుం సమర్థః. 24

ఇపుడు భగవత్కృపను కోరుచున్నది. ఓ అచ్యుతా కేవలము భజించడము తప్ప వేరు పురుషార్థమేదియు లేనట్టి నీవు సమస్త కోరికలు తీర్చునట్టి, సత్పురుషులచే స్తుతించబడు, ఏ నీ కరపద్మమును భక్తుల శిరమున దయతో నుంచితివో అట్టి కరపద్మమును నా శిరమున నుంచుము. (అని అధ్యాహారము) ఓ వరేణ్యా! నన్ను నీ వక్షఃస్థలమున భరిస్తూ నాపై ఆదరమే కలిగి యున్నావు. నాయందు కేవలము ఆదరము, భక్తుల యందు పరమమైన దయ కల్గియున్నావనునది చాలా విచిత్రము. అందువలన నీ మాయతో కూడిన లీలను ఎవరునూ తెలియుటకు సమర్థులు కారు. 24

చూ॥ రమ్యకేऽపి భగవతః ప్రియతమం మాత్స్యమవతారరూపం తద్వర్షపురుషస్య మనోః ప్రాక్ప్రదర్శితం-ఇదానీమపి మహతా భక్తియోగేనారాధయతి-ఇదం-చోదాహరంతి-ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమస్సత్త్వాయ ప్రాణాయౌజసే సహసే బలాయ మహామత్స్యాయ నమ ఇతి. 25

రమ్యకవర్షమున రమ్యక వర్షాధిపతియగు మనువునకు పూర్వము భగవంతుడు మహామత్స్యరూపములో దర్శనమొసగెను. ఇప్పుడుగూడా ఆ మనువు గొప్ప భక్తియోగముతో ఆ మత్స్యమూర్తిని ఆరాధిస్తూ, సత్వప్రధానుడు, ప్రాణభూతుడు, సూత్రాత్ముడు మానసిక, ఇంద్రియ, శారీరకబలరూపుడు, ఓంకార స్వరూపుడు, సర్వశ్రేష్ఠుడునగు మహామత్స్యమూర్తికి నమస్కారము అని స్తుతించును. 25








టీ:- రమ్యక ఇతి. సత్త్వాయ సత్త్వప్రధానాయ. ముఖ్యతమాయ. ప్రాణాయ సూత్రాత్మనే. 25

శ్లో॥ అంతర్బహిశ్చాఖిలలోకపాలకై
రదృష్టరూపో విచిరస్యురుస్వనః ।
స ఈశ్వరస్త్వం య ఇదం వశేన
యన్నామ్నా యథా దారుమయీం నరస్త్రియమ్ ॥ 26

టీ:- అంతరితి. ఉరుః స్వనో వేదాత్మకో నాదో యస్య. యః ఇదం విశ్వం. బ్రాహ్మణాదినామ్నా విధి నిషేధాలంబనభూతేన. వశే అనయత్ నియమితవాన్. సః త్వమీశ్వరః. తథా చ శ్రుతిః. "తస్య వాక్తంతిర్నామాని దామానీ"తి. 26

వేదమే నాదముగా గల్గినట్టి, బ్రహ్మాది సమస్త లోకపాలకులచే చూడబడని రూపము కలిగి, (బ్రహ్మాది లోకపాలకులకుకూడా అగమ్యుడవగు) కూడా సమస్త ప్రాణులలో ప్రాణరూపముగా, బయట వాయు రూపముగా సంచరించు ఈశ్వరుడవగు నీవు, బొమ్మలనాడించు నరుడు దారుమయములగు బొమ్మలనాడించునటుల విధి నిషేధముల కాలంబనమగు బ్రాహ్మణాది నామములతో ఈ ప్రపంచమును అధీనము చేసికొని ఆడించెదవు. ఈ విషయమును "తస్యవాక్తంతిర్నామా నిదామాని" అను శ్రుతి తెలుపుచున్నది. 26

శ్లో॥ యం లోకపాలాః కిల మత్సరజ్వరా
హిత్వా యతంతోఽపి పృథక్సమేత్య చ ।
పాతుం న శేకుర్ద్విపదశ్చతుష్పద
స్సరీసృపం స్థాస్ను యదత్ర దృశ్యతే ॥ 27

టీ:- నన్విద్రాదయో వశం నయంతి. లోకపాలత్వాత్ కుతోఽహం?

లోకపాలకులు కావున జగత్తును ఇంద్రాదులే ఆధీనమొనర్చుకొనదెరు నేనెలా స్వాధీనపరచుకొనగలను అన్నచో తెలుపుచున్నాడు.

ఇంద్రియాభిమానులు, మాత్సర్యయుక్తులగు ఇంద్రాది లోకపాలకులు ప్రాణస్వరూపుడవగు నిన్ను వదిలి (అనగా నీవులేక పోవుటచే) ఆ లోకపాలకులు వేరువేరుగాగాని, అందరుకలసిగాని మనుష్య, పశు, స్థావర, జంగమాదులగు ఎన్ని ప్రాణులు ఈ జగత్తున







తత్రాహ – యమితి. మత్సర ఏవ జ్వరో యేషాం తే. యం హిత్వా ద్విపదశ్చతుష్పదః – సరీసృపం జంగమం స్థాస్ను స్థావరం చ. యదత్ర దృశ్యతే తత్కించిదపి పాతుం న శక్తాః సత్వమేవ ప్రాణరూపేణ పాలక ఈశ్వరశ్చేత్యర్థః. తథా చ శ్రుతిః. "తా అహింసం తాహముద్ధ మస్మ్యహముక్తమస్మీ" త్యాది. 27

శ్లో॥ భవాన్ యుగాంతార్ణవ ఊర్మిమాలిని
క్షోణీమిమామోషధి వీరుధాం నిధిం ।
మయాసహోరుక్రమతేజ ఓజసా
తస్మై జగత్ప్రాణ గణాత్మనే నమః ॥ 28

టీ:– అవతారచరితమాహ – భవానితి. భవాన్. ఇమాం క్షోణీం – మయా మనునా సహ. మత్సహితాం ధృత్వేత్యధ్యాహారః. ఊర్మిమాలావతి ప్రళయార్ణవే. ఓజసా ఉరుక్రమ తే విచరతి. యద్వా పాతుమిత్యస్యా నుషంగః. క్షోణీం పాతుం క్రమతే ఉత్సహత ఇత్యర్థః. యతః అజః కీదృశీం ఓషధీనాం వీరుధాం చ నిధిమాశ్రయభూతాం తస్మై తే నమః జగతో యః ప్రాణగణస్తస్యాత్మనే నియంత్రే. 28

కనబడుచున్నవో వాటిలో ఒక్క ప్రాణిని కూడా కఠిన ప్రయత్నముతోనైనా రక్షించలేకపోయిరి అనగా నీవే ప్రాణరూపముగా రక్షించు ఈశ్వరుడవు అని భావము. ఈ విషయమును "తా అహింసంతాహ ముద్ధమస్మ్యహ ముక్తమస్మి" అను శ్రుతి తెలుపుచున్నది. 27

అవతారచరితను తెలుపుచున్నాడు. ఓ అజా! నీవు పెద్దనగు అలలతోకూడిన ప్రళయకాలమందలి సముద్రములో, ఓషధులకు, లతలకు ఆశ్రయభూతమగు ఈ భూమండలమును నాతో సహా వహించి ఉత్సాహముతో విహరించెదవు. ఈ భూమండలమును, నన్ను రక్షించుటకు ఉత్సాహముతో పరిక్రమించెదవు. అట్టి నీకు నమస్కారము (అని స్తుతించుచుండెను). 28










చూ॥ హిరణ్మయే తు భగవాన్నివసతి కూర్మతనుం న బిభ్రాణస్తస్య తత్ప్రియతమాం తనుమర్యమాసహ తద్వర్షపురుషైః పితృ గణాధిపతి రుపధావతి- మంత్రమిమం చానుజపతి. ఓం నమో భగవతే - అకూపారాయా - సర్వసత్త్వగుణవిశేషణాయ, నోపలక్షిత స్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమోఽవస్థానాయ నమస్తే ఇతి. 29

టీ:- హిరణ్మయ ఇతి. తత్ప్రియతమాం తాం ప్రియతమాం అకూపారాయ. కూర్మాయ సర్వః సంపూర్ణః సత్త్వగుణో విశేషణం యస్య. న ఉపలక్షితం స్థానం యస్య వారిచరత్వాత్ వర్ష్మణే వర్షీయసే. కాలాన వచ్ఛిన్నాయ. భూమ్నే సర్వగతాయ. అవస్థానాయ ఆధారాయనాయ. 29

శ్లో॥ యద్రూపమేతన్నిజమాయయార్పితం
చార్థస్వరూపం బహురూపరూపితం ।
సంఖ్యానయస్యాస్త్యయథోపలంభ
నాత్తస్మైనమస్తేఽవ్యపదేశరూపిణే ॥ 30

టీ:- యదితి. నిజమాయయా అర్పితం ప్రకాశితమేతదర్థస్వరూపం. దృశ్యం పృథివ్యాది యస్యైవ రూపం. యతః పృథక్ నాస్తి. కథంభూతం బహుభిః రూపైః రూపితం నిరూపితం యస్య చ సంఖ్యా నాస్తి కుతః. అయథా మిథ్యైవోపలంభనాత్. నహి మరీచిజలమేతావదితి సంఖ్యాతుం శక్యతే. అవ్యపదేశరూపిణే అనిరుక్తప్రపంచాకారాయ. 30

హిరణ్మయవర్షములో భగవంతుడగు శ్రీహరి కమఠ (తాబేలు) రూపమును ధరించి నివసించును. ఆ హిరణ్మయవర్షములో నివసించెడి వారితోకూడి పితృగణములకధిపతియగు అర్యముడు భగవంతుని ప్రియతమ రూపమగు కమఠరూపమును ఈ మంత్రమును జపిస్తూ ఉపాసించుచుండును. ఐశ్వర్యాదిషడ్గుణ సంపన్నుడు, సంపూర్ణ సత్వగుణయుక్తుడు సముద్రమున (జలములో) నివసించడముచే ఎవరిచేతను తెలియబడని నివాసస్థానముకల్గినవాడు కాలావచ్ఛిన్నుడు, సర్వవ్యాపకుడు, సర్వాధారుడు, ఓంకారస్వరూపుడు నగు కచ్ఛప రూపునకు నమస్కారము.(అని జపిస్తూ ఉపాసించెను). 29

అనేక రూపములతో నిరూపితమగు నీ యొక్క మాయచే ప్రకాశిత మగు పృథివ్యాది రూపమగు ఈ దృశ్య ప్రపంచము మిథ్యాభూతమే అయినందున మృగతృష్ణలో ఇంత నీరున్నదని లెక్కించి చెప్పుటకు వీలుకానటుల దీనిని లెక్కించశక్యము కాదు. అట్టి రూపము నీది. అలాంటి అనిర్వచనీయ రూపుడవగు నీకు నమస్కారము. (సగుణ రూపము కూడా మాయామయమైన నీ రూపమే కావున అనిర్వచనీ- యము) 30











శ్లో॥ జరాయుజం స్వేదజమండజోద్భిజం
చరాచరం దేవర్షిభూతమైంద్రియం ।
ద్యౌః ఖం క్షితిశ్శైల సరిత్సముద్రా
ద్వీపగ్రహర్ క్షేత్ర్యభిధేయ ఏకః ॥ 31

టీ:- బహురూపత్వం దర్శయన్ తస్యైవేశ్వరాదవ్యతిరేకమాహ - జరాయుజమితి. ద్వీపగ్రహర్క్షేత్ర్యభిధేయస్త్వమేవైకః. న త్వద్వ్యతిరిక్తోఽస్తి "సర్వం ఖల్విదం బ్రహ్మే"త్యాది శ్రుతేరిత్యర్థః. 31

శ్లో॥ యస్మిన్న సంఖ్యేయ విశేష నామ
రూపాకృతౌ కవిభిః కల్పితేయం ।
సంఖ్యా యయా తత్త్వదృశాపనీయతే
తస్మై నమస్సాంఖ్య నిదర్శనాయ ॥ 32

టీ:- సప్రపంచతామనూద్య తన్నిరాసేన ప్రణమతి - యస్మిన్నితి. అసంఖ్యేయాః అనంతాః విశేషాః యేషాం తాని. నామాని రూపాణ్యాకృతయశ్చ యస్య. తాదృశే యస్మిన్ త్వయి. కవిభిః కపిలాదిభిః. ఇయం చతుర్వింశత్యాదిసంఖ్యా కల్పితా సతీ. యయా తత్త్వదృశా యేన తత్త్వజ్ఞానే న అపనీయతే తస్మై తే సంఖ్య సిద్ధాంత రూపాయ నమః. పరమార్థరూపాయేతి వా. 32

ఈ దృశ్య ప్రపంచముయొక్క అనేక రూపములను చూపుతూ అవన్నియూ ఈశ్వరాభిన్నములే అని తెలుపుచున్నాడు. జరాయుజములు, స్వేదజములు అండజములు, ఉద్భిజములు, జంగమములు, స్థావరములు, దేవతలు, పితృగణములు, ఋషులు, భూతములు, ఇంద్రియసంబంధములు, స్వర్గము, ఆకాశము, భూమి, పర్వతములు, నదులు, సముద్రములు, ద్వీపములు, గ్రహములు, నక్షత్రములు మొదలగు విభిన్న నామములతో పలుకబడెడి దృశ్యప్రపంచమంతయు నీవొక్కడవే. (నీవే) నీకంటే వేరేదియు లేదు. ఈ విషయమున "సర్వంఖల్విదంబ్రహ్మ" అను శ్రుతి ప్రమాణము. 31

అసంఖ్యాములగు నామములు అనేక రూపములు విశేషాకృతులు కల్గియున్న నీ యందు కపిలాది విద్వజ్జనులచే చతుర్వింశతి సంఖ్య ఏదైతే కల్పించబడినదో అది తత్త్వ దృష్టి కలిగిన పిదప తొలగిపోవును. వస్తుతః నీవొక్కడవే! అట్టి సాంఖ్య సిద్ధాన్త స్వరూపుడవగు నీకు నమస్కారము. 32










చూ॥ ఉత్తరేషు కురుషు-భగవాన్ యజ్ఞపురుషః కృతవరాహరూప ఆస్తే. తంతు దేవీ హ్యేషా భూస్సహకురుభిరస్ఖలిత భక్తియోగేనోపధావతి -ఇమాం చ పరమాముపనిషదమావర్తయతి,ఓంనమో భగవతే మంత్ర తత్త్వలింగాయ-యజ్ఞక్రతవే - మహాధ్వరావయవాయ-మహీధరాయ. మహా పురుషాయ నమః - కర్మశుక్లాయ - త్రియుగాయాగుణాయ నమస్తే ఇతి. 33

టీ:- ఉత్తరేష్వితి. ఏషా భూరుపధావతీత్యన్వయః మంత్రై స్తత్త్వేన లింగత్య ఇతి తథా తస్మై. యజ్ఞాః అయూపాః క్రతవః సయూపాః. తద్రూపాయ అత ఏవ. మహాంతః అధ్వరాః అవయవభూతా యస్య. కర్మణా శుక్లాయ శుద్ధాయ. యజ్ఞాధిష్ఠాత్రే త్రియుగాయ కృతయుగే యజ్ఞాభావాత్. యద్వా - కలియుగే ఛన్నత్వాత్. 33

ఉత్తర కురువర్షమున భగవంతుడగు యజ్ఞపురుషుడు యజ్ఞ వరాహరూపముతో ప్రకాశించుచున్నాడు. ఆ యజ్ఞ వరాహమూర్తిని కురువర్ష వాసులతో కూడి పృథ్వి అచంచలమైన భక్తియోగముతో ఉపాసించుచుండును. ఈ గొప్పనైన మంత్రమును జపిస్తూ ఉపాసించును. ఐశ్వర్యాది షడ్గుణ సంపన్నుడవు, నిజతత్త్వము వేదమంత్రములతో తెలియబడేవాడవు, యజ్ఞరూపుడవు, క్రతురూపుడవు అగు (అయూపముతి యజ్ఞములు సయూపములు (క్రతువులు) గొప్ప యజ్ఞములే అవయవములుగా కలవాడవు, మహాపురుషుడవు, శుద్ధకర్ముడవు, త్రియుగమూర్తివి, అగుణమూర్తివి, ప్రణస్వరూపమువు, యజ్ఞవరాహమూర్తి వగు నీకు నమస్కారము. (కృత యుగమున యజ్ఞములు లేనందున త్రియుగ మూర్తివని చెప్పబడినది). 33

శ్లో॥ యస్య స్వరూపం కవయో విపశ్చితో
గుణేషు దారుష్వివ జాతవేదసం ।
మథ్నంతి మథ్నా మనసా దిదృక్షవో
గూఢం క్రియార్థైర్మథనేరితాత్మనే ॥ 34

టీ:- యస్యేతి కవయో విద్వాంసః విపశ్చితో నిపుణాః గుణేషు

అప్రకాశమానుడగు ఏ స్వరూపమును నిపుణులగు పండితులు కాష్ఠములతో అగ్నిని మథించినటుల, నిన్ను చూడగోరినవారై దేహేంద్రియాదులలో వివేకసాధనమగు మనస్సుతో కర్మఫలములతో మథించెదరో (వెదుకుదురో) ఆ మథనముతో ప్రాకట్యమొందిన ఆత్మస్వరూపుడవగు నీకు నమస్కారము. 34









దేహేంద్రియాదిషు మథ్నంతి విచిన్వన్తి మథ్నా వివేక సాధనేన మనసా క్రియార్థైః కర్మభిస్తత్ఫలైశ్చ గూఢం అప్రకాశమానం దిదృక్షవః. ఏవం మథనే ఈరితః ప్రకటితః ఆత్మా స్వరూపం యస్య తస్మై నమః. 34

శ్లో॥ ద్రవ్యక్రియా హేత్వయనేశ కర్తృ
భిర్మాయాగుణైర్వస్తు నిరీక్షితాత్మనే ।
అన్వీక్షయాం గాతిశయాత్మబుద్ధిభిర్ని
రస్తమాయా కృతయే నమో నమః ॥ 35

టీ:- మథనమేవ దర్శయన్నాహ - ద్రవ్యేతి. ద్రవ్యం విషయః. క్రియా ఇంద్రియవ్యాపారః హేతుర్దేవతా. అయనం దేహః ఈశః కాలః కర్తా అహంకారః. ఏతైర్మాయాగుణైః కార్యైరుపలక్షణైః. వస్తుతేన నిరీక్షితో య ఆత్మా తస్మై అన్వీక్షయా విచారేణ. అంగైర్యమనియమాదిభిః అతిశయాత్మా నిశ్చయవతీ బుద్ధిర్యేషాం తైః. నిరస్తా మాయా నిమిత్తా ఆకృతిర్యస్మాత్ తస్మై. 35

శ్లో॥ కరోతి విశ్వస్థితి సంయమోదయం
యస్యేప్సితం నేప్సితమీక్షితుర్గుణైః ।
మాయా యథాయో భ్రమతే తదాశ్రయం
గ్రావ్ణో నమస్తే గుణకర్మసాక్షిణే ॥ 36

ఆ మనోమథనమే చూపుతూ తెలుపుచున్నాడు. విచారముతో యమ, నియమాది యోగసాధనతో, నిశ్చయమగు బుద్ధికలవారై, విషయము, ఇంద్రియవ్యాపారము, ఇంద్రియాధిష్ఠాతృ దేవతలు, శరీర మూలము, అహంకారము మున్నగుమాయాగుణ కార్యములనుగాంచి వాస్తవికముగా ఆత్మతత్త్వమును నిశ్చయించి ఇలాంటి మాయికములగు ఆకారరహితుడవగు నీకు నమస్కారము. 35

ఈ విధముగా నిర్గుణరూపమునకు నమస్కరించి ప్రస్తుతము పరమేశ్వర రూపమునకు నమస్కరించుచున్నాడు. జడమగు లోహము (ఇనుము) అయస్కాంతమునకభిముఖమై ఎటుల భ్రమించునో అటు లనే ఏ సర్వసాక్షిభూతుని యొక్క (తన కొరకు కాకుండ సమస్త ప్రాణుల




టీ:- తదేవం నిర్గుణరూపేణ నత్వా. పరమేశ్వరరూపేణ ప్రణమతి- కరోతీతి. యస్యేక్షితుర్జీవార్థమీప్సితం అత్యంతానిచ్ఛాయామీక్షణా యోగాత్. స్వార్థం తు నేప్సితం విశ్వస్థిత్యాది స్వగుణైర్మాయాకరోతి. తస్యాః జడత్వేఽపీశ్వరసన్నిధానాత్ ప్రవృత్తిం దృష్టాంతేనాహ- యథా అయః లోహో గ్రావ్ణః అయస్కాంతాన్నిమిత్తాత్ భ్రమతి. తదాశ్రయం తదభిముఖం సత్. గుణానాం కర్మాణాం జీవ దృష్టానాం చ. సాక్షిణే తస్మై తే నమః. 36

శ్లో॥ ప్రమథ్య దైత్యం ప్రతివారణం మృథే
యో మాం రసాయా జగదాది సూకరః ।
కృత్వాగ్ర దంష్ట్రే నిరగాదుదన్వతః
క్రీడన్నివేభః ప్రణతోఽస్మి తం విభుమ్ ॥ 37

టీ:- అవతారచరితమాహ - ప్రమథ్యేతి. యో జగతామాదిః కారణ భూతః సూకరః మాం పృథ్వీం అగ్ర దంష్ట్రే దంష్ట్రాగ్రే కృత్వా. రసాతలాదారభ్య ఉదన్వతః ప్రళయార్ణవాత్. ఇభో గజ ఇవ నిరగాత్. తతశ్చ. ప్రతివారణం ప్రతిగజతుల్యం. దైత్యం ప్రమథ్య. యః క్రీడన్ స్థితః. తం ప్రభుం ప్రణతాస్మీత్యన్వయః. 37

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, అష్టాదశోఽధ్యాయః**

కొరకై) ఇచ్ఛామాత్రముతో విశ్వ స్థిత్యాది స్వగుణములతో మాయ (ప్రకృతి) జగదుత్పత్తి స్థితిలయములనొనరించుచున్నదో అలాంటి సమస్త గుణ కర్మలకు సాక్షిభూతుడవగు నీకు నమస్కారము. 36

వరాహావతార చరితను తెలుపుచున్నాడు.

జగత్తుకు కారణభూతమగు ఏ ఆదినారాయణమూర్తి యుద్ధమున ప్రతిద్వంద్వియగు హిరణ్యాక్ష రాక్షసుని సంహరించి నన్ను (భూమిని) కోరలపై నుంచుకొని రసాతలము నుండి, ప్రళయ సముద్రము నుండి గజమువలె క్రీడిస్తూ బయటకు కొనివచ్చినాడో ఆ ప్రభువగు నీకు నమస్కరించుచున్నాను. 37

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పద్దెనిమిదవ అధ్యాయము సమాప్తము.**






## ఏకోనవింశోऽధ్యాయః

శ్లో॥ ఊనవింశే కింపురుషే భారతే చోపవర్ణ్య తే ।
సేవ్యసేవకభావశ్చ భారతశ్రేష్ఠ్యమేవ చ ॥

**శ్రీశుక ఉవాచ**

చూ॥ కింపురుషే వర్షే భగవంతమాదిపురుషం లక్ష్మణాగ్రజం సీతాభిరామం రామం తచ్చరణసన్నికర్షాభిరతః పరమభాగవతోత్తమో హనుమాన్ సహ కింపురుషైరవిరతభక్తిరుపాస్తే-ఆర్ష్టిషేణేన సహ గంధర్వైరనుగీయమానాం పరమకల్యాణీం భర్తృభగవత్కథాం సంశ్రుణోతి స్వయం చేదం గాయతి ఓం నమో భగవతే-ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణశీలవ్రతాయ-నమ ఉపశిక్షితాత్మనే నమ ఉపాసిత లోకాయ -నమస్సాధువాదనికర్షణాయ నమో బ్రహ్మణ్య దేవాయ-మహాపురుషాయ-మహారాజాయ నమ ఇతి. 1

టీ:- చ. కింపురుష ఇతి. భర్తా చాసౌ భగవాంశ్చ తస్య కథాం. ఆర్యాణాం లక్షణాని. శీలం. వ్రతం చ యస్మిన్. ఉపశిక్షితాత్మనే సంయతచిత్తాయ. ఉపాసితోऽనుస్మృతో లోకో యేన. సాధువాదః సాధుత్వ ప్రసిద్ధిః. తస్య నికర్షణాయ. నికషాశ్మవన్నిర్ధారణ స్థానాయ పరమసీమ్నే ఇత్యర్థః. 1

## 19 వ అధ్యాయము

ఈ పందొమ్మిదవ అధ్యాయమున కింపురుష, భారత వర్షముల సేవ్య సేవక భావము భారతవర్షము యొక్క శ్రేష్ఠత్వము తెలుపబడు చున్నది.

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

కింపురుషవర్షమున లక్ష్మణునికగ్రజుడు, ఆదిపురుషుడు, సీతాహృదయాభిరాముడు, భగవంతుడునగు శ్రీరామచంద్రుణ్ణి, రామచంద్రుని పాద సన్నిధి రసికుడగు పరమ భాగవతోత్తముడగు హనుమంతుడు కింపురుషవర్షములోని కిన్నరులతో కూడి అవిరళ భక్తితో ఉపాసించుచుండును. అచటి గంధర్వులతోగూడి ఆర్ష్టిషేణుడు, ప్రభువు, భగవంతుడునగు శ్రీరామచంద్రునియొక్క పరమ మంగళకరమగు చరితను గానము చేయుచుండును. ఆ రామకథా గానము వింటూ హనుమ స్వయముగా ఈ మంత్రమును జపించు చుండును. ఐశ్వర్యాది షడ్గుణసంపన్నుడు, పవిత్ర కీర్తిమంతుడు, మహాపురుష లక్షణములు, శీలములే వ్రతములుగా గలవాడు సంయత చిత్తుడు, లోకారాధనతత్పరుడు, సాధుత్వమునకు ఒరిపిడి రాయివంటి వాడు, బ్రాహ్మణులను దైవములుగా భావించెడి వాడు, మహాపురుషుడు, రాజాధిరాజు, ఓంకారస్వరూపుడును అగు శ్రీరామచంద్రునకు నమస్కారము అని జపిస్తూ ఉపాసించుచుండును. 1








శ్లో॥ యత్త ద్విశుద్ధానుభవైకమాత్రం
స్వతేజసా ధ్వస్తగుణవ్యవస్థం ।
ప్రత్యక్ప్రశాంతం సుధియోపలంభనం
హ్యనామరూపం నిరహం ప్రపద్యే ॥ 2

టీ:- శ్రీరామం పరమార్థ రూపేణ ప్రణమతి - యదితి. యదేకం వేదాంతేషు ప్రసిద్ధం తత్త్వం తత్ప్రపద్యే. కథంభూతం. విశుద్ధశ్చాసావనుభవశ్చ. స ఏవ మాత్రా స్వరూపం యస్య. విశుద్ధత్వే హేతుః. ప్రశాంతం తత్రాపి హేతుః. స్వతేజసా. స్వరూపప్రకాశేన. ధ్వస్తా గుణానాం వివిధా జాగ్రదాద్యవస్థా యస్మిన్. అనుభవమాత్రత్వే హేతుః . ప్రత్యక్ దృశ్యాదన్యత్. తత్కుతః. అనామరూపం.నను వస్తుత ఏవం భూతస్యాపి జీవస్యోక్తసర్వవిపర్యయో దృశ్యతే. తత్రాహ- నిరహం అహంకారాభావాత్. న తథా వైపరీత్యమిత్యర్థః. నను శ్రీరామస్య రూపం నైవం ప్రతీయతే. తత్రాహ సుధియా పుంసా ఉపలభ్యత ఇత్యుపలంభనం. శుద్ధచిత్తేన బ్రహ్మత్వేనైవోపలభ్యత ఇత్యర్థః. 2

శ్లో॥ మర్త్యావతారస్త్విహ మర్త్యశిక్షణం
రక్షోవధాయైన న కేవలం విభోః ।
కుతోఽన్యథా స్యాద్రమతస్స్వ ఆత్మన్
సీతాకృతాని వ్యసనానీశ్వరస్య ॥ 3

శ్రీరామచంద్రుణ్ణి పరమాత్మరూపముతో నమస్కరించుచున్నాడు. వేదాన్తములలో ప్రసిద్ధమగు, విశుద్ధమైన అనుభవైకవేద్యుడవు, నీ స్వరూపప్రకాశముతో గుణముల కార్యరూపమగు జాగ్రదాది అవస్థలను ధ్వంసమొనరించినవాడవు, కనబడుదానికంటే భిన్నుడవు, పరమశాంతుడవు, అహంకారశూన్యుడవు, మంచి బుద్ధితో గ్రహించబడువాడవు, నామ రూప రహితుడవు, నిన్ను శరణు కోరుచున్నాను. శ్రీరామచంద్రుని రూపము ప్రతీయమానము కాదు కాని మంచి బుద్ధికల వారికి ఉపలభ్యమానమయ్యేడిది అనగా శుద్ధచిత్తముతో బ్రహ్మత్వమునొందిన వారికి లభించునని భావము. 2

అటులైనయెడల దశరథుని పుత్రుడవగుట ఎలా అనగా తెలుపుచున్నాడు. ప్రభువునకు మానవావతారము, మానవులకంటే అన్యులచే వధింపబడనట్టి రావణుని సంహరించుటకు మాత్రమేకాక ఈ సంసారమున స్త్రీ సంగముతో కలిగెడి దుఃఖము వారించవీలులేనిదని,



టీ:- కథం తర్హి దశరథపుత్రత్వం? తత్రాహ-మర్త్యేతి. విభోర్మర్త్యావతారస్తు రక్షసో రావణస్య వధాయైవ. న తస్య మనుష్యాదన్యతః అవధ్యత్వాత్. న కేవలమేతావత్ కింత్విహ సంసారే స్త్రీసంగాదికృతం దుఃఖం దుర్వారమితి. మర్త్యానాం శిక్షణం చ శిక్షార్థమపీత్యర్థః. అన్యథా. స్వే స్వరూపే. రమమాణస్య. జగదాత్మనః. సీతావిరహకృతాని వ్యసనానీతి-కుతస్స్యాత్. 3

మానవులకు తెలుపుటకు కూడా కల్గినది. అటులకానియెడల స్వాత్మానందుడగు జగదాత్మునకు సీతాదేవి విరహముచే కల్గిన దుఃఖములు ఎలా సంభవించును? 3

శ్లో॥ న వై స ఆత్మాత్మవతాం సుహృత్తమః
సక్తస్త్రిలోక్యాం భగవాన్వాసుదేవః ।
న స్త్రీకృతం కశ్మలమశ్నువీత న
లక్ష్మణం చాపి విహాతు మర్హతి ॥ 4

విషయాసక్తి లేనందున వ్యసనానర్హతను ప్రతిపాదించుచున్నాడు. ఆత్మవంతులకు ధీరులకు ఆత్మభూతుడు, మిత్రశ్రేష్ఠుడునగు భగవంతుడవు, వాసుదేవుడవగు నీకు త్రిలోకములలోని ఏ వస్తువునందును ఆసక్తి లేదు. అందువలన నీవు స్త్రీకృతమగు మోహమును సీతాదేవి వియోగముతో కల్గిన వ్యసనమును అనుభవించవు. లక్ష్మణునికూడా వదులుటకర్హుడవుకాదు. ఒకప్పుడు ఒక దేవదూత శ్రీరామునితో మనమిరువురము మాటలాడునపుడు ఎవరును రాకూడదు అటుల వచ్చినవారిని నీవు సంహరించవలెనని నియమమొనర్చగా, శ్రీరాముడు తాము మాటలాడు ప్రదేశమున కెవరును ప్రవేశించకుండ లక్ష్మణుని కాపలాగా ఉంచెను. అపుడు రామ దర్శనమునకు దుర్వాసమహర్షి రాగా లక్ష్మణుడు దుర్వాసుని రాకను తెలుపుటకై ప్రవేశించగా శ్రీరాముడు నియమము ప్రకారము లక్ష్మణుని వధించుట కుద్యమించగా, వసిష్ఠుడు ప్రియజనులను బహిష్కరించి వదిలివేయుట

టీ:- విషయాసక్త్యభావేన వ్యసనానర్హత్వముపపాదయతి-నవా ఇతి. స వై భగవాన్ త్రిలోక్యాం క్వాపి న సక్తః యత ఆత్మవతాం ధీరాణామాత్మా సుహృత్తమశ్చ అతో న స్త్రీకృతం మోహం ప్రాప్నుయాత్ న లక్ష్మణం చేతి దేవదూతేన శ్రీరామమామంత్రయతా విజ్ఞాపితం ఆవయోర్గోష్ఠీం కుర్వతోర్య ఆగచ్ఛతి న త్వయా వధ్య ఇతి. తథైవ ద్వారిస్థితం లక్ష్మణం దుర్వాసనం సమాగతం విజ్ఞాపయితుం ప్రవిష్టం హంతుముద్యతో వసిష్ఠవాక్యాత్తత్యాజ. తచ్చన యుజ్యేతేత్యర్థః. 4





శ్లో॥ జన్మ నూనం మహతో న సౌభగం
న చాపి బుద్ధిర్నాకృతిస్తోష హేతుః ।
తైర్యద్విసృష్టానపి నో వనౌకస
శ్చకార సఖ్యే బత లక్ష్మణాగ్రజః ॥ 5

టీ:- అతః శ్రీరామ ఏవ సర్వైస్సేవ్య ఇతి వక్తుం న తస్య తోష హేతుః సత్కుల జన్మాది. కింతు భక్తిరేపేత్యాహ-న జన్మేతి. మహతః పురుషాజ్జన్మ. మహతః శ్రీరామస్యేతి వా. సౌభగం సౌన్దర్యం. ఆకృతిః జాతిః. యద్యస్మాత్. తైర్జన్మాదిభిః విసృష్టాన్ త్యక్తానపి నో వనచరాన్. బత అహో. లక్ష్మణస్యాగ్రజోఽపి సఖిత్వే కృతవాన్. 5

శ్లో॥ సురోఽసురోవాథ నరోఽథవా
నరః సర్వాత్మనా యస్సుకృతజ్ఞముత్తమమ్ ।
భజేత రామం మనుజాకృతిం
హరిం య ఉత్తరాననయత్కోసలాన్ దివమ్ ॥ 6

మృత్యుదండనతో సమానమని తెలుపగా లక్ష్మణుని వదిలివేసెను. (అని చరిత్రప్రసిద్ధి కలదు) సీతావియోగ వ్యసనము, లక్ష్మణ పరిత్యాగము ఈ రెండునూ తగినట్టివి కావని భావము. 4

అందువలన శ్రీరామచంద్రుడే అందరిచేత సేవించదగినవాడు అని చెప్పుటకై, ఆ శ్రీరామునకు సంతోషహేతువులు, సత్కుల జన్మాదులు కావు. భక్తియే ఆతనిని సంతసింపచేయునని తెలుపుచున్నాడు.

ఉత్తమకులములో జన్మించడము, సౌందర్యము, వాక్చాతుర్యము, బుద్ధివైభవము, జాతి ఇవేవియు నీ సంతోషమునకు కారణములు కావు. ఏలనన నీవు లక్ష్మణునకగ్రజుడవైకూడా పైన చెప్పబడిన సత్కుల జన్మాదులు ఏవియు లేనట్టి మా వానరులతో సఖ్యము నర్పితివి. 5

అందువలన దేవతలుకాని, రాక్షసులుకాని, నరులుకాని, వానరులుకాని, ఎవరైనకాని సర్వదా సర్వాత్మనా ఉత్తమోత్తముడు, సుకృతజ్ఞుడు, మనుజాకృతితో అవతరించిన శ్రీహరియగు శ్రీరాముని సేవించవలయును. ఆ శ్రీరాముడు ఆశ్రితవత్సలుడై తనను భజించిన ఉత్తరకోసలవాసులకు (అయోధ్యవాసులను) స్వర్గవాసము కల్పించెను. 6





టీ:- సుర ఇతి. తస్మాత్ సురో వా అన్యోవా. యః కోऽపి. శ్రీరామమేవ సర్వప్రకారేణ భజేత్. సుకృతజ్ఞం అల్పీయసి భజనే బహుమానినం. య ఉత్తరాన్ కోసలాన్ అయోధ్యావాసినః. దివం స్వర్గమనయత్. 6

చూ॥ భారతేऽపి వర్షే భగవాన్ నారాయణాఖ్య ఆకల్పాంతముపచిత ధర్మ జ్ఞాన వైరాగ్యైశ్వర్యోపశమో పరమమాత్మోపలంభనమనుగ్రహాయాత్మ వతామనుకంపయా తపోవ్యక్తగతి శ్చరతి. 7

టీ:- భారతేऽపీతి ఉపచితైర్ధర్మాదిభిరాత్మా ఉపలభ్యతే యేన తత్త పశ్చరతి. తత్ర ఉపశమః ఇంద్రియాణాం సంయమః. ఉపరమో నిర హంకారతా. ఆత్మవతామనుగ్రహాయ. న స్వార్థం. ఈశ్వరత్వాత్. 7

చూ॥ భగవాన్నారదో వర్ణాశ్రమవతీభిర్భారతీభిః ప్రజాభిర్భగవత్ప్రోక్తాభ్యాం సాంఖ్యయోగాభ్యాం భగవదనుభావోపవర్ణనం సావర్ణేరుపదేక్ష్య మాణః పరమభక్తియోగేనోపసరతి. 8

టీ:- తమితి భగవదనుభావఉపవర్ణ్యతే యేన పాంచరాత్రేణ తత్సావర్ణేః మనోః. ఉపదేక్ష్యమాణః ఉపదేశం దాస్యమానః ఉపసరతి సేవతే. 8

భారతవర్షములో కూడా భగవంతుడు దయగలవాడై, నారాయణుడను పేరుతో, సంయమనశీలురగు ఆత్మవంతుల ననుగ్రహించుట కొరకు ధర్మ జ్ఞాన వైరాగ్య ఐశ్వర్య ఇంద్రియ నిగ్రహ నిరహంకారతలు వృద్ధినొంది ఆత్మస్వరూపోపలబ్ధిని కలిగించునట్టి తపస్సును, అవ్యక్త రూపముతో కల్పాంతము వరకు ఆచరించును. 7

భగవంతుడగు నారదుడు వర్ణాశ్రమ ధర్మావలంబులగు భారతజనులతోగూడి, స్వయముగా భగవంతునితో చెప్పబడిన సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రములతో భగవన్మహిమను ప్రకటింపచేసెడి పాంచరాత్ర దర్శనమును సావర్ణమునికి ఉపదేశిస్తూ పరమ భక్తియోగముతో ఆ భగవన్నారాయణుని సేవించుచుండును. 8





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చూ॥ ఇదం చాపి గృణాతి–ఓం నమో భగవతే–ఉపశమశీలాయ–ఉపరతానాత్మ్యాయ–నమోऽకించనవిత్తాయ–ఋషిఋషభాయ–నారాయణాయ– పరమహంసాయ. పరమగురవే– ఆత్మారామాధిపతయే–నమో నమ ఇతి. 9

ఓంకారస్వరూపుడు, ఐశ్వర్యాదిషడ్గుణసంపన్నుడు, ఇంద్రియ సంయమనశీలుడు, నిరహంకారుడు, నిర్ధనునకు ధనభూతుడు, ఋషిశ్రేష్ఠుడు, పరమహంస, పరమగురువు, ఆత్మారామాధిపతియునగు నారాయణునకు నమస్సులు అని జపిస్తూ సేవించెను. 9

చూ॥ గాయతి చేదమ్. 10

ఈ విధముగా గానము చేయుచుండెను. 10

టీ:- ఇదమితి. ఉపరతానాత్మ్యాయ నిరహంకారాయ. (9–10)

శ్లో॥ కర్తాస్య సర్గాదిషు యో న బధ్యతే
నహన్యతే దేహగతోऽపి దైహికైః ।
ద్రష్టుర్న దృగ్యస్య గుణైర్విదూష్యతే
తస్మై నమోऽసక్త వివిక్త సాక్షిణే ॥ 11

ఎవరైతే జగదుత్పత్తి స్థిత్యాదులకు కర్త అయి ఉండి కూడా కర్తృత్వాభిమానముతో బంధించబడడో, శరీరములో ఉంటూకూడా శరీర ధర్మములగు ఆకలి, దప్పిక, మొదలగు ధర్మములకు లోనుగాడో సర్వద్రష్ట అయికూడా ఎవని యొక్క దృష్టి దృశ్యముల గుణదోషములతో దూషితము కాదో అలాంటి అసంగుడు విశుద్ధసాక్షి స్వరూపుడగు భగవన్నారాయణునకు నమస్కారము. 11

టీ:- కర్తేతి. అసక్తశ్చాసౌ వివిక్తసాక్షి చ తస్మై నమః. అసక్తత్వం దర్శయతి. అస్య విశ్వస్య సర్గాదిషు కర్తాపి యో న బధ్యతే అహంకారేతి న మన్యతే వివిక్తమాహ – దేహగతోऽపి దైహికైః క్షుత్పిపాసాదిర్యో న హన్యతే నాభి భూయతే. సాక్షిత్వమాహ. యస్య ద్రష్టురపి సతోదృష్టిః గుణైర్ద్ర్శైర్న దూష్యతే న విక్రియతే. 11










శ్లో॥ ఇదం హి యోగేశ్వర యోగనైపుణ్యం
హిరణ్యగర్భో భగవాన్ జగాద యత్ ।
యదంతకాలే త్వయి నిర్గుణే మనో
భక్త్యాదధీతో ఝ్ఝితదుష్కళేబరః ॥ 12

టీ:- యోగకౌశలం నిరూపయన్. యోగం ప్రార్థయతే-త్రిభిః. ఇదమితి. హే యోగేశ్వర. హిరణ్యగర్భః. యద్యోగనైపుణం జగాద. ఇదమేతద్ధి జన్మప్రభృతి భక్త్యా అంతకాలేఽపి పుమాన్ త్వయి మనో ధారయే దితి యత్. కథంభూతస్సన్ ఉఝ్ఝితం దుష్కలేబరం తదభిమానో యేన. 12

ఇచటి నుండి మూడు శ్లోకములలో యోగనైపుణ్యమును నిరూపిస్తూ యోగమును ప్రార్థిస్తున్నాడు.

జీవుడు జన్మించినది మొదలు అంత్యకాలము వరకు దేహాభిమానమును వదిలి, భక్తిభావముతో నీ యందు మనస్సును లగ్నము చేయుటయే యోగకౌశలమని తెలిపెను. 12

శ్లో॥ యద్దైహికాముష్మిక కామలంపట
స్సుతేషు దారేషు ధనేషు చింతయన్ ।
శంకేత విద్వాన్ కుకళేబరాత్య యాద్య
స్తస్య యత్నశ్శ్రమ ఏవ కేవలమ్ ॥ 13

టీ:- అన్యథా తస్య శాస్త్రాభ్యాస శ్రమో వ్యర్థ ఇత్యాహ-యదితి. ఐహికాముష్మిక కామేషు లంపటో మూర్ఖః సుతాదిషు యోగక్షేమం చింతయన్ కుత్సితస్య కళేబరస్యాత్యయాత్ మృత్యోశ్శంత. తథా విద్వానపి సన్ యః శంకేత తస్య యత్నః శ్రమ ఏవ. 13

ఆ విధముగా భగవంతుని యందు మనస్సు నిలుపని యెడల శాస్త్రాభ్యాస శ్రమకూడా వ్యర్థమని తెలుపుచున్నాడు. మూర్ఖుడగు పురుషుడు ఐహికాముష్మిక భోగలంపటుడై పుత్ర కళత్ర విత్తాదులను గురించి చింతిస్తూ మృత్యువునకు ఏ విధముగా భీతిల్లునో అటులనే పండితుడగు పురుషుడుగూడా నింద్యమగు శరీరమును వదులుటకు భీతి చెందినచో ఆ పండితుడు జ్ఞానప్రాప్తికై చేసిన శాస్త్రాభ్యాసాది శ్రమ కూడా వ్యర్థమేయగును. 13








శ్లో॥ తన్నః ప్రభో త్వం కుకళేబరార్పితాం
త్వన్మాయయాహం మమతామధోక్షజ ।
భింద్యామ యేనాశు వయం సుదుర్భిదాం
విధేహి యోగం త్వయి నస్స్వభావజమ్ ॥ 14

అందువలన ఓ అధోక్షజా! నింద్యమగు ఈ శరీరముపైన, నీ మాయచేత కల్పించబడిన మమతను మేము తొందరగా త్రెంచుకొనునటుల మాకు నీ భక్తి యోగమును ప్రసాదించుము. ఇతరములగు ఏ ఉపాయములచేతగూడా ఈ మమతను భేదించుటకు సాధ్యపడదు. 14

టీ:- తదతి. యస్మాద్విదుషోऽపీయమేవ దశా. తత్ తస్మాత్. హే ప్రభో అధోక్షజ. త్వమేవ నో యోగం విదేహి. కీదృశం. త్వయి స్వభావజం సహజ వాసనారూపం యేన యోగేన. వయం త్వన్మాయయా నః కుకళేబరే అర్పితాం. అహం మమతాం. శీఘ్రం భింద్యామ త్యజేమ సుదుర్భిదాం. ఉపాయాంతరైః సర్వదా త్యక్తు మశక్యామ్ . 14

చూ॥ భారతేऽప్యస్మిన్ వర్షే సరిచ్ఛైలాస్సంతి బహవః - మలయో మంగళప్రస్థో మైనాకస్త్రికూట ఋషభః కూటరః కోల్లస్సహ్యో వేదగిరిరృశ్యమూకశ్శ్రీ శైలో వేంకటో మహేంద్రో వారిధరో వింధ్యశ్శుక్తి మానృక్షగిరిః పారియాత్రో ద్రోణశ్చిత్రకూటో గోవర్ధనో రైవతకః కుకుంభో నీలః కాకముఖ ఇంద్రకీలోరామగిరిరితి చ-అన్యే చ శతసహస్ర శైలాః తేషాం నితమ్బప్రభవా నదా నద్యశ్చ సంత్యసంఖ్యాతాః. 15

ఓ పరీక్షిద్రాజా! ఇలావృత వర్షములోవలెనే ఈ భారతవర్షము లోను అనేకములగు నదులు,పర్వతములుకలవు. మలయము, మంగళ ప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటరము, కోల్లము, సహ్యము, వేదగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వేంకటాద్రి, మహేంద్రము, వారిధరము, వింధ్యము, శుక్తిమంతము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కుకుంభము, నీలము, కాకాముఖము, ఇంద్రకీలము, రామగిరి అను








టీ:- భారతేఽపీతి. ఇళావృతవదస్మిన్నపి వర్షే. సరితః శైలాశ్చ సంతి. నితంబప్రభావాః తటేభ్యస్సంభూతాః. 15

పర్వతములే కాక వందల వేల ఇతర పర్వతములు కూడా కలవు. ఆ పర్వత తటముల నుండి జనించిన నదీ, నదములు అసంఖ్యాకములు గలవు. 15

చూ॥ ఏతాసామపో భారత్యః ప్రజానామభిరేవ పునంతి నామాత్మనా చోపస్పృశంతి చంద్రపటాతామ్రపర్ణీ అవటో దాకృతమాలా వైహాయసీ కావేరీ వేణీ పయస్వినీ పయోదా శర్కరావర్తా తుంగభద్రా కృష్ణవేణీ భీమరథీ గోదావరీ నిర్వింధ్యా పయోష్ణీ తాపీరేవాశిలా సురసా నర్మదా చర్మణ్వతీ సింధుశ్శోణశ్చ నదాః - మహానదీ వేదస్మృతి ఋషికుల్యాత్రి సమా కౌశికీ మందాకినీ యమునా సరస్వతీ దృషద్వతీ గోమతీ సరయూర్భోగవతీ సుషమా శతద్రుశ్చంద్రభాగా మరుద్వృధా వితస్తా అసిక్నీ విశ్వేతి మహానద్యః. 16

ఈ నదులు భారత జనులను, తమ నామములతోనే పవిత్రీకరించుచున్నవి. నదీ నామస్మరణచేతనే పవిత్రత కలుగును. భారత ప్రజలు ఈ నదుల జలములను దేహములతోను స్పృశించెదరు అనగా ఈ నదీజలములలో స్నానమొనర్చెదరు. చంద్రపటా, తామ్రపర్ణీ, అవటోదా, కృతమాలా, వైహాయసీ, కావేరి, వేణీ, పయస్వినీ, పయోదా, శర్కరావర్తా, తుంగభద్రా, కృష్ణవేణీ, భీమరథీ, గోదావరీ, నిర్వింధ్యా, పయోష్ణీ, తాపీ, రేవా, శిలా, సురసా, నర్మదా, చర్మణ్వతీ, సింధు, శోణా అనునవి నదములు. మహానదీ, వేదస్మృతి, ఋషికుల్యా, త్రిసమా, కౌశికీ, మందాకినీ, యమునా, సరస్వతీ, దృషద్వతీ, గోమతీ, సరయూ, భోగవతీ, సుషమా, శతద్రు, చంద్రభాగా, మరుద్వృధా, వితస్తా, అసిక్ని, విశ్వా అనునవి మహానదులు. 16

టీ:- ఏతాసామితి. ఆత్మనా చ దేహేనాప్యుపస్పృశంతి. 16

చూ॥ అస్మిన్నేవ వర్షే పురుషైర్లబ్ధ జన్మభిశ్శుక్ల లోహిత కృష్ణవర్ణేన ప్రారబ్ధేన కర్మణా దివ్యమానుషనారకగతయో బహ్వ్య ఆత్మన ఆనుపూర్వ్యేణ సర్వాహ్యేవ సర్వేషాం విధీయంతే. యథా వర్ణ విధానమపవర్గశ్చాపి భవతి. 17

ఈ భారతవర్షమున జన్మించిన పురుషులు తామొనరించిన సాత్విక రాజస తామస కర్మలననుసరించి అనేక రకములగు దివ్యమానుష, నరక గతులను క్రమముగా సాధించెదరు. (పొందుదురు) ఏలనన సమస్తములగు గతులు కర్మానుసారముగా అందరకు




టీ:- అస్మిన్నితి. లబ్ధం జన్మ యైస్తైః పురుషైః. సాత్త్వికాదినా స్వకృతేన కర్మణా దివ్యాది గతయ ఆత్మనో విధీయంతే సాధ్యంతే హి యస్మాత్ సర్వా ఏవ గతయః కర్మానుసారేణ సర్వేషాం భవంతి. యస్య వర్ణస్య యద్విధానం మోక్షప్రకారః. సన్న్యాస గృహస్థత్వాది. తదనతి క్రమేణాస్మిన్నేవ వర్షే నృణామపవర్గశ్చ భవతి ఏతశ్చ కర్మాది బహుసాధన సంభవాభిప్రాయేణోక్తం. న త్వన్యత్రాపవర్గాభావే తాత్పర్యం. సూ. "తదుపర్యతి బాదరాయణస్సంభవాది"తి. దేవానామపి మోక్షస్య బాదరాయణేన సూచితత్వాత్. 17

చూ॥ యోఽసౌ భగవతి సర్వభూతాత్మన్యనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే పర మాత్మని వాసుదేవే అనన్య నిమిత్త భక్తియోగ లక్షణో నానాగతి నిమిత్తా విద్యా గ్రంథి రంధన ద్వారేణ భవతి యథాపి మహాపురుష ప్రసంగః. 18

టీ:- అపవర్గస్వరూపమేవాహ - య ఇతి. అనాత్మ్యే. ఆత్మని భవ మాత్మ్యం రాగాది. తద్రహితే. అనిరుక్తే వాచామగోచరే. అనిలయనే అనాధారే. అనన్యనిమిత్తః యో విద్యాగ్రంథిః. తస్య రంధనం దహనం. తద్ద్వారేణ. మహాపురుషపురుషాః విష్ణుభక్తాస్తైః ప్రకృష్టః సంగో యోగో యథా భవతి తథా. 18

సంభవించును. తమ తమ వర్ణములకు నియతములగు సన్యాస గృహస్థత్వాదుల అనుష్ఠానము శాస్త్రోక్తముగా ఆచరించిన మోక్షప్రాప్తి కలుగును. మోక్షప్రాప్తి అనునది కర్మాద్యనేక సాధనములచే లభించుననే అభిప్రాయముతో చెప్పబడినదే కాని, ఇతర మార్గముల చేత మోక్షప్రాప్తి లేదని చెప్పినది కాదు. "తదుపర్యపి బాదరాయణస్సంభవాట్" అను సూత్రముచే బాదరాయణుడు దేవతలకుకూడా మోక్షమును సూచించినాడు. 17

మోక్షస్వరూపమును తెలుపుచున్నాడు. సర్వప్రాణులకు ఆత్మభూతుడు, రాగాది దోషరహితుడు, వాక్కులకగోచరుడు, అనాధారుడు, పరమాత్మ, భగవంతుడగు వాసుదేవునియందు కారణములేవీలేని భక్తిభావమే మోక్షము. ఇలాంటి అహైతుక భక్తిభావము (మోక్షము) అనేక విధములగు గతులకు కారణభూతమగు అజ్ఞాన రూపమగు హృదయగ్రంథి భేదనమొందగా, భగవంతుని ప్రియభక్తుల సాంగత్యము కల్గినపుడు మాత్రమే ప్రాప్తించును. 18






చూ॥ ఏతదేవ హి దేవా గాయంతి.

శ్లో. అహో బతైషాం కిమకారి శోభనం
ప్రసన్న ఏషాం స్విదుత స్వయం హరిః ।
యైర్జన్మలబ్ధం నృషు భారతాజిరే ముకుంద
సేవౌపయికం స్పృహా హి నః ॥ 19

టీ:- అహో ఇతి. ఏతదేవ మానుష్యమేవ. సర్వపురుషార్థసాధనం గాయంతి. అమీషాం ఏభిః ఉతస్విత్. అథవా. స్వయమేవ సాధనం వినైవ. హరిరేషాం ప్రసన్నోఽభూత్. ఏవం భూతస్య ధర్మస్య దుష్కరత్వాత్. భారతాజిరే భారతాంగణే. నః కేవలం స్పృహైవయత్ తన్ముకుంద సేవోపయోగి నృషు జన్మ యైర్లబ్ధమ్. 19

దేవతలు, మనుష్యత్వమే సర్వపురుషార్థ సాధనమని ఎలుగెత్తి చాటెదరు. అహో! ఈ మానవులు ఏ పుణ్యమొనర్చి భగవంతుడగు ముకుందుని సేవకు యోగ్యమగు, మానవజన్మపొంది భారతవర్షములో జన్మించిరి. లేక వీరియందు శ్రీహరియే స్వయముగా ప్రసన్నుడాయెనా? ఈ గొప్పనగు దుర్లభమగు సౌభాగ్యమునకై మేము పరితపించెదము. 19

శ్లో॥ కిం దుష్కరైర్నః క్రతుభిస్తపోవ్రతై
ర్దానాదిభిర్వాద్యుజయేన ఫల్గునా ।
న యత్ర నారాయణ పాదపంకజ
స్మృతిః ప్రమృష్టాతిశయేంద్రియోత్సవాత్ ॥ 20

టీ:- స్పృహామేవాహ సప్తభిః - కిమితి. దుష్కరైః క్రత్వాదిభిః. నః. ఫల్గునా తుచ్ఛేన ద్యుజయేన స్వర్గప్రాప్త్యా కిం? న కించిత్ఫలం కుతః

ఇచటినుండి ఏడు శ్లోకములలో ఆ దేవతల తపనను తెలుపు-చున్నాడు. మేము దుష్కరములగు యజ్ఞములతో, తపస్సుతో, వ్రతము-లతో, దానాదులతో, తుచ్ఛమగు స్వర్గమును సాధించినవారము. దీనితో ఫలమేమి? ఈ స్వర్గమున ఇంద్రియభోగాధిక్యతతో భగవన్నారాయణ పాదపంకజ స్మృతి లేకుండా పోతుంది. ఇలాంటి స్వర్గముతో లాభమేమియు లేదు. 20







యత్ర. నారాయణపాదపంకజస్మృతిర్నాస్తి. ప్రత్యుత అతిశయితాత్. ఇంద్రియాణాముత్సవాత్ భోగాత్ ప్రమృష్టాభూత్. 20

శ్లో॥ కల్పాయుషాం స్థానజయాత్పునర్భవాత్
క్షణాయుషాం భారతభూజయో వరః ।
క్షణేన మర్త్యేన కృతం మనస్విన
స్సన్న్యస్య సంయాత్యభయం పదం హరేః ॥ 21

టీ:- కల్పాయుషామితి. క్షణమల్పమేవాయుర్యేషాం.వరత్వే హేతుః . మర్త్యేనాపి దేహేన. క్షణేనైవ. కాలేన. కృతం కర్మ సన్న్యస్య హరేః పదం సమ్యగ్యాంతి. 21

ఈ స్వర్గాది లోకములలోని జనులకు కల్పపర్యంతము ఆయుష్య ముండును కాని ఆ పిదప తిరిగి సంసార చక్రములో పరిభ్రమించుట కలుగును. ఇలాంటి స్వర్గాది లోకములకంటే, భారతభూమిలో కొద్దికాలము మాత్రమే ఆయుష్యముగల నరులుగా జన్మించడమే శ్రేయము. ఏలనన భారతములోని ధీరులు ఈ మానవ శరీరముతో చేసిన సమస్తకర్మలను క్షణకాలముననే భగవంతున కర్పించి, సన్యసించి భయరహితమగు హరిపదమును పొందగలరు. 21

శ్లో॥ న యత్ర వైకుంఠకథా సుధాపగా
న సాధవో భాగవతాస్తదాశ్రయాః ।
న యత్ర యజ్ఞేశమఖామహోత్సవా
స్సురేశ లోకోఽపి న వై స సేవ్యతామ్ ॥ 22

టీ:- నేతి. అతః యత్ర వైకుంఠ కథామృత నద్యో న సంతి. తదాశ్రయాః మహాంతో నృత్తాద్యుత్సవా యేషు. తాదృశా యజ్ఞేశమఖాశ్చ పూజాః. సః సురేశస్య బ్రహ్మణోఽపి లోకో న సేవ్యతామ్. 22

ఎచట భగవత్కథామృతపు నదులు ఉండక, ఆ కథామృతమనే నదులకు ఉద్గమ స్థానములైన, పరమ భాగవతోత్తములగు సాధు-పురుషులు వసించరో, నృత్య, గీతాదులతో గూడిన ఉత్సవాదులతో యజ్ఞపురుషుడగు భగవంతుని పూజార్చనాదులు జరుగవో, అట్టి దానిని సేవించవలసిన అవసరంలేదు. బ్రహ్మలోకమైననూ దానిని సేవించకండి. 22








శ్లో॥ ప్రాప్తానృజాతిం త్విహ యే చ జంతవో
జ్ఞాన క్రియాద్రవ్యకలాప సంభృతామ్ ।
చేద్యతేరన్న పునర్మృతాయతే భూయో
వనౌకా ఇవ యాంతి బంధనమ్ ॥ 23

టీ:- అముముక్షూన్నరాన్నిందంతి-ప్రాప్తా ఇతి. జ్ఞానం చ తదర్థాః క్రియాశ్చ. తదర్థాని ద్రవ్యాణి చ. యేషాం కలాపేన. సంభృతాం పూర్ణాం అపునర్మృతాయ మోక్షాయ. వనౌకా ఇవ వనౌకసః. పక్షిణః. అత్రాదం తత్వమార్షం. యథా లుబ్ధకాత్. ముక్తా అపి పునర్యది తస్మిన్నేవ వృక్షే ప్రమత్తా విహరంతి. తర్హి యథా పునః బధ్యంతే తద్వత్. 23

శ్లో॥ యైశ్రద్ధయా బర్హిషి భాగశోహవి
ర్నిరుప్తమిష్టం విధిమత్ర వస్తుతః ।
ఏకః పృథాజ్నామభిరాహుతో ముదా
గృహ్ణాతి పూర్ణస్స్వయమాశిషాం ప్రభుః ॥ 24

టీ:- అహో.భారతవాసినాం భాగ్యమిత్యాహుః - యైరితి. శ్రు. "అగ్నయే జుష్టం నిర్వపామి. ఇంద్రాయజుష్టం నిర్వపామీ" త్యేవం భాగశః నిరుప్తం పృథక్కృతం. కథం విధినా ప్రకారేణ చ. మంత్రేణ చ వస్తుతశ్చరుపురోడాశాది భేదేన ఇష్టం దేవతాముద్దిశ్య త్యక్తం నిరుప్తం

**ముక్తికి యత్నించని మానవులను నిందించుచున్నాడు.**

వివేకవంతమగు బుద్ధి దానికనుకూలమగు కర్మ, ఆ కర్మోపయోగి యగు ద్రవ్యాది సామగ్రితో సంపన్నమగు మానవునిగా భారతవర్షములో జన్మనొంది గూడా, ఏ ప్రాణులైతే మోక్షము కొరకు యత్నించరో వారు వ్యాధుని బంధము నుండి ముక్తి నొంది, ఫలాదుల యందలి లోభముచే తిరిగి అదే వృక్షమునాశ్రయించి విహరించు పక్షులు తిరిగి బంధన మొందినటుల జనన మరణరూప బంధనము నొందుదురు. 23

ఆహా! భారతములో నివసించు జనుల అదృష్టమెంత గొప్పదని తెలుపుచున్నాడు. యజ్ఞములో శ్రు."అగ్నయే జుష్టం నిర్వపామి ఇంద్రాయజుష్టం నిర్వపామీ" అనుచు విభిన్న దేవతోద్దేశ్యముతో వేరువేరు విభాగములుగా చేసి, శ్రద్ధతో భారతజనులచే ఒసగబడు, విధి ప్రకారముగా మంత్ర వస్తువుల, పురోడాశాదులతో కూడిన హవిస్సును, ఇంద్రాది భిన్నభిన్న నామములతో ఆహ్వానించబడినను సంపూర్ణ మనోరథములనీడేర్చు, స్వతహాగా పూర్ణకాముడునగు శ్రీహరియే వచ్చి అన్నీ నేనని, ఇది నాకే అని త్యాగానంతరము స్వీకరించును. అట్టి భారతజనుల అదృష్టము ఎంత గొప్పది! 24








మమేదమితి స్వీకృత్య త్యాగానంతరమశ్నాతీత్యర్థః. పృథగింద్రాది నామభిః. ఆహుతః, ఆహూతః ఆశిషాం ప్రభుః స్వయం పూర్ణోऽపి హరిః. 24

శ్లో॥ సత్యం దిశత్యర్థితమర్థితో నృణాం
నైవార్థదో యత్పునరర్థితా యతః ।
స్వయం విధత్తే భజతామనిచ్ఛతా
మిచ్ఛా పిధానం నిజపాదపల్లవమ్ ॥ 25

టీ:- తత్రాపి. నిష్కామాః కృతార్థా ఇత్యాహుః. సత్యమితి. అర్థితః ప్రార్థితస్సన్. అర్థితం దదాతీతి సత్యం. అథాపి పరమార్థదో న భవత్యేవ. యద్యస్మాత్ యతో దత్తాదనంతరం పునరప్యర్థితా భవతి నను అనర్థిత శ్చేత్ కిమపి న దద్యాదిత్యాశంక్యాహుః. అనిచ్ఛతాం నిష్కామానాం తు ఇచ్ఛా పిధానమాచ్ఛాదకం సర్వకామ పరిపూరకం నిజపాదపల్లవం స్వయమేవ సంపాదయతి. 25

శ్లో॥ యద్యత్ర నస్స్వర్గసుఖావశేషితం
స్విష్టస్య సూక్తస్య కృతస్య శోభనమ్ ।
తేనాజనాభేస్మృతిమజ్జన్మన
స్స్యాద్వర్షే హరిర్యద్భజతాం శంతనోతి ॥ 26

ఈ భారతజనులలో నిష్కాములు, ధన్యులని పలుకుచున్నారు. భగవంతుడు తనను యాచించిన వారికి యాచించిన దానిని ఒసగును. అది సత్యము కానీ, ఇది భగవంతుడు భక్తునికిచ్చే యథార్థ వరదానముకాదు. ఏలనన కోరిన వస్తువు నొందిన పిదప కూడా యాచకుని మనమున ఇంకొక దానిపై కోరిక కలుగుచునే యుండును. మళ్ళీ యాచించవలసి వచ్చును. అటులకాక ఏదియూ కోరకుండా నిష్కామ భావనతో సేవించిన వారికి భగవంతుడు సర్వకామములను పూర్ణమొనర్చెడి తన పాదపల్లవమును స్వయముగా నొసగును. 25

అందువలన ఇంతవరకు స్వర్గసుఖమనుభవించిన పిదప కూడా మాచే పూర్వమొనర్చబడిన యజ్ఞ, ప్రవచనాది శుభకర్మల పుణ్యమేమైన మిగిలినచో ఆ పుణ్యముతో ఈ అజనాభవర్షమున (భారతమున) భగవత్స్మృతియుక్తమగు నరజన్మ కలుగుగాక! ఎందుకనగా









భగవంతుడగు శ్రీహరి తనను భజించెడి వారికి సమస్త సుఖములను కలుగచేయును. 26

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ జంబూద్వీపస్య రాజన్నుపద్వీపాన
ష్టావిహైక ఉపదిశంతి సగరా
త్మజైరశ్వాన్వేషణే ఇమాం మహీం పరితో
నిఖనద్భిరుపకల్పితాన్. 27

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

ఓ పరీక్షిద్రాజా! సగర చక్రవర్తి పుత్రులు యజ్ఞాశ్వమును వెదకుచూ, ఈ భూమిని నాలుగు దిక్కులలో త్రవ్వగా జంబూద్వీపములో ఎనిమిది ఉపద్వీపములు ఏర్పడినవని కొందరు తెలుపుదురు. 27

చూ॥ తద్యథా స్వర్ణ ప్రస్థశ్చంద్రశుక్ల ఆవర్తనో రమణకో మందేహారుణః పాంచజన్యః సింహళో లంకేతి – ఏవం భారతోత్తమ జంబూద్వీప వర్షవిభాగో యథోద్దేశముపవర్ణితః. 28

ఆ ఎనిమిది ఉపద్వీపములు స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందేహారుణము, పాంచజన్యము, సింహళము, లంక అనునవి. ఓ భరతశ్రేష్ఠా! ఈ విధముగా జంబూద్వీప వర్ష విభాగమును వర్ణించితిని. 28

టీ:– యదితి. స్విష్టస్య సమ్యగ్యజనస్య. సూక్తస్య ప్రవచనస్య. అన్యస్యాపి కర్మణః. స్వర్గసుఖాదుపభుక్తాదవశేషితం. యది కించిదస్తి తేనాజ నాభే వర్షే నః అస్మాకం జన్మస్యాత్. కీదృశం స్మృతిమత్ హరిరేవ. సేవ్య ఇత్యనుసంధానయుక్తం. యతః హరిరేవ భజతాం శం సుఖం తనోతి. (26–28)

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, ఏకోనవింశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు పంతొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**





 



## వింశోऽధ్యాయః

శ్లో॥ వింశే ప్లక్షాదిషడ్ద్వీపస్థితిమాహ సహార్ణవైః ।
లోకాలోకస్థితం చాంతర్బహిర్భాగాదిమానతః ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ అతః పరం ప్లక్షాదీనాం ప్రమాణలక్షణసంస్థానతో వర్ష విభాగో యథోద్దేశముపవర్ణ్యతే జంబూద్వీపో యావత్ప్రమాణ విస్తారస్తావతా క్షారోదధినా పరివేష్టితో యథా మేరుర్జంబ్వాఖ్యేన లవణోదధిరపి తతోऽపి ద్విగుణ విశాలేన ప్లక్షాఖ్యేన పరిక్షిప్తః–యథా పరిఘాబాహ్యోపవనేన. 1

టీ:- అత ఇతి. తావతా లక్షవిస్తారేణ. పరిక్షిప్తః పరివేష్టితః. 1

చూ॥ ప్లక్షో జంబూప్రమాణో ద్వీపోఖ్యాతికరోహిరణ్మయ ఉత్థితో యత్రాగ్నిరుపాస్తే సప్తజిహ్వః–తస్యాధిపతిః ప్రియవ్రతాత్మజ ఇధ్మజిహ్వస్త ద్వీపం సప్తవర్షాణి విభజ్య–సప్తభ్యోవర్షనామభ్య ఆత్మజేభ్య ఆకలయ్య స్వయమాత్మయోగేనోపరరామ. 2

టీ:- ప్లక్ష ఇతి. ఉపాస్తే తిష్ఠతి. ఆకలయ్య సమర్ప్య. 2

## 20 వ అధ్యాయము

ఈ ఇరువదవ అధ్యాయమున ప్లక్షద్వీపము మొదలగు ఆరు ద్వీపముల స్థితిని, సముద్రముల స్థితిని , లోకాలోకముల స్థితి లోపలి బయటి కొలతలతోసహా తెలుపుచున్నాడు.

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఇక్కడి నుండి ప్లక్షాది ద్వీపముల యొక్క ప్రమాణము, లక్షణము, స్థితిననుసరించి వర్షవిభాగము వర్ణించబడును. ఏవిధముగా మేరు పర్వతము జంబూద్వీపముతో చుట్టబడియున్నదో అటులనే జంబూ ద్వీపముకూడా తనతో సమానమగు పరిమాణము, విస్తారముగల లవణ సముద్రముతో చుట్టుముట్టబడి యున్నది. లవణ సముద్రము కూడా దానికంటే రెండింతలు విశాముగల ప్లక్షద్వీపముచేత చుట్టుకొనబడి అగడ్త, వెలుపలి ఉపవనముతో చుట్టబడియున్నటుల ఉన్నది. 1

జంబూద్వీపమున అతివిస్తారమగు జంబూవృక్షము వలెనే ఈ ప్లక్షద్వీపమున ఈ ద్వీపమునకు ఖ్యాతితెచ్చెడు అతి విస్తారమగు, బంగారుమయమగు ప్లక్షవృక్షము కలదు. ఈ ద్వీపమున సప్తజిహ్వుడగు అగ్ని ఉపాసించబడుచుండును. ప్లక్షద్వీపాధిపతి, ప్రియవ్రత పుత్రుడగు ఇధ్మజిహ్వుడు ఈ ద్వీపమును ఏడు వర్షములుగా విభజించి వర్షముల పేర్లుగల తన ఏడుగురు పుత్రులకు ఇచ్చి తాను ఆధ్యాత్మయోగమును ఆశ్రయించి ఉపరతుడాయెను. 2

ఓం నమోభగవతేవాసుదేవాయ ఓం నమోభగవతేవాసుదేవాయ

ఓం నమోభగవతేవాసుదేవాయ ఓం నమోభగవతేవాసుదేవాయ

 

 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

చూ॥ శివం యశస్యం సుభద్రం శాంతం క్షేమమభయమృతమితి వర్షాణి–తేషు గిరియోనద్యశ్చసప్తైవాభిజ్ఞాతాః మణికూటో వజ్రకూట ఇంద్రసేనో జ్యోతిష్మాన్ ధూమ్రవర్ణో హిరణ్యగ్రీవో మేఘమాల ఇతి సప్త సేతుశైలాః. 3

టీ:– శివ ఇతి. అభిజ్ఞాతాః ప్రసిద్ధాః సప్తైవ. అన్యే చ పర్వతా నద్యశ్చ సహస్రశః సంతీత్యర్థః. మానసోత్తరస్య మండలాకారత్వోక్తేః. ప్లక్షాది పంచద్వీపేషు వర్షాద్రయస్తిర్యగ్రేఖా కారా ఉభయతోऽబ్ధిస్పృశ ఇతి గమ్యతే. అన్యథా సప్తభిః సప్తవర్ష విభాగాసంభవాత్. వైష్ణవే. వర్షాణాం పూర్వాదిక్రమేణోక్తేశ్చ. 3

ప్లక్షద్వీపములోని ఏడు వర్షములు, ఈ వర్షములలో ఏడు పర్వతములు, ఏడు నదులు ప్రసిద్ధములైయున్నవి. మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జోతిష్మంతము, సుపర్ణము, హిరణ్యష్ఠీవము, మేఘమాలా అనునవి ఏడు పర్వతములు. ఇవి ముఖ్యమైనవి. వేరే పర్వతములు, నదులు వేలకొద్ది కలవని భావము. మానసోత్తర భాగమునకు మండలాకారత్వము చెప్పబడినందున ప్లక్షాది పంచ ద్వీపములలో వర్షములు, పర్వతములు తిర్యగ్రేఖారముగా ఇరువైపుల సముద్రమును తాకునవని తెలియుచున్నది. అటులకానియెడల ఏడు పర్వతములతో సప్త వర్షవిభాగము సంభవము కాదు. 3

చూ॥ అరుణా సృమణా ఆంగీరసీ సావిత్రీ సుప్రభాతా ఋతంభరా సత్యంభరేతి మహానద్యః–యాసాం జలోపస్పర్శనవిధూతరజస్తమసో హంస పతంగ గోర్ధ్వాయన సత్యాంగ సంజ్ఞాశ్చత్వారో వర్ణా స్సహస్రాయుషో విబుధోపమసందర్శన ప్రజననాః–స్వర్గద్వారం త్రయ్యా విద్యయా భగవంతం త్రయీమయం సూర్యమాత్మానం యజంతే. 4

టీ:– అరుణేతి. జలోపస్పర్శనేన. విధూతం రజస్తమశ్చ యేషాం హంసాదయో బ్రాహ్మణాదిస్థానీయాః. విబుధోపమం సందర్శనం. క్లమస్వేదాదిరహితంరూపం ప్రజననమపత్యోత్పాదనం చ యేషాం. 4

అరుణా, సృమణా, ఆంగీరసీ, సావిత్రీ, సుప్రభాత, ఋతంభరా, సత్యంభరా అనునవి ప్రసిద్ధములగు ఏడు మహానదులు. ఈ నదుల జలోప స్పర్శనముతో క్షాళితమైన రజస్తమోగుణముగల హంస, పతంగ, ఊర్ధ్వాయన, సత్యాంగ అను నాలుగు వర్ణములవారు వేయి వర్షములు ఆయుస్సుగలవారై దేవతలవలే అలసిపోవుట, చెమటపట్టుట మొదల గునవి లేనిరూపములు కలవారై దేవతలతో సమానమైన సంతానము కలవారై త్రయీవిద్యతో (వేదవిద్యతో) వేదమయుడగు సూర్యుని ఆత్మరూపునిగా ఉపాసించెదరు. 4





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చూ॥ ప్రత్నస్య విష్ణోరూపం యస్సత్యర్తస్య బ్రహ్మణ అమృతస్య మృత్యోశ్చ సూర్యమాత్మానమీ మహీతి. 5

టీ:- విదితా అపి ద్వీపమంత్రా వ్యాఖ్యాయంతే. ప్రత్నసేతి. ప్రత్నస్య పురాణపురుషస్య విష్ణోర్యద్రూపం సూర్యం. ఈమహి శరణం వ్రజేమ. కథంభూతం సత్యాదీనామాత్మానాం అధిష్ఠాతారం. తత్ర సత్యమనుష్ఠీయమానో ధర్మః. ఋతం ప్రతీయమానో ధర్మః. బ్రహ్మణః తద్బోధకస్య వేదస్య అమృతస్య శుభఫలస్య. 5

చూ॥ ప్లక్షాదిషు పంచసు పురుషాణామాయురింద్రియమోజస్సహో బలం బుద్ధిర్విక్రమ ఇతి చ సర్వేషామౌత్పత్తికీ సిద్ధిరవిశేషేణ వర్ధతే-ప్లక్షస్తు సమానే నేక్షురసో దేవావృతో యథా-తథా స ద్వీపోఽపి శాల్మలో ద్విగుణవిశాలస్సమానేన సురో దేనావృతః-పరితః యత్ర హ వై శాల్మలిః ప్లక్షాయామా-యస్యాం వాధః కిల నిలయనమాహు ర్భగవతశ్ఛందస్తుతః పతత్రిరాజస్య-సాద్వీపస్య హూతయ ఉపలక్ష్యతే. 6

టీ:- ప్లక్షాదిష్వితి. శ్రు. "సుపర్ణోఽసి గురుత్మాన్ త్రివృత్తే శిర" ఇత్యాది శ్రుతేః. ఛందోభిః స్వావయవభూతైః శ్రీవిష్ణుం స్తౌతీతి ఛందస్తుత్. తస్య ద్వీపస్య హూతయే వ్యపదేశాయ. (6-9)

అనుష్ఠానయోగధర్మమగు సత్యమునకు ప్రతీయమాన ధర్మమగు ఋతమునకు, ధర్మబోధకమగు వేదమునకు, మృత్యువునకు, అమృతమునకు అధిష్ఠాతయగు పుణ్యపురుషుడైన, విష్ణురూపమేయగు సూర్యుని శరణొందెదము. 5

ప్లక్షాది పంచద్వీపములలో మనుష్యులకు జన్మనుండియే ఆయుష్షు, ఇంద్రియము, మనోబలము, ఇంద్రియబలము, శారీరక బలము, బుద్ధి, పరాక్రమములు సమానములుగా సిద్ధించుచుండెను. ప్లక్షద్వీపము తనతో సమానమగు విస్తారముగల ఇక్షురస సముద్రముతో పరివేష్టితమై యున్నది. ఆ ఇక్షురస సముద్రము పిదప ఇక్షురస సముద్రముకంటే రెండింతల వైశాల్యముగల శాల్మలీద్వీపము. ఆ శాల్మలీద్వీపము, ఆ ద్వీపముతో సమానమైన వైశాల్యముగల సురాసముద్రముతో చుట్టుకొన బడియున్నది. ప్లక్షద్వీపములోని ప్లక్షవృక్షముతో సమమగు శాల్మలీ వృక్షము ఈ ద్వీపమునగలదు. ఈ ప్లక్షవృక్షపు ఛాయలో వేదమయమగు రెక్కలతో భగవంతుని సేవించెడి పక్షిరాజగు గరుడ భగవానుడు నివసించియుండునని తెలిపెదరు.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








ఈ విషయమున "సుపర్ణోసి గరుత్మాన్ త్రివృత్తేశిర" ఇత్యాది శ్రుతి ప్రమాణము. ఈ వృక్షము కారణముగనే ఈ ద్వీపమునకు శాల్మలీ ద్వీపమని పేరు వచ్చినది. 6

చూ॥ తద్ద్వీపాధిపతిః ప్రియవ్రతాత్మజో యజ్ఞబాహుస్స్వసుతేభ్యస్సప్త భ్యస్తన్నామాని సప్త వర్షాణి వ్యభజత్–సురోచనం సౌమనస్యం రమణకం దేవబర్హం పారిబర్హ మాప్యాయనమభిజ్ఞాతమితి. 7

ఈ శాల్మలీద్వీపమునకు ప్రియవ్రతునిపుత్రుడగు యజ్ఞబాహుడు అధిపతి. ఈ యజ్ఞబాహువు ఈ ద్వీపమును తన ఏడుగురు పుత్రులకు వారి నామములతోనే సురోచన, సౌమనస్యం, రమణకం, దేవవర్షం, పారిబర్హం, అప్యాయనం, అభిజ్ఞాతం అను నామములతో విభజించి ఇచ్చెను. 7

చూ॥ తేషు వర్షాద్రయో నద్యశ్చ సప్తైవాభిజ్ఞాతాః–స్వరసశ్శతశృంగో వామదేవః కుముదో ముకుందః పుష్పవర్షశ్శతశ్రుతిరితి–అనుమతిస్సినీ వాలీ సరస్వతీ కుహూ రజనీ నందారాకేతి. 8

ఈ వర్షములలోని ఏడు పర్వతములు, ఏడు నదులు ప్రసిద్ధము లైనవి కలవు. స్వరసము, శతశృంగము, వామదేవము, కుముదము, ముకుందము, పుష్పవర్షము, శతశ్రుతి అనునవి ఏడు పర్వతములు. అనుమతి, సినీవాలీ, సరస్వతీ, కుహూ, రజనీ, నందా, రాకా అనునవి ఏడు నదులు. 8

చూ॥ తద్వర్ష పురుషాః శ్రుతధర విద్యాధర వసుంధరే ధ్మరసంజ్ఞాః భగవంతం వేదమయం సోమమాత్మానం వేదేన యజంతే. 9

ఈ వర్షములలో శ్రుతధరులు, విద్యాధరులు, వసుంధరులు, ఇధ్మధరులు, అను నాలుగు వర్ణములవారు వేదమయుడు, ఆత్మ స్వరూపుడునగు చంద్రుణ్ణి వేదమంత్రములతో ఉపాసించెదరు. 9

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ



  

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చూ॥ స్వగోభిః పితృదేవేభ్యో వ్యభజన్ శుక్ల కృష్ణయో ।
అంధః ప్రజానాం సర్వాసాం రాజానస్సోమ అస్త్వితి ॥ 10

టీ:- స్వేతి. స్వగోభిః స్వరశ్మిభిః అంధః అన్నం. సోమో నః రాజా అస్తు. అభిముఖ్యేన భవతు. హ్రస్వపాఠే త్వవివక్షయా సంధ్యభావ ఇతి జ్ఞాతవ్యం. 10

కృష్ణపక్ష, శుక్లపక్షములలో, పితరులకు, దేవతలకు, సమస్త ప్రాణులకు అన్నమును, (భోజనమును) తన కిరణములతో విభాగము చేసి ఇచ్చే చంద్రదేవుడు మాకు రాజగుగాక (రంజన చేయువాడగు గాక) అని స్తుతించెదరు. 10

చూ॥ ఏవం సురోదాద్బహిస్తద్ద్విగుణః-సమానేనావృతో ఘృతోదేన యథాపూర్వం కుశద్వీపః-యస్మిన్ కుశస్తంభో దేవకృతస్తద్ద్వీపాఖ్యాపనో జ్వలన ఇవాపరః స్వశష్పపుష్పరోచిషా దిశో దశ విరాజయతి. 11

టీ:- ఏవమితి. ఏవం సురోదాద్బహిః ఘృతోదేనావృతః కుశ ద్వీప ఇత్యన్వయః. స్వశష్పాణి స్వకోమలశిఖాః. తేషాం రోచిషా. (11-15)

ఇదేవిధముగా సురసముద్రము బయట దానితో రెండింతల పరిమాణముగల కుశద్వీపము కలదు. పూర్వము తెలుపబడిన ద్వీపము వలెనే ఈ కుశద్వీపము తనతో సమమగు విస్తారముగల ఘృతోదము (ఘృతసముద్రము) తో ఆవరించబడియున్నది. ఈ కుశద్వీపమున భగవన్నిర్మితమగు కుశస్తంభము (వృక్షము) కలదు. దానితోనే ఈ ద్వీపమునకు కుశద్వీపమని పేరు కల్గినది. ఈ కుశస్తంభము రెండవ అగ్నివలె, తన కోమలమగు శాఖల, పుష్పముల కాంతితో దిక్కులను ప్రకాశింపజేయుచున్నది. 11

చూ॥ తద్ద్వీప పతిః ప్రైయవ్రతో రాజాహిరణ్యరేతానామస్వం ద్వీపం సప్తభ్యస్స్వసుతేభ్యో యథాభాగం విభజ్య స్వయం తు తప ఆతిష్ఠత్. 12

ఆ కుశద్వీపమునకు ప్రియవ్రతుని పుత్రుడగు హిరణ్యరేతుడు రాజు. ఆతడు ఈ కుశద్వీపమును తన ఏడుగురు కొడుకులకు యథా భాగముగా విభజించి ఇచ్చి, తాను తపమొనరించుచుండెను. 12

  





చూ॥ వసు వసుదాన దృఢరుచి నాభిగుప్త సత్యవ్రత విప్ర వామదేవ నామభ్యః పుత్రేభ్యః-తేషాం వర్షేషు సీమాగిరయో నద్యశ్చాభిజ్ఞాతాస్సప్త సప్తైవ. 13

ఆ హిరణ్యరేతునకు వసువు, వసుదానుడు, దృఢరుచి, నాభిగుప్తుడు, సత్యవ్రతుడు, విప్రుడు, వామదేవుడు అను పేర్లుగల వారు ఏడుగురు పుత్రులు. వారి వర్షముల సరిహద్దులలో ఏడు పర్వతములు, ఏడు నదులు ప్రసిద్ధములై యున్నవి. 13

చూ॥ బభ్రుశ్చతుశ్శృంగః కపిలశ్చిత్రకూటో దేవానీక ఊర్ధ్వరోమా ద్రవిణ ఇతి. 14

బభ్రువు, చతుశ్శృంగము, కపిల, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము అనునవి ఏడు సీమాపర్వతములు. 14

చూ॥ రసకుల్యా మధుకుల్యా శ్రుతవిందా మిత్రవిందా దేవగర్భా ఘృతచ్యుతా మంత్రమాలేతి-యాసాం పయోభిః కుశద్వీపౌకసః కుశల కోవిదాభియుక్తకులకసంజ్ఞా భగవంతం జాతవేదస్స్వరూపిణం కర్మ కౌశలేన యజంతే. 15

రసకుల్యా, మధుకుల్యా, శ్రుతవిందా, మిత్రవిందా, దేవగర్భా, ఘృతచ్యుతా, మంత్రమాలా అనునవి ఏడు నదులు. ఈ నదీజలమును సేవించెడి కుశలులు, కోవిదులు, అభియుక్తులు, కులకులు అను వర్ణసంజ్ఞలుగల కుశద్వీప వాసులగు జనులు, అగ్ని స్వరూపుడగు భగవంతుని నైపుణ్యముగా యజ్ఞాది కర్మలతో సేవించెదరు. 15

చూ॥ పరస్య బ్రహ్మణస్సాక్షాజ్జాతవేదోఽసి హవ్యవాట్ ।
దేవానాం పురుషాంగానాం యజ్ఞేన పురుషం యజేతి ॥ 16

టీ:- పరస్యేతి. హే జాతవేదః. త్వం సాక్షాత్. పరబ్రహ్మణో హరేః హవ్యవాడసి. అతో దేవానాం యజ్ఞేన. పురుషం హరిమేవ యజ. అంగానాం నామ్నా దత్తమంగినే సమర్పయేత్యర్థః. 16

ఓ అగ్నీ! నీవు సాక్షాత్తుగా పరబ్రహ్మయగు శ్రీహరికి హవిస్సును చేర్చెడివాడవు. అందువలన భగవంతునకు అంగభూతులగు దేవతలకు సమర్పించే ద్రవ్యములు శ్రీహరికే సమర్పించుము అని స్తుతిస్తూ ఉపాసించెదరు. అనగా అంగముల పేరుతో ఒసగబడిన దానిని అంగికే సమర్పించుము అని భావము. 16






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ







చూ॥ తథా బహిః క్రౌంచద్వీపో ద్విగుణః-సమానేన దధిమంథోదేన పరిత ఉపక్లృప్తోవృతో యథా కుశద్వీపో ఘృతోదేన-యస్మిన్ క్రౌంచో నామ పర్వతరాజో ద్వీపనామ నిర్వర్తక ఆస్తే. 17

టీ:- తథేతి. ఉపక్లృప్తో వేష్టితః. యథా కుశద్వీపో ఘృతోదేన వృతః. దధ్నో మంథః. రసః స ఏవ ఉదకం యస్య. 17

చూ॥ యోऽసౌ గుహ ప్రహరణోన్మథిత నితంబ కుంజోऽపి దధి మంథోదేవాసిచ్యమానో భగవతా వరుణేనాభిగుప్తో విభయో బభూవ. 18

టీ:- య ఇతి. గుహస్య కార్తికేయస్య. ప్రహరణేన ఆయుధేన. ఉన్మథితా నితంబాః కుంజాని చ యస్య. 18

చూ॥ తస్మిన్నపి ప్రైయవ్రతో ఘృతపృష్ఠో నామాధిపతిః స్వే ద్వీపే వర్షాణి సప్తధా విభజ్య-తేషు పుత్రనామసు సప్తరిక్థాదాన్ వర్షపాన్ నివేశ్య స్వయం భగవాన్ భగవతః పరమకల్యాణ యశస ఆత్మభూతస్య హరేశ్చరణారవిందముప జగామ. 19

టీ:- తస్మిన్నితి. స్వయం భగవాన్ జ్ఞానీ. పరమకల్యాణం యశో యస్య. (19-20)

ఈ ఘృతసముద్రమునకు వెలుపల ఘృతోదనమున కంటే రెండింతల విస్తారముగల క్రౌంచద్వీపము, (క్రౌంచద్వీప పరిమాణము 16లక్షలయోజనములని లెక్కించవచ్చు) తనతో సమానమగు దధి మంథోదముతో, కుశద్వీపము ఘృతోదముతో పరివేష్టితమైనటుల చుట్టు -ముట్టబడియున్నది. ఈ క్రౌంచద్వీపమున క్రౌంచమను పర్వతరాజము కలదు. దానితోనే ఈ ద్వీపమునకు క్రౌంచద్వీపమను పేరు కల్గినది. దధిమంథోదమనగా దధిరసమే ఉదకముగా కల్గినదని అర్థము. 17

ఈ క్రౌంచపర్వతము పూర్వకాలమున కార్తికేయుని శస్త్ర ప్రహారముతో క్షతమగు కటి ప్రదేశములతో నితంబాదికములు కలదై నను దధిమంథోదముచే తడపబడుచు వరుణ భగవానునిచే రక్షింపబడి భయరహితమైనది. 18

ఆ క్రౌంచద్వీపమునకధిపతి ప్రియవ్రతరాజు పుత్రుడగు ఘృత పృష్ఠుడు. తన ద్వీపములోని వర్షములను ఏడుగా విభజించి తన పుత్రుల పేర్లుగల ఆ వర్షములయందు తన ఉత్తరాధికారులగు పుత్రులను ఆ వర్ష రక్షకులుగా నియమించి స్వయముగా జ్ఞానియై సర్వాంతరాత్మ పరమ మంగళకరమగు కీర్తిమంతుడునగు శ్రీహరి చరణపంకజములను శరణువేడెను. 19








చూ॥ ఆమోదో మధువహో మేఘపృష్ఠస్సుదామా ఋషిజ్యో లోహితార్ణో వనస్పతిరితి ఘృతపృష్ఠసుతాః–తేషాం వర్షగిరియస్సప్తసప్తైవ నద్యశ్చాభిఖ్యాతాః. 20

ఆ ఘృతపృష్ఠునకు ఆమోదుడు, మధువహుడు, మేఘపృష్ఠుడు, సుదాముడు, ఋషిజ్యుడు, లోహితార్ణుడు, వనస్పతి అను ఏడుగురు పుత్రులు. ఆ వర్షములు ఏడు పర్వతములు సీమలుగా, ఏడు నదులతో ప్రసిద్ధములైనవి. 20

చూ॥ శుక్లో వర్ధమానో భోజన ఉపబర్హణ ఆనందో నందనస్సర్వతోభద్ర ఇతి– అభయా అమృతౌఘా ఆర్యకా తీర్థవతీ–తృప్తిరూపా–పవిత్రవతీ–శుక్లేతి–యాసామంభః పవిత్రం సకలముపయుంజానాః గురు–ఋషభ–ద్రవిణకదేవకసంజ్ఞావర్ష పురుషా ఆపోమయం దేవమయమపాం పూర్ణేనాంజలినా యజంతి. 21

టీ:- శుక్ల ఇతి. అపోమయం అమ్మయం. 21

శుక్లము, వర్ధమానము, భోజనము, ఉపబర్హణము, ఆనందము, నందనము, సర్వతోభద్రము అనునవి ఏడు పర్వతములు. అభయా అమృతౌఘా, ఆర్యకా, తీర్థవతీ, తృప్తిరూపా, పవిత్రవతీ, శుక్లా అనునవి ఏడు నదులు. ఈ నదుల నిర్మల పవిత్ర జలములను సేవించు గురు, ఋషభ, ద్రవిణక, దేవిక, అను చాతుర్వర్ణ పురుషులు జలములతో నిండిన అంజలుల ద్వారా వరుణదేవుని ఉపాసించెదరు. 21

శ్లో॥ ఆపః పురుష వీర్యాః స్థ పునంత్యో భూర్భువస్సువః ।
తానః పునంత్వమీవఘ్నస్స్పృశతామాత్మనా భువ ఇతి ॥ 22

టీ:- ఆప ఇతి. హే అపః పురుషవీర్యాః ఈశ్వరాత్ లబ్ధ సామర్థ్యాః స్థ భవథ. అత ఏవ భూర్భువస్సువః. త్రైలోక్యం పునంత్యః. తాః భవంత్యః నోఽస్మాకం. స్పృశతాం స్పర్శనం కుర్వతాం భువః శరీరాణి పునంతు. ఆత్మనా స్వరూపేణైవ అమీవఘ్న్యః. పాపహంత్ర్యః. 22

ఓ వరుణా! నీవు పరమాత్ముని నుండి సామర్థ్యమునొంది భూ భువః సువర్లోకములను పావనమొనర్చుచూ, రూప దర్శనముతోనే పాపములను నాశనము చేసేవాడవగు నీవు, నిన్ను స్పృశిస్తున్న మా శరీరములను పవిత్రీకరించుమని స్తుతించెదరు. 22








  



చూ॥ ఏవం పరస్తాద్దధిమంథోదాత్పరిత ఉపవేశితశ్శాకద్వీపో ద్వాత్రింశల్లక్షయోజనా యామః సమానేన చ క్షీరోదేన పరివేష్టితో యస్మిన్ శాకో నామ మహీరుహః-స్వక్షేత్రవ్యపదేశః-యస్య పర్ణాన్యంతర్భహిః ఖరమృదుస్పర్శాని-యస్య హి మహాన్ సురభిగన్ధస్తం ద్వీపమను వాసయతి. 23

ఇదేవిధముగా దధిమంథోదము చుట్టునూ ముప్పదిరెండు లక్షల యోజన విస్తారముగల శాకద్వీపము స్థాపితమైయున్నది. తనతో సమమగు విస్తారముగల క్షీరోదముతో (క్షీరమువలె మిక్కిలి స్వచ్ఛమగు నీరుగల సముద్రముతో) పరివేష్టితమై యున్నది. ఈ ద్వీపమున శాకము అను వృక్షము కలదు. ఆ వృక్షముతోనే ఈ ద్వీపమునకు శాకద్వీపమని పేరు వచ్చినది. ఈ శాకవృక్షము ఆకులు లోన కఠిన స్పర్శ కలిగి, బయట మృదు స్పర్శ కలవై ఉండును. ఈ వృక్షము నుండి వచ్చు గొప్ప సుగంధము ఆ శాకద్వీపమంతటినీ సుంగంధితమొనర్చును. 23

చూ॥ తస్యాపి ప్రైయవ్రతేవాధిపతిర్నామ్నా మేధాతిథిః సోఽపి విభజ్య సప్తవర్షాణి పుత్రనామాని తేషు స్వాత్మజాన్ పురోజవా మనోజవవే పమాన ధూమ్రానీక చిత్రరథ బహురూప విశ్వచార సంజ్ఞాన్నిధాప్యాధి పతీన్-స్వయం భగవత్యనంత ఆవేశితమతి స్తపోవనం ప్రవివేశ తేషాం వర్షమర్యాదా గిరయో నద్యశ్చ సప్తసప్తైవాసన్. 24

ఈ శాకద్వీపమునకును ప్రియవ్రతుని పుత్రేడే అధిపతి. ఆతని పేరు మేధాతిథి. ఇతడును ఈ శాక ద్వీపమును తన పుత్రుల పేర్లతో సప్తవర్షములుగా విభజించి ఆ వర్షములకు తన పుత్రులగు పురోజవుడు, మనోజవుడు, వేపమానుడు, ధూమ్రానీకుడు, చిత్రరథుడు, బహురూపుడు, విశ్వచారుడను వారిని అధిపతులనుగా నియమించి తాను భగవంతుడగు శ్రీహరి యందు బుద్ధిని నిలిపి తపోవనమునకు వెళ్ళెను. ఆ వర్షముల సరిహద్దు పర్వతములు ఏడు, నదులును ఏడే ఉండును. 24

 







చూ॥ ఈశాన ఉరుశృంగో బలభద్రశ్శతకేసరస్సహస్రస్రోతా దేవపాలో మహానస ఇతి. 25

ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రస్రోతము, దేవపాలము, మహానసము అనునవి ఏడు రకముల గిరులు. 25

చూ॥ అనఘా ఆయుర్దా-ఉభయసృష్టిరపరాజితా-పంచపరీ-సహస్ర సృతిః నిజధృతిరితి. 26

అనఘా, ఆయుర్దా, ఉభయసృష్టి, అపరాజితా, పంచపరీ, సహస్రసృతి, నిజధృతి, అనునవి ఏడు నదులు. 26

చూ॥ తద్వర్షే పురుషా ఋతవ్రతసత్య వ్రతదాన వ్రతసువ్రతనామానో భగవంతం-వాయ్వాత్మకం ప్రాణాయామవిధూతరజస్తమసః పరమ సమాధినా యజంతే. 27

ఈ శాక వర్షములో ఋతవ్రత, సత్యవ్రత, దానవ్రత, సువ్రతులను చాతుర్వర్ణ పురుషులు ప్రాణాయమముద్వారా రజస్తమో గుణముల క్షీణింపచేసికొని వాయురూపుడగు భగవంతుని గొప్ప సమాధి యోగముతో ఉపాసించెదరు. 27

టీ:- ఏవమితి. క్షీరోదేన క్షీరవదతిస్వచ్ఛేనోదకేన యస్య పర్ణాన్యంతః ఖరస్పర్శాని. బహిర్మృదు స్పర్శాని స శాకో నామ వృక్షః. (23-27)

శ్లో॥ అంతఃప్రవిశ్య భూతాని యో బిభర్త్యాత్మకేతుభిః ।
అంతర్యామీశ్వరస్సాక్షాత్పాతు నో యద్వశే ఇదమ్ ॥ 28

ఎవరైతే తన ప్రాణాదివృత్తులతో ప్రాణులతో ప్రవేశించి వారిని రక్షించునో, ఈ సంపూర్ణమగు దృశ్యజగత్తు ఎవని ఆధీనములో నుండునో, అట్టి సాక్షాత్ సర్వాంతర్యామియగు వాయు భగవానుడు మమ్ములను రక్షించుగాక. (అని స్తుతించెదరు) 28

టీ:- అంతరితి. ఆత్మకేతుభిః ప్రాణాదివృత్తిభిః అత్ర వశే ఇదమితి సంధ్యభావ ఆర్షః. 28












చూ॥ ఏవమేవ క్షీరోదాత్పరతః పుష్కరద్వీపస్తతో ద్విగుణాయామస్స మంతత ఉపకల్పితస్సమానేన స్వాదూదక సముద్రేణ బహిరావృతః-యస్మిన్బృహత్పురుషం జ్వలనశిఖామల కనక పత్రాయుతాయుతం భగవతః కమలాసనస్యాధ్యాసనం పరికల్పితమ్. 29

టీ:- ఏవమితి. జ్వలనశిఖావదమలానాం కనకపత్రాణాం. అయుతానాం అయుతాని యస్య. 29

ఇదే విధముగ క్షీరసముద్రము పిదప క్షీరసముద్రమునకంటే రెండింతలు విశాలము కల్గినట్టి, తనతో సమానమగు విస్తారముగల శుద్ధోదకసముద్రముతో బయట అంతటా చుట్టుకొని పుష్కరద్వీపము కలదు. ఈ ద్వీపమున అగ్నిశిఖలవలె ప్రకాశించు సువర్ణమయములగు లక్షసంఖ్యగల రెక్కలుగల(రేకులుగల)ఒక పెద్దకమలము భగవంతుడగు బ్రహ్మదేవునకు ఆసనముగా కల్పించబడి యున్నది. 29

చూ॥ తద్ద్వీపమధ్యే మానసోత్తరో నామైక ఏవార్వాచీన పరాచీనయోర్వర్షయోర్మర్యాదాచలోऽయుతయోజనోచ్ఛ్రాయాయామః-యత్ర చతసృషు దిక్షు చత్వారి పురాణి లోకపాలానా మిన్ద్రాదీనాం యదుపరిష్టాత్సూర్య రథస్య మేరుం పరిక్రమతః సంవత్సరాత్మకం చక్రం దేవానా మహో రాత్రాభ్యాం చక్రవత్పరిభ్రమతి. 30

ఆ పుష్కరద్వీప మధ్యమున ఆ ద్వీపపు ప్రాక్పశ్చిమ విభాగమును తెలిపెడి పదివేల యోజనముల ఎత్తు, పదివేల యోజనముల పొడవుగల మానసోత్తరమను ఒకే పర్వతము కలదు. ఈ పర్వతముపైన నాలుగు దిశలలో ఇంద్రాది లోకపాలకుల నాలుగు పట్టణములు కలవు. దీనిపైన మేరు పర్వతమును పరిక్రమించెడి సూర్యరథముయొక్క సంవత్సర రూపమగు చక్రము, దేవతల అహోరాత్రములు అనగా ఉత్తర దక్షిణాయనములతో చక్రమువలె సర్వదా పరిభ్రమించుచుండును. 30

చూ॥ తద్ద్వీపస్యాధిపతిః ప్రైయవ్రతో వీతిహోత్రో నామ-స్వాత్మజౌ రమణకథాతకనామానౌ వర్షపతీ నియుజ్య స్వయం పూర్వజవద్భగవత్కర్మశీల ఆస్తే. 31

ఈ పుష్కరద్వీపమునకధిపతి, ప్రియవ్రత పుత్రుడగు వీతిహోత్రుడు. అతడు రమణక, ధాతకలను పేర్లుగల తన పుత్రులను రెండు వర్షములకధిపతుల నొనరించి తను తన అన్నలవలెనే భగవత్సేవాతత్పరుడై ఉండెను. 31






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- తదితి దేవ నామహోరాత్రాభ్యాం ఉత్తరదక్షిణాయ నాభ్యామిత్యర్థః. (30-31)

చూ॥ తద్వర్షపురుషా భగవంతం బ్రహ్మరూపిణిం సకర్మకేణ కర్మణా చారాధయంతి. 32

ఆ పుష్కరవర్షమున నివసించెడివారు కమలాసనుడు, బ్రహ్మరూపియగు భగవంతుణ్ణి, బ్రహ్మసాలోక్యాదులను (బ్రహ్మాది లోకాలలో ఉండేట్టు) ప్రాప్తింప చేసెడి కర్మలతో ఆరాధించెదరు. 32

టీ:- తదితి. బ్రహ్మరూపిణం కమలాసనమూర్తిం. సకర్మకేణ బ్రహ్మసాలోక్యాదిసాధనేన. 32

ఇదం చోదాహరంతి.

శ్లో॥ యత్తత్కర్మమయం లింగం బ్రహ్మలింగం జనోఽర్చతి ।
భేదేనైకాంతమద్వైతం తస్మై భగవతే నమ ఇతి ॥ 33

ఎవరైతే సాక్షాత్ కర్మఫల రూపుడో, ఎవని నుండి బ్రహ్మజ్ఞానము సాధ్యమగునో, ఒకే పరమేశ్వరునిలో ఎవని సంపూర్ణ స్థితి కలదో ఎవరినైతే అందరూ పూజించెదరో, ఎవరైతే అద్వీతీయుడో, శాంత స్వరూపుడో, అట్టి బహ్మస్వరూపుడగు, భగవంతునకు నమస్కారము అని స్తుతించెదరు (33)

టీ:- యత్తదితి. కర్మమయం కర్మఫలరూపం. బ్రహ్మ లింగ్యతే యస్మాత్. ఏకస్మిన్నేవ పరమేశ్వరే అన్తో నిష్ఠా యస్య తత్ అతఏవ. వస్తుతః అద్వైతం. 33

చూ॥ తతః పరస్తాత్ లోకాలోకో నామాచలో లోకాలోకయోరంతరాళే పరిత ఉపక్లృప్తః. 34

ఈ శుద్ధోదక సముద్రము తర్వాత లోకాలోకమను పర్వతము లోకాలోకముల మధ్యన చుట్టునూ కల్పించబడి యున్నది. ఇది




టీ:- తత ఇతి. తతశ్శుద్ధోదాత్. పరస్తాత్ లోకః సూర్యాద్యాలోకవాన్ దేశః ఆలోకః తద్రహితః. తయోరంతరాళే మధ్యే. తయోర్విభాగార్థ మిత్యర్థః. 34

చూ॥ యావన్మానసోత్తరమేర్వోరంతరం తావతీ భూమిః-కాంచన్యా దర్శతలోపమా-యస్యాం ప్రహితః పదార్థో న కథంచిత్పునః ప్రత్యుపల భ్యతే-తస్మాత్సర్వసత్త్వపరిహృతా-ఆసీత్. 35

టీ:- తతః పరస్తాదితుక్త్యం తదేవ కియతాంతరేణేత్యపేక్షాయాం. తదంతర్వర్తినీం భూమిమాహ - యావదితి. సార్ధసప్తలక్షోత్తరం సార్ధ కోటి పరిమితం. తావతీ భూః. శుద్ధోదాత్పరతోఽస్తీత్యర్థః. సాచైకోన చత్వారిం శల్లక్షోత్తర కోట్యష్టక పరిమితా జ్ఞేయా. అర్ధపుష్కర ద్వీపేన. సహశుద్ధోదః షణ్ణవతి లక్షాణి ఏవం హి సతి మేరులోకాలోక యో రంతరం సార్ధ ద్వాదశకోటిపరిమితం తావతీభూరితి వక్ష్యమాణము పపన్నం భవతి. ఏతదేన శైవతంత్రేషూక్తం. శ్లో. "కోటిద్వయం త్రిపంచా శల్లక్షాణి చ తతః పరమ్, పంచాశచ్చ సహస్రాణి సప్తద్వీపాస్ససాగరాః తతో హేమ మయీ భూమిర్దశకోట్యో వరాననే, క్రీడానార్థాయ లోకాలోకస్తతః పర" ఇతి. అత్ర చ దశకోటిత్వం పూర్వోక్తభూమ్యా సహద్రష్టవ్యం సర్వసత్త్వ పరిహృతేతి దేవవ్యతిరేకేణేతి జ్ఞేయం. దేవానాం క్రీడానార్థా యేత్యుక్త త్వాత్. 35

సూర్యాద్యాలోకము (సూర్యాది ప్రకాశము) కల్గినది. సూర్యాద్యా లోకము లేనిది అలోకము. ఈ రెండింటిని విభజించుటకు లోకాలోక పర్వతము కలదని తాత్పర్యము. 34

శుద్ధోదమునకంటే తర్వాత లోకాలోక పర్వతమని చెప్పబడినది. ఎంత దూరము తర్వాత ఉంటుదనే విషయం కోసం ఆ మధ్యలోనున్న భూమిని గూర్చి తెలుపుచున్నాడు.

మేరుపర్వతము నుండి మానసోత్తర పర్వతము వరకు ఒక కోటి యాభైఏడు లక్షల యాభైవేల యోజనముల భూమి కలదు. ఇది శుద్ధోన సముద్రము వరకు గలది. పిదపగల భూమి ఎనిమిది కోట్ల ముప్పది తొమ్మిది లక్షల యోజన పరిమితమైనదిగా తెలియవలెను. పుష్కర ద్వీపములోని సగభాగముతో కూడిన శుద్ధోదకము తొంబదిఆరు లక్షల యోజనములు. ఈ మేరు లోకాలోక పర్వతముల అంతరము పన్నెండుకోట్ల యాభైలక్షల యోజన పరిమిత భూమియని చెప్పబోవునది సరిపడగలదు. ఈ విషయమే శైవతంత్రములలోను చెప్పబడినది. సాగరములతో కూడిన సప్తద్వీపములు రెండు కోట్ల యాభైమూడులక్షల యాభైవేల యోజనములు. ఆ తరువాత సువర్ణమయమగు భూమి పదికోట్ల యోజనములు. ఇది దేవతల క్రీడార్థమైనది. ఆ తరువాత లోకము ఆ పిమ్మట అని చెప్పబడినది. అచట పదికోట్లు అనునది





చూ॥ లోకాలోక ఇతి సమాఖ్యా యదనేనాచలేన లోకాలోకయోరంత ర్వర్తినా వ్యవస్థాప్యత ఇతి సలోకత్రయాంతే పరిత ఈశ్వరేణ విహితః -యస్మాత్సూర్యాదీనాం ధ్రువాపవర్గాణాం జ్యోతిర్గణానాంగభస్తయోఽ ర్వాచీనాం స్త్రీన్ లోకానావితన్వానా న కదాచిత్పరాచీనా భవితుముత్స హంతే. 36

టీ:- లోకాలోక ఇతి. లోకత్రయస్యాంతే పరితో మర్యాదారూపో విహితః. యస్మాత్ ప్రతిబంధకాత్ సూర్యః ఆదిర్యేషాం ధ్రువోఽప సర్గోఽంతో యేషాం అవితన్వానాః సమంతాత్ప్రకాశయంతః. పరతో గంతుం న శక్నువంతి. 36

పూర్వములో చెప్పబడిన భూమితో సహా చూడవలెను. ఆ తరువాత సువర్ణమయము, దర్పణముతో సమమగు స్వచ్ఛమైన భూమిగలదు. ఈ భూమిలో పడిన ఏ వస్తువుకూడా తిరిగి లభించదు. అందువలన ఈ భూమిలో దేవతలు కాక ఏ ప్రాణియు నుండదు. దేవతానాం క్రీడానాయ అని చెప్పబడుటచే దేవతావ్యతిరిక్త ఏ ప్రాణియు నుండదని తెలియవలయును. 35

లోకాలోక పర్వతము సూర్యాది ప్రకాశముగల, సూర్యాది ప్రకాశము లేని భూభాగములమధ్య నున్నందున ఈ పర్వతమునకు లోకాలోక పర్వతమని పేరు కలిగినది. ఈ లోకాలోక పర్వతమును పరమాత్మ ముల్లోకముల బయట, చుట్టునూ స్థాపించినాడు. ప్రతిబంధక మగు ఈ పర్వతము వలన ముల్లోకములను ప్రకాశించెడి సూర్యుని నుండి ధ్రువుని వరకుగల సమస్త జ్యోతిస్సమూహముల యొక్క కిరణములు అర్వాచీనములగు ముల్లోకములను ప్రకాశింపచేస్తూ ఎప్పుడు కూడా పరాచీనములు కావు. అనగా అవతలివైపుకు వెళ్ళలేవు. (36)







చూ॥ తావదున్నహనాయామః ఏతావానేన లోకవిన్యా సోమానలక్షణ సంస్థాభిశ్చింతితః కవిభిః. 37

టీ:- తావదితి. తావదున్నహనముత్సేధః తదనురూప ఆయామశ్చ విస్తారో యస్య ధ్రువాదప్యుచ్ఛ్రితత్వాత్త్రిలోకీ మర్యాదాభూతఇత్యర్థః. 37

సూర్యకిరణ ప్రసారమును కూడా అడ్డుకొనేంత ఎత్తు, దానికి తగిన విస్తారము కలిగియున్నదీ పర్వతము. ధ్రువుని కంటే ఎత్తుగా నుండడముచే ముల్లోకములకు సరిహద్దుగా అయినదని భావము. పండితులచే లక్షణము, స్థితి ననుసరించి ఈ విధముగా (ఇంతయే) లోకముల విస్తారము చెప్పబడినది. 37

చూ॥ స తు పంచాశత్కోటి గుణితస్య భూగోళస్య తురీయ భాగోయం లోకాలోకాచలః తదుపరిష్టాచ్చతసృష్వాశాస్వాత్మ యోనినాఖిల జగద్గురుణాధినివేశితా యే దిగిభపతయః ఋషభః పుష్కరచూడో వామనోऽప రాజిత ఇతి సకల లోకస్థితి హేతవః. 38

టీ:- స ఇతి. సోऽయం తు లోకాలోకాచలః. తురీయభాగః చతుర్థోऽంశః సార్ధద్వాదశకోట్యః. మేరోరేకత ఇతి ద్రష్టవ్యం. ఆశాసు దిక్షు యే నిధినివేశితాః తే ఆసతే. 38

సమస్త భూగోళము యాభైకోట్ల యోజనముల పరిమితమైనది. ఈ భూగోళ పరిమాణములో లోకాలోక పర్వతము నాల్గవభాగ పరిమితమై అనగా పన్నెండున్నరకోట్ల యోజన పరిమితమై యున్నది. దీనిపైన నాలుగు దిశలలో సమస్త ప్రపంచమునకు గురువుగు బ్రహ్మచేత ఋషభ, పుష్కర, చూడవామన, అపరాజితములను ఏ దిగ్గజములున్నవో అవి సమస్త లోకస్థితికి కారణములై యున్నవి. 38

చూ॥ తేషాం స్వవిభూతీనాం మహేంద్రాదీనాం లోకపాలానాం వివిధవీర్యోపబృంహణాయ-భగవాన్ పరమమహాపురుషో మహావిభూతి పతిరంతర్యామ్యాత్మనో విశుద్ధసత్త్వధర్మజ్ఞాన మహావైరాగ్యైశ్వర్యాద్యష్ట మహాసిద్ధ్యుపలక్షణం-విష్వక్సేనాదిభిస్స్వపార్షదప్రవరైః పరివారితో

ఆ దిగ్గజములకు తన అంశభూతులగు మహేంద్రాది లోక పాలకుల యొక్క వివిధ శక్తులను వృద్ధినొందించుటకు, సమస్త లోకములకు స్వస్తి నొనరించుటకై భగవంతుడు, పురుషోత్తముడు, సమస్త ఐశ్వర్యముల కధిపతి, సర్వాంతర్యామియగు శ్రీహరి తన








నిజవరాయుధోపశోభితైర్దోర్దండైస్సంధారయమాణస్తస్మిన్ గిరివరే సమన్తాత్సకలలోక స్వస్తయ ఆస్తే. 39

టీ:- తేషామితి. తేషాం దిగ్గజానాం. స్వవిభూతీనాం. స్వాంశ భూతానాం. మహేంద్రాదీనాం చ వివిధవీర్యోపబృంహణాయ సకలలోక స్వస్తయే చ. భగవాన్ తస్మిన్నాస్త ఇత్యన్వయః. కింకుర్వన్. ఆత్మనః స్వస్య యద్విశుద్ధం సత్త్వం తతస్తం ధారయమాణః ఆవిష్కుర్వన్. కీదృశం ధర్మజ్ఞానాద్యష్టమహాసిద్ధయశ్చోపలక్షణం యస్య తత్. దోర్దండైరుపలక్షితస్సన్. మహావిభూతేః పరమైశ్వర్యస్య. పతిత్వాదేకయైవమూర్త్యా. సమంతాదాస్తే. 39

చూ॥ ఆకల్పమేష భవగానాత్మమాయావిరచిత వివిధలోకయాత్రాగోపీథాయేతి. 40

టీ:- నన్వతర్యామిణా అంతస్స్థేనైవ సర్వం కర్తుం శక్యం. కిం తస్య బహిస్సమంతాదవస్థానేనేత్యాశంక్య తస్యార్థం స్వయమేవ వ్యాచష్టే- ఆకల్పమితి ఆత్మనో యోగమాయయా. విరచితా యా. వివిధాలోక యాత్రా తస్యాః గోపీథాయ రక్షణాయ. ఏష భగవానేవంభూతం ఆకల్పం వేషం గతః లీలయా ప్రాప్త ఇతి సమంతాదాస్త ఇత్యస్యార్థః. 40

శుద్ధసత్త్వమగు ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాది ఎనిమిది మహాసిద్ధులతో సంపన్నుడై, శ్రేష్ఠమైన శంఖ చక్రాద్యాయుధములను, భుజములయందు ధరించి, సుశోభితుడై విశ్వక్సేనాది తనపరివారముతో పరివేష్టితుడై, ఆ పర్వతమున కల్పాంతము వరకుండును. పరమైశ్వర్యమునకు పతియగుటచే ఒకే రూపముతో ఆ పర్వతమున అంతటా ఉండును. 39

భగవంతుడు సర్వాంతర్యామియగుచే అతడే సమస్తము నొనరించుటకు శక్యుడుకదా! అలాంటి భగవంతుడు బయట, లోన అంతటా ఉండుట ఎందుకని శంకించి సమంతాదనుదాని అర్థమును తానే వ్యాఖ్యానించుచున్నాడు.

తన యొక్క యోగమాయచేత రచించబడిన వివిధములగు లోకముల వ్యవస్థను రక్షించుటకై ఆ భగవంతుడు తన లీలామానుష రూపముతో కల్పాంతము వరకు ఆ పర్వతమున అంతటా నుండునని భావము. 40


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ



చూ॥ యోఽన్తర్విస్తార ఏతేనహ్యాలోకపరిమాణం చ వ్యాఖ్యాతం- యద్బహిర్లోకాలోకాచలాత్ తతః పరస్తాద్యోగేశ్వరగతిం విశుద్ధముదా హరంతి. 41

టీ:- య ఇతి. ఆలోకపరిమాణం చ మేరోరేకతః సార్ధ ద్వాదశ కోటయః తతో లోకాలోకాత్ ఆలోకాద్వా. పరస్తాత్ విశుద్ధాం ద్విజపుత్రానయనేఽర్జునస్య శ్రీకృష్ణేన ప్రదర్శితాం. 41

లోకాలోక పర్వతాంతరములోనున్న భూవిస్తారము, మేరుపర్వతమునుండి లోకాలోక పర్వతము వరకుగల భూవిస్తారము పన్నెండుకోట్ల యాభైలక్షల యోజనములు అని వ్యాఖ్యానించబడినది. లోకాలోక పర్వతమునుండి బయటనుండెడి భూభాగమును బ్రాహ్మణ పుత్రుని తెచ్చుటకై అర్జునునకు శ్రీకృష్ణుడు చూపించినదిగా తెలుపుదురు. ఆ బయట భూమిలో కేవలము యోగీశ్వరులే సంచరించగలుగుదురు. 41

శ్లో॥ అండమధ్యగత సూర్యో ద్యావా భూమ్యోర్యదంతరం ।
సూర్యాండగోళయోర్మధ్యే కోట్యస్స్యుః పంచవిశంతిః ॥ 42

టీ:- విస్తరేణోక్తం బ్రహ్మాండమానం సర్వతోఽపి నిరూపయతి - అండేతి. అండమధ్యగతః. కిం తన్మధ్యం? తదాహ - ద్యావాభూమ్యోః పూర్వోత్తరకపాలయోర్యదంతరం మధ్యమస్థానం. సర్వతః పంచవిశంతి కోట్యస్స్యుః. 42

సవిస్తారముగా చెప్పబడిన బ్రహ్మాండముయొక్క పరిమాణము మొత్తము తెలుపుచున్నాడు. బ్రహ్మాండ మధ్యన సూర్యుడు కలడు. ఈ అండమధ్యమున ఏమిటో తెలుపుచున్నాడు. స్వర్లోక, భూలోకములు పూర్వోత్తర కపాలములు; వాటి అంతరాళములోని మధ్య స్థానమే అండమధ్యము. ఈ మధ్యస్థానమున సూర్యుడుగలడు. సూర్యునకు బ్రహ్మాండమునకు మధ్య స్థలము అన్ని దిశలలోను ఇరువది ఐదుకోట్ల యోజనములు. 42

శ్లో॥ మృతేఽండ ఏష ఏతస్మిన్ యతో మార్తాండ ఉచ్యతే ।
హిరణ్యగర్భ ఇతి యద్ధిరణ్యాండసముద్భవః ॥ 43

సూర్యుడు బ్రహ్మాండము మధ్యలో నుండుటకు వేరే కారణమును ఆ సూర్యనామ నిర్వచనముతో తెలుపుచున్నాడు.

మృతమగు అనగా అచైతన్యమగు బ్రహ్మాండము మధ్యలో వైరాజ








టీ:- అండమధ్యావస్థానే కారణాంతరం తన్నామనిర్వచనేనాహ-మృతఇతి మృతే అచేతనేఏష సూర్యోవైరాజరూపేణయస్మాత్ర్పవిష్టః. 43

రూపముతో ఉండడముచే సూర్యుడు మార్తాండుడని, హిరణ్మయమగు బ్రహ్మాండము నుండి ప్రకటితుడగుచే హిరణ్యగర్భుడని పిలువబడు-చున్నాడు. 43

శ్లో॥ సూర్యేణ హి విభజ్యంతే దిశః ఖం ద్యౌర్మహీభిదా ।
స్వర్గాపవర్గ నరక రసౌకాంసి చ సర్వతః ॥ 44

టీ:- సూర్యేణేతి. కించ సూర్యేణైవ విభజ్యంతే. దిశః ఖమంతరిక్షం భిదా అన్యోఽపి విభాగః. స్వర్గాపవర్గౌ భోగమోక్షదేశౌ. రసౌకాంసి అతలాదీని. 44

ఆ సూర్యుని చేతనే దిక్కులు, ఆకాశము, ద్యులోకము, (అంతరిక్ష లోకం) భూలోకము, స్వర్గము, మోక్షము, నరకములు, అతలాది లోకములుగా సమస్త విభాగములు కలుగుచున్నవి. 44

శ్లో॥ దేవతిర్యఙ్మనుష్యాణాం సరీసృప వీరుధామ్ ।
సర్వజీవ నికాయానాం సూర్య ఆత్మాదృగీశ్వరః ॥ 45

టీ:- ఉపాసనార్థమాహ - దేవాదీనాం సూర్యః ఆత్మా. దృగీశ్వరః నేతా అధిష్టాతా చ. 45

ఉపాసన కొరకై తెలుపుచున్నాడు.

సూర్యుడే దేవతలకు, తిర్యక్కులకు, మనుష్యులకు, సరీసృపము-లకు, లతావృక్షాదులకు, సమస్త జీవ సమూహమునకు ఆత్మనేత్రేంద్రి-యాధిష్ఠాతయై యున్నాడు. (సూర్య ఆత్మా జగతస్థస్తుషశ్చ-శ్రుతి) 45

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,**
**వింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు**
**ఇరువదవ అధ్యాయము సమాప్తము.**








## ఏకవింశోऽధ్యాయః

శ్లో॥ ఏవమధ్యాయవింశత్యా భూమర్యాదా నిరూపితా ।
అతః పరం ద్యుమర్యాదా పాలనం త్రిభిరుచ్యతే ॥
ఏకవింశే రవేః కాలచక్రేణ భ్రమతోऽన్వహం ।
స్వగత్యా రాశిసంచారైర్లోకయాత్రా నిరూప్యతే ॥

**శ్రీశుక ఉవాచ**

చూ॥ ఏతావానేవ భూవలయస్య సన్నివేశః ప్రమాణ లక్షణతో వ్యాఖ్యాతః ఏతేన హి దివో మండలమానం తద్విద ఉపదశంతి-యథా ద్విదళయోర్నిష్పావాదీనాం తదంతరేణాంతరిక్షం తదుపసంధితం యన్మధ్యగతో భగవాంస్తపతాం పతిస్తపన ఆతపేన త్రిలోకీం ప్రతపత్యవ భాసయత్యాత్మభాసా. 1

టీ:- ఏతావానితి. ఏతావాన్విస్తారేణ కోట్యః పంచాశత్-ఉత్సేధేన పంచవిశంతిః-నిష్పావాదీనాం నిష్పావబీజవద్ద్విదళవద్బీజాదీనాం-ద్విదళయోర్మధ్యే-యద్దైకస్య మానేనాపరస్యమానముపదిశ్యతే-తద్వత్ తదంతరేణ తయోర్మధ్యే-తదుపసంధితం తాభ్యాముభయతస్సంలగ్నం. 1

## 21 వ అధ్యాయము

ఈ విధముగా ఇరువది అధ్యాయములలో భూలోకవిషయము నిరూపించబడినది. ఆ పిదప మూడధ్యాయములతో ద్యుమర్యాదా (సూర్యమండల) పాలనము తెలుపబడుచున్నది. ఈ ఇరువది ఒకటవ అధ్యాయమున ప్రతి దినము కాలచక్ర భ్రమణముతో సూర్యుని గమనముతో రాశి సంచారము నిరూపించబడుచున్నది.

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

భూవలయముయొక్క విస్తారము యాభైకోట్ల యోజనములు , ఎత్తులో ఇరువదిఐదుకోట్ల యోజనములని భూలోకముయొక్క సన్నివేశము ప్రమాణలక్షణములతో తెలుపబడినది. శనగలు మొదలగు ద్విదళముల విత్తనముల యొక్క రెండు దళములలో ఒకదాని స్వరూపము తెలిసిన (రెండు సమాన విభాగములుగా విడిపోయినప్పుడు పైభాగమెంతో క్రింది భాగమూ అంతేకదా!) రెండవదాని స్వరూపము తెలిసికొనగలిగినటుల భూ పరిమాణముననుసరించి పండితులు ద్యులోక పరిమాణమును కూడా తెలుపుదురు. ఈ భూ, ద్యులోకముల మధ్యన అంతరిక్షలోకము కలదు. ఈ అంతరిక్షము భూ, ద్యులోకముల రెండింటిని అంటుకొని యున్నది. దీని మధ్యన భగవంతుడగు సూర్యుడు తనవేడి, ప్రకాశములతో ముల్లోకములను వేడెక్కించుచు, ప్రకాశింపచేస్తూ తనదైన కాంతితో ప్రకాశించుచున్నాడు. 1


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









చూ॥ స ఏష ఉదగయన దక్షిణాయన వైషువతసంజ్ఞాభిరారోహణావరోహణాభ్యాం మందక్షిప్రసమానాభిర్గతిభిరారోహణావరోహణ సమస్థానేషు యథా సవనమభిపద్యమానో మకరాదిషు రాశిష్వహో రాత్రాణి దీర్ఘహ్రస్వ సమానాని విధత్తే. 2

టీ:- స ఇతి. ఉదగయనాది సంజ్ఞాదిభిర్మంద క్షిప్ర సమగతిభిః - యథా కాలం ఆరోహణాది స్థానేషు ఆరోహణాద్యభిపద్యమానః - మకరాదిష్వహో రాత్రాణి దీర్ఘ హ్రస్వసమానాని విధత్తే. 2

ఈ సూర్యుడు ఉదగయన, దక్షిణాయన, వైషువత (విషువత్) అనుపేర్లు గల్గినట్టి వరసగా మంద, క్షిప్ర, సమాన గమనములతో , ఆరోహణ, అవరోహణ, సమాన స్థానములలో యథా కాలముగా చలనముగావిస్తూ మకరాది రాశులలో దివా రాత్రములను దీర్ఘ, హ్రస్వ, సమానములుగా చేయుచున్నాడు. 2

చూ॥ యదా మేష తులయోర్వర్తతే తదాహోరాత్రాణి సమాని భవంతి. (3)

టీ:- తత్ప్రపంచయతి - యదేతి. అత్యంతవైషమ్యాభావాత్సమానానీత్యుక్తం సర్వదా సామ్యం త్వేకస్యైవాహోరాత్రస్య. 3

ఆ విషయమును విశదపరచుచున్నాడు. సూర్యభగవానుడు ఎప్పుడు మేష, తులా రాశులలో సంచరించుచుండునో అప్పుడు అహస్సు(పగలు) రాత్రి సమానములుగా నుండును. పెద్ద వైషమ్యు లేనందున సమానములు అని చెప్పబడినది. ఒక అహోరాత్రము ఎప్పుడూ సమానముగానే యుండును. 3

చూ॥ యదా వృషభాదిషు పంచసు రాశిషు చరతి - తదాహాన్యేవ వర్ధంతే - హ్రసతి చ మాసి మాస్యై కైకా ఘటికా రాత్రిషు యదా వృశ్చికాదిషు పంచసు వర్తతే-తదాహోరాత్రాణి విపర్యయాణి భవంతి. 4

సూర్యుడు ఎప్పుడు వృషభము మున్నగు ఐదు రాశులలో సంచరించుచుండునో అప్పుడు పగళ్ళు వృద్ధిచెందుచుండును. నెల నెలా రాత్రులలో ఒక్కొక్క ఘడియ తగ్గుచుండును ఎప్పుడైతే వృశ్చికాది పంచ రాశులలో నుండునో అహోరాత్రములు విపర్యయములగును









టీ:- యదేతి. యద్యపి వృషభమిథునయోరేవ అహ్నాం వృద్ధిః. కర్కటాదిషు హ్రాసః. తథాపి రాత్ర్యపేక్షయా వర్ధంత ఇత్యుక్తం. ఏవం రాత్రి వృద్ధావపి. దినాపేక్షయా హ్రసంతీత్యుక్తం. ఏకైకేతి చ. స్థూలదృష్ట్యోక్తం వృద్ధిహ్రాసయోః ప్రతిమాసం వైషమ్యాత్. విపర్యయాణీతి. అహాని న్యూనాని. రాత్రాయోऽధికా ఇత్యర్థః. 4

అనగా రాత్రులు వృద్ధినొందును, పగళ్ళు తగ్గుచుండును. వృషభ మిథున రాశులలో సంచరించినప్పుడు అహస్సునకు (పగటికి) వృద్ధి కర్కాటాదులలో క్షీణత్వము కల్గుచున్నది. అయినప్పటికి రాత్రికంటే పగళ్ళు పెరుగుచున్నవని చెప్పబడుచున్నది. ఇదే విధముగా రాత్రివృద్ధి విషయమునను దినమున కంటే తగ్గుచున్నవని చెప్పబడినది. ప్రతిమాసములోను వేరువేరు విధములు నుండుటచే పై విషయము స్థూలదృష్టితో చెప్పబడినది. 4

చూ॥ యావద్దక్షిణాయనమహాని వర్ధంతే యావదుదగయనం రాత్రయః ఏవం నవకోటయ ఏకపంచాశల్లక్షాణి చ యోజనానాం మానసోత్తరగిరి పరివర్తనస్యోపదిశంతి. 5

టీ:- తాత్త్వికం వృద్ధి హ్రాస్వ కాలమాహ-యావదితి. ఏవం మందాది గతిభిః నవకోటయ ఇతి. మేరోరుభయతః. మానసోత్తరస్యాంతర్విస్తారేణ పంచదశలక్షాధిక కోటిత్రయ పరిమితేన. ఇదం పరిమండలమాన మున్నేయం. ఏవం పంచదశభిర్ఘటికాదిభిరిత్యాదిష్వపి త్రైరాశిక గుణితేన తత్తన్మానమున్నేయం తత్రాపేక్షితో విశేషః పురాణాంతరాదవగంతవ్యః తత్రారోహణాది స్థానాని వాయుపురాణే దర్శితాని. శ్లో, "సర్వగ్రహాణాం త్రీణ్యేవ స్థానాని ద్విజసత్తమాః, స్థానం జరద్గవం మధ్యం

ఇప్పుడు నిజమగు వృద్ధి హ్రాస్వ(క్షయ)కాలమును తెలుపు చున్నాడు. దక్షిణాయనము వరకు దివములు(పగళ్ళు)పెరుగుచుండును ఉత్తరాయణము వరకు రాత్రులు పెరుగుచుండును. ఈ విధముగా మానసోత్తర పర్వతముపై సూర్యుని పరిక్రమ మార్గము మందాది గతులచే తొమ్మిదికోట్ల యాభైఒక్క లక్షల యోజనములు అని తెలుపుదురు. మేరువునకు రెండుప్రక్కల మానసోత్తర పర్వతముయొక్క లోపలి విస్తారముతో మూడుకోట్ల పదిహేనులక్షల యోజనములుగా ఈ పరిక్రమ మార్గము యొక్క కొలతను తెలియవలెను. ఈ విధముగానే పదిహేను ఘడియలతో అనువాటిలోను, మూడు రాశుల గుణితముతో ఆ యా కొలతలను తెలిసికొనవలెయును. ఈ విషయమున విశేష పరిజ్ఞానమును వేరే పురాణముల వలన తెలియవలెను.




తథైరావతముత్తరమ్, వైశ్వానరం దక్షిణతో నిర్దిష్టమిహ తత్త్వత” ఇతి. తదేవం మధ్యమోత్తర దక్షిణమార్గత్రయం ప్రత్యేకం. వీధి త్రయేణ త్రివిధా భిద్యతే. త్రిభిస్త్రిభిరశ్విన్యాది నక్షత్రైర్నాగవీధిర్గజ వీధిరైరావత వీధిశ్చేతి. ఉత్తరమార్గే వీధిత్రయం ఆర్షభీగోవీధిః జారద్గవీచేతి, వైషువతే మధ్యమార్గే వీధిత్రయం అజవీధిః మృగవీధిః వైశ్వానరవీధిశ్చేతి దక్షిణమార్గే వీధిత్రయం తదప్యుక్తం. తత్రైవ వాయుపురాణే. శ్లో. “అశ్వినీ కృత్తికాయామ్యా నాగవీధితిశబ్దితా, రోహిణ్యార్ద్రా మృగశిరో గజవీధ్యభిధీయతే. పుష్యాశ్లేషాతథాదిత్యావీధిశ్చైరావతీ స్మృతా, ఏతాస్తు వీధయస్తిస్ర ఉత్తరో మార్గ ఉచ్యతే. తథా ద్వే చాపి ఫల్గున్యౌ మఘా చైవార్షభీ మతా, హస్త చిత్తా తథా స్వాతిర్గోవీధిరితి విశ్రుతా. జ్యేష్ఠా విశాఖానురాధా వీధిర్జారద్గవీ మతా, ఏతాస్తు వీధయస్తిస్రో మధ్యమో మార్గ ఉచ్యతే. మూలాషాఢోత్తరాషాఢాహ్యజవీధ్యభిశబ్దితా, శ్రవణం చ ధనిష్ఠా చ మార్గీ శతభిషక్తథా. వైశ్వానరీ భాద్రపదీ రేవతీ చైవ కీర్తితా, ఏతాస్తు వీధయస్తిస్రో దక్షిణో మార్గ ఉచ్యత” ఇతి. యామ్యా భరణీ. ఆదిత్యా అదితి దేవతాకా పునర్వసుః మార్గీ మృగవీధిః. ఏవం స్థితే ఉత్తరాయణే ధ్రువేణ యుగాక్షకోటినిబద్ధవాయుపాశద్వయాకర్షణే. రథస్యారోహణం. తదాభ్యంతరమండల ప్రవేశో గతిమాంద్యం చ. తేన దినవృద్ధిః రాత్రిహ్రాసశ్చ దక్షిణాయనే చ. పాశప్రసారణాదవ రోహణే. బహిర్మండల ప్రవేశో గతిశైఘ్ర్యం చేత్యహోరాత్రయోర్విపర్యయః

ఆరోహణాదిస్థానములు వాయుపురాణమున ఇటుల చూపబడినవి. సమస్త గ్రహములకు జరద్గవం, ఐరావతం, వైశ్వానరం అని మూడు స్థానములు వీటిలో జరద్గవం మధ్యమస్థానము, ఐరావతం ఉత్తర స్థానము, వైశ్వానరము దక్షిణస్థానముగా నిర్దిష్టములైనవి. ఈ విధముగా మధ్యమోత్తరదక్షిణ స్థానములు మూడు ప్రత్యేకముగా వీధిత్రయముతో విభాగమొందును. అశ్విని మొదలుకొని మూడేసి నక్షత్రములతో నాగవీధి, గజవీధి, ఐరావతవీధి అని ఉత్తర మార్గమున మూడు వీధులు. వైషువత (మధ్యమ) మార్గములో ఆర్షభవీధి, గోవీధి, జారద్గవవీధి అను మూడు వీధులు, దక్షిణమార్గములో అజవీధి, మృగవీధి, వైశ్వానరవీధి అను మూడు వీధులు వాయుపురాణమున ఈ వీధుల విషయము ఇటుల తెలుప బడినది. అశ్విని, భరణి, కృత్తిక ఈ మూడు నక్షత్రములు నాగవీధి అనబడును. రోహిణి, మృగశిర, ఆర్ద్రలు గజవీధి అనబడును. పునర్వసు, పుష్యమి, ఆశ్లేషలు ఐరావతవీధి అనబడును. ఈ మూడువీధులు ఉత్తర మార్గమని చెప్పబడినవి. అదే విధముగా మఘ, పూర్వఫల్గుణ, ఉత్తర ఫల్గుణ నక్షత్రములు ఆర్షభవీధి, హస్త, చిత్త, స్వాతులు గోవీధి అని చెప్పబడినవి, విశాఖ, అనూరాధ, జేష్ఠలు జారద్గవవీధి. ఈ మూడు వీధులు మధ్యమ (వైషువత) మార్గమన బడును. మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢలు అజవీధి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషలు మృగవీధి, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతిలు వైశ్వానరవీధి.

 



వైషువతేషు. పాశసామ్యాత్సమూవస్థానే మధ్యమండలప్రవేశో గతిసామ్యం చేత్యహోరాత్రయోస్సామ్యమితి. తథా చ పురాణాంతరే. శ్లో. "ఆకృష్యేతే యదా హ్యేతౌ ధ్రువేణ సమధిష్ఠితౌ, తదాభ్యంతరత స్సూర్యో భ్రమతే మండలాని తు. ధ్రువేణ ముచ్యమానేన పునారశ్మి యుగేన తు. తత్రైవ బాహ్యతస్సూర్యో భ్రమతే మండలానిచే" తి. తదే తదుక్తం. యదా మేషతులయోరిత్యాదినా. 5

ఈ మూడు వీధులు దక్షిణ మార్గమన బడును. పై విషయము కింద రేఖా చిత్రమున చూపబడినది.

ఉత్తరమార్గము–ఉత్తరాయణం మధ్యమమార్గము–వైషువతము దక్షిణమార్గము–దక్షిణాయనము

| **ఐరావత స్థానము (ఉత్తర స్థానము)** | | **జరద్గవ స్థానము (విష్ణువత్) (మధ్యమ స్థానం)** | | **వైశ్వానర స్థానము (దక్షిణ స్థానము)** | |
|---|---|---|---|---|---|
| నాగవీధి | అశ్వని, భరణి కృత్తిక | ఆర్షభీవీధి | మఘ, పూర్వఫల్గుణ ఉత్తర ఫల్గుణ | అజవీధి | మూల, పూర్వాషాఢ ఉత్తరాషాఢ |
| గజవీధి | రోహిణీ, మృగశిర ఆర్ద్ర | గోవీధి | హస్త,చిత్త,స్వాతి | మృగవీధి | శ్రవణం, ధనిష్ఠ శతభిషం |
| ఐరావత వీధి | పునర్వసు, పుష్యమి ఆశ్లేష | జారద్గవ వీధి | విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ | వైశ్వానర వీధి | పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి |

ఈ విధముగానుండగా ఉత్తరాయణమున ధ్రువునితో యుగాక్ష కోటి నిబద్ధమగు వాయుపాశము. ఈ రెండింటి ఆకర్షణచే సూర్య రథమునకు ఆరోహనమునందు అంతరమండల ప్రవేశముతో గమనము మందగించును. దానితో అహస్సు వృద్ధియగును, రాత్రి

 



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ






చూ॥ తస్మిన్నైంద్రీం పురీం పూర్వస్మాన్మేరోర్దేవధానీంనామ-దక్షిణతో యామ్యాం సంయమనీం నామ-పశ్చాద్వారుణీం నిమ్లోచనీం నామ-ఉత్తరతస్సౌమ్యాం విభావరీం నామ. 6

టీ:- ఉదయాస్తమయాదికం వక్తుమహ-తస్మిన్నితి. తస్మిన్మానసోత్తరే మేరోః పూర్వత ఐంద్రీం పురీం ఉపదిశంతీత్యనుషంగః. 6

క్షీణించును. దక్షిణాయమున వాయుపాశ ప్రసారణము వలన అవరోహమునందు బహిర్మండల ప్రవేశముతో శీఘ్రగమనము చేత అహోరాత్రులు విపర్యయములు అనగా రాత్రి వృద్ధి అహస్సు క్షీణ మగును. వైషువతము (మధ్యమము)లో వాయుపాశము సమమగుటచే సమాన స్థితిలో మధ్య మండల ప్రవేశముతో సమాన గమనము కలిగి అహో రాత్రములు సమానముగా నుండును. వేరే పురాణమున ధ్రువునితో సమానమగు స్థితిలో దక్షిణోత్తర మార్గములు ఆకర్షించబడినవైనపుడు సూర్యుడు మండలములను లోపలనుండి పరిభ్రమించును. ధ్రువునిలో వదల బడినపుడు కాంతి సమూహముతో సూర్యుడు మండలములను వెలుపలనుండి పరిభ్రమించును. దీనితో రాత్రింబవళ్ళలో వ్యత్యాసము కలుగునని తెలుపబడినది. ఈ విషయమే మేష, తులయోః అను మొదలుగాగల దానిచేత చెప్పబడినది. 5

ఉదయాస్తమయాదులను తెలుపుచున్నాడు. ఆ మానసోత్తర పర్వతమున మేరువునకు ప్రాగ్దిశలో ఇంద్రుని దేవధానీ నగరము, (అమరావతి) మేరువునకు దక్షిణమున యముని సంయమినీ నగరము, పడమరలో వరుణదేవుని నిమ్లోచినీ నగరము, ఉత్తరమున చంద్రుని విభావరీ అను నగరములు కలవు. (అని తెలుపుదురు). 6







చూ॥ తాసూదయమధ్యాహ్నాస్తమయ నిశీథానీతి భూతానాం ప్రవృత్తి నివృత్తి నిమిత్తాని సమయ విశేషేణ మేరోశ్చతుర్దిశం తత్రత్యానాం దివసమధ్యగత ఏవ సదాదిత్యస్తపతి–సవ్యేనాచలం చలన్ దక్షిణేన కరోతి. 7

టీ:– తాస్వితి. తాసు పురీషు ఉదయాదీన్యుపదిశంతి చతుర్దిశ మిత్యుక్తేః యే మేరోర్దక్షిణే దేశే తేషామైంద్రీమారభ్య పూర్వాదయః. యే పశ్చిమే. తేషాం యామ్యామారభ్య. యే ఉత్తరే తేషాం వారుణీ మారభ్య. యే పూర్వే తేషాం సౌమ్యామారభ్య. తత్రత్యానాం మేరుస్థానాం సవ్యేనేతి. నక్షత్రాభిముఖాయా స్వగత్యా మేరుం వామతః కుర్వన్నపి. ప్రదక్షిణావర్త ప్రవహాఖ్య వాయుభ్రామ్యమాణ జ్యోతిశ్చక్రవశాత్ప్రత్యహం దక్షిణతః కరోతి. అతశ్చక్రగతివశాదతిదూరం గతోభూసంలగ్నస్యేవ దర్శనము దయః ఆకాశమారూఢస్యేవ దర్శనం మధ్యాహ్నః. భూమి ప్రవిష్టస్యే వాదర్శనమస్తమయః తతోऽతీవ దూరగమనే. నిశీథ ఇతి. సముద్రతీరస్థదృష్ట్యా చ. శ్రు. "అద్భ్యో వా ఏష ప్రాత రుదేత్యపస్సాయం ప్రవిశతీ" తి శ్రుతిసిద్ధో లోకవ్యవహారః న వాస్తవికః. తదుక్తం వైష్ణవే. శ్లో. "ఉదయాస్తమనే చైవ సర్వకాలం తు సమ్ముఖే, దిశాస్వశేషాసు తథా మైత్రేయవిదిశాసు చ. యైర్యత్ర దృశ్యతే భాస్వాన్ న తేషాముదయః స్మృతః, తిరోభావం చ యత్రైతి తత్రైవాస్తమనం రవేః నైవాస్తమన

ఆ నగరములలో మేరువునకు నాలుగు దిశలలో ఆయా జీవుల ప్రవృత్తి, నివృత్తులకు కారణములగు సూర్యోదయము, మధ్యాహ్నము, సూర్యాస్తమయము నిశీది (అర్ధరాత్రములు) అగుచున్నవి. మేరువు పైనన్నున్న వారికి ఎల్లప్పుడు సూర్యుడు మధ్యాహ్న కాలములలోనున్న వాడయ్యే తపింపచేయును. ఆ నగరములలో ఉదయాదులను ఇలా తెలుపుదురు. నాలుగు దిశలలో అని చెప్పబడినందున మేరువునకు దక్షిణదిశలోనున్న వారికి ఇంద్రపురము నుండి పూర్వాది దిక్కులు కాగలవు. మేరువునకు పశ్చిమదిశలో నున్నవారికి యమపురి నుండి, ఉత్తరములో నున్న వారికి వరుణపురి నుండి మేరువునకు పూర్వదిశలో నున్న వారికి చంద్రుని పురము నుండి పూర్వాది దిశలు సంభవము లగును. సూర్యుడు నక్షత్రాభిముఖమగు తన గమనముతో మేరువును వామపార్శ్వమున నుంచుకొని తిరుగుచున్ననూ, సమస్త జ్యోతిర్మండల మును భ్రమణమొనరించెడి ఎల్లప్పుడు దక్షిణ పార్శ్వమువైపు వీచెడి ప్రవాహమగు వాయువు ద్వారా పరిభ్రమింప చేయడముతో సూర్యుడు మేరువును దక్షిణ పార్శ్వమున నుంచుకొని గమన మొనర్చినటుల అనిపించును. అందువలన మండలాకార గమనము వలన చాలా దూరము వెళ్ళినపుడు భూమినంటుకొనినటుల కనిపించును. అదియే సూర్యోదయము. ఆకాశము అధిరోహించినటుల కనిపించడము మధ్యాహ్నము, భూమిలోనికి ప్రవేశించినటుల కనిపించక పోవడము








మర్కస్య నోదతుస్సర్వదా స్మృతః. ఉదయాస్తమనాఖ్యం హి దర్శనాదర్శనం రవేః. శక్రాదీనాం పురే తిష్ఠన్ స్పృశత్యేష పురత్రయం, వికర్ణౌ ద్వౌ వికర్ణస్థస్త్రీన్ కోణాన్ ద్విపురే తథే"తి. అత ఏవ తత్రైవోక్తం. శ్లో. "సర్వేషాం ద్వీపవర్షాణాం మేరురుత్తరతః స్థితః" ఇతి. యతో యత్ర యస్సూర్యముదయంతం పశ్యతి సైవ తస్య ప్రాచీ. తస్య చ వామతో మేరుస్తిష్ఠతీతి. 7

అస్తమయము అంతకంటే ఎక్కువదూరము వెళ్ళినపుడు నిశీథము అని అనబడు చున్నది. సముద్రతీరములోనుండి వారిదృష్టిలో శ్రుతి "అద్భ్యో వా ఏష ప్రాత రుదేత్యప స్సాయం ప్రవిశతీ" ఈ సూర్యుడు నీటిలో నుండి ప్రొద్దున ఉదయించును, సాయం సమయమున నీటిలో ప్రవేశించును అని శ్రుతి సిద్ధమగు వ్యవహారమని లోకములో చెప్పబడునదిగా ఉన్ననూ వాస్తవమైనదిగా తోచదు. విష్ణుపురాణమున ఇదే విషయము ఉదయాస్తమానాలు సమస్త దిక్కులతో, విదిక్కులలో ఎల్లప్పుడు ఎదురుగానే జరుగును అనగా సూర్యుడు ఎల్లప్పుడును ప్రకాశించుచునే యుండును. సూర్యుడు ఎక్కడ ఎవరిచేత చూడబడునో వారికి అది ఉదయమగును. ఎవరికి ఎచట కనబడదో అచట వారికి అస్తమయము. సూర్యునకు ఉదయముకాని అస్తమయము కాని ఎప్పుడును లేవు. ఉదయాస్తమాన వ్యవహారము సూర్య దర్శనా దర్శనముల వలన కలుగునదే. సూర్యుడు ఇంద్రాదుల యొక్క నగరములలో ఉంటూ మిగిలిన మూడు నగరములను స్పృశించును అనగా తన కిరణములతో ప్రకాశింపచేయును. సూర్యుడు రెండు కర్ణముల్లో ఉంటూ మూడు కోణములను, రెండు నగరములను స్పృశించును అని చెప్పబడినది. అందువలననే అచటనే విష్ణు పురాణముననే సమస్త ద్వీపములకు, వర్షములకు మేరువు ఉత్తరముగా నున్నదని చెప్పబడినది. ఎప్పుడు ఎక్కడ నుండి సూర్యుడు ఉదయించు


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ











చూ॥ యత్రోదేతి తస్య హి సమానసూత్రనిపాతే నిమ్లోచతి-యత్ర క్వచన స్యందేనాభితపతి తస్య హ్యేష సమాన సూత్రనిపాతే ప్రస్వాపయతి - తత్ర గతం న పశ్యంతి-యే తమనుపశ్యేరన్. 8

టీ:- యథోక్తముదయాస్తమనాద్య నియమం తం దర్శయతి-యత్రేతి. స్యందనేన స్వేదోద్గమేన ప్రస్వాపయతి నిశీథం కరోతి. యే తం సమనుపశ్యేరన్ ప్రస్వాపనమానసూత్రస్థాః. 8

చూ॥ యదా హ్యైంద్ర్యాః పుర్యాః ప్రచలతి-పంచదశభిర్ఘటికాభి ర్యామ్యాం సపాదకోటిద్వయం యోజనానాం సార్ధద్వాదశ లక్షాణి సాధికానిచోపయాతి - ఏవం తతో వారుణీం సౌమ్యామైంద్రీం చ పునః. 9

టీ:- యదేతి. సాధికాని పంచవిశంతిసహస్రాధికాని. 9

-టను చూచెదరో వారికి అది ప్రాచీ(తూర్పు) వానికి వామపార్శ్వమున మేరువుండును. 7

పైనచెప్పినవిధముగా ఉదయాస్తమయముల నియమరాహిత్య-మును చూపుచున్నాడు. ఏ నగరమున సూర్యుడు ఉదయించునో దానికి చక్కగా ఎదురుగానుండెడి నగరమున అస్తమించును. ఏ నగరమున చెమటలు కక్కిస్తూ తపింపచేయునో (అనగా మిట్ట మధ్యాహ్నము) దానికి సమానముగా ఎదురుగా నుండెడి నగరమున నిద్రింపచేయుననగా మధ్యరాత్రి అగునని భావము. ఎచట మధ్యాహ్నమున తపింపచేయు సూర్యుని ఎవరుగాంచిరో వారు దానికి చక్కగా ఎదురుగానున్న నగరమునకు వెళ్ళినచో సూర్యునిగాంచలేరు. 8

సూర్యుడు ఇంద్రపురినుండి యమనగరమగు సంయమినికి వెళ్ళునప్పుడు పదిహేను ఘడియలలో రెండుకోట్ల ముప్పదిఏడు లక్షల యాభైవేల యోజనములు పయనించును. ఇదేవిధముగా వరుణ, సోమ, ఇంద్ర నగరములకును అదే ప్రయాణ సమయములో అన్ని యోజన-ములు పయనించును. 9









చూ॥ తథాన్యే చ గ్రహాస్సోమాదయో నక్షత్రైస్సహ జ్యోతిశ్చక్రే సమభ్యుద్యంతి-సహవాభినిమ్లోచంతి. 10

టీ:- తథేతి. సహ వాసహైవ. యద్యపి వస్తుతః సూర్యస్యాపి నక్షత్రైస్సహైవోదయాస్తమయౌ. తథాపి. తస్య తత్సాహిత్యాదర్శనాత్సోమాదీనామేవ తత్సాహిత్య ముక్తం. 10

చూ॥ ఏవం ముహూర్తేన చతుస్త్రింశల్లక్షయోజనాన్యష్ట శతాధికాని సౌరోరథస్త్రయీమయశ్చతసృషు పరివర్తతే పురీషు-యస్యైకం చక్రం ద్వాద శారం షణ్ణేమిత్రి నాభిసంవత్సరాత్మకం సమామనంతి. 11

టీ:- ఏవమితి. త్రయీమయ ఇత్యాదుపాసనార్థం. ద్వాదశ మాసా అరా యస్య. షదృతవో నేమయో యస్య త్రీణి చాతుర్మాస్యాని నాభయో యస్య. 11

చూ॥ తస్యాక్షో మేరోర్మూర్ధని కృతమానసోత్తరే కృతేతరభాగో యత్ర ప్రోతం రవి రథచక్రం తైల యంత్ర చక్రవన్మానసోత్తరగిరౌ పరిభ్రమతి. (12)

ఇదే విధముగా చంద్రుడు మొదలగు ఇతర గ్రహములుకూడా నక్షత్రముతో కూడి జ్యోతిశ్చక్రములో ఉదయించుచున్నవి, అస్తమించుచున్నవి. సూర్యునకు కూడా నక్షత్రములతో కూడియే ఉదయాస్తమయములు కల్గిననూ సూర్యునకు నక్షత్ర సన్నిహితత్వము కనపడదు. చంద్రాదులకే నక్షత్రముల సాన్నిహిత్యము తెలుపబడినది. 10

సూర్యరథము త్రయీ(వేదమయము)మయమనుట ఉపాసన కొరకు చెప్పబడినది. ఈ విధముగా సూర్యభగవానుని వేదమయమగు రథము ఒక ముహూర్త కాలములో ముప్పదినాలుగు లక్షల ఎనిమిది వందల యోజనముల చొప్పున నాలుగు పురములలో తిరుగుచుండును. సూర్యుని రథముయొక్క ఒకచక్రము మాసములనే పన్నెండు అరలతో; ఋతువులను ఆరు నేములతో; చతుర్మాసములను మూడు నాభులతో ఉన్న సంవత్సర చక్రముగా తెలుపబడినది. 11

ఆ సూర్యరథపు అక్షము యొక్క ఒక భాగము మేరుపర్వత శిరము పైన; మరొక భాగము మానసోత్తర పర్వతముపైనుంచబడి సూర్యరథ చక్రము గానుగ చక్రమువలె తిరుగుచు మానసోత్తర









టీ:- తస్యేతి. కృత ఇతరభాగో యస్య మానసోత్తరగిరౌ లక్షార్ధాదుపరి వాయుబద్ధభూమావితి ద్రష్టవ్యం. చక్రం వా తావదుచ్ఛ్రితమితి మంతవ్యం. అన్యథా అయుతమాత్రోచ్ఛ్రాయత్వాన్మానసోత్తరస్య మేరోశ్చతురశీత్యుచ్ఛ్రాయత్వాదక్షస్య. సామ్యానుపపత్తేః. 12

పర్వతముపై తిరుగుచుండును. మానసోత్తర గిరియందు అనగా యాభైవేల యోజనములపైన వాయుబద్ధ భూమియున్నదని తెలియవలెను. లేక రథచక్రము అంత ఎత్తు గలదిగా తలచవలయును. అటులగాని యెడల మానసోత్తరగిరి పదివేల యోజనముల ఎత్తు గలదగుటవలన మేరుపర్వతము ఎనుబదినాలుగు వేల యోజనముల ఎత్తు గలదగుట వలన అక్షమునకు సమానత్వము కుదరదు. 12

చూ॥ తస్మిన్న క్షే కృతమూలో ద్వితీయోऽక్షస్తురీయమానేన సంయమిత స్తైలయంత్రాక్షవద్ధ్రువే కృతో పరిభాగః. 13

టీ:- తస్మిన్నితి. తస్మిన్నక్షే చక్రప్రాంతే కృతమూలః నిబద్ధపూర్వభాగః ప్రథమాక్షో మేరుమానసోత్తరాయతః. సార్ధ సప్త లక్షాధికసార్ధ కోటి ప్రమాణః తస్య తురీయమానేన సార్ధసప్త త్రింశత్సహస్రాధికైకోన చత్వారింశల్లక్ష మానేన. ధ్రువే కృతః వాయుపాశేన బద్ధః ఉపరిభాగో యస్య. 13

అక్షపు చక్ర ప్రాంతములో మూలమున నిబద్ధమైన పూర్వభాగము ప్రథమాక్షము, మేరువు నుండి మానసోత్తర పర్వతము వరకు పొడవు ఒకకోటి యాభైఏడులక్షల యాభైవేల యోజనముల ప్రమాణము కల్గియున్నది. ఆ అక్షము ఉత్తర భాగము ద్వితీయాక్షముపై ప్రమాణములో నాల్గవ భాగముతో ముప్పైతొమ్మిది లక్షల ముప్పైఏడువేల ఐదువందల యోజన పరిమాణముతోగానుగ అక్షమువలె ధ్రువునిపైన వాయుపాశముతో బద్ధమైయుండును. 13

చూ॥ రథనీడస్తు షట్త్రింశల్లక్ష యోజనాయస్తురీయ భాగ విశాలస్తు తావాన్ రవి రథ యుగః- యత్ర హయాశ్ఛందోనామానస్సప్తారుణ యోజితా వహంతి - దేవమాదిత్యం-పురస్తాత్స వితురరుణః పశ్చాచ్చ నియుక్తస్సౌత్య కర్మణి కిలాస్తే. 14

ఆ రథమున కూర్చుండే స్థలము ముప్పది ఆరులక్షల యోజనముల పొడవు, తొమ్మిది లక్షల యోజనముల వెడల్పు కలిగి యున్నది. అట్టి సూర్యరథమున గాయత్ర్యాది చందస్సుల పేర్లుగల ఏడు గుఱ్ఱములు సారథి అరుణునితో యోజితములై సూర్యభగవానుని




టీ:- రథేతి. నీడం ఉపవేశస్థానం గాయత్ర్యాది ఛందో నామానః అరుణేన యోజతాస్సంతో దేవం వహంతి. పురస్థాత్ స్థితోఽపి పశ్చాత్ ప్రత్యుఙ్ముఖ ఆస్తే. యద్వా యత్పూర్వస్య పురః తస్యైవ పశ్చిమత్వాత్ పశ్చాదిత్యుక్తం. అశ్వస్థానం చ వాయునోక్తం. శ్లో. "సప్తాశ్వరూప చ్ఛందాంసి వహంతీశం హి వామతః, చక్రాక్ష సన్నిబద్ధాని చక్రే చాక్షః సమాహిత"ఇతి. 14

వహించుచుండును(మోయుచుండును). సూర్యునకు ముందు అరుణుడు పశ్చిమముఖుడై సూతకర్మ నాచరిస్తూ ఉండును. ఈ అశ్వముల స్థానము వాయుపురాణమున అశ్వరూపములగు ఏడు చందస్సులు చక్రమున సమాహితమగు అక్షమునకు బద్ధములై సూర్యుని వామపార్శ్వము నుండి వహించుచుండును (మోయుచు లేదా లాగును) అని చెప్పబడినది. 14

చూ॥ తథా వాలఖిల్యాఋషయోఽంగుష్ఠపర్వమాత్రాః షష్టి సహస్రాణి పురతస్సూర్యం సూక్తవాకాయ నియుక్తాస్సంస్తువంతి. 15

టీ:- తథేతి. సూక్తవాకాయ సుభాషితాయ. 15

సూర్యునిముందు బొటనవేలి యొక్క కణుపు ప్రమాణం ఆకారముతో ఆరువేల మంది వాలిఖిల్యలను వారు స్వస్తివాచనమునకు నియుక్తులై స్తుతించుచుందురు. 15

చూ॥ తథాన్యేచర్షయో గంధర్వాప్సరసో నాగాగ్రామణ్యో యాతుధానా దేవా ఇత్యేకైకశో గణాస్సప్తచతుర్దశరథస్తోమాని మాసి మాసి భగవంతం సూర్యమాత్మానం నానానామానః పృథఙ్నామానః పృథక్కర్మభిర్ద్వంద్వశ ఉపాసతే. 16

టీ:- తథేతి. ఏకైకశశ్చచతుర్దశ. ద్వంద్వశస్సప్తగణాస్సంతో మాసి మాస్యుపాసత ఇత్యన్వయః. 16

అదే విధముగా ఇతర ఋషులు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు, వీరు ఒక్కో వర్గము నుండి పదునాల్గురు చొప్పున ఇద్దరిద్దరు కలిసి ఏడు గణములై ప్రతిమాసమున అనేక నామములుగల, ఆత్మ స్వరూపుడగు సూర్యభగవానుని వేరు వేరుగా అనేక పేర్లు గలవారై వివిధ కర్మలతో ఇద్దరిద్దరు కలిసి ఉపాసింతురు. 16





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చూ॥ లక్షోత్తరసార్ధనవకోటి యోజన పరిమండలం భూవలయం యస్య క్షణేన ద్విశతగవ్యూత్యుత్తర ద్విసాహస్ర యోజనాని స భుంక్తే. 17

టీ:- లక్షయతి. గవ్యూతిః క్రోశద్వయం. 17

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,
ఏకవింశోऽధ్యాయః

ఈ విధముగా సూర్యభగవానుడు తొమ్మిదికోట్ల యాభై ఒక్కలక్షల యోజనముల పరిమాణముగల భూమండలమును, ప్రతిక్షణము రెండువేల యోజనముల, రెండువందల గవ్యూతుల దూరము పయనించు చున్నాడు. (గవ్యూతి అనగా రెండు కోసులు. అనగా 1మైలు) 17

శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు
ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ







## ద్వావింశోऽధ్యాయః

శ్లో॥ ద్వావింశే సోమశుక్రాదేః స్థానమాహోత్తరోత్తమమ్ ।
తత్తద్గత్యనుసారేణ త్విష్టానిష్టే తథా నృణామ్ ॥

రాజోవాచ

చూ॥ యదేతద్భగవత ఆదిత్యస్య మేరుం ధ్రువం చ ప్రదక్షిణేన పరిక్రమతో రాశీనామభిముఖం ప్రచలితం భవతోపవర్ణితం–అముష్య వయం కథమనుమీమహీతి. 1

టీ:- యదితి. రాశీనామభిముఖం అప్రదక్షిణం చ ఉపవర్ణితం సవ్యేనాచలం చలన్ దక్షిణేన కరోతీతి వదతా అముష్య వయం కథమనుమీమహి తత్కథం జ్ఞాసామ్యః. విరుద్ధాత్వాదిత్యర్థః. 1

సహోవాచ

చూ॥ యథా కులాలచక్రేణ పరిభ్రమతా సహ భ్రమతాం తదాశ్రయాణాం పిపీలికాదీనాం గతిరన్యైవ ప్రదేశాంతరేఽప్యుపలభ్యమానత్వాత్ –ఏవం నక్షత్రరాశిభిరుపలక్షితేన కాలచక్రేణ ధ్రువం మేరుం చ ప్రదక్షిణేన పరిధావతా సహ పరిధావమానానాం తదాశ్రయాణాం సూర్యాదీనాం గ్రహాణాం గతిరన్యైవ నక్షత్రాతంరే చోపలభ్య మానత్వాత్. (2)

## 22 వ అధ్యాయము

ఈ ఇరువది రెండవ అధ్యాయమున ఎవరి గమనము ననుసరించి మానవులకు ఇష్టానిష్టములు సంభవించునో అట్టి చంద్ర శుక్రాదుల స్థితి ఉత్తరోత్తముగా కలదను విషయము తెలుపబడుచున్నది.

**పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.**

ఓ భగవాన్! సూర్యభగవానుడు మేరువును, ధ్రువుని ప్రదక్షిణ–ముగా పరిభ్రమిస్తూ రాశులకభిముఖముగా పరిభ్రమించునని "సవ్యేనా చలంచన్ దక్షిణే నకరోతి" అని అప్రదక్షిణముగా వర్ణించితిరి. ఇది విరుద్ధముగా గోచరించుచున్నది. దీనిని మేమెట్లు తెలుసుకోగలము. 1

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను**

ఓ పరీక్షిద్రాజా! తిరుగుచుండెడి కుమ్మరి సారె (చక్రము) నాశ్రయించి, దానితోసహా తిరిగెడి చీమలు మొదలగు వాని గమనము దానితో భిన్నమైనదేయగును. ఏలనన అవి భిన్నభిన్న సమయములలో కుమ్మరిసారె యొక్క భిన్న భిన్న స్థానములలో కనుపించును. అదే విధముగా నక్షత్రారాశులతో ఉపలక్షితమగు ధ్రువునకు మేరువునకు ప్రదక్షిణముగా పరిభ్రమించెడి కాలచక్రముతో కూడి పరిభ్రమించెడి



 



టీ:- సహేతి. చక్రవశాత్స్వతశ్చ గతిద్వయమవిరుద్ధమితి పరిహారార్థః (2)

ఆ కాలచక్రము నాశ్రయించిన సూర్యాది గ్రహముల గమనము కాల భేదముతో వేరు వేరు రాశులలో నక్షత్రములలో కన్పించడము వలన వాస్తవముగా భిన్నమైనదే. చక్రాధీనమగు గమనము తన గమనము ఈ గతి ద్వయము అవిరుద్ధములు. 2

చూ॥ స ఏష భగవానాదిపురుష ఏవ సాక్షాన్నారాయణో లోకానాం స్వస్తయ ఆత్మానం త్రయీమయం కర్మవిశుద్ధి నిమిత్తం కవిభిరపి వేదేన జిజ్ఞాస్యమానో ద్వాదశధా విభజ్య షట్సు వసన్తాదిషు ఋతుషు యథోప జోషం ఋతుగుణాన్ విదధాతి. 3

టీ:- స ఇతి. తత్తత్కాలనియమేన కర్మణాం విశుద్ధేః షాడ్గుణ్యస్య నిమిత్తభూతమాత్మానం. విభజ్య జిజ్ఞాస్యమానో వితర్క్యమానః యథోపజోషం యథాకర్మభోగం ఋతుగుణాన్ శీతోష్ణాదీన్. 3

పండితులు వేదముల ద్వారా ఎవరి గమనమును తెలిసి-కొనుటకు ఉత్సుకులగుదురో అట్టి ఆదిపురుషుడు, భగవంతుడునగు సాక్షాత్ నారాయణుడే లోకములకు మంగళమొనరించుటకు, కర్మశుద్ధి కొరకు వేదమయరూపమగు కాలమును (తనను) పన్నెండు విభాగములుగా (మాసములుగా) విభజించి వసంతాది షడ్రుతువులలో యథా యోగ్యముగా శీతోష్ణాది గుణములను కలుగజేయుచున్నాడు. 3

చూ॥ తమేవమిహ పురుషాస్త్రయ్యా విద్యయావర్ణాశ్రమాచారానుపథా ఉచ్చావచైః కర్మభిరామ్నాతైర్యోగవితానైశ్చ శ్రద్ధయా యజన్తోఽంజసా శ్రేయస్సమధిగచ్ఛంతి. 4

టీ:- తమితి. వర్ణాశ్రమాచారానువర్తినః పురుషాః. త్రయ్యా అమ్నాతైః కర్మభిః. ఇంద్రాదిరూపం యోగవితానైశ్చ ధ్యానాదిభిః అంతర్యామి రూపం పూజయంతః. 4

ఈ సూర్యభగవానుని ఈ లోకములో వర్ణాశ్రమాచార ధర్మమును అనుసరించు పురుషులు వేదత్రయీచేత ప్రతిపాదించబడిన బృహత్కర్మలలో ఇంద్రాది దేవతారూపముతో యోగసాధనములగు ధ్యానాదులతో అంతర్యామి రూపముగా శ్రద్ధాపూర్వకముగా ఆరాధించి సుగమముగా (పరమపదమును) శ్రేయస్సును పొందుదురు. 4



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ












చూ॥ అథ స ఏష ఆత్మాలోకానాం ద్యావా పృథివ్యోరంతరేణ నభోవలయస్య కాలచక్రగతో ద్వాదశ మాసాన్ భుంక్తే రాశి సంజ్ఞాన్ సంవత్సరావయవాన్ మాసం పక్షద్వయం సపాదఋక్షద్వయం దివా నక్తం చేతి వదంతి. 5

టీ:- అథేతి. స ఏవ స్వగత్యా మాసాది వ్యవహారకారణమిత్యాహ స ఏష లోకానాం ఆత్మా ద్యావాపృథివ్యోరంతరేణ మధ్యే యన్నభోవలయమంతరిక్షం తస్య మధ్యే. యత్కాలచక్రం తద్గతః. రాశిభిర్మేషాదిభిస్సంజ్ఞా యేషాం చైత్రాదిసంజ్ఞాస్తు చాంద్రమానానాం మానమాహుః -పక్షద్వయం మాస ఇతి. చాంద్రేణ మాసేన స పాదం మహానక్షత్ర ద్వయం సౌరేణ దివానక్తం చ అహోరాత్రమితి పిత్ర్యేణ. 5

చూ॥ యావతా కాలేన షష్ఠమంశం భుంజీత స వా ఋతురిత్యుపదిశంతి సంవత్సరావయవః అథ యావతార్ధేన నభోవీధ్యాం ప్రచరతి తం కాలమయనమాచక్షతే. 6

టీ:- యావతేతి. షష్ఠమంశం రాశిద్వయం. 6

సూర్యుడే తన గమనముతో మాసాది వ్యవహారములకు కారణమగుచున్నాడని తెలుపుచున్నాడు. ఆ సూర్యుడే సమస్త లోకములకు ఆత్మభూతుడై భూ, స్వర్లోకముల మధ్యలోనున్న ఆకాశ మండలములోని కాలచక్రములో ఉంటూ సంవత్సరములోని భాగములు (అవయవములు) అగు మేషాది రాశులుగా ప్రసిద్ధములగు పన్నెండు నెలలను భోగించుచున్నాడు. చైత్రాది మాస సంజ్ఞలు చాంద్రమాసమునసరించినవి. ఈ మాసముల పరిమాణమును తెలుపుచున్నాడు. చాంద్రమాసమున శుక్ల కృష్ణ రెండు పక్షములు ఒకనెల సౌరమానములో రెండు నక్షత్రముల పావు (సపాదనక్షత్ర ద్వయం) మాసము పితరుల పరిమాణముతో ఒక రాత్రి, ఒక పగలు, ఒక మాసమని చెప్పుదురు. 5

సూర్యుడు సంవత్సరమున, ఎంత సమయములో సంవత్సరములోని ఆరవభాగమునధిగమించునో ఆ కాలమును ఆ సంవత్సరా-వయవమగు ఋతువు అందురు. ఆకాశమార్గమున ఎంతకాలములో సంవత్సరములోని అర్ధమార్గమును అధిగమించునో అది అయనమన-బడును. 6









చూ॥ అథ చ యావన్నభోమండలం సహ ద్యావా పృథివ్యోర్మండలాభ్యాం కార్త్స్న్యేన సహ భుంజీత - తం కాలం సంవత్సరం పరివత్సరమిళావత్సరమనువత్సరమిద్వత్సరమితి భానోర్మాంద్యశైఘ్ర్య సామ్యగతిభిస్సమామనంతి. 7

టీ:- అథచేతి. మండలాభ్యాం సహ భుంజీత సహ స హి సూర్యః యదా శుక్ల ప్రతిపది సంక్రాంతిర్భవతి. తదాసౌ చాంద్రయోః మానయోర్మాసః యుగపదుపక్రాంతో భవతి. స సంవత్సరః. తతః సౌరమానేన వర్షే షట్ దినాని వర్ధంతే చాంద్రమానేన షట్ హ్రసంతీతి. ద్వాదశ దివసవ్యపధానాదుభయోరగ్ర పశ్చాద్భావో భవతి. ఏవం పంచవర్షాణి గచ్ఛంతి. తన్మధ్యే ద్వౌ మలమాసౌ భవతః. తతః పునః షష్ఠస్సంవత్సరో భవతి. తదేవమవాంతరభేదేన సంవత్సరాది పంచకం సమామనంతి. 7

సూర్యభగవానుడు ఎంతకాలములో ద్యావా పృథ్వి మండలములతో కూడిన ఆకాశమండలమును పరిభ్రమించునో ఆ కాలమును సూర్యునియొక్క మంద, శీఘ్ర, సమాన గతుల వలన సంవత్సరము, పరివత్సరము, ఇళావత్సరము, అనువత్సరము, ఇద్వత్సరము అను ఐదు విధములుగా తెలుపుదురు. ఎప్పుడైతే శుక్ల ప్రతిపద రోజున సంక్రమణము కలుగునో అపుడు చాంద్రమానము ప్రకారము ఈ వత్సరము ఒకసారి ఉపక్రమించును. (తిరుగును) అది సంవత్సరమనబడును. సౌరమానము ప్రకారము వత్సరములో ఆరు రోజులు పెరుగును. చాంద్రమానములో ఆరు రోజులు తగ్గును. ఈ విధముగా పన్నెండు రోజుల వ్యత్యాసముతో సౌర, చాంద్రమానములకు ముందువెనుకలు సంభవించును. ఈ విధముగా ఐదు వర్షములు గడచును. ఈ ఐదు వర్షముల మధ్యలో రెండు మల (అధిక) మాసములు కలుగును. ఆ పిమ్మట ఆరవ వర్షము సంవత్సరమగును. ఈ విధముగా అవాంతర భేదముతో సంవత్సరాది పంచకము (వర్షముల) ను తెలుపుదురు. 7

చూ॥ ఏవం చంద్రమా అర్కగభస్తిభ్య ఉపరిష్టాల్లక్షయోజనాదుపలభ్యమానోऽర్కస్య సంవత్సరభుక్తిం పక్షాభ్యాం మాసభుక్తిం సపాదర్క్షాభ్యాం దినేనైవ పక్షభుక్తిమగ్రచారీ ద్రుతతర గమనో భుక్తే. 8

చంద్రాదుల స్థానమును కార్యమును కూడా తెలుపుచున్నాడు. ఈ విధముగా మండల రూపములగు సూర్యకిరణములపై ఒక లక్ష యోజనములపైన చంద్రుడుండును. ఈ చంద్రుడు, సూర్యుడు ఒక






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ





టీ:- సోమాదీనామపి స్థానం కార్యం చాహ-ఏవ మితి. అర్కగభస్తిభ్యః మండలరూపాభ్యః సపాదర్క్షాభ్యాం సపాదనక్షత్ర ద్వయేన. 8

చూ॥ అథ చాపూర్యమణాభిరపక్షీయమాణాభిశ్చకలాభిః పిత్రూణా మహోరాత్రాణి పూర్వపక్షాభ్యాం-విదధానః సర్వజీవనివహప్రాణో జీవశ్చైకమేకం నక్షత్రం త్రింశతా మూహూర్తైర్భుంక్తే. 9

టీ:- అథేతి. సర్వేషాం జీవనివహానాం ప్రాణః అన్నమయత్వాదమృత మయత్వాచ్చ అత ఏవ జీవనహేతుత్వాజ్జీవశ్చ. 9

చూ॥ య ఏష షోడశకలః పురుషో భగవాన్ మనోమయోऽన్న మయోऽమృతమయో దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప వీరుధాం ప్రాణాప్యాయనశీలత్వాత్సర్వమయ ఇతి వర్ణయంతి తత ఉపరిష్టాల్లక్షయోజనతో నక్షత్రాణి మేరుం దక్షిణేనైవ కాలాయన ఈశ్వర యోజితాని సహాభిజితాష్టావింశతిః. 10

టీ:- తదేవాహ-యఏష ఇతి. దక్షిణేనైవ న తు తేషాం పృథగన్యా గతి రస్తీత్యర్థః కాలాయనే కాలచక్రే ఉత్తరాషాఢ శ్రవణ సంధ్యా

వర్షమున అధిగమించేడి మార్గమును ఒకనెలలో; ఒకనెల మార్గమును సపాదనక్షత్రద్వయములో అనగా రెండుంబావు దినములలో; పక్షపు మార్గమును ఒకే దినములో, సమస్త నక్షత్రములకు ముందుండి త్వరిత గమనము కలవాడై అధిగమించును. 8

చంద్రుడు వృద్ధి, క్షీణతనొందు కళలతో, శుక్ల, కృష్ణ పక్షములలో పితరులకు దివారాత్రముల విభాగమొనరించుచూ, అన్నమయుడు , అమృతమయుడు అగుటచే సర్వప్రాణులకు ప్రాణభూతుడై, జీవభూతుడై ఒక్కొక్క నక్షత్రమును ముప్పదేసి ముహూర్తముల కాలములలో అధిగ మించును. 9

పదహారు కళలుగల మనోమయ, అన్నమయ, అమృతమయ, పురుషస్వరూపుడగు చంద్ర భగవానుడు దేవతలు, పితరులు, మనుష్యులు, భూతములు, పశుపక్షులు, సరీసృపములు, వృక్షములు మున్నగు సర్వప్రాణులను పోషించడము చేత ఈతనిని సర్వమయుడని తెలుపుదురు. ఈ చంద్రునకు మూడులక్షల యోజనములపైన అభిజన్మక్షత్రముతో కూడిన ఇరువది ఎనిమిది నక్షత్రములు కాలచక్రములో పరమేశ్వరునిచే నియుక్తములై మేరువును దక్షిణమున నుంచుకొని పరిభ్రమించును. అనగా వాటికి వేరు గమనము లేదని










అభిజిన్నక్షత్రం ఫలవిశేషేణ పృథక్కల్పితం తేన సహ. తథా చ శ్రుతిః శ్రు. "అభిజిన్నా మనక్షత్రం ఉపరిష్టాదషాఢానాం అధస్తాచ్ఛ్రోణాయా" ఇత్యాది. 10

చూ॥ తత ఉపరిష్టాదుశనాద్విలక్షయోజనత ఉపలభ్యతే పురతః పశ్చాత్సహైవార్కస్య శైఘ్ర్య మాంద్య సామ్యాభిర్గతిభిరర్కవచ్చరతి - లోకానాం నిత్యదానుకూల ఏవ ప్రాయేణ వర్షం యచ్చారేణానుమీయతే సవృష్టివిష్టం భగ్రహోపశమనః - ఉశనసా బుధోవ్యాఖ్యాతః. 11

టీ:- తత ఇతి. పురతస్సూర్యేణ భోక్ష్యమాణే నక్షత్రే పశ్చాద్భుక్తిస్సహైవ భుజ్యమానే చారేణ క్రమశః నక్షత్రాద్యతిక్రమేణ వృష్టేః విష్టంభః స్తంభనం యస్మాత్ గ్రహాత్ తముపశమయతీతి తథా. బుధో వ్యాఖ్యాతః పురతః పశ్చాత్సహైవ వా చరతీతి. 11

చూ॥ తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనతో బుధస్సౌమ్య ఉపలభ్యమానః ప్రాయేణ శుభకృద్యదార్కమతిరిచ్యతే-తదాతివాతాభ్రప్రాయానా వృష్టాదిభయ మాశంసతే. 12

టీ:- కించిద్విశేషం చాహ-తతఇతి. అశంసతే సూచయంతి. 12

తాత్పర్యము. ఉత్తరాషాఢ, శ్రవణముల మధ్యన విశేష ఫలముగా అభిజన్నక్షత్రము వేరుగా కల్పించబడినది. ఈ విషయమును 'ఆషాఢము లకు పైన శ్రవణమునకు క్రిందుగా అభిజన్నక్షత్రము' అను శ్రుతి తెలుపుచున్నది. 10

ఈ నక్షత్రములకు రెండులక్షల యోజనములపైన శుక్రుడు కనిపించును. ఈ శుక్రుడు సూర్యుని యొక్క మంద, శీఘ్ర, సమ గతులననుసరించి సూర్యునకు సమానముగా, ఒక్కొక్కసారి ముందు వెనుకల లోను సమానముగా నుండి పరిభ్రమించును. సూర్యచారము వలెనే శుక్రచారముండును. ఈ శుక్రుడు లోకులకు ఎల్లప్పుడు అనుకూలుడై ఉండును. శుక్రాచారముతోనే వర్ష విషయము తెలిసికో-బడును. ఈ శుక్రుడు వర్షమును స్తంభింపచేయు గ్రహములను ఉపశమింపచేయును. శుక్రగ్రహముతో బుధగ్రహము తెలుపబడినది. అనగా బుధగమనము శుక్రగమనమువలెనే ఉండునని భావము. 11

బుధగమనములోని విశేషమును తెలుపుచున్నాడు. ఈ శుక్రునకు రెండులక్షల యోజనములపైన చంద్రుని పుత్రుడగు బుధుడు కన్పించును. తరచుగా శుభకరుడై ఉండును. కాని ఎప్పుడు సూర్యగమనమును ఉల్లంఘించునో అప్పుడు పెద్దగాలులు, మేఘాడంబరత, అనావృష్టి మున్నగు భయములు కల్గునని సూచించెదరు. 12







చూ॥ తత ఊర్ధ్వమంగారకోऽపి యోజనలక్షద్వితయ ఉపలభ్యమానః -త్రిభిస్త్రిభిః పక్షైః రేకైకశో రాశీన్ ద్వాదశచానుభుంక్తే యది వక్రేణాభి వర్తతే ప్రాయేణాశుభగ్రహోఽఘశంసః. 13

టీ:- తతఇతి అఘశంసః దుఃఖసూచకః. యది వక్రేణాభివర్తతే తర్హి. త్రిభిస్త్రిభిః పక్షైః. 13

చూ॥ తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనాంతరతో బృహస్పతిరేకైకస్మిన్ రాశౌ పరివత్సరం ప్రచరతి-యది న వక్రస్స్యాత్ప్రాయశ్శోభనో బ్రాహ్మణ కులస్య. 14

చూ॥ తత ఉపరిష్టాద్యోజనలక్షద్వయాత్ప్రతీయమానశ్శనైశ్చర ఏకైకస్మిన్ రాశౌ త్రింశన్మాసాన్ విళంబమానస్సర్వానేవానుపర్యేతి తావద్భిరను వత్సరైః ప్రాయేణ హి సర్వేషామశాంతికరః. 15

చూ॥ తత ఉపరిష్టాదృషయ ఏకాదశలక్షయోజనాంతర ఉపలభ్యంతే-య ఏవ లోకానాం శమనుభావయంతో భగవతో విష్ణోర్యత్పరమం

ఈ బుధునకంటే రెండులక్షల యోజనములపైన అంగారకుడు కనబడును. ఈ అంగారకుడు వక్రగతి లేనప్పుడు ఒక్కొక్క రాశిని మూడేసి పక్షములలో అధిగమించుచూ. పన్నెండు రాశులనధిగమిం-చును. అంగారకుడు అశుభగ్రహము తరచుగా దుఃఖసూచకుడు. 13

ఈ అంగారకునకు రెండులక్షల యోజనముల దూరమున బృహస్పతి యుండును. వక్రగతి లేనియెడల ఈ బృహస్పతి ఒక్కొక్క రాశిని ఒక్కొక్క సంవత్సరములో భోగించును (అధిగమించును). ఈతడు తరచుగా విప్ర కులమునకనుకూలుడు. 14

ఈ బృహస్పతికి రెండులక్షల యోజనములపైన కనిపించు శనైశ్చరుడు ఒక్కొక్కరాశిలో మంద గతిలో ముప్పది నెలలు ఉండును. మొత్తము రాశులను ముప్పది సంవత్సరములలో అధిగమించును. ఈతడు చాలా వరకు అందరికి అశాంతిని కలిగించును. 15

శనైశ్చరునకుపైన పదకొండులక్షల యోజనముల దూరమున సప్తర్షులు కానబడుదురు. వీరు సమస్త జనుల కల్యాణమును కోరుచూ,





  

పదం ప్రదక్షిణం ప్రక్రమంతి. 16

భగవంతుడగు విష్ణువు యొక్క పరమపదమగు ధ్రువమండలమునకు ప్రదక్షిణ మొనరించుచుందురు. 16

టీ:- తత ఇతి. యది న వక్రస్స్యాత్తర్హి పరివత్సరం. (14-16)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, ద్వావింశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము.

  







## త్రయోవింశోఽధ్యాయః

శ్లో॥ త్రయోవింశే ధ్రువస్థానం జ్యోతిశ్చక్రాశ్రయం తతః ।
శింశుమార స్వరూపేణ హరేశ్చ స్థితిరుచ్యతే ॥

**శ్రీశుక ఉవాచ**

చూ॥ అథ తస్మాత్పరతస్త్రయోదశ లక్షయోజనాంతరతో యత్తద్విష్ణోః పరమం పదమభివదంతి - యత్ర మహాభాగవతో ధ్రువ ఔత్తానపాదిరగ్నినేంద్రేణ ప్రజాపతినా కాశ్యపేన ధర్మేణ చ సమ కాలయుగ్భిస్సబహుమానం దక్షిణతః క్రియమాణ ఇదానీమపి కల్పజీవినామాజీవ్య ఉపాస్తే తస్య హవా అనుభావ ఉపవర్ణితః. 1

టీ:- అథేతి.యత్తత్ప్రసిద్ధం విష్ణోఃపదం యత్ర ధ్రువః ఉపాస్తే తిష్ఠతీత్యన్వయః. సమకాలమేవ యుజ్యంత ఇతి తథా తైర్నక్షత్రరూపైః. 1

చూ॥ స హి సర్వేషాం జ్యోతిర్గణానాం గ్రహనక్షత్రాదీనామనిమిషేణావ్యక్తరం హసా భగవతా కాలేన భ్రామ్యమాణానాం స్థాణురివావష్టంభ ఈశ్వరేణ విహితశ్శశ్వదవభాసతే-యథా మేధిస్తంభే ధాన్యాక్రమణ పశవస్సంయోజితాః - త్రిభిస్సవనైర్యథాస్థానం మండలమాచరంతి -

## 23 వ అధ్యాయము

ఈ ఇరువదిమూడవ అధ్యాయమున జ్యోతిశ్చక్రమునకాశ్రయభూతమగు ధ్రువస్థానము శింశుమార (మొసలి) స్వరూపముతో శ్రీహరి స్థితి తెలుపబడుచున్నది.

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

ఓ పరీక్షిద్రాజా! ఈ సప్తర్షిమండలము తరువాత పదమూడు లక్షల యోజములపైన విష్ణుభగవానుని పరమపదముగా తెలుపబడు ధ్రువ స్థానముండును. ఇక్కడ మహాభాగవతుడు ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువుడు నక్షత్ర రూపులగు అగ్ని, ఇంద్ర కశ్యపప్రజాపతి, ధర్ములతో అందరూ ఒక్క కాలములోనే మిక్కిలి ఆదరముతో ప్రదక్షిణము చేయుచుండగా ఇప్పటికినీ కల్పాంతము వరకు జీవించెడి లోకమునకాధారభూతుడై ఉంటున్నాడు. ఆ ధ్రువుని గొప్ప చరితము చతుర్ధ స్కంధములో వర్ణించబడినది. 1

ఎల్లప్పుడు జాగ్రదవస్థలో నుండి, అనిర్వచనీయ వేగముగల, భగవంతుడగు కాలుని వేగముతో భ్రమింపజేయబడుచున్న గ్రహ, నక్షత్రాది జ్యోతిర్గణములకు భగవంతునిచే ఈ ధ్రువపదమే కదలనట్టి (స్థాణువులాంటి) ఆధారస్తంభమొనరించబడి, ఎల్లప్పుడు ప్రకాశించు











ఏవం భగణగ్రహాదయ ఏతస్మిన్నంతర్బహిర్యోగినః కాలచక్ర ఆయోజితా ధ్రువమేవావలంబ్య – వాయునోదీర్యమాణా ఆకల్పాన్తం పరిక్రమంతి. 2

టీ:- స ఇతి. మేధిస్తంభే బద్ధా ధాన్యా క్రమణే పశవోబలీవర్దాః. 2

చూ॥ నభసి యథా మేఘాశ్శ్యేనాదయో వాయువశాత్కర్మ సారథయః పరివర్తంతే ఏవం జ్యోతిర్గణాః ప్రకృతిపురుష సంయోగానుగ్రహీతాః కర్మనిర్మిత గతయో భువి న పతంతి. 3

టీ:- నభసీతి. కర్మసారథిః సహాయో యేషాం. 3

చూ॥ కేచనైతజ్జ్యోతిరనీకం శింశుమార సంస్థానేఽస్య భగవతో వాసుదేవస్య యోగధారణాయామనువర్ణయంతి యస్య పుచ్ఛాగ్రేఽవాక్ఛిరసః కుండలీభూతదేహస్య ధ్రువ ఉపకల్పితః – తస్య లాంగులే ప్రజాపతి రగ్నిరింద్రో ధర్మ ఇతి – పుచ్ఛమూలే ధాతా విధాతా చ – కట్యాం సప్తర్షయః. 4

చుండును. మేధిస్తంభమున బంధించబడిన ధాన్యాక్రమణ పశువులగు బలీవర్ధములు (వృషభములు) దగ్గర, దూరము, మధ్యలో నుంటూ మండలాకారముగా ఏ విధముగా పరిభ్రమించునో అటులనే నక్షత్ర గ్రహాదులు లోన, బయట, కాలచక్రములో నియుక్తములై ధ్రువ మండల నాధారముగా చేసికొని వాయు ప్రేరణతో కల్పాంతము వరకు పరిభ్రమించుచుండును. 2

ఆకాశమున ఏ విధముగా మేఘములు, గద్దలు మొదలగు పక్షులు తమ కర్మల సహాయముతో, వాయువున కధీనములై తిరుగు చుండునో అటులనే జ్యోతిర్గణములు (గ్రహనక్షత్రాదులు) ప్రకృతి, పురుష సంయోగముతో అనుగ్రహించబడిన (ఏర్పడిన) కర్మలచే నిర్మితములగు గమనములు కలవై, భూమిపైన పడిపోకుండా ఉండును. (పైననే తిరుగునని భావము). 3

ఈ జ్యోతిశ్చక్రమునకు ఈశ్వరుడే ఆధారభూతుడగుటచే క్రింద పడిపోవుననే శంకనే లేదని, వేరొక విధమున తెలుపుచున్నాడు. కొంతమంది ఈ జ్యోతిశ్చక్రమును భగవంతుడగు వాసుదేవుని యొక్క యోగశక్తి ఆధారమున నుండెడి శింశుమారస్థానముగా వర్ణించెదరు. శరీరమును కుండలాకారముగా నుంచి అధోముఖమైనున్న ఈ










టీ:- ఈశ్వరాధారత్వాత్పునః పతనశంకైవ నాస్తీతి వక్తుం మతాంతర మాహ - కేచనేతి. జ్యోతిరనీకం జ్యోతిశ్చక్రం యోగ ధారణాయాం స్థితమితి శేషః. లాంగూలే అగ్రాదధోభాగే. 4

చూ॥ తస్య దక్షిణావర్త కుండలీభూత శరీరస్య యాన్యుదగయనాని దక్షిణ పార్శ్వే నక్షత్రాణ్యుపకల్పయతి-దక్షిణాయనాని తు సవ్యే-యథా శింశు మారస్య కుండలాభోగసన్నివేశస్య పార్శ్వయోరుభయోరప్యవయ వాస్సమసంఖ్యా భవంతి - పృష్ఠేత్వజవీధిరాకాశగంగా చ ఉదరతః. 5

టీ:- తస్యేతి. ఉదగయనాని అభిజిదాదీని పునర్వస్వంతాని చతుర్దశ దక్షిణపార్శ్వే దక్షిణాయనానిపుష్యాద్యుత్తరాషాఢాం తాని చతుర్దశ వామపార్శ్వే. 5

చూ॥ పునర్వసు పుష్యౌ దక్షిణ వామయోః -శ్రోణ్యోరార్ద్రాశ్లేషా చ - దక్షిణవామయోః పాదయోరభిజిదుత్తరాషాఢే దక్షిణ వామయో ర్నాసికయో ర్యాథా సంఖ్యం శ్రవణ పూర్వాషాఢే దక్షిణ వామయోర్లోచన యోర్ధ నిష్ఠా మూలం చ దక్షిణ వామయోః కర్ణయోర్మఖాదీనష్టౌ నక్షత్రాణి దక్షిణాయ నాని వామపార్శ్వవక్రేషు యుంజీత-తథైవ మృగశీర్షాదీన్యు దగయనాని దక్షిణపార్శ్వేషు ప్రాతిలోమ్యేన ప్రయుంజీత-శతభిజ్జ్యేష్ఠే

శింశుమారము యొక్క తోక పైభాగమున ధ్రువుడు కల్పించబడినాడు. లాంగుల మందు అనగా తోక మధ్య భాగమున ప్రజాపతి, అగ్ని, ఇంద్ర, ధర్ములు; పుచ్ఛమూలమున ధాత, విధాతలు; కటిదేశమున సప్తర్షులు కల్పించబడి యున్నారు. 4

ఈ శింశుమారము దక్షిణపువైపు మరల కుండలీభూతమై యున్నది. దీని కుడివైపున ఉత్తరాయణపు అభిజిత్ మొదలుకొని పునర్వసు వరకుండెడి పదునాలుగు నక్షత్రములను కల్పించుదురు. శింశుమారము కుండలాకారముగా నున్నప్పుడు రెండువైపులలోను అవయవముల సంఖ్య సమమైయుండును. అందువలన ఇచట నక్షత్రముల సంఖ్య సమమైయున్నది. దీని పృష్ఠ భాగమున అజవీధి అనబడు మూల, పూర్వాషాఢా, ఉత్తరాషాఢా నక్షత్ర సమూహము ఉదరములో ఆకాశ గంగ ఉండునని తెలిపెదరు. 5

ఈ నక్షత్రముల స్థానములను, శింశుమార స్థాన విశేషములతో విభజించి తెలుపుచున్నాడు. శింశుమారము యొక్క కుడి, ఎడమ శ్రోణములలో కటి తటములలో ఉదగయన, అంత్య నక్షత్రమగు పునర్వసు, దక్షిణాయన ఆద్య నక్షత్రమగు పుష్యమి, ఈ రెండు నక్షత్రములకు సమీపమగు ఆర్ద్ర, ఆశ్లేష నక్షత్రములు శింశుమారము కడిఎడమ పాదములలో, ఉత్తర దక్షిణాయనముల మొదటి నక్షత్రము










స్కంధయోః – దక్షిణవామయోర్న్యసేత్. 6

టీ:– తదేవస్థాన విశేషేణ విభజ్య దర్శయతి.–పునర్వస్వితి. పునర్వసు రుదగయనాం త్యం నక్షత్రం పుష్యో దక్షిణాయనస్యాద్యం. ఆర్ద్రాశ్లేషే తయోర్నిరంతరే అభిజిదుత్తరాషాఢే ఉత్తర దక్షిణాయనయోరాద్యంత నక్షత్రే. శ్రవణ పూర్వాషాఢే తయోరుత్తరపూర్వే ధనిష్ఠామూలం చ. తయోరప్యుత్తరపూర్వే మఖాదీని యాన్యనూరాధాంతాని దక్షిణాయనా న్యష్టౌ. తాని వామపార్శ్వేషు మృగశీర్షాదీని ప్రాతిలోమ్యేన పూర్వాభాద్ర పదాంతాని యాన్యుదగయన నక్షత్రాణ్యష్టౌ. దక్షిణపార్శ్వే. శతభిషగ్ జ్యేష్ఠే ఉత్తర దక్షిణాయన యోరవశిష్ట స్కంధయోః. 6

చూ॥ ఉత్తరహనావగస్త్యః అధరహనౌ యమః ముఖే చాంగారకః – శనైశ్చరః ఉరస్థలే – బృహస్పతిః కకుది – వక్షస్యాదిత్యో హృదయే నారాయణః మనసి చంద్రః నాభ్యముశనా – స్తనయోరశ్వినౌ – బుధః ప్రాణాపానయోః – రాహుర్గళే కేతవస్సర్వాంగేషు రోమసు సర్వే తారాగణాః. 7

టీ:– ఉత్తరేతి. యమో నక్షత్రరూపః. తథా నారాయణః అశ్వినౌ చ కకుది గళపృష్ఠే శృంగే. 7

లగు అభిజిదుత్తరాషాఢా నక్షత్రములు, వాటి తర్వాతి మొదటి నక్షత్రములగు ధనిష్ఠ, మూలా నక్షత్రములు కుడిఎడమ కర్ణములలోనుండును. మఖ మొదలుకొని అనురాధ వరకుగల ఎనిమిది దక్షిణాయణ నక్షత్రములు కుడిపక్క వక్త్రములలో నుంచవలెను. ఉత్తరాయణ దక్షిణాయణ నక్షత్రములలో మిగిలిన శతభిషా. జ్యేష్ఠా నక్షత్రములుయ కుడిఎడమ స్కంధములయందుంచవలయును. 6

ఆ శింశుమారము పై దవడలో అగస్త్యుడు, క్రింది దవడలో నక్షత్ర రూపుడగు యముడు, ముఖములో అంగారకుడు ఉరఃస్థలములో శనైశ్చరుడు, మెడ వెనుక భాగమున బృహస్పతి, వక్షఃస్థలమున సూర్యుడు, హృదయమున నారాయణుడు, మనమున చంద్రుడు, నాభిలో శుక్రుడు స్తనములలో అశ్వినీ దేవతలు; ప్రాణాపానముల బుధుడు, గళ మందు రాహువు, సర్వాంగములలో కేతువు, రోమము లలో సమస్త నక్షత్ర గణములు ఉన్నవి. 7









చూ॥ ఏతదుహ వై భగవతో విష్ణోస్సర్వ దేవతామయం రూపం అహరహస్సంధ్యాయాం ప్రయతో వాగ్యతో నిరీక్షమాణ ఉపతిష్ఠేత నమో జ్యోతిర్లోకాయ కాలాయనాయ అనిమిషాం పతయే – మహాపురుషాయా భిధీమహీతి. 8

టీ:- ఏతదితి. జ్యోతిషాం లోకాయాశ్రయాయ కాలచక్రరూపాయ నమోऽభిధీమహీతి. మంత్రేణోపతిష్ఠేత. 8

శ్లో॥ గ్రహర్క్ష తారామయమాదిదైవతం
పాపాపహమ్మంత్రకృతాం త్రికాలమ్ ।
నమస్యతః స్మరతో వాత్రికాలే నశ్యేత
తత్కాలజ మాశు పాపమ్ ॥ 9

టీ:- గ్రహేతి. మంత్రకృతాం పూర్వోక్తమంత్రం జపతాం. 9

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,**
**త్రయోవింశోऽధ్యాయః**

ఇది విష్ణుభగవానుని యొక్క సర్వదేవమయమగు స్వరూపము. ఈ రూపమున ప్రతినిత్యము సంధ్యాసమయమున, పవిత్రుడై , మౌనముగా దర్శిస్తూ, సమస్త జ్యోతిర్గణమున కాశ్రయభూతమగు కాలచక్ర స్వరూపుడు, సర్వదేవాధిపతి, పరమపురుషుడు అగు పరమాత్ముని నమస్కార పూర్వకముగా ధ్యానిస్తున్నాము అను మంత్రము నుచ్ఛరిస్తూ ఉపాసించవలయును. ("నమో జ్యోతిర్లోకాయ, కాలాయనాయ, అనిమిషాయ పతయే మహాపురుషాయ ధీమహి")8

గ్రహ, నక్షత్ర, తారామయుడు, త్రికాలములలో మంత్ర, జపమొనరించెడి వారి పాపములను తొలగించెడి, తేజోయముడగు ఆదిదేవుణ్ణి, ప్రాతర్మధ్యాహ్న సాయంవేళలలో నమస్కరించెడి, స్మరించెడి వారికి ఆ యా కాలములో కలిగిన పాపములు వెంటనే నశించగలవు. 9

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు**
**ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము.**












## చతుర్వింశోऽధ్యాయః

శ్లో॥ ఏవం త్రిభిర్ద్యుమర్యాదాపాలనం వర్ణితం తథా ।
అథో భువనమర్యాదాపాలనం త్రిభిరుచ్యతే ॥

చతుర్వింశే రవేరర్వాక్ స్వర్భాన్వాదిస్థితిః క్రమాత్ ।
అతలాది బిల స్వర్గ మర్యాదాస్సప్త వర్ణితాః ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ అధస్తాత్సవితుర్యోజనాయుతే స్వర్భానుర్నక్షత్రవచ్చరతీత్యేకే - యోऽసావమరత్వం గ్రహత్వం చాలభత-భగవదనుకంపయా స్వయమసురాపశదః సైంహికేయో హ్యతదర్హణస్తస్య తావజ్జన్మకర్మాణి చోపరిష్టాద్వక్ష్యామః. 1

టీ:- సూర్యమారభ్య ధ్రువాంతం సన్నివేశం నిరూప్యేదానీం సూర్యాదధస్తాన్నిరూపయతి-అధస్తాదితి. స్వర్భానుః రాహుః అలభత లేభే సింహికాయాః పుత్రః. 1

## 24 వ అధ్యాయము

ఈ విధముగా మూడధ్యాయములలో ద్యుమర్యాదను పాలనమును వర్ణించి ఇపుడు భూలోకమునకు కిందుగానున్న భువన మర్యాదాపాలనములను మూడధ్యాయములలో తెలుపుచున్నాడు.

ఇరువది నాల్గవ అధ్యాయమున సూర్యుని తర్వాత స్వర్భానుడు మున్నగువారి స్థితిని క్రమముగా అతలాది బిల స్వర్గముల మర్యాదను వర్ణించుచున్నాడు. ఇంతకు ముందు సూర్యుని నుండి ధ్రువుని వరకునున్న దేశమును నిరూపించి ఇపుడు సూర్యుని కింది భాగమును నిరూపించుచున్నాడు.

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా! సూర్యునకు పదివేల యోజనముల కింద , రాహువు నక్షత్రమువలె తిరుగుచుండునని కొందరు తెలుపుదురు. ఈ రాహువు భగవంతుని దయతో దేవత్వమును, గ్రహత్వమును పొందెను. సింహికాపుత్రుడగు ఈ రాహువు స్వతహాగా రాక్షసుడై దేవత్వ, గ్రహత్వ స్థానమునకర్హుడుకాడు. ఆ రాహువు యొక్క జన్మకర్మలనుగురించి ముందు చెప్పెదను. 1









చూ॥ యదధస్తరణేర్మండలం ప్రతపతి-తద్విస్తరతో యోజనాయుత మాచక్షతే ద్వాదశసహస్రం సోమస్య-త్రయోదశసహస్రం రాహోః యః పర్వణి తద్వ్యవధాన కృత్తద్వైరానుబంధస్సూర్యా చంద్రమాసావభి ధావతి-తన్నిశామ్యోభయత్రాపి భగవతా రక్షణాయ ప్రయుక్తం సుదర్శనం నామ భాగవతం-తత్తేజసా దుర్విషహం చక్రం ముహుః పరివర్తమానమభ్యవస్థితో ముహూర్తముద్వేజమానశ్చలిత హృదయ ఆరాదేవ నిరవర్తతే-తదుపరాగ ఇతి వదతి లోకః. 2

టీ:- గ్రహణం వక్తుమాహ.-యదితి. యదధస్తరణేర్మండలం. అమృతపానే మధ్యప్రదేశే న తయోర్వ్యవధానం కరోతీతి తథా అతఏవ తాభ్యాం సూచితత్వాద్వైరమనుబధ్నాతీతి తథా. భాగవతం చక్రం పరివర్తమానం పరిభ్రమత్. అభిముఖం ముహూర్తమవస్థితస్సన్నిత్యేవ మంతరా తదవస్థానముపరాగం గ్రహణం వదంతి. తత్ర చ ఋజువక్ర స్థితిభ్యాం సర్వగ్రాసాసర్వగ్రాసౌ న తు వస్తుతో గ్రాసో ऽస్తి దూరాంతరత్వాత్. 2

గ్రహణము తెలుపుటకు చెప్పుచున్నాడు. తపించెడి సూర్య మండల విస్తారము పదివేల యోజనములని చెప్పబడినది. ఇదే విధముగా చంద్ర మండల విస్తారము పన్నెండువేల యోజనములు, రాహుమండల పదమూడువేల యోజనముల విస్తారము కల్గినది. అమృత పాన సమయమున రాహువు దేవతా వేషముతో సూర్య చంద్రుల మధ్యలో వచ్చి కూర్చొనగా సూర్య చంద్రులు రాహువు దేవత కాదని భగవంతునికి సూచించిరి. ఆ వైరమును స్మరించి రాహువు అమావాస్య, పూర్ణిమ పర్వ దినములలో సూర్య చంద్రులపై ఆక్రమణ చేయుటకు పూనును. ఇది చూచి భగవంతుడు సూర్య చంద్రులను రక్షించుటకు తనకు ప్రియమగు సుదర్శనచక్రమును ప్రయోగించగా ఆ చక్రము సహించుటకు శక్యముగాని తేజస్సుతో ఉద్విగ్నము, చకితమును అయిన మనముతో ముహూర్త కాలము మాత్రము అచట ఉండి వెంటనే వెనుకకు మరలును. ఆ ముహూర్తసమయముననే జనులు గ్రహణమని అందురు. అచట ఋజు వక్రగతితో సంపూర్ణ గ్రాసమని, అర్ధగ్రాసమని అనబడును. చాలా దూరమునున్నందున వాస్తవముగా గ్రాసమేలేదు. 2

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








చూ॥ తతోఽధస్తాత్సిద్ధ చారణవిద్యా ధరాణాం సదనానిత వాన్మాత్ర ఏవ తతోఽధసాద్యక్ష పిశాచ ప్రేత భూతగణానాం విహారాజి రమంతరిక్షం యావద్వాయుః ప్రవాతి – యావన్మేఘాః ఉపలభ్యంతే. 3

టీ:- తత ఇతి. తావన్మాత్ర ఏవ యోజనాయుతే. అంతరిక్షం గ్రహహీనం తస్యావధిమాహ యావద్వాయుః ప్రవాతి తీవ్రో వాతీతి. తస్యాప్యవధిమాహ. –యావన్మేఘాః. 3

ఆ రాహువునకు పదివేల యోజనముల కింద సిద్ధ, చారణ విద్యాధరుల యొక్క నివాసములు. దీని కింద యక్ష, రాక్షస, పిశాచ, ప్రేత, భూత సమూహములు విహరించెడి స్థలము కలదు. అదియే అంతరిక్షమనబడును. ఈ అంతరిక్షము గ్రహహీనమై వాయువు తీవ్రముగా వీచువరకుండును. ఈ వాయు తీవ్రత మేఘసంచారము వరకుండును. 3

చూ॥ తతోఽధస్తాచ్ఛత యోజనాంతరేణేయం పృథవీ – యావద్ధంస భాస శ్యేన సుపర్ణాదయః పతిత్త్రి ప్రవరా ఉత్పతంతి. 4

టీ:- తత ఇతి. పృథివ్యా ఉపరి భూర్లోకావధిమాహ–యావద్ధం సాదయః పార్థివా వికారాః. 4

దానికి క్రిందగా నూరు యోజనముల దూరములో భూమిగలదు. ఎంతవరకైతే పార్థివ వికారములగు హంసలు, భాసములు, గద్దలు, గరుడపక్షులు మొదలగు పక్షి శ్రేష్ఠములు ఎగురునో అంతవరకు భూమండలపు హద్దు. 4

చూ॥ ఉపవర్ణితం భూమేర్యథాసన్నివేశావస్థానం అవనేరప్యధస్తాత్సప్త భూవివరాః, ఏకైకశో యోజనాయుతాంతరేణాయామ విస్తారేణోప్లక్ప్తాః – అతలం వితలం సుతలం రసాతలం తలాతలం మహాతలం పాతాళమితి. 5

టీ:- ఉపవర్ణితమితి. యోజనాయుతాంతరేణ ప్రత్యేకముచ్ఛ్రితాః. ఆయామో యోఽండకటాహస్య తావద్విస్తారేణ. 5

భూసన్నివేశ స్థితి తెలుపబడినది. ఈ భూమికూడా క్రింద అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళములను ఏడు భూవివరములు(భూమిలో నుండు బిలము లోకములు) ఒకదానికొకటి పదివేల యోజనముల దూరము చొప్పున పదివేల యోజనముల పొడవు, వెడల్పుతో పరికల్పించబడి యున్నవి. 5








చూ॥ ఏతేషు హి బిల్వస్వర్గేషు స్వర్గాదప్యధిక కామభోగైశ్వర్యానంద భూతివిభూతి సుసమృద్ధ భవనోద్యాన క్రీడా విహారేషు దైత్య దానవ కాద్ర వేయానిత్యప్రముదితానురక్త కళత్రాపత్య బంధు సుహృదనుచరా గృహ పతయ ఈశ్వరాదప్య ప్రతిహతకామా మాయావినోదా నివసంతి. (6)

టీ:- సామాన్యేన వివరాణి వర్ణయంతి.-ఏత్వేష్వితి. అథాతలమిత్యతః ప్రాక్తనేన గ్రంథేన ఏతేషు దైత్యాదయో నివసంతీత్యన్వయః. కథంభూతేషు అధికః కామభోగశ్చ ఐశ్వర్యానందశ్చ భూతిః సంపత్తిః విభూతిః అణిమాదిసిద్ధిలబ్ధైశ్వర్యవిశేషః తైస్సుసమృద్ధా భవనాదయో యేషు కథంభూతాః నిత్యప్రముదితాః అనురక్తాః కళత్రాదయో యేషాం న ప్రతిహతః. కామో యేషాం మాయయా వినోదో యేషాం. 6

అతలాది భూవివరములను సామాన్యముగా ఉపవర్ణించుచున్నాడు. ఈ భూవివరములు బిల స్వర్గములనబడును. ఈ బిల స్వర్గములలో స్వర్గమున కంటే అధికముగా విషయోపభోగము, ఐశ్వర్యము, ఆనందము, సంపత్తు, అనిమాద్యష్ట సిద్ధులతో లభించెడి ఐశ్వర్యములతో, సుసమృద్ధములగుభవనములలో, ఉద్యానవనములలో, క్రీడా విహారస్థలములలో దైత్యులు, దానవులు, నాగులు ఎల్లప్పుడు సంతుష్టులగు బంధువులు, భార్యలు, సంతానము, స్నేహితులు, సేవకులుగలవారై గార్హస్థ్యధర్మమునవలంభించి ఇంద్రాది దేవతలను మించిన భోగములు కలిగి అనేక రకముల మాయా వినోద క్రీడల నొనరించుచూ నిత్య సంతుష్టులై నివసించెదరు. 6

చూ॥ యే మహారాజ మయేన మాయావినాऽభినిర్మితాః పురో నానామణి ప్రవర ప్రవేక విరచిత విచిత్ర భవన ప్రాకార గోపుర సభా చైత్య చత్వరాదిభిర్నాగాసుర మిథున పారావత శుక శారికాకీర్ణ కృత్రిమ భూమిభిర్వివరేశ్వర గృహోత్తమైః సమలంకృతాశ్చకాసంతి. 7

టీ:- కించ. యేష్వేతి. హే మహారాజ యేషు మయేన నిర్మితాః

ఓ పరీక్షిన్మహారాజా! ఈ బిలస్వర్గములలో మాయావియగు మయునిచేత అనేకములగు జాతి రత్నములలో శ్రేష్ఠములగు మణులచే నిర్మించబడిన చిత్ర విచిత్రములగు భవనములు, ప్రాకారములు, నగరద్వారములు, సభాభవనములు, మందిరములు, విశాలమగు అంగణములుగల గృహములతో నాగులు, అసురులు, జంటలతో పావురములు, చిలుకలు, సారికలు(మైనా), మున్నగు పక్షులతోకూడి









పురశ్చకాసంతీత్యన్వయః. కథంభూతాః. నానా యే మణిప్రవరాః తేషాం ప్రవేకాః ముఖ్యాః. తైర్విరచితైర్విచిత్రైర్భవనాదిభిః. తథా వివరేశ్వరాణాం గృహోత్తమైశ్చ సమలంకృతాః కీదృశైః గృహోత్తమైః. నాగాశ్చ అసురాశ్చ మిథునభూతాః పారావతాదయశ్చ తైరాకీర్ణాః, కృత్రిమా భూమయో యేషు తైః. నానాస్వనమిథునేతి పాఠాంతరే నానాస్వనత్వం మిథున విశేషణమ్. 7

చూ॥ ఉద్యానాని చాతితరాం మన ఇంద్రియానందిభిః కుసుమ ఫలస్తబక సుభగ కిసలయావనత రుచిర విటపినాం– కనక లతాంగా లింగితానాం– శ్రీభిస్సముదిత మిథున వివిధ విహంగకుల కోలాహల జలాశయానాం– అమల జల పూర్ణానాం ఝషకులోల్లంఘన క్షుభిత నీరనీరజ కుముద కువలయ కల్హార నీలోత్పల లోహిత శతపత్రాది వనేషు కృత నికేతనానాం–ఏక విహారాకుల మధుకర నికరాణాం మధుర వివిధ స్వరాదిభిరింద్రియోత్సవైరమరలోక శ్రియమతిశయితాని. (8)

టీ:– ఉద్యానానీతి. ఉద్యానాని చ అతితరామమరలోక శ్రియమతి శయితాని యేషు చకాసంతీత్యన్వయః. కాభిః. శ్రీభిః. కేషాం కుసుమ ఫల స్తబకాశ్చ సుభగకిసలయాని చ తైరవనతా రుచిరా విటపా యేషాం

యున్న కృత్రిమ భూములలో విరాజిల్లు బిలాధిపతుల గృహరాజములతో అలంకృతములగు పట్టణములు ప్రకాశించుచుండును. (నానావిధస్వన మిథున అనుపాఠాంతరములో అనేక రకముల ధ్వనులు జంటలకు విశేషణము). 7

ఆబిలములలో పుష్ప ఫల స్తబకములతో సుందరములగు చిగుళ్ళతో వంగిన కొమ్మలుగల, బంగారు వర్ణముగల లతల అంగ పాశములతో ఆలిగింతములగు వృక్షముల శోభలతో, చక్రవాకాది అనేక రకములగు పక్షుల జంటల కోలాహలము కలిగి స్వచ్ఛములగు జలములతో నిండి చేప గుంపుల ఎగురుటచే కదులుచుండు జలము లందలి కమలములు, కుముదములు, కలువలు, కల్హరములు, నీలికమలములు, ఎఱ్ఱ కమలములు, శతపత్రముల పుష్ప వనములలో నివాస మేర్పరుచుకొని అవిరామముగా విహరించెడి తుమ్మెద గుంపులు చేయు అనేక విధములగు, మనోహరములగు ధ్వనులచే, ఆహ్లాదకరమైన ఉత్సవములతోనూ గొప్పగా మనస్సునకు, ఇంద్రియములకు ఆనందము కల్గించెడి ఉద్యానవనములు స్వర్లోక శోభనతిక్రమించినవై ప్రకాశించుచుండును. 8












ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

తేషాం విటపినాం లతానామంగైరాలింగితానాం శ్రీభిః తథా సమిథునాః చక్రవాకాది మిథున సహితా యే వివిధా విహంగాః తద్యుక్తానాం జలాశయానాం చ శ్రీభిః. కీదృశానాం అమలైః జలైః పూర్ణానాం పునరపి కైరతిశయితాని ఝషకులోల్లంఘనేన క్షుభితం యజ్జలాశయానాం నీరం. తస్మిన్ యాని నీరజాని తేషాం వనేషు కృతనికేతనం యైస్తేషాం అర్థాత్పక్షిణాం ఏకః అఖండో యో విహారః తేనాకులాశ్చ తే మధురాశ్చ వివిధ స్వరాదయస్తైర్యే ఇంద్రియోత్సవాః తైశ్చ-యద్వా మిథునేత్యా దేరుత్తరేణైవ సంబంధః. మన ఇంద్రియానందిభిరితి స్వనాదీనాం విశేషణం. తత్ర నీరజం సామాన్యేన కమలం లోహితం శతపత్రం తద్విశేషః. 8

చూ॥ యత్ర వాహవనభయమహోరాత్రాదిభిః కాలవిభాగైరుపలక్ష్యతే- యత్ర మహాహి ప్రవర శిరోమణయస్సర్వశార్వరం తమః ప్రబాధంతే. 9

టీ:- యత్ర హేతి. అహోరాత్రాదిభిర్యద్భయం తన్నోపలక్ష్యతే సూర్యా ద్యభావాత్. 9

చూ॥ న వా ఏతేషు వసతాం దివ్యౌషధి, రస రసాయనాశనపాన స్నానాదిభిరాధయో వ్యాధయః వలీపలిత జరాదయశ్చ-దేహవైవర్ణ్య దౌర్గంధ్య స్వేద క్లమగ్లానిరితి వయోఽవస్థాశ్చ భవంతి. 10

ఆ బిలమిల లోపలికి సూర్యాదుల ప్రకాశము లేనందున దివా రాత్రములను కాల విభాగముల భయముండదు. అచటి సంపూర్ణమగు అంధకారమును సర్వశ్రేష్ఠుల శిరోరత్నములు తొలగించుచుండును. (నాగమణుల కాంతిచే అంధకారము దూరమగును) 9

ఈ లోకములలో నివసించెడివారు దివ్యములగు ఓషధుల రసమును, రసాయన, అన్న, పాన, స్నానాదులలో సేవించడముచేత వారికి శారీరక, మానసిక రుగ్మతలు, చర్మము ముడుతలు పడడము,

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









టీ:- నేతి. క్లమః శ్రమః గ్లానిరనుత్సాహః. 10

శరీరములో దుర్గంధముకల్గడము, చెమటపట్టడము, శ్రమ, నిరుత్సాహము అను వయోవస్థల వలన కలుగు వికారములు సంభవించవు. అనగా అచటివారు నిత్యయౌవనులై, సుందరులై, శక్తి సంపన్నులై యుందురని భావము. 10

చూ॥ నహి తేషాం కల్యాణానాం ప్రభవతి కుతశ్చన మృత్యుర్వినా భగవత్తేజసశ్చక్రాపదేశాత్-యస్మిన్ ప్రవిష్టే సురవధూనాం ప్రాయః పుంసవనాని భయాదేవ స్రవంతి పతంతి చ. 11

టీ:- న హీతి. కల్యాణానాం మంగళరూపాణాం యస్మిన్ భగవత్తేజసి ప్రవిష్టే పుంసవనాని గర్భాః. శ్లో. "అచతుర్థాధ్భవేత్స్రావః పాతః పంచమ షష్ఠయో" రితి స్రావపాతౌ జ్ఞేయౌ. 11

మంగళరూపులగు ఆ లోకనివాసులకు భగవంతుని తేజో రూపమగు సుదర్శన చక్రముతో తప్ప, దేనితోనూ మృత్యుభయము ఉండదు. సుదర్శనచక్రము ప్రవేశించినంతనే భయముతో అసురస్త్రీల గర్భస్రావములు, గర్భపాతములు కలుగును. నాలుగు నెలల వరకు జరుగు గర్భనష్టమును గర్భస్రావమని; ఐదు, ఆరు నెలలోజరుగు గర్భనష్టమును గర్భపాతము అని ఎఱుగవలయును. 11

చూ॥ అథాతలే మయపుత్రో బలో నామాసురో నివసతి-యేన హవా ఇహ సృష్టాః షణ్ణవతీర్మాయాః కాశ్చనాద్యాపి మాయావినో ధారయంతి యస్య చ జృంభమాణస్య ముఖతస్త్రయః స్త్రీగణా ఉదపద్యంత-తాస్స్వైరిణ్యః కామిన్యః పుంశ్చల్యఇతి-యా వై బిలాయనం ప్రవిష్టం పురుషం రసేన హాటకాఖ్యేన సాధయిత్వా స్వవిలా సావలోకనానురాగ స్మిత సల్లాపోపగూహనాదిభిస్స్వైరం కిల రమయంతి. 12

అతల లోకమున మయుని పుత్రుడు బలుడనువాడు నివసించును. ఈ బలుడు తొంబదియారు రకముల మాయలను సృష్టించినాడు. వాటిలో కొన్ని ఇప్పటికిని మాయావులగు వ్యక్తులు ధరించుచున్నారు. (కలిగియున్నారు) ఆ బలుడు ఆవులించిపుడు అతని ముఖమునుండి స్వైరిణులు అనగా సవర్ణపురుషునితోనే రమించువారు, కామినులు అనగా ఇతర వర్ణ పురుషులతోను రమించువారు








టీ:- అథేతి. సవర్ణే రతాః స్వైరిణ్యః కామిన్యస్త్వసవర్ణేఽపి రతాః తత్రాప్యతిచంచలాః పుంశ్చల్యః. బిలాయనం బిలాయతనం సాధయిత్వా సంభోగ సమర్థం కృత్వాస్వే అసాధారణ విలాసాః. తత్పూర్వకోఽవలోకః తేనా నురాగయుక్తం స్మితం తేన సల్లాపముపగూహనం చ తదాదిభిః. 12

చూ॥ యస్మిన్నుపయుక్తే పురుష ఈశ్వరోఽహం సిద్ధోఽహమిత్య యుత మహాగజ బలమాత్మానమితి మన్యమానః కత్థతే మదాంధ ఇవ. 13

టీ:- యస్మిన్నితి. యస్మిన్ రసే ఉపయుక్తే సేవితే. 13

చూ॥ తతోఽధస్తాద్వితలే హరో భగవాన్ హాటకేశ్వరః స్వపార్షదభూత గణావృతః ప్రజాసర్గోపబృంహణాయ భవాన్యా సహ మిథునీభూయాస్తే -యతః ప్రవృత్తా సరిత్ప్రవరా హాటకీ నామభవయోర్వీర్యేణ యత్ర చిత్రభానుర్మాతరిశ్వనా సమిధ్యమాన ఓజసా పిబతి తన్నిష్ఠ్యూతం హాటకాఖ్యం సువర్ణం భూషణేన సురేంద్రావరోధేషు పురుషాస్సహ పురుషీభిర్ధారాయంతి. 14

పుంశ్చలులు అనగా మిక్కిలి చంచల స్వభావము కలవారు అను మూడు రకముల స్త్రీ సమూహములు జన్మించినవి. వీరు ఈ అతల లోకమున ప్రవేశించిన పురుషులను హాటకమను రసాయనమును పానము చేయించి సంభోగ సమృద్ధినిగా నొనరించి తమ యొక్క హావ, భావ విలాసములతో కూడిన చూపులతో, అనురాగయుక్తమగు చిరునవ్వులతో ప్రేమాలాపములతో, ఆలింగనాదులతో యథేచ్ఛగా రమింప చేయుదురు. 12

ఈ హాటకము అను రసమును సేవించిన పురుషుడు తనను తాను పదివేల ఏనుగుల బలముకల వానినిగా తలచుకొని నేనే ఈశ్వరుడను నేను సిద్ధుడను అని మదాంధునివలె గర్వితుడగును. 13

ఈ అతలమునకు కిందనుండెడి వితలలోకమున భగవంతుడగు శంకరుడు, హాటకేశ్వరుడను పేరుతో తన అనుచరులగు భూత గణములతో కలసి యుండును. ప్రజాపతి యొక్క సృష్టినభివృద్ధి నొందించుటకు భవానితో జంటగా విహరించుచుండును. భవానీ భవుల తేజస్సుతో హాటకీ అనునది ఇచ్చుట ప్రభవించినది. ఈ హాటకీ నదీజలమును వాయువుతో ప్రజ్వలితుడగు అగ్ని, ఉత్సాహముతో

టీ:- తత ఇతి. భవయోః భవస్య భవాన్యాశ్చ. చిత్రభానురగ్నిః. తేన నిష్ఠ్యూతం పూత్కృత్యత్యక్తం. అసురేంద్రాణామవరోధేషు అంతఃపురేషు పురుషీభిః స్త్రీభిః. 14

చూ॥ తతోఽధస్తాత్సుతలే - ఉదారశ్రవాః పుణ్యశ్లోకో విరోచనాత్మజో బలిః భగవతా మహేంద్రస్య ప్రియం చికీర్షమాణేనాదితేర్లబ్ధకాయో భూత్వా వటుర్వామనరూపేణ-పరాక్షిప్తలోకత్రయో భగవదనుకంపయైవ పునః ప్రవేశితః-ఇంద్రాదిష్వవిద్యమానయా సుసమృద్ధయా శ్రియాభిజుష్టః-స్వధర్మేణారాధయంస్తమేవ భగవంతమపగతసాధ్వస ఆస్తేఽధునాపి. 15

టీ:- తత ఇతి. సుతలే బలిరధునాప్యాస్త ఇత్యన్వయః. కథంభూతః మహేంద్రస్య. ప్రియం కర్తుమిచ్ఛతా భగవతా. ప్రథమం పరాక్షిప్త మపహృతం లోకత్రయం యస్య సః. పునర్భగవతోఽనుకంపయైవ తత్ర ప్రవేశితస్సన్. కీదృశేన. యోఽదితేస్సకాశాద్భూత్వా వటుర్వామ నరూపేణ లబ్ధకాయస్తేన. 15

చూ॥ నో ఏవైతత్సాక్షాత్కారో భూమిదానస్య-యత్తద్భగవత్యధోక్షజే-అశేష జీవనికాయానాం జీవభూతాత్మ భూతే పరమాత్మని వాసుదేవే-

పానముచేసి పూత్కరించి ఉమిసిన హాటకమును బంగారమును ఆభరణములుగావించుకొని అసురరాజుల అంతఃపురములో స్త్రీలు, పురుషులు ధరించెదరు. 14

మహేంద్రునికి (ఇంద్రునికి) ప్రీతిని కలుగజేయుటకు అదితి గర్భమున వామనునిగా అవతరించిన శ్రీహరి, తొలుత తన మూడు పాదములతో ముల్లోకములను ఆక్రమించి, విరోచనుని పుత్రుడగు బలి చక్రవర్తి నుంచి సర్వస్వమును గ్రహించి, పిదప అతనిని అనుగ్రహించి, సుతలానికి పంపి, ఇంద్రాదుల వద్ద కూడా లేనట్టి ఉత్కృష్ట సంపదలను ఇచ్చెను. అచట ఆ బలి చక్రవర్తి ఇప్పటికినీ తన స్వధర్మాచరణతో శ్రీహరిని ఆరాధిస్తూ నిర్భయముగా ఉంటున్నాడు (15)

కొందరు బలికి సుతలలోకరాజ్యమును శ్రీహరికిచ్చిన భూదాన ఫలముగా తలంతురు. అది కాదని నిరాకరించుచున్నాడు. ఈ






తీర్థతమే-పాత్రఉపపన్నే - పరయా శ్రద్ధయా పరమాదర సమాహిత మనసా సంప్రతిపాదితస్య సాక్షాదపవర్గద్వారస్య యద్బిల నిలయై- శ్వర్యమ్. 16

టీ:- కేచిత్తస్య సుతలరాజ్యం భూమిదాన ఫలం మన్యంతే తన్నిరాకరోతి-నోఏవైతదితి. యద్బిలనిలయే వివరస్థానే ఐశ్వర్యం. ఏతద్భూమి దానస్య. సాక్షాత్కారః ఫలం న భవత్యేవ. కుత ఇత్యపేక్షాయామేవం భూతస్య దానస్య సాక్షాదపవర్గహేతుత్వాదిత్యాహ-యత్తత్ప్రసిద్ధం దానం తస్య తదేవాహ-భగవతి. అశేషజీవనికాయానాం జీవభూతశ్చాసావాత్మ భూతశ్చ. సర్వజీవనియంతా చాసావాత్మారామశ్చేత్యర్థః. తస్మిన్ సంప్రతిపాది తస్య సమ్యగ్భక్తిపురస్సరతస్సమర్పితస్య. 16

సుతలలోకములోని ఐశ్వర్యము, ఈ భూమి దానమునకు ముఖ్యఫలము కాదు. ఏలనన సమస్త జీవ సమూహాములకు జీవభూతుడు, ఆత్మభూతుడు, పరమాత్మ, వాసుదేవుడు, పూజ్యతముడు, పవిత్రుడు, భగవంతుడు, సర్వభూతనియంత, ఆత్మారాముడును అగు సత్పాత్రమగు అథోక్షజుడు దానగ్రహీతకాగా, గొప్ప శ్రద్ధ, పరమ ధర్మములతో స్థిర చిత్తములతో ఇవ్వబడిన భూదానమునకు ఫలము సాక్షాత్తుగా అపవర్గము ముక్తియే అగును. అందువలన బలికి ఈ బలైశ్వర్యములు భూదాన ఫలితము కానే కావు. 16

చూ॥ యస్య హవావ క్షుత పతన ప్రస్ఖలనాదిషు వివశస్సకృన్నామాభి గృణన్ పురుషః కర్మబంధనమంజసా విధునోతి-యస్య హ వై ప్రతి బాధనం త్విహముముక్షవోఽన్యథైవోపలంభతే - తద్భగవతో భక్తానాం సర్వేషామాత్మనామాత్మదే - ఆత్మతమే. 17

టీ:- యస్యహేతి. కించ. యస్య నామ క్షుతాదిషు వివశోఽపి సకృదపి. గృణన్ కర్మబంధం విధునోతి. కథంభూతం. యస్య

తుమ్ముట, పడుట, జారుట మున్నగు సమయములలోనైనా, వివశుడై, ఏ భగవంతుని యొక్క నామమును స్మరించినంతలోనే పురుషుడు కర్మబంధనములను తొలగించుకొనునో. అట్టి కర్మబంధన- మును ముముక్షులగు జనులు యోగసాధనాది అనేక ఉపాయముల నాశ్రయించి, అతికష్టముతో తొలగించుకొందురు. అందువలననే సంయమము కలిగిన భక్తులకు, జ్ఞానులకు స్వస్వరూప ప్రదానము చేసెడి సమస్త ప్రాణులకు ఆత్మభూతుడగు ఆ భగవంతునకు



ప్రతిబాధనం త్విహ ముముక్షవోऽన్యథైవోపలభంతే. యన్నివృత్త్యర్థం యోగసాంఖ్యాదిక్లేశాననుభవంతీత్యర్థః. తం కరబంధం త్యజంతి తత్తస్మిన్ భాగవతానాం భక్తానాం జ్ఞానినాం చ. యథాతథం ఆత్మదే జ్ఞానదే హరౌ ఆత్మతమే చ. సమర్పితస్య భూమిదానస్య న తత్ఫలమితి పూర్వేణైవ సంబంధః. 17

చూ॥ నైవ భగవానస్మై నమముష్యానుజగ్రాహ యదుత పునరాత్మాను స్మృతిమోషణం మాయామయ భోగైశ్వర్యమేవాతానునేతి. 18

టీ:- కించ నేదం భగవదనుకంపయా లబ్ధం ఫలం. కింత్వేకాంతభక్తస్య తస్యాంతరాయసూత్రమిత్యాహ-నేతి. భగవాన్ అముష్య అముం నైవానుగృహీతవాన్. తత్ర హేతుః-యదుతేతి. ఆత్మన ఈశ్వరస్యాను స్మృతిం ముష్ణాతీతి తథా తదుక్తం వైష్ణవే "వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు, తస్యాంతరాయోమైత్రేయ దేవేంద్ర త్వాదికం ఫల" మితి. 18

చూ॥ యత్తద్భగవతానధిగతాన్యోపాయేన యాచ్ఞాచ్ఛలేనాపహృత స్వ శరీరావశేషితలోకత్రయః-వరుణపాశైశ్చ సంప్రతి ముక్తః-గిరిదర్యాం చాపవిద్ధ ఇతి హోవాచ. 19

ఆత్మభావముతో చేసిన భూదానమునకు ఈ సుతల ఐశ్వర్యము ఫలము కాదు అని పూర్వ గద్యముతో అన్వయము. 17

బలికి ఈ బలైశ్వర్యములు భగవత్కృపతో లభించిన ఫలము కూడాకాదు. కాని ఏకాంత భక్తుడగు బలికి ఇది అతని ఏకాంత భక్తికి అంతరాయము మాత్రమేనని తెలుపుచున్నాడు. భగవంతుడు తనకు సర్వస్వము దానమొనరించిన బలికి దానఫలముగా ఈశ్వర స్మృతిని తొలగించెడి ఈ మాయామయ మగు భోగైశ్వర్యములనే ఒసగినయెడల, బలిపైన ఇదేమియు అనుగ్రహముకాదు. విష్ణుపురాణమున "ఓ మైత్రేయా! జప, హోమ, అర్చనాదులతో వాసుదేవుని యందే మనము కలవానికి దేవేంద్రత్వాది ఫలమంతరాయభూతమైనదే" అని తెలుప బడినది. 18

ఆ బలి యొక్క ఏకాంతభక్తిని సోదాహరణముగా చూపు -చున్నాడు. భగవంతుడు బలివద్ద నుండి ముల్లోకములను గ్రహించుట కొరకు వేరే ఉపాయమును గాంచక యాచన అనుమిషతో బలి యొక్క






టీ:- తస్యైకాంతభక్తిం సప్రపంచమాహ-యదితి. యత్తత్ అతిప్రసిద్ధమితి వక్ష్యమాణమువాచ హేత్యన్వయః. కథంభూతః అనధిగతః అన్యః ఉపాయో యేన తేన భగవతా యచ్ఛాచ్ఛలేనాపహృతం స్వశరీరమాత్రావశేషితం లోకత్రయం యస్య. సమ్యక్ ప్రతి ముక్తో బద్ధః. అపవిద్ధః ప్రక్షిప్తోऽపి సన్. 19

చూ॥ నూనం బతాయం భగవానర్థేషు న నిష్ణాతో యోऽసావింద్రో యస్య సచినో మంత్రాయ వృత ఏకాంతతో బృహస్పతిః తమతిహాయ స్వయముపేంద్రేణాతదర్థ్వా మాత్మానమయాచతాత్మన ఆశిషో నో ఏవైతద్దాస్యమతి గంభీర వయసః కాలస్య మన్వంతర పరివృత్తం కియల్లోకత్రయమిదమ్. 20

టీ:- మౌనమితి. బతేతి ఖేదే. భగవాన్ విద్వానపి. యోऽసావింద్రః యస్యైకాంతేన బృహస్పతిః సచివః సహాయః. యతో మంత్రాయ మంత్రార్థం వృతః సోऽపి పురుషార్థేషు నూనం న నిష్ణాతః న నిపుణః యత ఉపేంద్రేణ ద్వారభూతేన తముపేంద్రం విహాయాత్మానాం మాం లోకత్రయమయాచత మంత్రపదం బృహస్పతిమతిక్రమ్యేతి వా. తస్మిన్ ప్రసన్నే స ఏవ వరణీయో న లోకత్రయం. యతస్తదతితుచ్ఛమిత్యాహ-అతిగంభీరం అనంతం వయో యస్య తస్య కాలస్య యన్మన్వంతరం. తేన పరివృత్తం విపర్యస్తం లోకత్రయమిదం కించిత్. 20

త్రిలోక రాజ్యమునపహరించి, కేవలము శరీరావశిష్టునిగా చేసిననూ, వరుణ పాశములతో బంధించి పర్వతగుహలో పడవేసిననూ బలి ఇలా పలికెను. 19

అయ్యో! విద్వాంసుడగు ఈ ఇంద్రుడు కూడా తనకు నిజమైన శ్రేయోర్థమును సంపాదించుకొనుటలో కుశలుడుకాదు. ఎందుకనగా తన శ్రేయస్సంపాదనకు అనన్య భావముతో బృహస్పతి సహాయము కోరియు, ఆ బృహస్పతిని కూడా కాదని, ఉపేంద్రుడుగా నవతరించిన విష్ణువును విష్ణుభక్తిని యాచించక, ఆ ఉపేంద్రుని ద్వారా అనర్థమైన ఈ త్రిలోకాధిపత్యమును యాచించెను. ఆ లోకత్రయము అనంతమగు కాలములో కేవలము ఒక మన్వంతర పర్యంతము మాత్రమేనుండునది అనంతమగు భగవంతుని కైంకర్యములో లోకత్రయము తుచ్ఛమైనది. కదా! 20









చూ॥ యస్యానుదాస్యమేవాస్మత్పితామహః కిల వవ్రే–న తు స్వపిత్ర్యం –యదుతాకుతోభయం పదం దీయమానం భగవతోపరతే స్వపితరి. 21

టీ:– ప్రహ్లాదస్తు ఏక వార్థే నిష్ణాత ఇత్యాహ–యస్యేతి. స్వపితరి ఉపరతే మృతే సతి. స్వం పిత్ర్యం పదం భగవతా దీయమానమపి భగవతః ఖలు న పరమన్యదితి కృత్వా న తు జగ్రాహేత్యర్థః. 21

చూ॥ తస్య మహానుభావస్యానుపథమలమమృదిత కషాయః కో వాస్మద్విధః–పరిక్షీణ భగవదనుగ్రహ ఉపజిగమిషతీతి. 22

టీ:– నను త్వమతివీరః కుతస్తమేవ బహుమన్యసే? తత్రాహ–తస్యేతి తస్యానుపథం అనువర్త్మ అమృదితా అక్షీణాః కషాయా రాగాదయో యస్య పరిక్షీణో భగవదనుగ్రహో యస్య స కో వా ఉపగంతుమిచ్ఛతీతి. (22)

చూ॥ తస్యానుచరితముత్తరస్మాద్విస్తరిష్యతే యస్య భగవాన్ స్వయ మఖిల జగద్గురుర్నారాయణో ద్వారి గదాపాణిరవతిష్ఠతే–నిజజనాను కంపిత హృదయః–యేనాంగుష్ఠేన పదా దశకంధరో యోజనాయు తాయుతం దిగ్విజయ ఉచ్చాటితః. 23

ప్రహ్లాదుడొక్కడే స్వశ్రేయో నిర్ణయములో నిష్ణాతుడని తెలుపు–చున్నాడు. నా తాతయగు ప్రహ్లాదుడు తన తండ్రి (హిరణ్యకశిపువు) నృసింహునిచే సంహరించబడగా, తన తండ్రికి సంబంధించిన నిష్కంటమగు రాజ్యమును ఇచ్చుటకు భగవంతుడు సిద్ధపడిననూ ఈ రాజ్య భోగము భగవద్భక్తి కంటే గొప్పదికాదని తలచి భగవంతుని దాస్యమునే కోరుకొనెను. 21

నీవు గొప్ప వీరుడవు కదా! మరి ఆ ప్రహ్లాదునే గొప్పవానిగా ఎందులకు తలచెదవు అనుదానికి తెలుపుచున్నాడు. భగవదనుగ్రహము లేనట్టి, వాసనలు నశించనటువంటి నా లాంటివారు మహానుభావుడగు ప్రహ్లాదునియొక్క మార్గము చేరుటకు ఎలా సాహసించెదరు అని బలి పలికెను. (అనగా వాసనలు నశించకపోవడంచేత నా కన్నా ప్రహ్లాదుడే గొప్పవాడని భావము) 22

బలి ఇంతటి గొప్పవాడుకదా మరి ఆ బలి చరిత్రనే విస్తారముగా తెలుపుమనునేమోయని తెలుపుచున్నాడు. ఓ పరీక్షిద్రాజా! అలాంటి బలియొక్క చరిత్ర (తర్వాత) అష్టమస్కంధమున విస్తారముగా తెలిపెదను. ఎవరి పాదాంగుష్ఠముచేత మాత్సర్యయుక్తుడగు రావణుడు












టీ:- నన్వేవం భూతశ్చేద్బలిః తర్హి తస్యైవ చరితం విస్తరేణ కథ్యతాం తత్రాహ-అథ శుకోక్తిః. తస్యేతి. తస్య బలేరనుచరితముపరిష్టాదష్టమే విస్తరిష్యతే. యస్య ద్వార్యవతిష్ఠతే. నిజజనేష్వనుకంపితం కృతాను కంపంహృదయం యస్య. ద్వారపాలకర్మ దర్శయతి యేన. శ్రీనారాయణే న బలేః ద్వారి విశన్ దశకంధరః ఉచ్చాటితః. కేన పదా తత్రాప్యంగు ష్ఠేనైవ. 23

చూ॥ తతోఽధస్తాత్తలాతలే మయోనామ దానవేంద్రస్త్రిపురాధిపతిర్భగ వతా త్రిపురారిణా త్రిలోక్యాశ్శం చికీర్షుణా నిర్దగ్ధపురత్రయస్తత్ప్రసాదా ల్లబ్ధపదో మాయావినామాచార్యో మహాదేవేన పరిరక్షితో విగతసుదర్శన భయో మహీయతే. 24

టీ:- యథా హరిణా స్వభక్తో బలిః సుతలే నిహితః సుఖమాస్తే. ఏవం మహాదేవభక్తోఽపి యస్తలాతలే సుఖమాస్త ఇత్యాహ-తత ఇతి. లబ్ధం పదం స్థానం యేన మహీయతే పూజ్యతే. 24

చూ॥ తతోఽధస్తాన్మహాతలే కాద్రవేయాణాం నైకశిరసాం క్రోధ వశానాం గణః - కుహక - తక్షక - కాళీయ - సుషేణాది - ప్రధాన మహాభోగవంతః పతత్త్రి రాజాధిపతేః పురుషోత్తమవాహాదనవరత

లక్షల కొద్ది యోజనముల దూరము చిమ్మివేయబడెనో అలాంటి భగవంతుడు, భక్త జనులపైన దయాహృదయము కలవాడై, సమస్త జగత్తులకు పరమగురువగు భగవన్నారాయణుడు చేతిలో గదను ధరించి సుతలలోకమున బలి యొక్క గృహ ద్వారముననే ఎల్లప్పుడు స్వయముగా పహరాధారుగా నిలబడియుండును. 23

ఏ విధముగా శ్రీహరిచే తన భక్తుడగు బలి సుతలలోకములో నుంచబడి సుఖముగా నున్నాడో, అదే విధముగా మహాదేవుని భక్తుడగు మయుడు సుతలలోకము క్రింది తలాతలములో సుఖముగానున్నాడని తెలుపుచున్నాడు. ముల్లోకములకు సుఖము కలుగజేయు ఇచ్ఛతో త్రిపుర దాహమొనరించిన శంకరుని అనుగ్రహముతో తలాతల స్థానమునొందిన మయుడనే రాక్షసరాజు మాయావులకు గురువై , మహాదేవుని ద్వారా రక్షించబడుచూ సుదర్శనచక్ర భయము లేనివాడై ఆ లోకజనులచే పూజింపబడుచుండును. 24

ఈ తలాతలము క్రింద మహాతల బిలలోకమున కద్రువకు జన్మించిన, అనేక ఫణములుగల, మిక్కిలి క్రోధవంతులగు పన్నగముల సమూహము ఉండును. వీరిలో కుహకుడు, తక్షకుడు, కాలేయుడు,









ముద్వేలమానాః స్వకళత్రాపత్య సుహృత్కుటుంబ సంగేన క్వచిత్ప్రమత్తా విహరంతి. 25

టీ:- తత ఇతి. నైకశిరసాం అనేకఫణానాం గతోఽస్తి. ఏతత్ప్రపంచ యతి-కుహకేతి. మహాభోగవంతో మహాకాయాః. పురుషోత్తమవాహాత్ హరేర్వాహనాత్. 25

సుషేణుడు మున్నగువారు ముఖ్యులు. వీరు గొప్పవైన ఫణములు కలిగియుందురు. వీరు పురుషోత్తముడగు శ్రీవిష్ణు వాహనమగు పక్షిరాజు గరుత్మంతుని వలన భీతిల్లుచూ, తమ భార్యా, పుత్ర, మిత్రుల, కుటుంబ సాంగత్యములతో ఒక్కొక్కసారి ప్రమత్తులై విహరించు-చుందురు. 25

చూ॥ తతోఽధస్తాద్రసాతలే దైతేయా దానవాః ఫణయో నామ నివాత కవచాః కాలకేయా హిరణ్యపుర నివాసిన ఇతి విబుధప్రత్యనీకా ఉత్పత్త్యా మహౌజసో మహాసాహసినో భగవతః సకలలోకానుభావస్య హరేరేవ తేజసా ప్రతిహత బలావలేపా బిలేశయా ఇవ నివసంతి-యే వై సరమయేంద్రదూత్యా వాగ్భిర్మంత్రవర్ణాభిరింద్రాద్బిభ్యతి. 26

టీ:- తత ఇతి. విబుధప్రత్యనీకాః దేవశత్రవః. సకలేష్వపి లోకేష్వను భావో యస్య తస్యైవ తేజసా సుదర్శనేన ప్రతిహతో బలావలేపో వీర్యమదో యేషాం బిలేశయాః సర్పా ఇవ ఇంద్రదూత్యా ప్రయుక్తాభి ర్మంత్రరూపాభిర్వాగ్భిః. ఏవం హి వైదికమాఖ్యానం ఫణిభిరసురైర్ని గూఢాంగాం అన్వేష్టుం సరమాం దేవశునీమింద్రేణ ప్రహితాం సంధిమిచ్ఛంతః. ఫణయః ప్రాహుః. కిమిచ్ఛంతీ సరమేత్యాది. సా చ

మహాతలము కింది భాగమున రసాతలమున, ఫణులు అనబడు దైత్యులు, దానవులు, నివాతకవచులు, కాలేయులు, హిరణ్యపురవాసులు అనబడు దేవతల శత్రువులు నివసించుదురు. వీరు జన్మతః గొప్ప బలవంతులు, గొప్ప సాహసికులు, సమస్తలోక ప్రభావశాలియగు శ్రీహరి తేజస్సుతో బలము క్షీణింపచేయబడినవారై, సర్పములవలె నివసించియుందురు. వీరు ఇంద్రదూతియగు సరమ యొక్క "హతా ఇంద్రేన ఫణయశ్శయధ్వం" ఇంద్రునితో చంపబడి పడియుండుడు అను మంత్రములచే ఇంద్రునిగూర్చి భీతిల్లెదరు. అను ఒక వైదికమగు ఆఖ్యానము ప్రసిద్ధమైయున్నది. ఫణులను దైత్యులు భూమిని రసాతలములో దాచిరి. అపుడు ఇంద్రుడు భూమిని వెదకుటకై 'సరమా' యను దూతిని పంపెను. దైత్యులు సరమతో సంధిచేసికొనకోరిరి. కాని సరమ సంధిచేయక ఇంద్ర స్తుతిచేస్తూ "ఓ ఫణులారా! మీరు








సంధిమనిచ్ఛంతీంద్ర స్తుతిపూర్వకం తాన్ ప్రతి పరుషమాహ–హతా ఇంద్రేణ ఫణయశ్శయధ్వమిత్యాది. తే చ తచ్ఛ్రుత్వా బిభ్యతీతి. 26

చూ॥ తతోఽధస్తాత్పాతాళే – నాగలోక పతయో వాసుకి ప్రముఖాః శంఖ– కుళిక–మహాశంఖ–శ్వేత– ధనంజయ–ధృతరాష్ట్ర– శంఖచూడ – కంబళాశ్వతర– దేవదత్తాదయో మహాభోగినో మహామర్షా నివసంతి– యేషాముహ వై పంచసప్తదశ శతసహస్రశీర్షాణాం ఫణాసు విరచితా మహామణయొ రోచిష్ణవః పాతాళవివరే తిమిరనికరం స్వతేజసా విధమంతి. 27

టీ:– తత ఇతి. మహాభోగినః మహాఫణాః. మహానమర్షః క్రోధో యేషాం పంచాదిసంఖ్యాని శీర్షాణి యేషాం. శీర్షా ణ్ణమితి వక్తవ్యే శీర్షాణామిత్యార్షః. 27

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, చతుర్వింశోఽధ్యాయః**

ఇంద్రునిచే చంపబడి భూమిపై శయించండి" అని శపించెను. ఆ శాపముతోనే ఫణులు ఎల్లప్పుడు ఇంద్రునకు భీతిల్లెదరని ప్రసిద్ధి. 26

ఈ రసాతలమునకు కింద పాతాళబిలలోకమున నాగలోకాధిపతులగు వాసుకి ప్రధానుడుగాగల శంఖుడు, కుళికుడు, మహా–శంఖుడు, శ్వేతుడు, ధనంజయుడు, ధృతరాష్ట్రుడు, శంఖచూడుడు, కంబళాశ్వతరుడు, దేవదత్తుడు మున్నగు వారు గొప్ప ఫణములుగలిగి మిక్కిలి క్రోధవంతులగువారు నివసించెదరు. వీరిలో ఐదు, ఆరు, ఏడు, పది, వంద, వేయి సంఖ్యలతోగల శిరములందలి పడగల యందు మణులు గొప్పకాంతి కలవై పాతాళ బిలములోని చీకటిని తమ కాంతితో తొలగించును. 27

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు ఇరువది నాలుగవ అధ్యాయము సమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








## పంచవింశోధ్యాయః

శ్లో॥ పంచవింశే తతోఽధస్తాదాహ శేషస్య సంస్థితమ్ ।
సంజి హీర్ష్రోరిదం యత్ర రుద్ర సముద్భవః ॥

### శ్రీ శుక ఉవాచ

చూ॥ తస్య మూలదేశే త్రింశద్యోజనసాహస్రాంతర ఆస్తే-యావై కలా భగవతస్తామసీ సమాఖ్యాతానంత ఇతి సాత్త్వతీయాయం ద్రష్టృదృశ్య యోస్సన్నికర్షణాదహమితి చాభిమానలక్షణాత్సంకర్షణ ఇత్యాచక్షతే. 1

టీ:- తస్యేతి. కోఽసావనంతస్సాత్త్వతీయాః సాత్త్వతతంత్రనిష్ఠాః చతుర్వ్యూహోపాసనే యం సంకర్షణ ఇత్యాచక్షతే. తథాఖ్యానే హేతుః ద్రష్ట ృదృశ్యయోః సమ్యక్ నికర్షణమేకీకరణం యేన తత్కృతః. అహమిత్యభిమానో లక్షణం చిహ్నమధిష్ఠాతుర్యస్య అహంకారాధిష్ఠానేన ద్రష్ట ృదృశ్యయోస్సన్నికర్షణాత్సంకర్షణ ఇత్యర్థః. 1

చూ॥ యస్యేదం క్షితిమండలం భగవతోఽనంతమూర్తేః సహస్రశిరస ఏకస్మిన్నేవ శీర్షణీధ్రియమాణం సిద్ధార్థ ఇవ లక్ష్యతే. 2

టీ:- అనంతత్వమాహ-యస్యేతి. యచ్ఛబ్దానాం స ఏష భగవాననంత ఇత్యుత్తరేణాన్వయః. 2

## 25వ అధ్యాయము

ఈ ఇరువది అయిదవ అధ్యాయమున పాతాళము కింద భాగమున కాలము తీరిన పిదప, శేషుని ఉనికిని లయమొనరించుటకు రుద్రుని ఉద్భవము తెలుపుచున్నాడు.

### శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

ఓ పరీక్షిద్రాజా! పాతాళ లోకమునకు కిందుగా పదివేల యోజనముల దూరమున అనంతుడు అను నామముతో ఖ్యాతినొందిన భగవంతుని తామసకళ కలదు. ఈ అనంతుణ్ణి సాత్వతతంత్ర నిష్ఠులు నాలుగు విధములగు ఉపాసనలతో సంకర్షణుడని తెలుపుదురు. దానికి కారణము నేను అను అభిమాన లక్షణ చిహ్నము. అహంకారా-ధిష్ఠానముతో చూచు వానిని చూడబడు దానిని సన్నికర్షణము (అనగా బాగుగా ఒకటి చేయుట)చే సంకర్షణుడు అనబడుచున్నాడు. 1

అనంతత్వమును తెలుపుచున్నాడు. భగవంతుడగు అనంతునకు వేయి శిరస్సులు కలవు. ఆ వేయి శిరస్సులలో ఒక శిరసున ఉంచబడిన ఈ భూమండలము ఆవగింజతో సమానముగా కనబడును. ఈ గద్యము లోని యచ్ఛబ్దములకు సఏవ భగవాననంత అను ఆరవ గద్యముతో అన్వయము. 2









చూ॥ యస్య హ వా ఇదం కాలేనోప సంజిహీర్షతోऽమర్ష విరచిత రుచిరభ్రమద్భ్రువోరంతరేణ సన్నికర్షణో నామ రుద్ర ఏకాదశవ్యూహ స్త్ర్యక్షస్త్రి శిఖం శూలముత్తంభయన్నుదతిష్ఠత. 3

టీ:- తామసత్వమాహ-యస్యే హేతి. యస్య హీదం విశ్వముప సంహర్తుమిచ్ఛతః. అమర్షేణ విరచితే కుటీలీకృతే అతఏవ రుచిరే మనోజ్ఞే భ్రమంతౌ భ్రువౌ తయోర్మధ్యే ఉత్తంభయనున్నమయన్. 3

తామసత్వమును తెలుపుచున్నాడు. ప్రళయకాలమున ఈ ప్రపంచమును ఉపసంహరించు ఇచ్ఛ, కోపముగలిగిన పరమాత్మ యొక్క కుటిలములైన, సుందరములగు కనుబొమ్మల మధ్య స్థానము నుండి సంకర్షణుడను రుద్రుడావిర్భవించును. ఈ రుద్రవ్యూహము ఏకాదశ సంఖ్యగల్గి మూడుకన్నులుకల్గి త్రిశూలమును ఎత్తిపట్టి యుండును. 3

చూ॥ యస్యాంఘ్రి కమల యుగళారుణ విశద నఖ మణిషండ మండ లేష్వహిపతయస్సహసాత్త్వత ఋషభైరేకాంత భక్తియోగేనావనమంతః స్వవదనాని పరిస్ఫురత్కుండలప్రభామండల మండిత గండస్థలాన్యతి మనోహరాణి ప్రముదితమనసః ఖలు విలోకయంతి. 4

టీ:- సుభగత్వమాహ-యస్యేతి. యస్యాంఘ్రికమల యుగళే. అరుణా విశదా నఖా ఏవ మణయః. తేషాం షండః సమూహః. తస్య మండలేషు పరిస్ఫురతాం కుండలానాం ప్రభయా మండితాని గండస్థలాని యేషు తాని. 4

సుందరత్వమును తెలుపుచున్నాడు. సంకర్షణుని యొక్క పదపద్మయుళమునందలి ఎఱ్ఱనగు, స్వచ్ఛమగు నఖములనెడు మణుల సమూహములయందు, తమ కర్ణాభరణకాంతుల సమూహముతో అలంకరించబడిన మిక్కిలి సుందరములగు కపోలములుగల నాగరాజులు ప్రధానమైన నాగులతో కలసి సంతోషపడిన మనస్సులతో చూచుచుందురు. (తమ శిరస్సులతో సంకర్షణుని పాదములకు నమస్క రించెదరు). 4


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ







చూ॥ యస్యైవ హి నాగరాజకుమార్య ఆశిష ఆశాసానాశ్చార్వంగద వలయ విలసిత విశద విపుల ధవళ సుభగ రుచిర భుజరాజత స్తంభేష్వగరు చందన కుంకుమ పం కానులేపనా వలింపమానా స్తదభిమర్శనోన్మథిత హృదయ మకర ధ్వజావేశ రుచిర లలిత స్మితాః –తదనురాగమద ముదితమద విఘూర్ణితారుణ కరుణావలోక నయన వదనారవిందం సవ్రీడం కిల విలోకయంతి. 5

టీ:– యస్యైవేతి. చారూణి అంగదవలయైః. విలసితాశ్చ తే విశదాశ్చ విపులాశ్చ ధవళాశ్చసుభగాశ్చ రుచిరాశ్చభుజా ఏవ రజతస్తంభాస్తేషు అగరు చందన కుంకుమానాం పంక ఏవానులేపః. తేనావలింపమానాః తేషామభిమర్శనేనోన్మథితే హృదయే మకరధ్వజస్యావేశేన రుచిరం చ లలితం చ స్మితం యాసాం తాః. తస్యానురాగేణ మదేన చ ముదితం చ తత్ మదేన విఘూర్ణితే ప్రచలితే ఈషదరుణే కరుణావలోకయుక్తే నయనే యస్మిన్ తద్వదనారవిందం విలోకయంతి. 5

అనేకమంది నాగరాజకన్యలు వివిధములగు కోరికలతో ఆ సంకర్షణుని సుందరమగు అంగద వలయములలో (శరీరభాగములు) ప్రకాశించు స్వచ్ఛమై, విశాలములైన తెల్లనైన, సుందర రుచిరములగు భుజములనెడి వెండి స్తంభములకు అగరు, చందన, కుంకుమ, పంకమును, అవలేపనము కావిస్తూ (పూయుచూ) ఆ సమయములో సంకర్షణుని అంగస్పర్శతో మథితమగు హృదయములందు మన్మథావేశము కలుగగా సుందర లలితములగు చిరునవ్వులతో ఆ నాగకన్యల అనురాగ మదముతో సంతసించి, మద విహ్వలమగు ఎఱ్ఱనగు దయావలోకనముగల ఆ సంకర్షణుని నయనారవిందము–లను లజ్జతో కూడినవారై కాంచుచుందురు. 5

చూ॥ స ఏవ భగవాననంతోऽనంత గుణార్ణవ ఆదిదేవ ఉపసంహృతా మర్షరోషవేగో లోకానాం స్వస్తయ ఆస్తే. 6

టీ:– స ఇతి. అమర్షః అసహనం రోషః క్రోధః ఉపసంహృతః తయోర్వేగో యేన. 6

ఆ భగవంతుడు అనంతగుణసముద్రుడు, ఆదిదేవుడగు ఆ అనంతుడే అసహన క్రోధావేశములను ఉపసంహరించి సమస్త లోకములకు శుభమొనరించుటకై ప్రకాశించుచుండును. 6










చూ॥ ధ్యాయమానస్సురాసురోరగ సిద్ధ గంధర్వ విద్యాధర ముని గణైరన వరతమదముదిత వికృత విహ్వాలలో చన స్సులలిత ముఖరితామృతేనా ప్యాయమానః- స్వపార్షద విబుధ యూథపతీ నపరిమ్లానరాగ నవ నిజ తులసి కామోదమధ్వాసవేన మాద్యన్మధుకర వ్రాత మధురగీతశ్రియం వైజయంతీం స్వాం వనమాలాం నీలవాసా ఏకకుండలోహల కకుది కృత సుభగ సుందర భుజో భగవాన్మహేంద్రో వారణేంద్ర ఇవ కాంచనీం కక్ష్యా ముదారలీలో బిభర్తి. 7

టీ:- ఉపాసనార్థమాహ-ధ్యాయమాన ఇతి. సురాదిభిర్ధ్యాయమానః చింత్యమానః అనవరతం మదేన ముదితాశ్చాసౌ వికృతవిహ్వాల లోచనశ్చ సులలితేన ముఖరితామృతేన వచనామృతేన స్వపార్షదాన్ బుధయూథపానాం పతీంశ్చ ఆప్యాయమానః హర్షయన్ నీలే వాససీ యస్య. ఏక మేవ కుండలం యస్య హలస్య కకుది పృష్ఠేకృతః న్యస్తః సుభగశ్చ సుందరశ్చ భుజో యేన ఉదారా లీలా యస్య సః. న పర్లిమానో రాగః కాంతిర్యస్యాః తస్యా నవతులసికాయాః ఆమోద మధ్వాసవేన సురభిమధురసేన మాద్యతాం మధుకరాణాం యే వ్రాతాః తేషాం మధురగీతే న శ్రీః యస్యాః తాం మాలాం కక్ష్యాం వరత్రాం. 7

ఉపాసనకొరకై తెలుపుచున్నాడు. దేవతలు,అసురులు, నాగులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, మునిగణములచేత ధ్యానించబడు, నిరంతరము ప్రేమోన్మాదముతో సంతసించి, చంచలములు, విహ్వాలములు అగు నేత్రములు కలిగిన సంకర్షణుడు సలలితమగు వాగమృతముతో తన సేవకులగు దేవసమూహములను సంతోషింప చేస్తూ, నీలాంబరధారియై, కర్ణమున ఒకే కుండలమును ధరించి, నాగలి ముప్పెపైన సుందరమగు భుజము నుంచి, (నాగలిపై చేయి నుంచి) ఇంద్రుని వాహనమగు ఐరావతము యొక్క గళమందలి బంగారు శృంఖలమువలె నున్నటువంటి, వాడని కాంతిగల నూతన తులసీగంధ (మధు) రసముతో మదించిన తుమ్మెద గుంపుల మధురములగు ఝుంకారముల శోభగల వైజయంతీమాలను (ఉదారలీలామయుడై) ధరించును. 7








చూ॥ య ఏష ఏవమనుశ్రుతోఽభి ధ్యాయమానో ముముక్షూణా మనాది కాలకర్మవాసనా గ్రథితమవిద్యామయం హృదయగ్రంథి సత్త్వ రజస్తమోమయమంతర్హృదయం గత ఆశు వినిర్భినత్తి- తస్యానుభావ మిమం భగవాన్ స్వాయంభువో నారదస్సహ తుంబురుణా సభాయాం బ్రహ్మణస్సంశ్లోక యామాస. 8

టీ:- య ఇతి. సంశ్లోకయామాస వర్ణయా మాస. 8

ఈ విధముగా భగవంతుడగు అనంతుడు, ముముక్షువులు తన మాహాత్మ్యమును ధ్యానించగా శ్రవణము చేస్తూ, వారి హృదయములలో ఆవిర్భవించి, అనాది కాలము నుండి కర్మ వాసనచే కలిగిన సత్వరజస్తమోమయమగు, అజ్ఞానమయమగు హృదయగ్రంథిని వెంటనే త్రుంచివేయును. ఆ అనంతుని మహద్గుణములను బ్రహ్మ పుత్రుడగు నారదభగవానుడు తుంబురునితో కలిసి బ్రహ్మదేవుని సభలో ఈ విధముగా వర్ణించుచుండెను. (తరువాతి శ్లోకముతో అన్వయము)8

శ్లో॥ ఉత్పత్తి స్థితి లయ హేతవోఽస్య
కల్యాస్సత్త్వాద్యాః ప్రకృతిగుణా యదీక్షయాసన్ ।
యద్రూపం ధ్రువమకృతం యదేకమాత్మన్
నానాధాత్కథముహవేద తస్య వర్త్మ ॥ 9

టీ:- ఉత్పత్తీతి. అస్య జగత ఉత్పత్త్యాది హేతవో గుణా యస్యేక్షయా. కలాః స్వస్వ కార్యసమర్థా ఆసన్ యస్య తు రూపం ధ్రువమనంతం అకృతం చ అనాది. తత్ర హేతుః యదేకమేవ సత్. ఆత్మన్ ఆత్మని నానాకార్యప్రపంచమధాత్. తస్య బ్రహ్మరూపస్య వర్త్మ తత్త్వం. జనః కథముహ వేద. న వేదైవేత్యర్థః. 9

ఏ సంకర్షణుని యొక్క దృష్టి మాత్రముననే ప్రపంచము యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణభూతములగు సత్త్వాది ప్రాకృతిక గుణములు, తమ తమ కార్యముల నొనరించుటకు సమర్థములగునో ఎవని యొక్క రూపము అనంతము, అనాదియైనదో ఎవడైతే ఒక్కడే నానా కార్యరూపమగు ప్రపంచమును ఆత్మలో ధరించునో అట్టి బ్రహ్మరూపుడగు సంకర్షణుని యొక్క తత్త్వమును ఎవరైనా ఎలా ఎరుగుదురు? తెలుసుకొనలేరనే భావము. 9









శ్లో॥ మూర్తిం నః పురుకృపయా బభార సత్త్వం
సంశుద్ధం సదసదిదం విభాతియత్ర ।
యల్లీలాలం మృగపతిరాదధేऽనవద్యా
మాదాతుం స్వజనమనాంస్యుదారవీర్యః ॥ 10

టీ:- తర్హి కథమసౌ ముముక్షుభిః సేవ్యతే? తత్రాహ-మూర్తిమితి. యత్రేదం సదసద్విభాతి. సః నోऽస్మాకం భక్తానాం కృపయా సంశుద్ధం సత్త్వం మూర్తిం బభార. స్వజనానాం మనాంస్యాదాతుం వశీకర్తుం. కృతాం యస్య లీలాం. మృగపతిః సింహః. ఆదధే అశిక్షత్ యతః ఉదారాణి వీర్యాణి యస్య. తస్మాదన్యం ముముక్షుః. కమాశ్రయేదిత్యుత్తరేణాన్వయః. యద్వా. కృపయే తత్ర హేతుః. యద్యస్మాత్. స్వజనానాం మనాంస్యాదాతుం లీలామాదదే. మృగపతిరివ ఉదారవీర్యః. యద్వా. మృగ్యంత ఇతి మృగాః కామప్రదాః. తేషాం పతిర్ముఖ్యః. 10

శ్లో॥ యన్నామశ్రుతమనుకీర్తయేదకస్మా
దార్తో వా యది పతితః ప్రలంభనాద్వా ।
హంత్యంహస్సపది నృణామశేషమన్యం
కం శేషాద్భగవత ఆశ్రయేన్ముముక్షుః ॥ 11

సంకర్షణుని తత్త్వమునెవరు తెలిసికొనని యెడల ఈ సంకర్షణుడు ముముక్షు జనులచే ఎటుల సేవించబడును? అనగా తెలుపుచున్నాడు. ఎవనియందైతే కార్యకారణరూపమగు సమస్త ప్రపంచము ప్రకాశించునో, ఎవడైతే తనవారి యొక్క మనస్సుల నాకర్షించుటకై ఉదారములగు వీరలీలలనొనర్చునో, ఏ లీలను పరాక్రమవంతమగు సింహము సైతం ఆదర్శముగా తలచి నేర్చుకొనునో అలాంటి ఉదారవీర్యుడగు సంకర్షణుడు మాపైన గొప్ప దయతో విశుద్ధమగు సత్త్వమయమగు స్వరూపమును ధరించినాడు. అట్టి సంకర్షణుని కంటే ముముక్షులు ఎవరినాశ్రయించెదరు? అని ఉత్తర శ్లోకముతో అన్వయము(మృగపతియగు సింహమువలె ఉదారవీర్యుడై స్వజనుల మనస్సుల నాకట్టుకొనుచు లీలనొనరించెను). మృగములనగా కామప్రదులు. వారికి పతి అనగా కోరికలీడేర్చు వారిలో శ్రేష్ఠుడు అని మృగపతి శబ్దమునకర్థము. 10

ఆ సంకర్షణుడు దయతో శరీరమును ధరించుట, అతని సేవ మొదలగునవి అటులుండనిమ్ము. అతని నామము యొక్క ఔదార్యము (మాహాత్మ్యము) అతి విచిత్రము అని తెలుపుచున్నాడు. పతితుడైనాగాని, మహాపాతకుడైనాగాని ఆ సంకర్షణుని నామమును అకస్మాత్తుగాకాని, ఆర్తితోగాని, పరిహాసమునకుగాని, ఉచ్చరించిననూ, లేదా విన్ననూ








టీ:- కించ ఆస్తాం తస్య కృపయా వపుర్ధారణం. తద్భజనం వా. తన్నామౌదార్యమేవాతి విచిత్రమేవేత్యాహ-యదితి. యస్య నామ. యది పతితః. మహాపాత కృపి. అనుకీర్తయేత్, తర్హి స శుద్ధ్యేదితి కిము వక్తవ్యం. యతోऽసావేన నృణామశేషమంహః సద్యోహంతి. కథమను కీర్తయేత్ అన్యతః శ్రుతం వా అకస్మాద్వా ఆర్తో వా సన్ ప్రలంభనాద్వా పరిహాసాత్. తస్మాచ్ఛేషాదన్యం. 11

ఆతని పాపములు హరించబడి, పరిశుద్ధుడగును. అందువలన ముముక్షులు ఆ సంకర్షణభగవానుని తప్ప, వేరెవరినీ ఆశ్రయించరు. (11)

శ్లో॥ మూర్ధన్యర్పితమణివత్సహస్ర మూర్ధ్నో
భూగోళం సగిరిసరిత్సముద్రసత్త్వం ॥
ఆనంత్యాదవిదిత విక్రమస్య భూమ్నః
కో వీర్యాణ్యపి గణయేత్సహస్ర జిహ్వః ॥ 12

టీ:- మూర్ధనీతి. గిర్యాదిసహితం భూగోళం. సత్త్వాని ప్రాణినః. సహస్ర జిహ్వోऽపి కో గణయేత్. 12

సహస్ర శిరస్సులుగల అనంత భగవానుడు, పర్వతములు, నదులు, సముద్రములు సమస్త ప్రాణులతో కూడిన సంపూర్ణ భూమండలమును తన ఒక శిరస్సుపైన మణివలె ధరించి ఉన్నాడు. అతడు అనంతుడగుటచే అతని పరాక్రమమునకు పరిమాణములేదు. అట్టి సర్వవ్యాపకుడు, భగవంతుడునగు అనంతుని యొక్క పరాక్రమములను వేయి జిహ్వలు గలవాడును గణించు సాహసమెలా చేయకలడు? అనగా వేయిజిహ్వలు కలవాడును అనంతుని పరాక్రమమును వర్ణించలేడని భావము. 12

శ్లో॥ ఏవం ప్రభావో భగవాననంతో
దురంతవీర్యోరుగుణానుభావః ।
మూలే రసాయాః స్థితః ఆత్మతంత్రో
యో లీలయా క్ష్మాం స్థితయే బిభర్తి ॥ 13

అనంతమగు పరాక్రమము అతిశయమగు గుణములు అవధిలేని ప్రభావముగల భగవంతుడగు అనంతుడు రసాతల మూలములో తన మహిమతో ఆత్మాధారుడై ఉండి, సంపూర్ణలోకముల స్థితికై తన లీలతో ఈ భూమండలమును భరించుచున్నాడు. 13












టీ:- ఏవ మితి. దురంతం వీర్యం బలం యస్య. ఉరవో గుణాః అనుభావశ్చ యస్య స చ రసాయాః భూమేర్మూలేః స్థితః తిష్ఠతి. ఆత్మతంత్రః ఆత్మాదారః. 13

చెప్పబడిన లోకముల విభాగపు ఉపయోగమును తెలుపుచు ఉపసంహరించుచున్నాడు.

**శ్రీ శుక ఉవాచ**

చూ॥ తా హ్యేవేహ నృభిరుపగంతవ్యాః గతయో యథాకర్మ వినిర్మితాః యథోపదేశ మనువర్ణితాః-కామాన్ కామయమానైరేతావతీర్హ్వి రాజన్ పుంసః ప్రవృత్తి లక్షణస్య ధర్మస్య విపాకగతయ ఉచ్ఛావచావిసదృశా యథా ప్రశ్నం వ్యాఖ్యాతాః-కిమన్యత్కథయామీతి. 14

టీ:- ఉక్తస్య లోక విభాగస్యోపయోగం వదన్ తదప్యుపసంహరతి- ఏతా ఇతి. ఏతా హ్యేవేహ కామాన్కామయమానైర్నృభిరుపగంతవ్యా ఇత్యన్వయః. తస్య ప్రపంచః ఏతావతీః ఏతా వత్యః. విపాకగతయః ఫలభూతా గతయః. వ్యాఖ్యాతాః వివృతాః. 14

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

ఓ పరీక్షిద్రాజా! భోగములకోరు పురుషులకు వారి కర్మలను అనుసరించి ప్రాప్తించు గతులు ఇవియే. నేను వినియున్నంతవరకు వర్ణించితిని. మానవుల యొక్క ప్రవృత్తిరూప ధర్మఫలభూతములగు పరస్పర విలక్షణములగు ఉచ్ఛ, నీచగతులు ఇవే . నీ ప్రశ్ననుసరించి వీటిని తెలిపితిని! ఇంకా ఏమి తెలుపవలయును. 14

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే, పంచవింశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు ఇరువది ఐదవ అధ్యాయము సమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ









## షడ్వింశోऽధ్యాయః

శ్లో॥ షడ్వింశే తు తతోऽధస్తాన్నరకస్థితిరుచ్యతే ।
పాపినో యత్ర దహ్యంతే యమదూతైర్యథా యథమ్ ॥

## 26వ అధ్యాయము

ఈ ఇరువది ఆరవ అధ్యాయమున పాపమొనరించిన వారు వారి పాపములననుసరించి ఎక్కడైతే యమదూతలతో శిక్షించబడుదురో అట్టి నరకస్థితి తెలుపబడుచున్నది. పురుషులకు పరస్పర విలక్షణము లగు ఉచ్ఛ, నీచ గతులు అని భోగముల విచిత్ర స్థితిని తెలిపితిరి. అదెట్లు? అని పరీక్షిత్తు అడుగుచున్నాడు.

**రాజోవాచ**

చూ॥ మహర్ష ఏతద్వైచిత్ర్యం లోకస్య వయమనుమీమహీతి. 1

టీ:- పుంసో గతయ ఉచ్చావచా విసదృశా ఇతి భోగవైచిత్ర్యముక్తం. తదేతత్కుత ఇతి పృచ్ఛతి-మహర్ష ఇతి. 1

**పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.**

ఓ శుకమహర్షీ! లోకులకు ఉచ్ఛ, నీచ గతులు కలుగగలవని తెలిపితిరి. గతులలో ఈ వైచిత్ర్యమును మేముటుల తెలియగలము? 1

**శ్రీ శుక ఉవాచ**

చూ॥ త్రిగుణత్వాత్కర్తుః శ్రద్ధాయాః కర్మగతయః పృథగ్విధాస్సర్వా ఏవ సర్వస్య తారతమ్యేన భవంతి. 2

టీ:- కర్మణః సమానత్వేऽసి శ్రద్ధావైచిత్ర్యాత్ఫల వైచిత్ర్యమితి పరిహరతి -త్రిగుణత్వాదితి. సాత్త్వికాా శ్రద్ధయా కర్తుః సుఖిత్వం.

**శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.**

కర్మలు సమానములే అయినను శ్రద్ధలోని తారతమ్యములతో, ఫలములలో కూడా తారతమ్యము కల్గునని పై సందేహమును పరిహరిస్తున్నాడు. ఓ పరీక్షిద్రాజా! కర్మల నాచరించెడి పురుషులు సాత్విక, రాజస, తామస ప్రవృత్తులు కలవారై ఉండటముచే వారి కర్మలో, శ్రద్ధలో భేదమేర్పడును. సాత్వికమగు శ్రద్ధతో కర్మనాచరించు కర్తకు








రాజస్యా అసుఖిత్వం దుఃఖిత్వం చ తామస్యాదుఃఖిత్వం చ. తత్రాపి తాసాం శ్రద్ధానాం తారతమ్యాత్ సుఖాదితారతమ్యం సర్వేషామిత్యర్థః (2)

సుఖత్వము, రాజసమగు శ్రద్ధతో కర్మనాచరించు కర్తకు సుఖరాహిత్యము వలన దుఃఖత్వము. తామసమగు శ్రద్ధతో కర్మనాచరించు కర్తకు దుః ఖత్వము కల్గును. ఈ విధముగా స్వభావము (ప్రకృతి) శ్రద్ధాభేదముతో సుఖాది ఫలతారతమ్యము (భేదము) అందరకు సంభవించును. 2

చూ॥ అథేదానీం ప్రతిషిద్ధ లక్షణస్యాధర్మస్య కర్తుశ్శ్రద్ధాయా వై సాదృశ్యాత్కర్మఫలం విసదృశం భవతి–అనద్యావిద్యాకామానాం తత్పరిణామలక్షణాస్సృతయః సహస్రశః ప్రవృత్తాస్తాః ప్రాచుర్యేణా సువర్ణయిష్యామః. 3

టీ:– అథేతి. ప్రతిషిద్ధం ప్రతిషేధః స ఏవ లక్షణం ప్రమాణం యస్యా ధర్మస్య. కర్తుః. శ్రద్ధా వై సాదృశ్యం తమసస్తారతమ్యాత్ తత్రాపి కారణందర్శయన్నాహ – అనాద్యవిద్యాకృతా నాం కామానాం. సృతయో నరకాః తాః. అనంతాః. అథేదానీం తాః ప్రాచుర్యేణానువర్ణయిష్యామ ఇత్యన్వయః. 3

నిషేధమే లక్షణముగాగల అధర్మమునాచరించెడి కర్తకు శ్రద్ధా భేదముతో కర్మఫలభేదమును చూపుచూ తెలుపుచున్నాడు. నిషేధమే లక్షణము గాగల అధర్మమునాచరించెడి కర్త యొక్క శ్రద్ధాభేదముచే కర్మఫలము భిన్నముగానే కలుగును. అనాది నుండి ఉన్న అజ్ఞానవశుడై కామనతో చేసిన నిషిద్ధ కర్మ ఫలరూపముగా కలిగెడు వేలకొద్ది నరకములు ప్రవృత్తములైయున్నవి. ఇప్పుడు వాటిని విస్తారముగా వర్ణించెదను. 3

**రాజోవాచ**

శ్లో॥ నరకానామ భగవన్ కిం దేశ విశేషాః? అథవా బహిస్త్రిలోక్యాః 'అహోస్విదంతరాళే? ఇతి'? 4

**పరీక్షిద్రాజు ఈ విధముగా పలికెను.**

ఓ శుకదేవా! నరకములనునవి ఈ భూమండలములోని దేశ విశేషములా? త్రిలోకమున కంటే బయటివా?, బ్రహ్మాండమున కంటే
















టీ:- నరకా ఇతి. కిం భూమావేవ దేశవిశేషాః? త్రిలోక్యాః బ్రహ్మాండాద్బహిర్వా? ఆవరణేషు మధ్యే అంతరాళే వా భూమివ్యతిరిక్తే? 4

బయటివా? లేక భూవ్యతిరిక్త ఆవరణ మధ్యలోని అంతరాళములోనివా? (అని ప్రశ్నించెను). 4

**ఋషి రువాచ**

చూ॥ అంతరాళ ఏవ త్రిజగత్యాస్తు దిశిదక్షిణస్యామధస్తాద్భూ మేరు పరిష్టాదండజలాశయస్య-యస్యామగ్నిష్వాత్తాదయః పితృగణాః -స్వానాం గోత్రాణాం పరమేణ సమాధినా సత్యా ఏవాశిష ఆశాసానా నివసంతి యత్ర హ భగవాన్ పితృరాజో వైవస్వతః. స్వవిషయం ప్రాపితేషు స్వపురుషైర్జంతుషు సంపరేతేషు-యథా కర్మావద్యమేవాను ల్లంఘితభగవచ్ఛాసనః సగణో దమం ధారయతి. 5

**ఋషి ఈ విధముగా పలికెను.**

ఓ పరీక్షిద్రాజా! ఈ నరకములు త్రిలోకములోనే అంతరాళములో దక్షిణదిశలో భూమి క్రింద భాగమున జలమునకు పై భాగమున కలవు. ఈ దక్షిణ దిక్కులోనే అగ్నిష్వాత్తాది పితృగణములు మిక్కిలి ఏకాగ్రతతో తమ గోత్రములలో జన్మించిన వారికి ఆశీస్సులను కోరుతూ నివసించెదరు. ఇచటనే సూర్య పుత్రుడు భగవంతుడగు యమధర్మరాజు భగవంతుని ఆజ్ఞను ఉల్లంఘించకుండా తన దూతలచే తన సమీపమునకు తేబడిన మృతజీవులకు వారి వారి దుష్కర్మల ననుసరించి పాప ఫలములను అనుభవింపజేసి దండించుచుండును. 5

చూ॥ తత్ర హైకే నరకానేకవింశతిం ప్రాహుః-అథతాంస్తే రాజన్నామ రూప లక్షణతోऽనుక్రమిష్యామః తామిస్రోऽంధతామిస్రో రౌరవో మహారౌరవః కుంభీపాకః కాలసూత్రమసిపత్రవనం సూకరముఖ మంధ కూపః క్రిమిభోజనస్సందంశ స్తప్తోర్మిర్వజ్రకంటక శ్శాల్మలిర్వైతరణీ పూయోదః ప్రాణరోధో విశసనం లాలాభక్షస్సారమేయాదనమవీచిరయో రేతః పానమితి. 6

ఓ పరీక్షిద్రాజా! కొంతమంది ఈ నరకములు ఇరువది ఒకటని తెలిపిరి. ఇప్పుడు ఆ నరకముల పేర్లు, లక్షణములు తెలిపెదను. ఆ నరకముల పేర్లు 1.తామిస్రము 2.అంధతామిస్రము 3.రౌరవము 4.మహారౌరవము 5.కుంభీపాకము 6.కాలసూత్రము 7.అసిపత్ర వనము 8.సూకరముఖము 9.అంధకూపము 10.క్రిమిభోజనము 11.సందంశము 12.తప్తోర్మి 13.వజ్రకంటకశాల్మలీ 14.వైతరిణీ




టీ:- అంతరాళఇతి. కర్మదోషమనతిక్రమ్యైవదమం పాపఫలం. ధారయతి దండం కరోతీత్యర్థః.న ఉల్లంఘితం భగవచ్ఛాసనం యేన.(5-6)

చూ॥ కించ క్షారకర్దమో రక్షోగణ భోజనశ్శూలప్రోతో దందశూకో వటనిరోధనో పర్యావర్తనస్సూచీముఖమిత్యష్టావింశతి నరకా వివిధ యాతనా భూమయః. 7

టీ:- మతాంతరేణాష్టావింశతిమాహ - కించేతి. 7

చూ॥ యస్త్విహ పరవిత్తాపత్య కళత్రాణ్యపహరతి. స హి కాలపాశ బద్ధోऽయమ పురుషైరతిభయానకైస్తామిస్ర నరకే. బలాన్నిపాత్యతే- అనశనాద్రి పాతనలగుడతాడన సంతర్జనాదిభిర్యాతనాభిర్యాత్యమానో జంతుర్యత్ర కశ్మలమాసాదిత ఏకదైవ మూర్ఛాముపయాతి తమిస్ర ప్రాయే. 8

టీ:- పాపభేదేన తత్తన్నరకయాతనా భేదం ప్రపంచయతి - యస్త్వితి. తమిస్రప్రాయే నరకే. యాత్యమానః పీడ్యమానః ఏకదైవ తదైవ. 8

15.పూయోదము 16.ప్రాణరోధము 17.విశసనము 18.లాలాభక్షణము 19.సారమేయాదనము 20.అవీచీ. 21.అయోరేతఃపానము అనునవి. 6

వేరేవారి మతమున ఇరువది ఎనిమిది నరకములను తెలుపుచున్నాడు. పై ఇరువది ఒక్కటే కాకుండ 1.క్షార కర్దమము 2.రక్షోగణ భోజనము 3.శూలప్రోతము 4.దందశూకము 5.అవటనిరోధము 6.పర్యావర్తనం 7.సూచీముఖము అనునవి ఏడు నరకములు కలిసి మొత్తము ఇరువది ఎనిమిది నరకములు. ఇవన్నీ అనేక రకములగు యాతనములను అనుభవించు స్థానములు. 7

పాపభేదముతో ఆ యా నరకముల యాతనా భేదమును తెలుపుచున్నాడు. ఏ పురుషుడైతే ఈ లోకమున ఇతరుల ధనమును, సంతానమును, కళత్రములను, అపహరించునో ఆ పురుషుడు మిక్కిలి భయంకరులగు యమకింకరులచే కాలపాశముతో బంధించబడి బలవంతముగా తామిస్ర నరకములో పడవేయబడును. ఆ చీకటిగల నరకములో ఆ పురుషుడు ఆహారమివ్వబడక, పర్వతములనుండి పడవేయబడి, దండములతో కొట్టబడి, భయపెట్టబడి అనేక విధములుగా బాధితుడగును. బాధతో దుఃఖితుడై వెంటనే మూర్ఛనొందును. 8





చూ॥ ఏవమేవాంధతామిస్రే యస్తు వంచయిత్వా పురుషం దారాను పభుంక్తే–యత్ర శరీరీ వినిపాత్యమానో యాతనావస్థో వేదనయా నష్ట స్మృతిర్నష్టదృష్టిశ్చ భవతి–యథా హి వనస్పతిర్వృశ్చ్యమానమూలః– తస్మాదంధతామిస్రం తముపదిశంతి. 9

టీ:- ఏవమితి. పురుషం పతిం వంచయిత్వా. 9

చూ॥ యస్త్విహ వా ఏతదహమితి మమేదమితి భూతద్రోహేణ కేవలం స్వకుటుంబమేవానుదినం పుష్ణాతి–స తదిహ విహాయ స్వయమేవ తదశుభేన రౌరవే నిపతతి–యే చేహ యథైవామునా విహింసితా జంతవః పరత్ర యమయాతన ఉపగతవంత ఏవ రురవో భూత్వా తథా తమేవ విహింసంతి–తస్మాద్రౌరవమిత్యాహుః రురితి సర్పాదతి క్రూరసత్త్వాపదేశః. 10

టీ:- యస్త్వితి. ఏతచ్ఛరీరమహమితి. ఇదం ధనాది మమేతి. మత్వా. స్వం చ కుటుంబమేవ పుష్ణాతి. తేనాశుభేన. రురవో భూత్వేతి. కర్మాణ్యేవ తథా పరిణామం ప్రాప్యేత్యర్థః. అతి క్రూరస్య భారశృంగాఖ్యస్య సత్త్వస్యాపదేశః. సంజ్ఞా యస్య సః. 10

ఎవరైతే పురుషుణ్ణి (భర్తను) మోసగించి, అతని భార్యాదులను అనుభవించునో అతడు అంధతామిస్రమను నరకమున పడును. ఆ అంధతామిస్రమున యాతనావస్థల దుఃఖముతో స్మృతి నశించినవాడై అంధుడగును. మూలము నరకబడిన చెట్టువలె వేదనలతో చంపబడి ఏమియూ తెలియకుండును. అందువలన దీనిని అంధతామిస్రమని చెప్పుదురు. 9

ఏ పురుషుడైతే ఈ శరీరమే నేనని, ఈ స్త్రీ ధనాదులు నావని తలంచి, ఇతర ప్రాణులకు ద్రోహమొనరించుచూ, నిత్యము కేవలము తన కుటుంబమునే పోషించునో వాడు ఆ శరీరమును, స్త్రీ, ధనాదులను ఇచ్చటనే వదిలి తానాచరించిన అశుభ కర్మతో స్వయముగా రౌరవ నరకములో పడును. ఈ లోకములో ఏ ప్రాణులకు ఎలాంటి హింస నొనరించినాడో ఆ నరకమున ఆ ప్రాణులు రురు రూపముతో అలాంటి హింసతోనే బాధించెదరు. అందువలననే ఈ నరకమును రౌరవమను పేరు కలిగెను. రురు అనునది సర్పమునకంటే మిక్కిలి క్రూరమైన భారశృంగమను ప్రాణి. అతడాచరించిన కర్మలే రురు రూపముగా పరిణామమొంది బాధించునని భావము. 10








చూ॥ ఏవమేవ మహారౌరవః యత్ర నిపతితం పురుషం క్రవ్యాదా రురవస్తత్క్రవ్యేణ ఖాదయంతి–యః కేవలం హి దేహం భరః. 11

టీ:– ఏవమితి. క్రవ్యేణ నిమిత్తేన. మాంసార్థమిత్యర్థః. 11

చూ॥ యస్త్విహ వా ఉగ్రః పశూన్ పక్షిణో వా ప్రాణభృత ఉపరుంధయతి తమపకరుణం పురుషాదైరపి గర్హితమముత్ర యమానుచరాః కుంభీపాకే తప్తతైల ఉపరుంధయంతి. 12

టీ:– యస్త్వితి. ప్రాణభృతస్సజీవాన్. ఉపరుంధ యంతి. పచంతి. అపకరుణం నిష్కృపం. 12

చూ॥ యస్త్విహ మాతృ పితృ బ్రహ్మద్రుక్సకాలసూత్రసంజ్ఞికే నరకే – అయుత యోజన పరిమండలే తామ్రమయేఽఖిలే ఉపర్యధస్తాదగ్న్యర్కాభ్యామభితప్యమానే – అభినివేశితః క్షుత్పిపాసాభ్యాం దహ్యమానాంతర్బహిశ్శరీర ఆస్తే శేతేఽవతిష్ఠతే పరిధావతి యాచతే చ యావంతి పశురోమాణితావద్వర్ష సహస్రాణి. 13

టీ:– యస్త్వితి. సోఽఖిలే సమస్తదేశే. 13

ఈ విధమైనదే మహారౌరవ నరకము. ఎవరిని లెక్కించక తన దేహమును మాత్రమే పోషించుకొని ఈ నరకమున పడిన పురుషుని క్రవ్యాదములు (పచ్చిమాంసమును భక్షించెడివి) అను రురువులు మాంసలోభముతో బాధించును. 11

ఈ లోకమున ఎవడైతే క్రూరుడై తన కడుపు నింపు కోవడము –నకై ప్రాణముతోనున్న పశు, పక్షులను చంపి పచనము చేయుదురో అట్టి దయాహీనుణ్ణి రాక్షసులుచేత గూడా గర్హించబడువాణ్ణి, యమదూతలు కుంభీపాక నరకమునకు గొనిపోయి సలసలామసలెడి నూనెలో పచనము చేయుదురు. 12

ఈ మానవుడైతే ఈ లోకమున తల్లి తండ్రులకు, బ్రాహ్మణులకు ద్రోహమొనరించునో వాణ్ణి కాలసూత్రమను నరకమునకు తీసుక వెళ్ళెదరు. ఈ కాలసూత్ర నరకము పదివేల యోజనముల విస్తారము కల్గియుండును. పైన సూర్యుడు, క్రింద అగ్నులు దహించుచుండును. అందులో ఆ మానవుడు పడవేయబడినవాడై ఆకలిదప్పికలతో వ్యాకులుడై దహించబడు లోపలి, బయటి (అంతర్బహిశ్శరీరము) శరీరముకలవాడై వ్యాకులతతో ఒక్కోసారి కూర్చుండును, పరుండును,







నిలబడును, పరుగెత్తును, యాచించును. ఈ విధముగ ఆ పశు శరీరమున ఎన్ని రోమములుండునో అన్ని వేల సంవత్సరములు బాధ నొందును. 13

శ్లో॥ యస్త్విహ వై నిజవేదపథా దనాపద్యగతః పాషండం వోపగత స్తమసి పత్రవనం ప్రవేశ్య కశయా ప్రహరంతి – తత్ర తత్రాసాది తస్త తస్తతో ధావమాన ఉభయతో ధారైస్తాళ వనాసిపత్రైశ్ఛిద్యమానస్వర్వాం గోహా హతో2స్మీతి పరమయా వేదనయా మూర్ఛితః పదే పదే నిపతతి–స్వధర్మహా పాషండానుగతః ఫలం భుంక్తే. 14

టీ:– యస్త్వితి. స్వధర్మహా స్వధర్మత్యాగీ. 14

ఏ మానవుడైతే ఎలాంటి ఆపత్తిలేకున్నను తన వైదిక మార్గమును వదిలి వేరే పాషండధర్మములనవలంభించునో ఆ మానవుని అసిపత్రవనమను నరకమున ప్రవేశపెట్టి కొరడాలతో కొట్టుచుందురు. ఆ అసిపత్రవనమున దెబ్బలకు తాళలేక అటునిటు పరుగెత్తుచు రెండువైపుల పదునుగల తాటి (అసి) పత్రములతో ఛేదించబడిన సర్వాంగములు కల్గినవాడై అయ్యో! చంపబడితిని! అని గొప్ప బాధతో మూర్ఛితుడై మాటిమాటికి పడిపోవుచుండును. ఈ విధంగా స్వధర్మమును వదిలి పాషండ ధర్మముననుసరించిన ఫలితమను–భవించును. 14

చూ॥ యస్త్విహ వైరాజా రాజపురుషో వా–అదండ్యే దండం ప్రణయతి– బ్రాహ్మణే వా శరీరదండం స పాపీయాన్నర కే<sup></sup>Sముత్ర సూకర ముఖే నిపతతి తత్రాతి బలైర్వినిష్పిష్యమాణావయవో యథైవేహేక్షుదండ ఆర్తస్వరేణ స్వనయన్ క్వచిన్మూర్ఛితః కశ్మలముపగతో యథైవేహేహా దృష్టదోషా ఉపరుద్ధా. 15

ఈ లోకములో ఏ రాజుగాని, రాజసేవకుడుగాని నిరపరాధిని దండించునో, బ్రాహ్మణునకు శారీరక దండనము విధించునో అలాంటి మహాపాపవంతుడు పరలోకమున సూకరముఖమను నరకమున పడును. చెరుకురసము తీయు యంత్రములోని చెరుకుగడవలె ఆ నరకమున గొప్పబలవంతులగువారిచే అవయవములు పిండబడగా



టీ:- యస్త్వితి. స్వనయన్ రుదన్ కశ్మలం మోహం. ఉపగతో భవతి. అదృష్టదోషాస్తేనోపరుద్ధాస్సంతో యథాకశ్మలముపగతాః తద్వత్. 15

ఆర్తస్వరముతో ఏడ్చుచూ, నిరపరాధులు ఆతనితో ఎలా దండించబడి మూర్ఛనొందిరో అలా మూర్ఛ నొందును. 15

చూ॥ యస్త్విహ సర్వభూతానామీశ్వరోపకల్పిత వృత్తీనామ వివిక్త పరవ్యథానాం స్వయం పురుషోపకల్పిత వృత్తిర్వివిక్తం పర్యవ్యథో వ్యథామాచరతి-స చాముత్రాంధకూపే తదభిద్రోహేణ నిపతతి తత్ర హాసౌ తైస్తైర్జంతుభిః పశుపక్షిభిస్సరీసృపైర్మశక యూకమత్కుణ మక్షి కాదిభిర్యే కేచనేహాభి ద్రుగ్ధా స్తైస్సర్వతోऽభిద్రుహ్యమాణస్తమసి విహత నిద్రా నిర్వృతి రలబ్ధావస్థానః పరిక్రామతి-యథా కుశరీరే జీవః. 16

ఈశ్వరుడు ప్రతి జీవికి విడి విడిగా వృత్తులు కల్పించినాడు. నల్లులు, దోమలు మొదలైన జీవులకు మనుష్య రక్తపానుదులే వృత్తులు. అవి తమ వృత్తిని నిర్వహించేటపుడు, ఇతరులకు కలిగే బాధను గ్రహించలేవు. బ్రాహ్మణాది భావముతో విధి, నిషేధ పూర్వకముగా కల్పించబడిన వృత్తి కలిగి, ఇతరుల వ్యధను తెలిసికొనగలిగినవాడై యుండిగూడా పైన తెలిపిన జీవరాశికి కష్టము కల్గజేయు మానవుడు అంధకూపమను నరకమున పడును. ఈ అంధకూపమున అతడు తనచే హింసించబడిన పశు, పక్షి, సరీసృప, మశక, యూక, మత్కుణ, మక్షికాదులగు వివిధ ప్రాణులచే అన్ని దిక్కుల నుండి హింసించబడుచు నిద్రావిహీనుడై, అశాంతితో, తమస్సుతో, దుష్టమగు శరీరమున జీవుని వలె పరిభ్రమించుచుండును. 16

టీ:- యస్త్వితి. ఈశ్వరేణోపకల్పితా మనుష్య రక్తపానాది లక్షణావృత్తి ర్యేషాం మత్కుణాదీనాం అవివిక్తా అవిజ్ఞాతా పరవ్యథా యైః. అవివేకి భిస్తేషాం పురుషేణ బ్రాహ్మణాదిభావేన విధినిషేధ పూర్వక ముపకల్పితా వృత్తిర్యస్య. వివిక్తా. పరవ్యథా యేన వివేకినా. అభిద్రుగ్ధాః హింసితాః విహతా నిద్రారూపా నిర్వృతిర్యస్య. న లబ్ధమవస్థానం యేన. స తమసి పరిక్రామతీతి. 16

చూ॥ యస్త్విహ వా అసంవిభజ్యాశ్నాతి యత్కించనోపనతమ నిర్మిత పంచయజ్ఞో వా యస్తైస్సంస్తుతస్స పరత్ర క్రిమిభోజనే నరకాధమే

ఈ లోకమున ఏ పురుషుడు భిక్షాదులతో లభించిన దానిని వేరెవరికీ, విభజించి ఇవ్వక మొత్తమును తానే భుజించునో, పంచమహా





నిపతతి-తత్ర శత సహస్రయోజనే క్రిమికుండే క్రిమిభూత స్స్వయం క్రిమిభిరేవ భక్ష్యమాణః క్రిమిభోజనో యావత్తదప్రత్తా ప్రహుతా దోననిర్వేశమాత్మానం యాతయతే. 17

టీ:- యస్త్వితి. కించ న భిక్షాదికం ఉపనతం ప్రాప్తం. తదసంవిభజ్య న నిర్మితాః పంచయజ్ఞాయేన, అత ఏవ వాయసైస్సంస్తుతః సమత్వేన వర్ణితః క్రిమిభోజనః క్రిమీనేవ భుంజానః. యావత్త్రత యావంతి యోజనాని తత్క్రిమికుండం తావంతి వర్షాణి యావద్వా తత్పాపమిత్యర్థః. అప్రత్తమసంవిభక్తం. అప్రహుతం చాత్తీతి తథా సః న నిర్వేశం అకృత ప్రాయశ్చిత్తం. 17

యజ్ఞములనాచరించక భుజించునో, వాడు కాకులతో సమానుడుగా తెలుపబడినాడు. అలాంటివాడు పరలోకమున క్రిమిభోజనమను నికృష్ట నరకములో పడును. అచట ఒక లక్షయోజనముల విస్తీర్ణముకల క్రిమి కుండములో(హ్రదములో) పురుగై(క్రిమియై) పురుగులతో భుజించ -బడుచూ, తానును పురుగులను భుజించుచూ ఆ క్రిమికుండము ఎన్ని యోజనములు కలదో అన్ని సంవత్సరములు (లక్షవర్షములు) లేక తన పాపములకు ప్రాయశ్చిత్తమొనరించుకొనునంతవరకు యాతనలననుభవించుచుండును. ఎవ్వరికీ ఇవ్వకుండా, హవనము చేయక భుజించినదాని ఫలముననుభవించును. 17

చూ॥ యస్త్విహ వైస్తేయేన బలద్వా హిరణ్య రత్నాదీని బ్రాహ్మణస్య వాపహరతి అన్యస్య వానాపది పురుషస్తమముత్రరాజన్ యమపురుషా అయస్మయైరగ్ని పిండైస్సందంశైస్త్వచి నిష్కుషంతి. 18

టీ:- యస్త్వితి. నిష్కుషంతి ఛిదంతి. 18

ఓ పరీక్షిద్రాజా! ఈ లోకమున ఏ వ్యక్తి దొంగతనముతోగాని. బలవంతముగాగాని బ్రాహ్మణుల యొక్క బంగారము, రత్నాదులను హరించునో, ఏ ఆపత్తి లేనప్పటికీ ఇతరుల సువర్ణ, రత్నాదులను హరించునో, ఆతని చర్మమును పరలోకమున యమదూతలు సందంశమను నరకమున అయోవికారమగు అగ్నిగోళములతో ఛేదించెదరు. 18










చూ॥ యస్త్విహ వా అగమ్యాం స్త్రియమగమ్యం వా పురుషం యోషిదభిగచ్ఛతి–తావదముత్ర కశయా తాడయంత స్తర్జయంతస్తిగ్మయా సూర్మ్యా లోహమయ్యా పురుషమాలింగయంతి స్త్రియం చ పురుష రూపయా సూర్మ్యా. 19

టీ:– యస్త్వితి. తిగ్మయా తప్తయా సూర్మ్యా ప్రతిమయా. 19

ఈ లోకమున అగమ్యయగు స్త్రీని పొందిన పురుషుడు, అగమ్యుడగు పురుషుని పొందిన స్త్రీ, పరలోకమున యమదూతలు కొరడాలతో కొడుతు భయపెట్టుచూ, తప్తోర్మి అను నరకమున వేడెక్కించబడిన లోహపు స్త్రీ ప్రతిమచే పురుషులను, వేడెక్కించబడిన లోహపు పురుష ప్రతిమతో స్త్రీలను ఆలింగింప చేయుదురు. 19

చూ॥ యస్త్విహ వైసర్వాభిగమస్తమముత్ర నిరయే వర్తమానం వజ్రకంటకశాల్మలిమారోప్య నిష్కర్షంతి. 20

టీ:– యస్త్వితి. సర్వాంభిగమః పశ్వాద్యుపగంతా. 20

ఈ లోకమున ఎవరైతే పశ్వాదులతో రమించునో అతణ్ణి పరలోకమున వజ్రకంటకశాల్మలీ అను నరకమున వజ్రము లాంటి ముళ్ళుగల శాల్మలీ వృక్షము నెక్కించి పైకి, క్రిందికీ లాగుదురు. 20

చూ॥ యే త్విహ వా రాజ్యనో రాజపురుషా అపాషండా ధర్మసేతూను ద్భిందంతి. తే సంపరేత్య వైతరణ్యాం నివతంతి భిన్నమర్యాదాస్తస్యాం నిరయపరిఘాభూతాయాం నద్యాం యాదోగణైరితస్తతో భక్ష్యమాణా ఆత్మనా న వియుజ్యమానైశ్చాసుభిరూహ్యమానాస్స్వాఘేన కర్మవిపాక మనుస్మరంతో విణ్మూత్ర పూయ శోణిత కేశ నఖాస్థి మేదో మాంసవసా వాహిన్యాముపతప్యంతే. 21

ఈ లోకమున ఏ రాజులుగాని, రాజపురుషులుగాని సత్కులీనులై ఉండి గూడా ధర్మమర్యాద నతిక్రమించెదరో వారు మృతి నొంది వైతరణి అనునదిలో పడుదురు. ఈ నది నరకముల అగడ్త లాంటిది, మలము, మూత్రము, చీము, నెత్తురు, వెంట్రుకలు, నఖములు, బొక్కలు, మేదము, మాంసము, మజ్జ మొదలగు దుర్గంధభూయిష్టమైన వాటితో ప్రవహించును. ఈ వైతరణీ నదియందు జలచరములచే అటునిటు చీల్చుకొని భక్షించబడుచు తన పాపకర్మలతో








టీ:- య ఇతి. అపాషండాః సత్కులీనాస్సంతః ద్వితీయాంతపాఠే సేతువిశేషణం. నదీం విశినష్టి - విణ్ మూత్రేతి. 21

శరీరమును వదలక ప్రాణములతోనే ఉండి (అనగా జలచరములతో చీల్చబడినను ప్రాణములను వదలక) ఈ దుర్గతికి తానొనరించిన కర్మలే కారణమని తలంచుచు (ఈ దుర్గతి తాను తెచ్చుకొన్నదే అని తలంచుచు) తాపము నొందుచుండును. 21

చూ॥ యే త్విహ వై వృషలీ పతయో నష్టశౌచాచార నియమాస్త్యక్త లజ్జాః పశుచర్యాం చరంతి-తే పాపినః ప్రేత్య పూయ విణ్మూత్ర శ్లేష్మ లాలాపూర్ణార్ణవే నిపతంతి. త దేవాతిబీభత్సితమశ్నంతి. 22

టీ:- యే త్వితి. పశుచర్యాం స్వేచ్ఛాచారం. 22

ఈ లోకమున ఎవరైతే శౌచ, ఆచార, నియమములను, లజ్జను వదిలి (సిగ్గులేక) శూద్రులతో సంబంధముచేసి పశువువలె చరించెదరో, స్వేచ్ఛగా తిరిగెదరో, వారు మృతినొంది చీము, మలము, మూత్రము, కఫము (తెమడ) ఉమ్మిలతోనిండిన సముద్రములాంటి పూయోదమనే నరకములో పడుదురు. 22

చూ॥ యే త్విహ వై శ్వ గర్దభ పతయో బ్రాహ్మణాదయో మృగయా విహారాః అతీర్థే చ మృగాన్నిఘ్నంతి-తానపి సంపరేతాన్ లక్ష్యభూతాన్ యమపురుషా ఇషుభిర్విధ్యంతి. 23

టీ:- యేత్వితి. అతీర్థే విహితా దన్యత్ర. విధ్యంతీతి ప్రాణ నిరోధో దర్శితః. 23

ఈ లోకములో బ్రాహ్మణాది ఉచ్చవర్ణ జనులు ఎవరైతే కుక్కలను, గాడిదలను పెంచుదురో, వేటలో విహరించుచూ శాస్త్ర నిషిద్ధములగు పశువులను చంపుదురో (శాస్త్ర నిషిద్ధ పశువధతో ప్రాణ నిరోధము చూపబడినది) వారు చనిపోయిన పిదప, వారిని యమదూతలు ప్రాణనిరోధమను నరకమున పడవేసి బాణములతో కొట్టుదురు. 23








చూ|| యే త్విహ వై దాంభికా దంభయజ్ఞేషు పశూన్ విశసంతి-తానముష్మిన్ లోకే వైశసే నరకే నిపతితాన్నిరయ పతయో మారయిత్వా విశసంతి. 24

టీ:- యే త్వితి. నిరయపతయో యమపురుషాః. 24

ఈ లోకమున ఆడంబరవంతులై ఎవరు, (పాఖండులు) ఆడంబరముతో చేయబడు యజ్ఞములలో పశువులను బలి యొసంగుదురో వారు పరలోకమున విశసనమను నరకమున పడి యమదూతలచే చంపబడి బలియొసంగబడెదరు.(బాధించబడెదరు). 24

చూ|| యస్త్విహ వై సవర్ణాం భార్యాం రేతః పాయయతి కామమోహితః -తమముత్ర రేతః కుల్యాయాం పాతయిత్వా రేతః పాయయంతిః.25

టీ:- లాలాభక్షమహ - యస్త్విహేతి. రేతఃపానం కారయంతి. 25

లాలాభక్షణమను నరకమును గురించి తెలుపుచున్నాడు. ఈ లోకములో ఎవడైతే కామాతురుడై తన కులవతియగు భార్యతో వీర్యపానము చేయించునో, వాణ్ణి పరలోకమున వీర్య హ్రదములో (లాలాభక్షమను నరకము) పడవేయించి వీర్యమును పానము చేయించెదరు. 25

చూ|| యే త్విహ దస్యవోऽగ్నిదా గరదా గ్రామాన్ సార్థాన్ వా విలుంపంతి - రాజభటా వా-తాంశ్చాపి హి పరేతాన్ యమదూతా వజ్రదంష్ట్రాశ్శ్వానస్సప్త శతాని విశసంతి-సరభసం నిఖాదయంతి. 26

టీ:- యేత్వితి. యమదూతా వజ్రదంష్ట్రాః శ్వానః తే సరభసం ససంభ్రమం. 26

ఈ లోకమున దొంగలుకాని, రాజులుగాని, రాజభటులుగాని ఎవరి ఇంటికైననూ నిప్పు పెట్టిననూ, ఎవరికైన విషమిచ్చిననూ, గ్రామములను, వ్యాపార బృందములను లూఠీ చేసిననూ వారు చనిపోయిన పిదప యమదూతలు సారమేయాదనమను నరకమున వజ్రముల లాంటి దంతములుగల ఏడు వందల కుక్కలచే కరిపించి, సరభసముగా (భయంకరమైన ఆశ్చర్యముగా) తినిపించెదరు. 26









చూ॥ యస్త్విహ వా అనృతం వదతి సాక్ష్యే ద్రవ్యవినిమయే వా-కథం చిత్సవై ప్రేత్య నరకే-అవీచిమత్య ధశ్శిరా నిరవకాశే యోజనశతోచ్ఛ్రా యాద్గిరిమూర్ధ్నస్సంపాత్యతే-యత్ర జలమివ స్థలమశ్మపృష్ఠమవభాసతే తదవీచిమత్-తత్ర తిలశో విశీర్యమాణం శిరా న మ్రియమాణః పునరారోపితో నిపతతి. 27

టీ:- యస్త్వితి. ద్రవ్యవినిమయే క్రయవిక్రయాదౌ నిరవకాశే నిరా లంబే అవీచిశబ్దార్థమాహ - యత్రేతి. వీచిస్తరంగః తద్రహిత త్వాద వీచిః. 27

ఈ లోకమునఎ వడైతే సాక్ష్య విషయమున క్రయ విక్రయాది ద్రవ్య వినిమయ విషయమున, దాన విషయమున ఏ విధముగానైనా అబద్ధమును పలుకునో వాడు చనిపోయిన పిదప నిరాధారమగు అవీచీ అను నరకమున పడును. ఆ నరకమున వందయోజనముల ఎత్తుగల పర్వతముపై నుండి తలక్రిందులుగా పడవేయుదురు. క్రింద బండరాయి పరుపు భూమి జలమువలె కన్పడుచుండును. ఎత్తు నుండి పడవేయడముచే శిరస్సు నువ్వు గింజలవలె తునకలు తునకలైననూ ప్రాణముపోక మళ్ళీ మళ్ళీ ఎత్తు నుండి క్రిందకు పడవేయబడుచు బాధనొందును. అచటి భూమి జలమువలె కనబడినను తరంగములు లేనందున "అవీచి" అనబడుచున్నది .27

చూ॥ యస్త్విహ వై విప్రో రాజన్యో వైశ్యో వా సోమపీథస్తత్కళత్రంవాః సురాం వ్రతస్థో వా పిబతి ప్రమాదతః-తేషాం నిరయం నీతానామురసి పదాక్రమ్యాన్యే వహ్నినా ద్రవమాణం కాలాయసం నిషించంతి. 28

టీ:- యస్త్వితి. యో విప్రస్తత్కళత్రం వా సురాం పిబతి. అన్యోఽపి వా వ్రతస్థస్సన్. రాజన్యో వా వైశ్యో వా సోమపీథః కృత సోమపాన ఇత్యన్వయః. తయోస్సోమస్థానే ఫలచమసవిధానాత్ సోమపాన నిషేధాచ్చ. తథా చ శ్రుతిః. "న్యగోధస్త్రిభిర్నిరాహృత్య తాస్సంపీడ్య

ఈ లోకమున బ్రాహ్మణుడుగాని, బ్రాహ్మణుని భార్య బ్రాహ్మణి కాని దీక్షలోయుండి ప్రమాదవశాత్తు సురాపానము చేసినను, క్షత్రియుడు కాని, వైశ్యుడుకాని దీక్షను తీసికొని సోమపానము చేసినయెడల పర లోకమున వారిని అయోరేతఃపానమను నరకమునకు తీసికవెడలి వారి ఎదపై కాలునుంచి వారి నోటిలో అగ్నితో కరిగించిన అయో ద్రవమును (కరిగించిన ఇనుము) పోయుదురు. క్షత్రియులకు, వైశ్యులకు సోమపాన నిషేధము వలన సోమ రస స్థానములో ఫలచమస విధానము "న్యగ్రోధస్త్రిభిర్నిరాహృత్య తాసంపీడ్య దధన్యున్మృజ్య తస్మై



 





దధన్యున్ముజ్య తస్మై భక్షం ప్రయచ్ఛేన్న సోమ" మితి. 28

చూ॥ యస్త్విహ వా ఆత్మసంభావనేన స్వయమధయో జన్మవిద్యాచార వర్ణాశ్రమతో వరీయసో న బహుమన్యతే-స మృతక ఏవ మృత్వా క్షారకర్దమే నిరయేకర్వాక్ఛిరానిపతితో దురంతాయాతనా హ్యశ్నుతే.29

టీ:- యస్త్వితి. స పూర్వమపి మృతక ఏవ సన్ మృత్వా. 29

చూ॥ యే త్విహ వై పురుష మేధేన యజంతే యాశ్చ స్త్రియోనృపశూన్ ఖాదంతి-తాంశ్చ తే-పశవ ఇహ నిహతా యమసదనే పాతయంతో రక్షోగణాస్సౌనికా ఇవ స్వధితినా విదార్యాసృక్పిబంతి-నృత్యంతి-హసంతి-గాయంతి చ-హృష్యమాణా యథా హి పురుషాదాః. 30

టీ:- యేత్వితి. పురుషస్య మేధేన హింసయా భైరవాదీన్ యజంతే. యాశ్చ స్త్రియః. కామరూపాః గణా భూత్వా యథే హతే పురుషాదా స్సంతః. పూర్వమసృక్పిబంత స్తద్వత్. 30

భక్షం ప్రయచ్ఛేన్న సోమ" అను శ్రుతిచే చెప్పబడినందున వారికి సోమపానము నిషిద్ధమై_పాప కర్మయగును. 28

ఈ లోకమున ఎవరైతే తాను అధముడై యుండిగూడా తానే గొప్పవాడినని తలంచి పుట్టుకతో (ఉన్నత వంశ జన్మతో) విద్యతో, నడవడికతో, (శీలముతో) వర్ణాశ్రమములతో తనకంటే గొప్పవారగు వారిని సత్కరించడో (గొప్పవారిగా తలచడో) వాడు బ్రతికియుండిగూడా చచ్చిన వానితో సమానుడే (జీవచ్ఛవము) వాడు చనిపోయిన పిదప క్షారకర్దమను నరకమున తలక్రిందులుగా పడవేయబడి అంతములేని దుఃఖము అనుభవించును. 29

ఈ లోకమున ఎవరైతే నరమేధము (పురుషులను హింసించి) తో భైరవాదులను పూజింతురో అట్టివారు మరియు ఏ స్త్రీలు నరులను పశువులవలె భుజించెదరో వారును ఇచట పశువులవలె చంపబడి యమలోకములో రక్షోగణభోజనమను నరకములో పడవేయబడి పూర్వము ఈ లోకమున వీరు మాంస భక్షణముచేసి, రక్తము త్రాగి ఏ విధముగా ఆనందించిరో ఆ విధముగానే వారిని అక్కడి రాక్షస సమూహము కసాయివారి వలె, ఖడ్గముతో చీల్చి సంతోషిస్తూ, వారి రక్తమును తాగుతూ, నాట్యము చేయుచూ నవ్వెదరు, గానము చేసెదరు. 30

 

చూ॥ యేత్త్విహ అనాగసోఽరణ్యే గ్రామే వా వైస్రంభకైరుప విస్రంభయ్య జిజీవిషూన్ శూలసూత్రాదిషు ప్రోతాన్ క్రీడతనయా యాతయంతి-తే ऽపి చ ప్రేత్య యమయాతనాసు శూలసూత్రాదిషు ప్రోతాత్మానః క్షుత్తృడ్భ్యాం చాభిహతాః కాక కంక బకాదిభిశ్చేతస్తత స్తిగ్మతుండై రాహన్య మానా ఆత్మశమలం స్మరంతి. 31

టీ:- యేత్త్వితి. వైస్రంభకైః విశ్వాసోపాయైః ఉపవిస్రంభయ్య విశ్వాస్య. (31)

ఈ లోకమున ఎవరైతే నిరపరాధులగు, వనములోని, గ్రామములోని ప్రాణులను నమ్మకము కలిగించెడి ఉపాయములతో నమ్మించి, నమ్మకముతో తమ వద్దకు వచ్చి జీవించగోరు వారిని శూలములతో పొడిచి తాళ్ళతో బంధించి ఆటాడినటుల బాధించెదరో వారు మృతినొంది పిదప (నరకములో) శూలప్రోతమను నరకమున శూలముతో పొడవబడుచూ, ఆకలి దప్పికలతో బాధనొందుచూ, తీక్షణములైన చుంచువులుగల కాకి, కొంగ మొదలగు భయంకరమగు పక్షులతో అటు ఇటు చీల్చబడుచూ తానొనసరించిన పాప కర్మలను స్మరించెదరు. 31

చూ॥ యేత్త్విహ వై భూతాన్యుద్వేజయంతి నరా ఉల్బణస్వభావా యథా దందశూకాస్తేऽపి ప్రేత్యనరకే దందశూకాఖ్యే నిపతంతి-యత్ర నృపదందశూకాః పంచముఖాఉపసృత్య గ్రసంతి యథా బిలేశయాన్. 32

టీ:- యేత్త్వితి. బిలేశయాన్ మూషికాదీన్. 32

ఓ పరీక్షిద్రాజా! ఈ లోకమున ఎవరైతే సర్పములవలె ఉగ్రస్వభావులై ప్రాణులను హింసించెదరో వారు మృతినొందిన పిదప దందశూకమను నరకమునపడుదురు. అచట వారిని అయిదు పడగలు గల పాములు మూషికములను మ్రింగినటుల మ్రింగును. 32

చూ॥ యే త్త్విహ వై బాలానంధాన్వాన్యాని దుర్బలాన్యవటకుసూల గుల్మాదిషు భూతాని నిరుంధతి-తథాముత్ర తేష్వేవోపవేశ్య-సగరేణ వహ్నినా ధూమే నిరుంధతి. 33

ఈ లోకమున ఎవరైతే బాలురను, గుడ్డివారిని, దుర్బలురగు ఇతర ప్రాణులను అగడ్తలలో కోటరములలో, గుహలలో బంధించి బాధించెదరో వారిని పరలోకమున అవటనిరోధమను నరకమున






టీ:- యేత్వితి. సగరేణ సవిషేణ. 33

అలాంటి స్థానములలోనే బంధించి, కూర్చుండచేసి, విషముతో కూడిన అగ్నిపొగలో బంధించి, బాధించెదరు. 33

చూ॥ యస్త్విహ వా అతిథీనభ్యాగతాన్ గృహమాగతాన్ వా గృహపతి రసకృదుపగత మన్యుర్దిధక్షురివ పాపేన చక్షుషా నిరీక్షతే-తస్య చాపి నిరయే పాప దృష్టే రక్షిణీ వజ్రతుండా గృధ్ర కంక కాక బకాదయః ప్రసహ్యోరు బలాహ్యు త్పాటయంతి. 34

టీ:- యస్త్వితి. అతిథయః అజ్ఞాతపూర్వాః. అభ్యాగతాః జ్ఞాతపూర్వాః తాన్ పాపేన వక్రీకృతేన. 34

ఈ లోకమున తన గృహమునకరుదెంచిన అతిథి అభ్యాగతు-లను కోపముతో పలుసార్లు, దగ్ధము చేయునటుల వక్ర దృష్టితో చూచినచో, పాపదృష్టితో చూచిన వారి నేత్రములను పర్యావర్తనము అను నరకమున కఠోరములగు చుంచువులుగల గద్ద, కంకములు, కాకులు, కొంగలు మొదలగు పక్షులు బలాత్కారముగా గొప్ప బలముతో పెరికివేయును. 34

చూ॥ యస్త్విహ వా ఆఢ్యాభిమతిరహంకృతస్తిర్యక్ప్రేక్షణస్సర్వతశ్శంకిత హృదయో వ్యయనాశచింతయా పరిశుష్యమాణహృదయ వదనో నిర్వృతిమనవగతో గ్రహఇవారమభిరక్షతి-సచాపి ప్రేత్య సంపాదనోత్కర్ష సంస్మరణ శమల గ్రహః సూచీముఖే నరకే నిపతతి-యత్రహ విత్త గ్రహం పాప పురుషం ధర్మరాజ పురుషాస్తంతువాయా ఇవ సర్వతోऽంగేషు సూత్రైః పరివయంతిః. 35

టీ:- యస్త్వితి. ఆఢ్యాభిమతిః ధనగర్వితః అహంకృతః. శ్రేష్ఠోऽ

ఈ లోకమున ఎవరైతే తాను గొప్ప ధనవంతుడనని తలంచి అహంకారముతో అందరినీ వక్రదృష్టితో కాంచునో, గురువు మొదలగు వారిని కూడా ధనమును హరించెదరను శంకతో చూస్తూ ఎవని ముఖము, హృదయము వెలవెలబోవునో, ఎవడు పిశాచమువలె ధనమును రక్షించుటయందే ఆసక్తి కలిగియుండి ధనసంపాదనము వృద్ధినొందించుట, రక్షించుటలో అనేక పాపములనాచరించునో వాడు మృతినొంది సూచీముఖమను నరకమున పడును. ఆ నరకమున ధనపిశాచియగు ఆ పాపిని యమ దూతలు తంతువాయువులవలె



 



హమితి మానీ. తిర్యక్ప్రేక్షణం యస్య. సర్వతః గుర్వాదయోऽపి ధనం చోరయిష్యంతీతి విశంకమానః. పరిశుష్యమాణం హృదయం వదనం చ యస్య అనవగతః అప్రాప్తః. తస్యార్థస్యోత్పాదనాదిభిః శమలం గృహ్ణాతి తథా. పరివయంతి. సూత్ర ప్రోతాన్ కుర్వంతి. 35

(శ్రావారివలె) సర్వాంగముల యందు సూత్రములతో క్రుచ్చబడిన వారినిగా చేయుదురు. 35

చూ॥ ఏవంవిధా నరకా యమాలయే సంతి సహస్రశః - తేషు సర్వేషు సర్వ ఏవాధర్మవర్తినో యే కేచిదిహోదితాశ్చావనీపతే పర్యాయేణ విశంతి - తథైవ ధర్మానువర్తినః ఇతరత్ర - ఇహ తు పునర్భవ ఉభయ శేషాభ్యాం నివిశంతి. 36

టీ:- ఏవమితి. ఇతరత్ర స్వర్గాదౌ. ఇహమర్త్యలోకే. పునర్భవే పునర్జన్మనిమిత్తం ఉభయోర్ధర్మాధర్మయోః శేషాభ్యాం. 36

ఓ పరీక్షిద్రాజా! యమలోకమున ఇలాంటి నరకములు వేలకొలది కలవు. వాటిలో కొన్ని ఇచ్చట తెలుపబడినవి. ఈ అన్ని నరకములలో అధర్మమునాచరించిన వారంతా తమ తమ కర్మలను అనుసరించి అనేక పర్యాయములు ప్రవేశించెదరు. అదే విధముగా ధర్మముననుసరించినవారు స్వర్గాది లోకములలో ప్రవేశించెదరు. ఈ విధముగా స్వర్గ నరకముల అనుభవముతో (భోగముతో) పుణ్య పాపములు క్షీణించగా మిగిలిన ధార్మధర్మములతో మర్త్య లోకములో తిరిగి జన్మించెదరు. 36

చూ॥ నివృత్తి లక్షణమార్గః ఆదావేవ వ్యాఖ్యాతః ఏతావానేవాండకోశో యశ్చతుర్దశధా పురాణేషు వికల్పిత ఉద్గీయతే. 37

టీ:- నివృత్తీతి. ఆదావేవ ద్వితీయస్కంధే వైశ్వానరం యాతీత్యాదినా. (37)

ఈ ధర్మాధర్మములకంటే విలక్షణమగు నివృత్తి మార్గమును ద్వితీయ స్కంధములో వైశ్వానరంయాతి అను మొదలగు దానితో మొదటనే తెలిపితిని. పురాణములలో చతుర్దశ భువనములుగా వర్ణించబడిన బ్రహ్మాండకోశము ఇంతటిదే. (ఇదే) అందరూ దీనినే స్తుతించెదరు, గానము చేయుదురు. 37


















చూ॥ యత్తద్భగవతో నారాయణస్య సాక్షాన్మహాపురుషస్య - స్థవిష్ఠ రూపమాత్మ మాయాగుణమయమనువర్ణితమాదృతః పఠతి శ్రుణోతి శ్రావయతి - స ఏవాయం భగవతః పరమాత్మన ఉపగేయం హ్యణిష్ఠమపి శ్రద్ధాభక్తి విశుద్ధ బుద్ధిర్వేద. 38

టీ:- యదితి. ఉపగేయం ఔపనిషదం. శ్రద్ధా భక్తిభ్యాం విశుద్ధా బుద్ధిర్యస్య. 38

సాక్షాత్తు పరమపురుషుడు, భగవంతుడునగు నారాయణుని యొక్క (ఆత్మ) మాయాగుణమయము, స్థూలరూపమగు, బ్రహ్మాండ కోశమును వర్ణించితిని. దీనిని ఎవరైతే శ్రద్ధతో పఠించెదరో, వినెదరో, వినిపించెదరో వారు ఉపనిషత్తులలో వర్ణించబడిన మనోబుద్ధులకందని భగవంతుడు పరమాత్మ యొక్క సూక్ష్మరూపమును శ్రద్ధాభక్తులతో శుద్ధమగు బుద్ధిగలవారై తెలిసికొనెదరు. 38

చూ॥ శ్రుత్వా యథాస్థూల సూక్ష్మరూపే - భగవతో హ్యతిస్థూలే నిర్జితమాత్మానం శనైస్సూక్ష్మే ధియా నయేత్. 39

టీ:- శ్రుత్వేతి. యథాశ్రుత్వా. 39

భగవంతునియొక్క స్థూల, సూక్ష్మ రూపములను విని మొదట స్థూలరూపములో చిత్తము స్థిరీకరించి మెల్లగా ఆ స్థూలరూపము నుండి సూక్ష్మ రూపమువైపు చిత్తమును మరల్చ వలయును. 39











శ్లో॥ భూద్వీప వర్ష సరి దద్రి నభస్సముద్ర
పాతాళదిఙ్నరక భాగణ లోక సంస్థా ।
గీతామయా తవ నృపాద్భుతమీశ్వరస్య
స్థూలం వపుస్సకలజీవనికాయ ధామ ॥ 40

టీ:- భూద్వీపేతి. కథంభూతా సంస్థా. సకలానాం జీవనికాయానాం ధామ ఆశ్రయభూతం వపుః. 40

ఓ పరీక్షిద్రాజా! నేను నీకు భూమి, ద్వీపములు, ద్వీపములలోని వర్షములు, నదులు, పర్వతములు, ఆకాశము, సముద్రములు, పాతాళము, దిక్కులు, నరకము, జ్యోతిర్గణములు, లోకముల స్థితిని వర్ణించి తెలిపితిని. ఇదియే సమస్త జీవసమూహామునకు ఆశ్రయ భూతమగు భగవంతుని యొక్క అద్భుతమగు స్థూలరూపము. 40

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే పంచమస్కంధే,**
**షడ్వింశోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున పంచమస్కంధమందు**
**ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము.**

పంచమస్కంధసంబంధి పదభావార్థదీపనైః ।
ప్రీయతాం పరమానంద నృహరిర్బాలచేష్టితైః ॥

పంచమస్కంధమునకు సంబంధించిన పదముల భావార్థ ప్రకాశనములనెడి బాలచేష్టలతో పరమానందరూపుడగు నృసింహుడు సంతసించుగాక.

**ఇది పంచమస్కంధము.**

**సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.**



